## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120032612

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఓజసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మాస్టర్ ఎమ్. కె.
# హోమియో తత్త్వశాస్త్ర
# ప్రవచనాలు

రచన

డాక్టర్ మోపిదేవి కృష్ణస్వామి




ప్రచురణ :

యూనివర్సల్ హ్యూమానిటేరియన్
ఎడ్యుకేషన్ ట్రస్టు
విశాఖపట్టణం

# ఇందులో....

# అంతరంగ తరంగం

"మాస్టర్ M. K. హోమియో తత్వశాస్త్ర ప్రవచనాలు" గ్రంథ రచన, ముద్రణ జరుగుతున్నంత కాలం ఉడతాభక్తిగా నేనూ ఆ మహా కార్యంలో రవ్వంత పాలు పంచుకోవడం జరిగింది. అందుకు మాస్టరుగారు నన్ను నిర్దేశించడం నా భాగ్యంగా నేను భావిస్తున్నాను. ఇంతకూ నేను నిర్వహించిన పని ప్రూఫులు దిద్దటం. అందుచేత అందరికన్నా ముందుగా ఈ గ్రంథాన్ని చదివే భాగ్యం మాస్టరుగారు నాకు కల్గించడం, నిజంగా నా అదృష్టం.

గత పది సంవత్సరాలుగా నాలో ఒక కోరిక అంతర్గతంగా వుండిపోయింది. అదీ-నేను నా ఆరోగ్య విషయంలో అల్లోపతీ వైద్యం పేరిట దాదాపు పదివేల రూపాయలు వృథాగా వెచ్చించి, చివరిగా 1983లో హోమియో వైద్యం ద్వారా మనస్సూ దేహారోగ్యం కుదుటపడ్డ పిదప ఏర్పడిన కోరిక అది. నమ్మకం లేని నా మూర్ఖత్వం ఛేదింపబడి నమ్మిక ఏర్పడ్డాక ఏర్పడిన కోరిక అది. ఆ కోరిక ఈనాడు వాస్తవం అవుతుంటే నా ఆనందానికి అవధుల్లేవు. సంకల్పము సిద్ధించిన సంతోష మిదీ.

ఈనాడు సమాజంలోనికి ఎంతో సాహిత్యం, ఎన్నో రకాల కథలు, నవలలు, వారపత్రికలు మొదలైన రూపాలలో వెదజల్లబడుతోంది. అవి సమాజానికి ఎంత వరకూ ఉపయోగపడుతున్నాయో, వాటి వల్ల సమాజం ఏ దారిలో పయనిస్తోందో ఒక్కసారి మనం ఆలోచించవలసిన అంశం. నా మటుకు నాకనిపిస్తుంది– ఏ విలువలూ లేని, ఎందుకూ కొరగాని పుస్తక పరంపరలు మానవాళిలోనికి విరజిమ్మబడుతూ, వారిని అనేక ప్రలోభాలకు గురి చేస్తున్నాయి. వ్యక్తులలో అనుకరణ మనస్తత్వాలను పెంపుచేసి, ఒక రకమైన ఊహా ప్రపంచంలోకి వారిని నెట్టి అనర్థాలకు గురి చేస్తున్నాయి. వాస్తవాలకు దూరం చేస్తున్నాయి. ప్రాచీన సంస్కృతీ

సాంప్రదాయాలకు, నాగరకత పేరుతో తిలోదకాలిస్తున్నాయి. ఈ మన స్తత్వాలకు కారణభూతములేమిటో ఈ గ్రంథం మనముందుంచుతుంది.

ఇంతకూ నా అంతరంగాభిలాషను మీ ముందుంచలేదు కదూ! సమాజాని కున్న నవలా వ్యామోహాన్ని దృష్టిలో వుంచుకొని ఎవరైనా ఒక మహానుభావుడు హోమియో తత్వశాస్త్రాన్ని ఒక నవలా రూపం గానో, కథారూపంగానో వివరిస్తూ జనంలోకి తెస్తే అది ఎంతో ప్రయోజనాన్ని సాధిస్తుందనేదే నా చిరకాల వాంఛితం. అది ఈనాడు "మాస్టర్ M. K. హోమియో తత్వశాస్త్ర ప్రవచనాలు" రూపంలో మన ముందుకు రావటం, నిజంగా మానవజాతి చేసుకొన్న మహా భాగ్యం.

శాస్త్రాన్ని శాస్త్ర పరిభాషలో క్లిష్టంగా కష్టంగా చెప్పక, ఒక కథారూపంగా, నవలవలె సోదాహరణంగా 'సోరాహారణం'గా చెప్పిన ఘనత శ్రీ కృష్ణస్వామి గారికే దక్కుతుంది. ప్రవచనం ప్రజానీకాన్ని వెన్నుతట్టి లేపుతుంది. అది ఒక దివ్యశక్తి. ఆ దివ్యశక్తి శ్రీ కృష్ణస్వామిగారినుండి వ్యక్తమై దిగివచ్చి ఈ గ్రంథ రూపం దాల్చటం ఒక దివ్య సన్నివేశం. వారు ఈ గ్రంథాన్ని నడిపిన తీరు తేరుపై సాగిపోతున్నంత హాయిగానూ, జోరుగానూ వుంది. గతంలో హోమియో తత్వ శాస్త్రమును ఇంత విపులంగా, సమకాలీన సామాజిక తత్వాలకు అన్వయించి చూపిన గ్రంథం మనకు గోచరించదు. అందునా తెలుగుభాషలో అసలే మృగ్యం.

ఈ గ్రంథాన్ని చదువుతున్నంత సేపూ శ్రీ కృష్ణస్వామిగారు మనకు మూడు కోణాల్లో దర్శనమిస్తారు. రసహృదయులైన ఒక సాహితీవేత్తగా, అనుభవజ్ఞులైన ఒక శాస్త్రవేత్తగా అన్నిటినీ మించి ఆత్మదర్శనం కలిగిన ఒక మహాద్రష్టగా మన ముందుంటారు. ఈ మూడు ప్రతిభా వ్యుత్పత్తుల దివ్యశక్తియొక్క త్రివేణీ సంగ మమే ఈ గ్రంథ రాజం. ఈ సంగమంలో మన మొక్క నాలుగు మునకలు వేస్తే మన సంగ దోషాలు పరిహారమై నాలుగు 'మియాజాలా' అజ కూడా వుండకుండా పోతాయనటం అతిశయోక్తి కాదు.

ఈ గ్రంథం సర్వ మానవజాతి అనుభవిస్తున్న దుర్భర బాధలనూ, దుర్వి పాకాలనూ దూరం చేసేందుకు స్వామి సంధించిన సుదర్శనం.

ఈ గ్రంథం చదువుతున్నంత సేపూ మనం నిత్యం చూస్తూ వుండే వ్యక్తులూ, మన పరిచయస్తులూ, మన బంధువులూ, మన చుట్టుప్రక్కల వారూ, ఆఖరుకు మనకు మనం కూడా, ఒక పాత్రగా ఇందులో అగుపడతాం. మనం ఎంతో

చిన్నవి అనుకొన్న సంఘటనల వెనుక సారాంశం, మామూలే అనుకొనే ఆవేశాల వెనుక గల 'సోరాంశం' మనను కళ్ళు తెరిపిస్తాయి. మనం, 'పిచ్చి' 'వెఱ్ఱి'అని కొట్టి పారేసే మనుష్యుల దౌర్భాగ్యం వెనుక దాగిన అసలు కారణం మనకు బోధ పడుతుంది. దాన్ని చక్కబెట్టే సక్రమమార్గం సూచితమవుతుంది. వారి యెడల ఈ దర్శనం అందనివారు అవలంభిస్తున్న పైశాచిక వైద్య విధానాలపై జుగుప్స కలుగుతుంది. ఆ రోగులఎడల సానుభూతి కలుగుతుంది. ఆదుకొనే సున్నితవిధానం అవగాహనకు వస్తుంది. సమాజానికి పెద్దఎత్తున మేలు జరుగుతుంది.

నిత్య జీవితంలోని అనేకానేక ఉదాహరణలతో, అనేకానేక పాత్రల పరిచయంతో ఈ గ్రంథాన్ని శ్రీకృష్ణస్వామిగారు ఒక గ్రంథంగాగాక మన కళ్ళముందు కదిలే ఒక నాటకంవలే, సినిమావలే నడిపించారు.

ఈ సందర్భంగా ఒక విషయాన్ని, ఒక యదార్థాన్ని మీ ముందుంచుతాను "సిఫిలిస్ వ్యాధి తత్వాన్ని గూర్చి మాస్టరుగారు వ్రాస్తూ 'సోరా' భర్త 'సిఫిలిస్' భార్యల కాంబినేషన్‌లో వారు పొందుపరచిన ప్రతి సంఘటన, ప్రతి సన్నివేశం, తీరా గ్రంథం చదివాక నూటికి నూరుశాతం నా స్వంత జీవితానికి అన్వయింపబడింది. అది చదువుతున్నంతసేపూ మా దంపతులు ఇరువురిమధ్యా గతంలో నడిచిన కథ నా కళ్ళముందొకసారి మెదిలి ఒకపైపు సున్నితమైన హాస్యానికి నవ్వుకొంటూనే ఒకపైపు నా దురదృష్టానికి ఏడుపు వచ్చింది. ఆద్యంతం అది నన్ను కదిలించింది. ఈ విధమైన వివరణాత్మకమైన గ్రంథమే నాకు 7, 8 సంవత్సరాలకు పూర్వం చేతికి అందివుంటే, నా భార్యను మృత్యువునుండి రక్షించుకోగలిగే వాడినని స్వానుభవంతో చెబుతున్నాను. ఈ గ్రంథం విలువలను గ్రహించవలసినదిగా దీనవదనంతో వేడు కొంటున్నాను.

అణిచివేతయే పరమావధిగా గల అల్లోపతీ వైద్యవిధానానికి ఈ గ్రంథమొక అశనిపాతంలా అనిపించినా "వైద్యులారా సహకారమందించే స్థితినుండి సరిచేసి నిలబెట్టే స్థితికి మనం పయనిద్దాం" అనే కృష్ణస్వామిగారి పిలుపు, ఆ వైద్యులయెడల వారికి గల సోదర వాత్సల్యాన్ని, రోగార్తుల యెడల వారికిగల మాతృ వాత్సల్యాన్ని ప్రకటిస్తోంది. ఇది ఆలోచించవలసిన అంశం.

ఈ గ్రంథ రచనలో ఒక ప్రత్యేకత గమనింపదగినది. ప్రతి 'మియాజము' యొక్క ప్రవర్తనావళిని, బాధల వివరాలను అన్న, ప్రాణ, మనో విజ్ఞానమయ కోశాల స్థాయిలలో వివరించే సందర్భంలో ప్రతిసారీ మిగిలిన మూడు 'మియాజముల'తో పోల్చి పాత్రలను మనముందు ప్రవేశపెట్టడం మాస్టరుగారి ప్రతిభకు, అనుభవానికీ తార్కాణం. అందువలన పాఠకునికి ఎప్పటికప్పుడు సందేహ నివృత్తి అవటమే గాక ఒకదాన్ని మరొకటిగా పొరబడే అవకాశం లేకుండా చేశారు మాస్టరుగారు.

సహజంగా శాస్త్రాధ్యయనం రెండుదశలుగా సాగుతుంది. ఒకటి 'థియరీ' రెండు 'ప్రాక్టికల్స్' రెంటినీ మిళితంచేసి ఈ గ్రంథంద్వారా మనకందించారు శ్రీ కృష్ణస్వామిగారు. వారి శాస్త్రావగాహనకూ, నైపుణ్యానికీ నమోవాకములు.

శాస్త్రజ్ఞుడు సమాజంలోనికివెళ్ళి, నలుగురితో మెలగుతూ, వారిలోఒకడై, వారే తానుగా, తానే వారుగా దర్శిస్తూ సంబంధ బాంధవ్యాలు ఏర్పరచుకొన్నప్పుడు మాత్రమే ఆ విధమైన ప్రతిభకు కావలసిన దివ్యదర్శనం లభిస్తుంది. అప్పుడు మాత్రమే ఆ శాస్త్రం పరిపూర్ణతను పొంది ఆయనమీదుగా దిగివస్తుంది. పదిమందికీ పనికివస్తుంది, ఫలితాన్నిస్తుంది. ఈ గ్రంథరచనలో జరిగినదదే.

తెల్లవారి లేస్తే అనేక వ్యాధులతో, బాధలతో, అనేక ఆర్తులతో ప్రతి దానికీ స్పెషలిస్టులను దర్శించే మనం, ఒక్కసారి మనస్సుపెట్టి ఈ గ్రంథాన్ని చదివితే మన మనస్సుకు పట్టిన మకిలి వదిలి, మన గమ్యమేమిటో మనకు బోధపడుతుంది. సంపాదనలో సగం ఆరోగ్యానికి వెచ్చించే అనారోగ్యపు అలవాటు మన నుండి దూరమవుతుంది. ఒక్కమాటలో చెప్పాలంటే మనమేమిటో మనకే బోధపడుతుంది. జీవన విధానమే మారిపోతుంది. జీవితలక్ష్యం గమనింపుకొచ్చి ఒక దివ్యమైన ప్రేమమయ సమాజానికి, సామ్రాజ్యానికి శ్రీకారం చుట్టబడుతుంది. విశ్లేషణ వరకూ ఎదిగిన వైద్యశాస్త్రానికి పరిష్కార మార్గాన్ని సూచిస్తుందీ గ్రంథం.

ఒక చిత్రం మీ ముందుంచుతాను. ఈ గ్రంథరచన జరుగుతుండగా శ్రీ మాస్టరుగారికి ఒకరోజున 104$^{0}$ జ్వరం వచ్చింది. గ్రంథావిష్కరణకు సమయం దగ్గర పడుతోంది. కావలసిన పని చాలావుంది. ఆ స్థితిలో మనమయితే ఉరుకులు, పరుగుల మీద జ్వరాన్ని ఆపచేయటానికి ఉద్యమిస్తాం. నేను గమనిస్తూనే వున్నాను. మాస్టరుగారు కేవలం ద్రవాహారం మీదనే వుంటూ ఏ మందూ (ఆఖరికి హోమియో మందుకూడా) వాడకుండా రచన కొనసాగిస్తూనే వున్నారు. చిత్రంగా జ్వరం రోజురోజుకూ తగ్గుకుంటూ వచ్చి, మూడవనాటికి నార్మల్ అయిపోయింది.

చనావ్యాసంగం ఆగలేదు సరికదా ఆ సమయంలో దిగివచ్చిన దర్శనాలు మరింత క్తి కట్టాయి. ఆ స్థితప్రజ్ఞతకు జేజేలు.

మరొక ప్రధానాంశమేమంటే, గ్రంథమంతా ఒకఎత్తు కాగా, చివరి అధ్యాయాలు గ్రంథానికే ఆయువుపట్టు. "సమన్వయము" అనే అధ్యాయం ఈ గ్రంథానికకు ముక్కానివంటిది. 'అనుశాసనము' అనే ముగింపు అధ్యాయం 'వైద్యానికి అనుపానం' వంటిది. అనుపానం యొక్క ఆవశ్యకతను ఆయుర్వేదం ఎంతగా నొక్కిచెప్పిందో మీకందరకూ తెలుసు.

ఈ కథను, మనందరిదీ అయిన మనకథను గ్రంథరూపంవరకూ నడిపించటానికి నడుముకట్టిన శ్రీ కృష్ణస్వామిగారు ధన్యులు. వారు 'మానవధర్మ శిక్షణా సంస్థ' ద్వారా మానవజాతికి చేస్తున్న సేవలో ఈ గ్రంథరచన హిమవత్ శిఖరారోహణం. ఇంతకుమించిన జాతీయసేవ మరొకటుందని నేను భావించడంలేదు. ఈ గ్రంథావిష్కరణ నిజంగా జాతి పునర్నిర్మాణ దివ్యభవనానికి శంఖుస్థాపన. రోగార్తమైన జాతి చైతన్యానికి శంఖారావం. ఈ భవన నిర్మాణ, విస్తరణలకు మనందరం రాళ్ళు మోద్దాం! ఈ శంఖారావాన్నిక మనందరం వాడవాడలకూ వినిపిద్దాం, జాతి శ్రేయస్సుకై జరుగుతున్న ఈ మహాకార్యంలో మనం పాలుపంచుకొందాం!

విజయవాడ,
25-5-1993

కె. త్రివిక్రమరావు

# సాధించవలసింది

సాధించవలసింది అయిపోయింది అనుకొన్నప్పుడు జాతి చతికిలబడుతుంది. చతికిలబడి ఊరుకోదు. ఇక పతనోన్ముఖమవుతుంది. స్వాతంత్ర్యం వచ్చేసింది. అనుకొనేటప్పటికి ఇక చతికిలబడదాం అనిపించింది మనకు. అంతవరకూ దేశం దేశం అంటూ తపించిన మనం ఇక దేశాన్ని స్మరించడమే మానేశాం. 'మన సంగతి ముఖ్యం', 'మన సంగతి మనం చూసుకోవాలి.' 'మన సంగతి మనం కాకపోతే ఇంకెవరు చూస్తారు?' 'ముందు మనని మనం నిలబెట్టుకోవాలి'! 'తన్ను మాలిన ధర్మం కూడదని కదా అంటారు'—మొదలయిన వాక్యాలను మంత్రాలుగా స్వీకరించి పతనోన్ముఖంగా వెళ్ళిపోతున్నాం. పై గా దీనిని అభ్యుదయమంటున్నాం. అభివృద్ధి అంటున్నాం. నిజం చెప్పండి. మన దేశం గాని, మన జాతిగాని, కనీసం మన జాతీయ పతాకంగాని రోజు మొత్తం మీద, అధమపక్షం ఒక్కసారయినా గుర్తుకు వచ్చేవారు, వాటిని గుర్తుకు తెచ్చుకొనేవారు మనలో ఎంతమంది ఉన్నారు? ఎంతలో ఎంత ఏమరుపాటు! ఎంతలో ఎంత అధఃపతనం! కేవలం సాధించవలసింది అయిపోయింది అన్న ఒక్క భావన మనను ఇంతటి దీనస్థితికి దిగజార్చింది! ఆర్థికంగా ఎలా నిలద్రొక్కుకోవాలన్న ఆలోచనే తప్ప, పారమార్థికంగా మనం సాధించవలసింది ఏమిటి? అన్న ఆలోచన ప్రభుత్వం నుండి ప్రజలవరకూ ఎవరికీ లేకపోవడం, ఎవరికీ రాకపోవడం విచిత్రంగా లేదూ! ఆర్థికమయిన అభివృద్ధి కావలసినదే. నేను కాదనను. పారమార్థికమయిన పురోగతి లేనప్పుడు ఆర్థికమయిన అభివృద్ధికి సార్థకత ఏమిటని నేనడుగుతున్నాను. ఇది, లేని పిల్లాడికి చొక్కాలు కుట్టుకుంటూ కూర్చోవడం కాదా—అని నేను ప్రశ్నిస్తున్నాను. పారమార్థికమయిన పురోగతి లేనప్పుడు, ఆర్థికమయిన అభివృద్ధి నిలువదు. రాణించదు. ప్రగతిని సాధించదు-అని నేను నొక్కి చెబుతున్నాను.

స్వాతంత్ర్యం వచ్చింది చాలనుకొన్నాం తప్ప స్వాతంత్ర్యం వచ్చింది ఎందుకో మనం గ్రహించుకోలేకపోయాం, గ్రహించుకోలేకపోతున్నాం. స్వాతంత్ర్యం వచ్చింది మనని మనం తీర్చిదిద్దుకోవడానికి! ప్రపంచ దేశాలలో మన దేశాన్ని నిలువెత్తున నిలబెట్టడానికి! ప్రపంచ దేశాల ప్రజలందరికీ పారమార్థిక దృక్పథం అలవరచడానికి! మొత్తం మానవజాతికి మనుగడను నేర్పడానికి! కావలసిన ఒరవడిని దిద్దడానికి! అంతేగాని, అందరినుండీ ఇలా అయినకాడికి అప్పులు తెచ్చుకొంటూ,

పరాన్నభుక్కులుగా బ్రతకడానికి కాదు. మానసిక పరాధీనత్వాన్ని ఒకానొక విశేష విషయంగా కొనసాగించడానికి కాదు. ప్రపంచ దేశాలలో మన దేశానికి ఒక పాత్ర ఉన్నది. ఆ పాత్రను పోషించవలసిన బాధ్యత మనపైన ఉన్నది. ఆ బాధ్యత లోనికి మనను మేల్కొల్పడానికే రామకృష్ణుని నుండి అరవిందుని వరకు మహనీయు లందరూ మనను ఉద్బోధిస్తూ వచ్చినది. ఆ పాత్రను మనచేత పోషింజేయడానికే మాస్టర్ ఇ. కె. తన నిండు జీవితాన్ని సేవాసందేశాలుగా ధారవోసినది. కాని చిత్రం ! మనకు రాజకీయం ఒంటబట్టినట్లుగా రాజయోగం ఒంటబట్టడం లేదు. ఈ దుస్థితినుండి మనం బయటపడాలి! మనం సాధించవలసింది ఇంకా ఉన్నది. నిజం చెప్పాలీ అంటే మనం సాధించవలసింది ఇప్పుడే ప్రారంభమవుతున్నది - అని గ్రహించిననాడు తప్పక మనం ఈ దీన స్థితినుండి బయట పడతాం! సద్భావనలు లేకపోవడమే, సకల దీనస్థితులకూ మూల కారణం ! భావదారిద్ర్యంనుండీ, భావనా దారిద్ర్యం నుండీ బయట పడదాం! ఆశలనుండి ఆశయాల పై పుకు నడుద్దాం! ఆశకూ, ఆశయానికీ తేడా ఏమిటి? ఏదయినా ఒకటి సాధిస్తున్నప్పుడు మనకు మనం మాత్రమే గుర్తుంటే అది ఆశ. మానవులందరూ గుర్తుంటే అది ఆశయం. కనుక ఆశలను ఆశయాలుగా రూపొందించడంలో మనం ఇప్పుడు శ్రద్ధ పెట్టవలసి ఉంది. వందల సంవత్సరాల విదేశీ పాలనలలో మ్రగ్గిన మన జాతి పరిస్థితి ఇటు భౌతికం గానూ, అటు మానసికంగానూ కూడ ఛిన్నాభిన్నంగా ఉంది. ఒకానొక వైకల్యస్థితి. ఒకానొక వైక్లబ్యస్థితి మన జాతిని వెన్నాడుతోంది. దారుణమయిన ఈ గ్రహణ స్థితినుండి మనం బయట పడాలి. అందుకు మనం మన జాతిని పునర్నిర్మించుకోవాలి! దివ్యమయిన పునరుజ్జీవనాన్ని మనం పొందాలి! మన వారసత్వమయిన నిత్య నూతనత్వంలోనికి మళ్ళీ మనం అడుగిడాలి! అందుకు మనమిప్పుడు దీక్షబూనాలి. మనను మనం తీర్చిదిద్దుకొని, ప్రపంచ పరిస్థితులను చక్కదిద్దవలసిన బాధ్యత మనపైన ఉన్నది. సనాతన ధర్మాన్నీ, సహజీవన విధానాన్నీ సకల జాతులకూ అందజేయవలసిన కర్తవ్యం మనపైన ఉన్నది. లేచి పదిమందికి పనిచేసిపెట్టవలసిన వాడు తానే పడుకొనిపోతే ఎలాగ? పైగా ఇది పడుకొని పోవడంలాగ కూడా లేదు. పడి ఉండడంలాగా ఉంది. భారతీయుడు ఈ విషాదయోగం నుండి బయటపడాలి! బయటపడి తీరాలి!

భారతీయుణ్ని విషాదయోగం నుండి బైట పడవేయడంలో, 'మానవ ధర్మ శిక్షణ సంస్థ' తన వంతు పాత్రను తాను నిర్వహిస్తూ ఉన్నది. అది వైద్య శిక్షణ కానీయండి, వేద శిక్షణ కానీయండి, జ్యోతిష శిక్షణ కానీయండి, సేవా సందేశ కార్యక్రమాలు కానీయండి- ఏవి నిర్వహించినా అవన్నీ కూడా జాతి పునర్నిర్మాణం కొరకే! - అని మీకు మనవి చేస్తున్నాను. ఆ జాతి పునర్నిర్మాణం కొరకు అనేక కోణాలనుండి జరుగుతున్న ఒకే ప్రయత్నమని నేను మనవి చేస్తున్నాను. చేతితో

వస్తువును పట్టుకొనేటప్పుడు అన్నివైపులనుండీ ఒక్కసారిగా పట్టుకొంటాం. ఇదీ అలాంటిదే. ఆ ఒక చేతివేళ్లే ఈ వివిధ కార్యక్రమాలు!

నా కిప్పుడు నైమిశారణ్యం గుర్తుకు వస్తున్నది. ఒకానొకప్పుడు నైమిశారణ్యంలో సూతుడు శౌనకాదిమహామునులకు పురాణేతిహాసాలను వినిపిస్తూ ఉండగా అప్పటికప్పుడు అవి గ్రంథస్థమై ప్రజలందరకూ అందుతూ ఉండేవి. అలా అలా, అందుతూ వచ్చినవే ఈనాడు మనకు దారి చూపిస్తున్న మన దివ్య గ్రంథాలు! అలాగే ఇప్పుడు కూడ మానవ ధర్మ శిక్షణ సంస్థ వివిధ శిక్షణ తరగతులను నిర్వహిస్తూ వస్తున్నది. ఆ శిక్షణ తరగతులలో బోధనా రూపంలో వెలువడుతూ వస్తున్న అంశాలు ఇలా ఒకటొకటిగా గ్రంథ రూపాలను ధరిస్తూ ఈనాడు యావత్ప్రజలకూ అందుతూ ఉన్నాయి. ఆనాడు నైమిశారణ్యంలో జరిగిన జ్ఞాన యజ్ఞాలు సరిగా ఇలాంటివే కదా-అని అనిపిస్తుంది నాకు వారు అడవులలో కూర్చొని కూడా మొత్తం మానవజాతిని గూర్చి ఆలోచించారు. అలాంటిది మనం మానవుల మధ్యలో బ్రతుకుతూ కూడా మానవుల గూర్చి ఆలోచించలేకపోతే ఎలాగ? అని అనిపిస్తూ ఉంటుంది నాకు. ఆ ఎలాగ అన్న ఆర్తికి మెచ్చి, 'ఇదిగో ఇలాగ అని నా చేతికి అందించబడినదే ఈ జాతి పునర్నిర్మాణ ఉద్యమం! ఆ ఉద్యమంలో భాగమే ఈ శిక్షణ తరగతులు. ఈ గ్రంథ ప్రచురణలు!

ఆధునికంగా అందివస్తున్న శాస్త్ర దర్శనానికి భారతీయమయిన సనాతన ధర్మస్పర్శ సోకినప్పుడు ఒక దివ్యమైన పరిపూర్ణత వ్యక్తమవుతుంది. ఈ గ్రంథంలో అలాంటి కార్యం జరిగింది. విశేషమయిన హోమియో తత్త్వ శాస్త్రానికి శాశ్వతమయిన తత్త్వ దర్శనపు స్పర్శ అందించబడింది. ఆ సమ్మేళనం నుండి అంతుబట్టని ఒక సమ్మోహనం వ్యక్తం కాసాగింది. అలా ఆ సమ్మోహమయిన స్థితిలో శాస్త్రసత్యాలు ఆవిష్కరింపబడ్డాయి ఇక్కడ. అనుభూతి ప్రదమయిన రీతిలో శాస్త్ర మర్మాలు విడమరచ బడ్డాయి ఇక్కడ! అంతటి సమ్మోహనత్వాన్ని ఈ రచనకు సంతరించి పెట్టిన గురు పరంపరకు పాదాభి వందనం చేస్తున్నాను. పదపదంలో వారి పాదముద్రలను కనుగొంటూ పరవశి స్తున్నాను. ఆ పారవశ్యాన్నే పలుకులుగా ఇక మీకు వినిపిస్తున్నాను. ఈ పలుకులు మిమ్ములను ప్రతినిధులుగా రూపొందించి జాతిపునర్నిర్మాణ ఉద్యమానికి ఉపయోగించ గలవని విశ్వసిస్తున్నాను.

శుభాకాంక్షలు

25–5–93
విజయవాడ

మోపిదేవి కృష్ణస్వామి

# స్వస్థత - అస్వస్థత

స్వస్థత, అస్వస్థత అనే పదాలను నిత్యజీవిత నిర్వహణలో మనం వాడుతూనే ఉంటాం. స్వస్థత అంటే బాగుండటమనీ, అస్వస్థత అంటే బాగుండకపోవడమనీ మనం అర్థం చేసికొంటూ ఉంటాం.

కొంచెం లోతులకు వెళితే స్వస్థత అంటే మన యొక్క సహజ స్థితి. అస్వస్థత అంటే మనకు అనుభవానికొస్తున్న మనయొక్క అసహజ స్థితి. ఆహార, విహార, వ్యవహారాలలో తేడాలు వచ్చినప్పుడు మన యొక్క సహజస్థితి చెదిరిపోతూ వుంటుంది. అసహజస్థితి మనకు అనుభవానికి వస్తూ వుంటుంది. దారి తప్పి తెచ్చుకొంటున్న ఈ అసహజ స్థితినే అస్వస్థత అంటున్నాం.

మనం స్వస్థతలో ఉన్నాము, లేమా మనం స్వస్థతలో లేము — అన్నది మనకెలా తెలుస్తుంది. ఆ తేడా మనకు ఎలా బోధపడుతుంది! మామూలుగా అనిపిస్తుంది కదా—డాక్టరు చెబితే తెలుస్తుంది-అని. కాని అది సరికాదు. మనం స్వస్థతలోఉన్నదీ, లేనిదీ చెప్పగలిగింది మనమే! చెప్పవలసింది కూడ మనమే!

స్వస్థత అంటే ఏమిటో, అది ఎలా తెలుస్తుందో చెబుతాను చూడండి. మనం స్వస్థతలో ఉన్నప్పుడు మన శరీరంలోని ఏ భాగమూ కూడ మనకు గుర్తుకు రాదు. ప్రత్యేకించి ఏ భాగాన్నీ కూడా మనం గమనించవలసిన అవసరం వుండదు. కాబట్టి మన శరీరంలోని ఏ భాగమూ మనకు గుర్తుకురాని స్థితి స్వస్థత. శరీరంలోని ఏ భాగమయినా మనకు గుర్తుకువస్తున్నదీ అంటే అది అస్వస్థత.

శరీరంలోని ఏ భాగమయినా మనకు ఎప్పుడు గుర్తుకు వస్తుంది? మనచేత ఎప్పుడు గమనింపబడుతుంది? అక్కడేదయినా తేడా వచ్చినప్పుడు! వేదన ఏదో అక్కడ కలిగినప్పుడు! అంతే కదా! గమనించి చూడండి!

తల ఎప్పుడు గుర్తుకు వస్తుంది? తలనొప్పి లాంటిదేదో వచ్చినప్పుడు. మోకాలు ఎప్పుడు గుర్తుకు వస్తుంది? అక్కడ ఏదయినా తేడా చోటు చేసి కొన్నప్పుడు. అంతేకదా!

ఇలా గమనిస్తూపోతే ఏ శరీర భాగమయినా మన గమనికను ఎప్పుడు కోరు తున్నది? అక్కడ ఏదయినా కూడని స్థితి ఎదురయినప్పుడు. అవును కదా! అస్వ స్థతను మనం ఇలాగే గమనిస్తున్నాం గదా!

స్వస్థతలో మనకు ఏవీ గుర్తుకురావు. హాయిగా ఉంటుంది. అస్వస్థతలో ఏవో ఒకటి గుర్తుకు వస్తుంది. ఆ మేరకు హాయి తగ్గిపోతుంది. ఇలా చూసినప్పుడు హాయిని అనుభవించగలగటమే స్వస్థత. అనుభవిస్తున్న హాయిని కోల్పోవటమే అస్వస్థత.

ఆంగ్లంలో కూడా ఈ సందర్భంలో ఇందుకు తగిన పదాలనే వాడుతున్నారు. ఈజ్ (ease) అంటే హాయి. డిసీజ్ (disease) అంటే హాయిని కోల్పోయిన స్థితి. ఈ ఈజ్, డిసీజ్ అన్న పదాలు మన స్వస్థత, అస్వస్థత అన్న పదాలకు దగ్గ రగా ఉన్నాయి. ఇది గమనించవలసిన విశేషము.

ఆరోగ్యము, అనారోగ్యము అని మరి రెండు పదాలను గూడా ఈ సంద ర్భంలో మనం వాడుతున్నాం. ఆరోగ్యము అంటే రోగము లేని స్థితి. అనా రోగ్యము అంటే రోగము కలిగిన స్థితి. ఈ పదాలు ఔచిత్యాన్ని అంతగా సంత రించుకొన్నవి కావు.

రోగములేని స్థితి అనడంకన్నా, సహజమయిన స్థితి అనడంలోనే ఔచిత్య మెక్కువగా ఉన్నది. కనుక ఆ సహజ స్థితిని స్వస్థతగానూ, సహజస్థితి చెదరి నప్పుడు అనుభవానికొచ్చే అసహజస్థితిని అస్వస్థతగానూ పేర్కొనడమే అన్ని విధాలా బాగున్నది.

అవయవాలు అన్నప్పుడు మనస్సూ మొదలయినవి గూడ అవయవాలే! అవి కూడ మనకు అందిరావలసిన ఉపకరణాలే! మనస్సు, బుద్ధి, చిత్తము, అహం కారము—ఈ నాలుగింటినీ అంతఃకరణములు అంటారు. అంతఃకరణములు అంటే లోపలి ఉపకరణాలు. మిగిలినవి కనిపించే అవయవాలయితే ఇవి అనిపించే అవ యవాలు. ఈ అవయవాలలో ఏ ఒక్కటి గుర్తుకు వచ్చినా కూడా అది అస్వస్థతే అవుతుంది.

అర్ధరాత్రి అయింది. లైటు తీసివేసి నిద్రకు ఉపక్రమించాము. కాని నిద్ర పట్టడంలేదు. మనస్సుకు ఏవో ఆలోచనలు. మనం నిద్రపోవాలి అంటున్నాము. అది ఆలోచించుకోవాలి అంటున్నది. అలా మన గమనికకు వస్తున్నది. మన కన్నా

వేరుగా వర్తిస్తూ ఉన్నది. అంటే ఏమిటన్న మాట — మనం అస్వస్థతలో ఉన్నామన్న మాట!

కొందరిలో మనస్సు అతిగా పనిచేస్తున్నది. కొందరిలో బుద్ధి అంది రాలేనంటున్నది. కొందరిలో చిత్తం క్షోభ ననుభవిస్తున్నది. కొందరిలో అహంకారం పేట్రేగుతున్నది. ఇవన్నీ కూడ, ఇలాంటివన్నీ కూడా అస్వస్థతగా గమనించవలసిన అంశాలే!

కొంచెం పరిశీలనగా చూడగలిగితే మనకొక విశేషమైన సత్యం బోధపడుతుంది. అస్వస్థతకు గురి అవుతున్న మనిషిలో ముందుగా "అనిపించే అవయవాలు" అస్తవ్యస్తమవుతున్నాయి. అటుపైన "కనిపించే అవయవాలు" వ్యాధిగ్రస్త మవుతున్నాయి. అస్వస్థత, అనిపించే అవయవాల మీదుగా, కనిపించే అవయవాల దగ్గరకు దిగి వస్తున్నది. రోగగ్రస్థుని సమీపిస్తున్న వైద్యుడు ఈ సత్యదర్శనాన్ని సమగ్రంగా పొందినవాడు కావడం ఎంతయినా అవసరం.

స్వస్థతలో ఉన్నప్పుడు శరీరం మనయందు ఉంటున్నది. అస్వస్థతగా ఉన్నప్పుడు శరీరంలో మనమున్నట్లుగా అనిపిస్తూ ఉంటుంది. అంటే శరీరం మన నుండి చెదరిపోతున్నదన్న మాట. మనం శరీరాన్ని పట్టుకొని ప్రాకులాడవలసిన పరిస్థితి దాపురిస్తున్నదన్న మాట!

కబాడీ ఆటలో ఒకనికి కాలు తొలిగింది. అప్పటి బాధను ఊహించ గలరు కదా! వర్ణనాతీతమయిన బాధ అది. ఎందువల్ల అంత బాధ అనుభవానికొస్తున్నది, ఏం జరిగిందని! కాలు తన స్థానాన్ని తప్పింది, తన స్థానం నుండి చెదిరింది. అంతేగదా!

ఇంతలో ఒడుపు తెలిసిన వాడొకడు అతని చెంతకువచ్చి, ఆ కాలును యథాస్థానానికి చేర్చాడు. అంతే! ఇక బాధ తగ్గిపోవడం మొదలు పెట్టింది. ఇంత వరకు జరిగినదంతా ఒక పీడకలగా కనిపించింది కాసేపటిలో ప్రాణం కుదుట పడింది.

ఈ సన్నివేశంలో చెదరుబాటువలన అనుభవానికొస్తున్న బాధ ఎంతటిదీ అన్నదీ గమనించుకొన్నాం గదా! చెదరుబాటునుండి కుదురుబాటుకు వస్తున్నకొద్దీ అతడు పొందుతూ వచ్చినహాయిని కూడ గ్రహించుకోగలిగాం కదా! ఒక అవయవం చెదురుతూ ఉంటేనే అంతటి బాధ కలుగుతూ ఉన్నదే—అలాంటిది శరీరమే చెదురుతూ ఉంటే ఆ అసహజస్థితి ఎలా ఉంటుంది, ఎంతటి బాధను కలిగిస్తుంది? ఆలోచించండి!

మన పూర్వుల్లో జీవిత కాలంలో తలనొప్పిని కూడ ఎరుగనివారు, వృద్ధాప్యం వచ్చినా కళ్ళజోళ్ళ అవసరం ఏమాత్రం రానివారు, జీవితం మొత్తంమీద తుమ్మి గాని, దగ్గిగాని, జ్వరమొచ్చిగాని ఎరుగనివారు ఎందరో కనబడతారు. వారందరూ అలా ఎలా ఉండగలిగారు! వారు ఈ స్వస్థవృత్తాన్ని ఆశ్రయించారు. స్వస్థవృత్తం నిర్దేశిస్తున్న దివ్య జీవన విధానాన్ని తమ దినచర్యగా రూపొందించుకొన్నారు. దానితో వారి శరీరం దృఢంగా నిలబడింది. వారి జీవితం పండుగలా సాగింది. వారందరూ అన్నివిధాలా ధన్యతను చెందారు. మరి మన మాటేమిటి? మనకూ ఆ అవకాశం ఉంది. వారిలా స్వస్థవృత్తాన్ని దినచర్యగా రూపొందించుకోగలిగిననాడు మనం కూడా అంతటి ధన్యతను అనుభవించగలం. అయితే ఈ రోజులలో ఇది సాధ్యమా!— అన్న అనుమానంగాని, అధైర్యంగాని మనలో కలుగకూడదు.

ఆచరణశీలి కాలాన్నిబట్టి పోడు. కాలం పోకడను గమనించుకొని దానిని తనకు అనుగుణంగా మలచుకోగలుగుతాడు. అదే గాలి, అదే ఏరు కొన్ని నావలు ఇటునుండి అటు వెళుతున్నాయి. కొన్ని నావలు అటునుండి ఇటు వస్తున్నాయి. వాతావరణం ఒకటే అయినా, నావ నావికుని సంకల్పాన్నిబట్టి నడుస్తోంది. నావికుడు తన ప్రయాణానికి అనుగుణంగా అటు ఏటినీ, ఇటు గాలివాటునూ కూడ వినియోగించుకొంటున్నాడు. సంకల్పముండాలేగాని సాధ్యం కానిదంటూ ఉంటుందా!

ఇంతే వైద్య విధానమూ కూడా ఆయుర్వేదం వివరించినంత సమగ్రంగా స్వస్థవృత్తాన్ని గురించి వివరించలేదు, చివరకు హోమియో కూడా! హోమియో తన అపురూపమయిన తత్త్వదర్శనంతో దీర్ఘ వ్యాధులను సమూలంగా నివారణ చేయగలుగుతున్నది. అందులో సందేహంలేదు. కాని ఆ తరువాత మానవుడు మళ్ళీ అలాంటి వ్యాధి బాధలకు గురికాకుండా ఉండాలీ అంటే జీవితాన్ని ఎలా నడుపుకో వలసి ఉంటుంది అన్నచోట హోమియో సూచించి వదిలిపెట్టింది తప్ప పూనుకొని వివరించలేదు. ఈ కారణం చేతనే మనం హోమియో వైద్య శిక్షణ తరగతులను నిర్వహిస్తున్నప్పుడు స్వస్థవృత్తాన్ని మొదటి అధ్యాయంగా, జత చేర్చుకొని బోధి స్తున్నాం. 'నిత్య జీవితానికి నియమావళి' అన్న పేరుతో బోధింపబడుతున్న ఈ అధ్యాయానికి రూపకల్పన జేయడంలో ఇటు స్వస్థవృత్తమూ, అటు సనాతన ధర్మమూగూడ మనకు ఎంతగానో అందివచ్చాయి.

లోకహితాన్ని కోరి ఈ 'నిత్యజీవితానికి నియమావళి'ని ఒక దివ్యమయిన గ్రంథంగా రూపొందించి మానవజాతికి మనమందించాము. ఈ రోజున ఈ గ్రంథం

దేశదేశాలలో అనుదినం అధ్యయనం చేయబడుతోంది. ఈ గ్రంథం ఎడల ప్రజలు ప్రకటిస్తున్న ఆర్తినీ, చూపిస్తున్న శ్రద్ధనూ గమనిస్తున్నకొద్దీ చెప్పవలసిన విధంగా చెప్పినప్పుడు ప్రజలు దివ్యజీవనంలోనికి తప్పక ప్రవేశిస్తారు, తపనతో ప్రవేశిస్తారు, తపస్సుగా తమ జీవితాలను ఇక మలచుకొంటారు—అన్న సత్యం మనకు దర్శన మిస్తోంది.

ఆయుర్వేదంలో మొదటిభాగం స్వస్థవృత్తం కాగా, రెండవభాగం ప్రాయశ్చిత్త కాండగా పేర్కొనబడింది. అనగా సృష్టికి అనుగుణంగా, పెద్దల అడుగుజాడలలో జీవితాన్ని నడుపుకొనలేకపోవడమన్నది పాపంగా పరిగణించబడింది. ఆ పాపఫలమే వ్యాధిబాధలు. ఆ వ్యాధిబాధలకు చేయబడే ఔషధ వినియోగమే జరిగిన పాపానికి ప్రాయశ్చిత్తకాండ!

అనాది అయిన ఆయుర్వేదమే అలా అలా అరేబియా దేశాలకు వెళ్ళి అక్కడ కొన్ని మార్పులకూ చేర్పులకూ లోనై తిరిగి భారతదేశానికి వచ్చినప్పుడు అదే 'యునాని' వైద్యంగా పిలువబడింది.

అలాగే కాల కాలాలలో రూపొందుతూ వచ్చిన రసవైద్యమూ, సిద్ధవైద్యమూ కూడ ఈ ఆయుర్వేద వైద్యానికి అనుబంధంగా రూపొందుతూ వచ్చినవే! ఊరు పెద్దదయినప్పుడు పేటలు పెరుగుతాయిగదా! అలాంటి స్థితి ఇది! ఆ పేటలన్నీ ఈ ఊరిలోని భాగాలేనని వేరుగా చెప్పనక్కరలేదుగదా!

ఇక ప్రకృతి వైద్యమున్నది. దీనినే న్యాచురోపతి అంటున్నారు. స్వస్థవృత్తంలోని కొన్ని అంశాలను స్వీకరించి వాటికొక ప్రత్యేకమయిన రూపునిచ్చి, ఈ చికిత్సా విధానాన్ని నిర్వహిస్తున్నారు. అన్నపానాలను నియమించడంద్వారా జీర్ణాశయాన్ని శుద్ధిచేసి, స్వస్థతను సిద్ధింపచేయాలన్నది వీరి ఆశయం. ఈ విధానాన్ని శ్రద్ధతో, పద్ధతిగా అనుసరించడంవల్ల ఒక మాదిరి వ్యాధి బాధలన్నీ తొలగిపోతాయి. అయితే దీర్ఘవ్యాధుల విషయంలో ముఖ్యంగా, వారసత్వంగా అందివచ్చిన దీర్ఘవ్యాధుల విషయంలో ఈ వైద్యం ఉపశమనాన్ని అందించగలదుగాని, నివారణను అనుగ్రహించలేదు.

స్వస్థవృత్తంలో కొంతభాగాన్ని తీసికొని చికిత్సా విధానంగా రూపొందించడం బాగానే ఉన్నది. కాని ఆ స్వస్థవృత్తాన్ని మరింతగా పుణికి పుచ్చుకొని, ఆ దివ్య జీవన విధానంలోనికి, తమ దగ్గర స్వస్థతను పొందుతున్న వారిని పెద్దఎత్తున ప్రవేశింపజేయవలసిన బాధ్యతను వీరు స్వీకరించవలసి ఉన్నది. తమనుండి జరుగు

తున్న ప్రయత్నానికి సమగ్రతను సంతరింపజేయడంలో వీరు శ్రద్ధపెట్టవలసి ఉంది. అలా జరిగిననాడు ఆయుర్వేద దర్శనానికి వీరు నిండయిన నిదర్శనాలను చూప గలుగుతారు.

యోగ చికిత్స కూడ స్వస్థవృత్తంలోని భాగమే! యోగాసనాలతో ప్రారంభించి, ప్రాణాయామ స్థితి వరకు నడిపించి, వ్యాధి బాధలనుండి ప్రజలకు విమోచనం కలిగించే ప్రయత్నం జరుగుతూ ఉన్నది. ఈ ప్రయత్నం మంచిదే! వీరు కూడ స్వస్థవృత్త మందిస్తున్న దివ్యజీవన విధానాన్ని తమచెంతకు చేరవస్తున్న వారికి సమగ్రమయిన తీరులో అందించగలగాలి.

అలాగే అయస్కాంత చికిత్స ఉన్నది. రంగులతో జరిపే చికిత్స ఉన్నది. వ్యాయామరూపంలో జరిపే చికిత్స ఉన్నది. నవరత్నాలలో కావలసిన దానిని ఎంచి వాటిని ధరింపజేసి నడిపే చికిత్సా విధానమున్నది. ఈ విధానాలన్నింటికీకూడా నేపథ్యంలో ఉన్నది ఆయుర్వేదమే!

అయితే జాగ్రత్త పడవలసినది ఒకటి ఉంది. పేర్లు పెరుగుతున్నకొద్దీ ఆయా చికిత్సలకు పరిధులు తగ్గుతున్నట్లుగా కనిపిస్తూ ఉన్నది. పరిధి తగ్గకుండా చూసుకోవడం ఎంతయినా అవసరం. ఆయుర్వేదం నుండి అందుకోవడమొక్కటే చాలదు. ఆయుర్వేదమంత విశాలమయిన పరిధిని కూడా రూపొందించుకోగలగాలి. లేకపోతే కార్యసాధన తగ్గి, కాలక్షేపం సాగిపోతుంది.

ఆయుర్వేదం చికిత్స విషయంలో ఔషధాలకు ఎంతటి పాత్రనిచ్చిందో, మణులకూ, మంత్రాలకూ కూడ అంతటి పాత్రనిచ్చింది. మణులూ, మంత్రాల విషయంలో ఇప్పుడిప్పుడే ఆధునికులు మళ్ళీ శ్రద్ధను చూపిస్తున్నారు. కనుకనే చికిత్సలో మణులకు ప్రాధాన్యం పెరుగుతున్నది జప, ధ్యానాదుల పేరిట మంత్రాలకూ ప్రాధాన్యం పెరుగుతున్నది. ప్రజల ఉత్సుకతను గమనించి ఈ రంగాలలో చికిత్సనందించేవారు కూడ పెరుగుతూ వస్తున్నారు. ఇలా చికిత్సనందించదలచేవారు ముందు ఆయుర్వేదాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేయడం అవసరం. అటుపైన ఆధునికంగా అందివస్తున్న పరిశోధనా ఫలితాలను ఈ ఆయుర్వేద అధ్యయనానికి అనగలుపుకోవచ్చు. ఇలా ఆయుర్వేదం కాలంతోపాటు ఇన్ని మలుపులూ తిరుగుతూ వచ్చి ఇలా ఇన్ని పేర్లతో ఇంతింతగా మనకు దర్శనమిస్తూ ఉన్నది.

అలోపతీ వైద్య విధానాన్ని కనిపెట్టింది హిపోక్రేటస్ మహాశయుడు. ఈయన గ్రీకు దేశస్థుడు. క్రీస్తుపూర్వం నాల్గవ శతాబ్దికి చెందినవాడు. ఇతడి నాటికి

ఆ దేశాలలో సరయిన వైద్యచికిత్స లేదు. కేవలం చిట్కా-వైద్యాలపైన ప్రజలు ఆధారపడేవారు. వైద్యాన్ని ఆ స్థితినుండి ముందుకు నడిపించాడు హిపోక్రేటస్. దేహ భాగాలనూ, ప్రాణప్రక్రియలను గమనించడం అవసరమని వైద్యులకు తెలియజెప్పాడు. వాటిని గమనించడం ఎలాగో కూడా వారికి నేర్పుకొంటూ వచ్చాడు.

హిపోక్రేటస్ ప్రేరణ ఆ మేరకు ఫలించింది. అలోపతీ వైద్య విధానంలో దేహభాగాలనూ, ప్రాణ ప్రక్రియలనూ పరీక్ష చేయడానికిగాను ఎన్నెన్నో పద్ధతులు వచ్చాయీ, వస్తున్నాయి. ఎన్నెన్నో పరికరాలు సమకూరాయి. ఇంకా సమకూరుతున్నాయి. దేహభాగాలనూ, ప్రాణప్రక్రియలనూ గమనించే విషయంలో అలోపతీ అందిస్తున్న ఈ సౌకర్యాలను మిగిలిన అన్ని వైద్య విధానాలవారుకూడా స్వీకరించి, సద్వినియోగం చేయగలిగితే బాగుంటుంది. చాలామంది అలా చేస్తున్నారు కూడా!

అయితే దేహభాగాలనూ, ప్రాణప్రక్రియలనూ ఇంతగా పట్టించుకొంటున్న అలోపతి, వ్యాధి స్వరూపాన్ని గూర్చి మాత్రం అంతగా అవగాహన చేసుకొనలేకపోతున్నది. నేటికికూడ అలోపతిలో ఈ దీనస్థితి ఇలాగే కొనసాగుతున్నది. దానితో వ్యాధి నివారణకు కావలసిన చర్యలను తగిన పద్ధతిలో చేపట్టలేకపోతున్నది. దీనితో అలోపతీ వైద్యం ద్వారా వ్యాధి ఉపశమిస్తున్నదితప్ప, నివారణ కావడంలేదు. వ్యాధిపరమైన ఈ అవగాహన ఇలా వీరిలో ఎదిగిరాని కారణాన మిరుమిట్లు గొలుపుతున్న వీరి సాంకేతిక అభివృద్ధి కూడా అలా వీరిచెంత నిస్సహాయస్థితిలో నిలబడిపోతున్నది. 'నేను ఇంతగా ఉండికూడా మీకు చేయగలుగుతున్నది చాలా తక్కువే కదా'—అన్నట్లు బాధతో చూస్తూ ఉన్నది.

అలోపతీ వైద్యుడు రోగి అనుభవిస్తున్న ప్రతి వేదననూ ఒక వ్యాధిగ పరిగణిస్తున్నాడు. ఇంకా చెప్పాలీ అంటే భ్రమ పడుతున్నాడు. ఒక్కొక్క వేదనన ఒక్కొక్క వ్యాధిగా పరిగణించి, దానికి ఒక్కొక్క 'కోర్సు'ను వ్రాసుకొంటు పోతున్నాడు. దీనితో ఎన్ని వేదనలుంటే అన్ని వ్యాధులున్నట్లయి, వాటికి అని కోర్సులు వాడవలసివచ్చి రోగుల పొట్టలు, మందుల బుట్టలయిపోతున్నాయి. రో తీసికొనే ఆహారపదార్థాల పరిమాణంకన్నా, రోగి తీసుకొనే ఔషధ పదార్థాల ప మాణం క్రమంగా పెరిగిపోతున్నది. నిజానికి ఇన్ని వ్యాధులు లేవు. ఇన్నిమందు అవసరం లేవు. ఈ సత్యం ఎడల అలోపతీ వైద్యుడు మేల్కొనవలసి ఉంది.

అలోపతీవైద్యునకు ఈ మేల్కొలుపును అనుగ్రహించడానికే హానిమా మహాశయుడు ఈ భూమిపైన అవతరించాడు. 1755వ సంవత్సరంలో జర్మ

దేశంలో జన్మించిన ఈ మహానుభావుడు 1843 వరకూ జీవించి తన జీవితకాలం లోనే హోమియో విధానాన్ని దర్శించి, దానిని అమలుపరచి, పరిపూర్ణ మయిన చికిత్సా విధానంగా దానిని సుప్రతిష్ఠితం చేశాడు. అలోపతీ వైద్యులు ఎక్కడ ఆగి పోతున్నారో అక్కడనుండి ముందుకు సాగాడు హానిమాన్. కొన్ని పదుల సంవత్స రాలు అలోపతిలో ఘనవైద్యునిగా పనిచేసి, దాని పరిమితులను గమనించుకొని అది చెందవలసిన పరిణితి వైపుగా తన ప్రయాణాన్ని సాగించాడు.

హానిమాన్ మహాశయుడు వేదనలు వ్యాధులు కావు అని గమనించుకొన్నాడు. వ్యాధిని పొడగట్టించుకొనే వైనాన్ని తన తపస్సు ద్వారా అందిపుచ్చుకొన్నాడు. మూలమయిన వ్యాధి స్థితిని గమనించిన తరువాత దానిని నివారణ చేయవలసిన విధా నాన్ని ప్రకృతిమాత అందిస్తున్న దర్శనాల నుండీ, నిదర్శనాల నుండీ అంతుబట్టించు కొన్నాడు. ఆ అంతుబట్టిన దానిని ఒంట బట్టించుకొన్నాడు. దానితో తరుణ వ్యాధు లకే గాదు, దీర్ఘ వ్యాధులకు కూడా శాశ్వతమయిన నివారణ సాధ్యమేనని నిరూ పించాడు. రోగి అయినవాడు జీవితాంతము రోగిగా ఉండవలసిన అవసరం లేదన్న శుభవార్తను భూమి ప్రజలకు అందించాడు. శాపానికే విమోచనమున్నప్పుడు ఈ రోగాన్నుండి విమోచనముండదా! ఇదియేమి ఘోరమని వ్యధచెందుతూ, కృంగి పోతున్న ఆర్తజనుల కన్నీళ్లను తుడిచాడు. జీవించి ఉండగానే మీరు పునర్జన్మను పొందగలరు. పునరుజ్జీవాన్ని అందుకొనగలరు- అని వారికి అభయమందించాడు. మానవజాతి మనుగడలో నూతన శకానికి నాంది పలికాడు. భూమిపైన దేవుని రాజ్యానికి దారులు తీర్చాడు.

ఈ మహనీయుడు అందించిన దివ్యదర్శనాన్నే ఇక ముందు మనం వివ రించుకోబోతున్నాం. చిత్రమేమంటే హానిమాన్ మహాశయునికి ఆయుర్వేద వైద్య మన్నది ఒకటి ఉన్నట్లు తెలియదు. కాని అతడి సాధనలో, పరిశోధనలో భారతీయ మయిన ఆత్మతత్త్వం తొణికిసలాడుతుంది. భారతీయమయిన తాత్త్విక దృక్పథం అలవరచుకొన్నవారికి మాత్రమే హానిమాన్ మహాశయుని దర్శనం పరిపూర్ణంగా అందుతుంది. ఇప్పుడు మనం చేస్తున్నదదే! భారతీయమయిన తాత్త్విక నేపథ్యం నుండి హానిమాన్ మహాశయుని దివ్యదర్శనాన్ని సమగ్రంగా పొడగట్టించుకొనే ప్రయత్నాన్ని చేస్తున్నాము. ఇది ఒక శుభ సమయం! ఇక ఈ వెలువడుతున్నదీ మానవ జాతికి కావలసిన దివ్య సమన్వయం! సోపాన క్రమంలో అందివస్తున్న ఆ దివ్య దర్శనాన్ని కలసి సాగుతూ అందుకొందాం!

(2)

దేహభాగాలను గూర్చీ, ప్రాణప్రక్రియలను గూర్చి అలోపతీ వారు అందిస్తున్న అవగాహన మీకు అందుబాటులోనే ఉన్నది. ఆ అవగాహనను జోడించుకోవలసిన కొన్ని సూక్ష్మాంశాలను స్వస్థ వృత్తం నుంచీ, సనాతన ధర్మం నుంచీ ఎంచి మీకు చెబుతాను. ఈ సూక్ష్మాంశాల యెడల మీకు అందించబడుతున్న ఈ అవగాహన ముందు ముందు అధ్యాయాలను బోధపరచు కొనేటందుకుగాను మీకు బాగా అక్కరకు వస్తుంది.

కావలసిన అంశాలను వరుసగా వివరిస్తాను. ఇక గమనించండి :

## త్రి లో కా లు

పదార్థము,శక్తి, ప్రజ్ఞ-ఇవి త్రిలోకాలు. దేహంగా నిలబడుతున్నది పదార్థము. ఆ పదార్థాన్ని చేతనవంతం చేస్తున్న ప్రాణమే శక్తి. ఆ శక్తిని నడిపిస్తున్న మన నిజస్వరూపమే ప్రజ్ఞ.

పదార్థము, శక్తి, ప్రజ్ఞ-వీటినే ఆంగ్లంలో వరుసగా, మేటర్, ఫోర్స్, కాన్షస్‌నెస్ అని అంటున్నాము. సంస్కృతంలో భూలోకము. భువర్లోకము, సువర్లోకము అని పిలుస్తున్నాము.

నారదుడు త్రిలోక సంచారి- అన్నప్పుడు అర్థమేమిటి! కేవలం అలా మబ్బుల్లో తిరిగి వస్తాడని కాదు. పదార్థము, శక్తి,ప్రజ్ఞ—అనే ఈ మూడు లోకాలలో ఏకకాలంలో చరించగలిగినవాడు అని అర్థం. ఈ మూడు లోకాల అనుపానులు తెలిసిన వాడని పరమార్థం.

ఈ మూడు లోకాల నడుమ చక్కని అనుసంధాన మున్నప్పుడు అది స్వస్థత. ఆ అనుసంధానం చెదరినప్పుడు అది అస్వస్థత.

ఒకతను బాటవెంట నడుస్తున్నాడు. అతని కుడిచేయి అతనితో నిమిత్తం లేకుండానే ముందుకూ, వెనక్కూ వణకుతూ కదలిపోతోంది. ఆ కదలికను అతడు ఆపలేడు. ఇక్కడ జరుగుతున్నది ఏమిటి? పదార్థమూ, శక్తీ ఈ రెండూ కూడా ప్రజ్ఞ యొక్క అధీనంలో లేవు. ఆ ఒద్దికనుండి చెదరిపోయాయి.

ఒకతనికి పక్షవాతం వచ్చింది. ఎడమవైపున కాలూ, చేయీ పడిపోయాయి. వాటిని కదల్చాలని ఉన్నదిగాని కదల్చలేడు. ఇక్కడ ఏమి జరుగుతున్నది? పదార్థమున్నది. ప్రజ్ఞకూడ ఉన్నది. ఈ రెండింటి మధ్యన ఉండవలసిన శక్తి మాత్రం తప్పుకొన్నది.

ఇదీ మూడు లోకాల కథ. ఇలా ఉంటుంది! ఈ లోకాల మధ్య శ్రుతి నిల బడాలి. ఆహార విహారాలలోని లేపాల వల్లగానీ, వారసత్వంగా సంక్రమించిన దోషాలవల్లగానీ ఈ శ్రుతి చెదరిపోవచ్చు. ఆ చెదురుబాటే మనకు అస్వస్థతగా అను భవమవుతూ ఉంటుంది.

## పంచ కోశాలు

అన్నమయ కోశము, ప్రాణమయ కోశము, మనోమయ కోశము, విజ్ఞాన మయ కోశము, ఆనందమయ కోశము-ఇవి పంచకోశాలు.

పదార్థమయస్థితిని అన్నమయ కోశము అన్నారు. ఆ పదార్థాన్ని చేతన వంతం చేస్తున్న ప్రాణశక్తిని ప్రాణమయ కోశమన్నారు. ఆ ప్రాణాన్ని నడిపిస్తున్న మనస్సును మనోమయ కోశమన్నారు. ఆ మనస్సుకు మంచిచెడులను వివరిస్తూ కావల సిన వివేకాన్ని బాధ్యతతో అందిస్తున్న బుద్ధిని విజ్ఞానమయ కోశమన్నారు. ఆ పైన వ్యక్తమవుతున్న మన నిజస్వరూపాన్ని ఆనందమయ కోశమన్నారు. ఆనందమయ కోశం నుండి మిగిలిన నాలుగు కోశాలూ వ్యక్తమవుతున్నాయన్న సత్యాన్ని గ్రహించమన్నారు. ఈ ఆనందమయ కోశాన్నే ప్రేమమయ కోశమని కూడా పిలి చారు.

పదార్థము, శక్తి, ప్రజ్ఞ-ఇవి త్రిలోకాలు గదా. ఈ త్రిలోకాలలో ప్రజ్ఞగా చెప్పబడిన దానిని పంచకోశాలలో మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశా లుగా విడమరచి చెప్పారు. అందువలన అంతకుముందు చెప్పబడిన త్రిలోకాలు ఇక్కడ పంచకోశాలుగా దర్శనమిస్తున్నాయి.

ఈ పంచకోశాలకు శ్రుతి కుదిరినప్పుడు, ఆ కుదిరిన శ్రుతి నిలచినప్పుడు అది స్వస్థత. ఆహార విహారాదులలోని అపచారాల వల్లగాని, వారసత్వంగా అంది పుచ్చుకున్న వ్యాధిస్థితుల వలనగాని ఆ శ్రుతి చెదరినప్పుడు అది అస్వస్థత!

చేతిపైన చీమ ప్రాకుతున్నది. ప్రాణానికి ఆ స్పర్శ అందుతున్నది. ప్రాణం మనస్సుకు చెబుతున్నది. దానిని తొలగించాలన్న వివేకం మనస్సుకు ఆ పైనుండి అందుతూ ఉన్నది. అప్పుడు మనస్సు దేహ, ప్రాణాలను ఆజ్ఞాపిస్తున్నది. చేయి కదలి చీమను తీసివేస్తున్నది. ఈ మొత్తము కథ ఎంత సేపటిలో జరుగుతున్నది! పంచకోశాల కలివిడితనం ఇలా ఉంటున్నది.

ఇక వీటి విడివిడి తనం చూద్దాం. ఒకతను పనిలో ఉన్నాడు. ఆకలి వేస్తున్నది. దేహం శోషిల్లుతున్నది. పని పూర్తి కావాలి కదా అని అలాగే ఉండిపోయాడు. వేసివేసి ఆకలి చచ్చిపోయింది. ఇక్కడ ఏమి జరుగుతున్నది! అన్నమయ, ప్రాణమయ కోశాల స్థితిగతులను మనోమయ కోశం నిర్లక్ష్యం చేస్తున్నది. విజ్ఞానమయ కోశం నుండి కావలసిన వెలుగును అందుకోలేక పోతున్నది. విజ్ఞానమయ కోశం ఇటు మనోమయ కోశాన్నీ కలుపుకోలేక పోతున్నదీ, అటు ఆనందమయ కోశాన్నీ అందుకొనలేక పోతున్నది. ఆనందమయ కోశం యొక్క అధీనం నుండి మిగిలిన నాలుగు కోశాలూ చెదరిన పరిస్థితి ఇది! చూశారా, ఆకలిని నిర్లక్ష్యం చేయడమనే ఈ చిన్న అంశంలో అయిదు కోశాలూ ఎలా విడివిడి తనాన్ని ప్రదర్శిస్తున్నాయో! ఇక ఈ అపశ్రుతి క్రమక్రమంగా దారుణ వ్యాధి బాధలకు దారితీయగలదు.

తైత్తిరీయోపనిషత్తు ఈ పంచకోశాల స్వరూప స్వభావాలను చక్కగా వివరిస్తున్నది. మానవ నిర్మాణాన్ని గురించీ, జీవిత నిర్వహణాన్ని గురించీ మన సనాతన వాఙ్మయం శాస్త్రీయమైన పద్ధతిలో ఆచరణకు అనుకూలమయిన రీతితో మనకు వివరిస్తూ ఉన్నది.

తెలిసో తెలియకో నిష్ఠూరమాడుతూ మనవాళ్లు అంటూ ఉంటారు. ఏమని! నీకు ఏ కోశానా బుద్ధి లేదురా!-అని. కోశాలను ఇలా నిష్ఠూరంగా తలచుకొంటున్నాం. ఇప్పుడిక నిజంగా తలచుకొందాం!

## త్రిధాతువులు

వాతము, పిత్తము, శ్లేష్మము- ఇవి త్రిధాతువులు. ప్రాణమయ కోశాన్ని ఆశ్రయించి వ్యక్తమయ్యే సుడిగుండాల వంటి స్థితులివి.

శ్లేష్మధాతువు కణనిర్మాణాన్ని చేస్తుంది. పిత్తధాతువు కణదహన కార్యాన్ని నిర్వహిస్తుంది. వాత ధాతువు జీవన యాత్రకు కావలసిన స్పందనలను వ్యక్తం చేస్తుంది. శ్లేష్మ, పిత్త ధాతువులను సమపాళంగా నడిపే ప్రయత్నం కూడ వాత ధాతువు నుండి జరుగుతుంది.

శ్రుతి కుదిరినప్పుడు ఈ త్రిధాతువులు మనకు స్వస్థతను అందిస్తాయి. శ్రుతి చెదరినప్పుడు ఈ త్రిధాతువుల నుండి త్రిదోషాలు పుడతాయి. అవి అస్వస్థతను కలిగించి మనలను ఇబ్బంది పెడతాయి.

శ్లేష్మధాతువు చెదరినప్పుడు కణ నిర్మాణ క్రియ అస్తవ్యస్తమవుతుంది. అంటే కణనిర్మాణం అతిగా జరుగవచ్చు. లేదా కావలసిన దాని కన్నా కూడా తగ్గిపోవచ్చు.

కణ నిర్మాణం అతిగా జరిగినప్పుడు శరీరం అదేపనిగా పెరగవచ్చు. బరువు మితిమీరవచ్చు. అలాగే జలుబులు, తుమ్ములు, దగ్గులు, కళ్లె మొదలయిన రూపాలలో మితిమీరిన కణనిర్మాణం వ్యక్తం కావచ్చు.

కణనిర్మాణం తగ్గిపోయినప్పుడు శరీరం ఇలకరుచుకొని పోవచ్చు. తిన్న తిండికి ప్రయోజనం లేని స్థితి ఏర్పడవచ్చు. ఈ స్థితిలో ఉన్న కొందరు ఎంతకూ తేలరు. వయస్సుకు తగిన ఎదుగుదల వీరిలో మనకు కనబడదు.

పిత్తధాతువు చెదిరినప్పుడు కణదహన క్రియ గతితప్పి పోతున్నది. అనగా ఆ క్రియ మితిమీరి జరుగవచ్చు. లేదా మందకొడితనాన్ని పొందవచ్చు.

మితిమీరి జరిగినప్పుడు తిన్న ఆహారం వెంటవెంటనే అరిగిపోతూ వెర్రి ఆకలి పుట్టుకువస్తుంది. అదే ఈ క్రియ మందగించినప్పుడు తీసికొన్న ఆహారం ఎంతకూ అరగక అలా ఒక బరువుగా నిలబడిపోతుంది రాయిపెట్టినట్లో, ఉండ చుట్టినట్లో ఉండిపోతుంది.

ఇంకా ఈ చెదరుబాటు వల్ల శరీరభాగాల్లో మంటలు అనుభవానికి వస్తాయి. కడుపుమంట, శిరస్సుమంట, కళ్ళమంట, ఎన్నెన్నోరకాల మంటలు. ఈ మంటలతో లోపలి దేహభాగాలలో ఒరిపిళ్ళు, పుండ్లు కూడా ఏర్పడుతూ ఉంటాయి.

వాతధాతువు చెదరినప్పుడు స్పందనలు ఇక గతి తప్పుతాయి. గుండె గతి తప్పవచ్చు. ఊపిరితిత్తులు గతితప్పవచ్చు. రక్తప్రసరణ గతి తప్పవచ్చు. ఇలా ఇవి గతి తప్పడంవల్ల గుండెనొప్పి రావచ్చు. ఆస్తమా విజృంభించవచ్చు. రక్తపోటు మనను పడగొట్టవచ్చు.

అలాగే శరీరంలోని వాయుస్థితులు గతి తప్పుతాయి. శరీరభాగాలలో వాయువు చేరుకొంటూ, పేరుకొంటూ నిలబడిపోతుంది. దానితో రకరకాల తీపులు, నొప్పులు ప్రారంభమవుతాయి. కడుపునొప్పుల దగ్గరనుండి కీళ్ళనొప్పుల వరకు ఎలాంటి నొప్పులయినా ఏర్పడవచ్చు.

ఇదీ త్రిధాతువుల కథ! వీటిమధ్య శ్రుతి నిలచినప్పుడు స్వస్థత. ఆహార విహారాలలో తేడాలవల్ల గాని, వారసత్వం నుండి పుటికి పుచ్చుకొన్న దీర్ఘవ్యాధుల వల్ల గాని ఈ శ్రుతి చెదరినప్పుడు అనుభవానికొచ్చేది అస్వస్థత!

## సప్త ధాతువులు

రసము, రక్తము, మాంసము, అస్థి మజ్జ, శుక్రము — ఇవి సప్తధాతువులు. ఈ సప్తధాతువుల అల్లికయే మన అన్నమయ కోశము.

మనం తీసికొన్న ఆహారం జీర్ణాశయాన్ని చేరి, అచట పచనం చేయబడి రస స్థితిని పొందుతుంది. ఇక ఆ రసస్థితినుండి వరుసగా రక్తము, మాంసము, మేదస్సు అస్థి, మజ్జ, శుక్రము ఏర్పడుతున్నాయి.

రక్తమాంసములను గూర్చి మనకు తెలుసు. ఇక మేదస్సు అనగా క్రొవ్వు, అస్థి అనగా ఎముక. మజ్జ అనగా ఎముక చుట్టూ, ఎముక లోపలా ఉండే పదార్థం. శుక్రము అనగా తిరిగి మరొక శరీరానికి రూపుదిద్దగల ధాతువు. ఇది సప్తమధాతువు. శరీరమునకు సారభూతమయిన ధాతువు ఇది. మరొక శరీరమునకు రూపకల్పన చేయగలిగిన శక్తి గలిగినది. పురుషులలో దీనిని శుక్రము అంటున్నాము. స్త్రీలలో దీనిని శోణితము అంటున్నాము.

ఈ సప్తధాతువుల నడుమ శ్రుతి నిలబడినప్పుడు దేహం చక్కగా నిలబడుతుంది. ఈ శ్రుతి ఏమాత్రం చెదరినా, ఈ ధాతువుల పొందిక దెబ్బతిని, శరీర నిర్మాణంలో ఎగుడుదిగుడులు, ఆటుపోటులు గోచరిస్తాయి.

## పంచ ప్రాణాలు

ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము-ఇవి పంచప్రాణాలు. ప్రాణమయకోశం మనలో ఇలా అయిదు విధాలుగా పనిచేస్తూ ఉన్నది.

ప్రాణమనగా లోనికి ఆకర్షించే శక్తి. అన్నపానాదుల స్వీకరణ జరుగుతున్నది దీనివల్లనే! శ్వాసక్రియలో ఉచ్ఛ్వాస సాగుతున్నది దీనివల్లనే! మనం దేనిని గ్రహించాలన్నా సాధ్యమవుతున్నది దీనివల్లనే!

అపానమనగా బయటకు విడిచిపెట్టే శక్తి. మల మూత్రాదుల విసర్జన జరుగుతున్నది దీనివల్లనే! శ్వాసక్రియలో నిశ్వాస నడుస్తున్నది దీనివల్లనే! స్వేద క్రియ కూడ వ్యక్తమవుతున్నది దీనివల్లనే. మనం దేనిని బయటకు పంపగలుగుతున్నామన్నా, బయటకు ఈయగలుగుతున్నామన్నా సాధ్యపడుతున్నది దీనివల్లనే!

వ్యానమనగా ప్రాణమయ కక్ష్యలోమన శరీరం యొక్క ఆకారాన్ని ఒక మూసలా పట్టి నిలబెడుతున్న శక్తి. దీనివల్లనే మనకు ఈ ఆకారం నిలబడుతున్నది. దీనివల్లనే రోజులు గడుస్తున్నా మన బంధుమిత్రులు మనను గుర్తుపట్టగలుగుతున్నారు. వయస్సుతో బాటుగా మనలో అనేకములయిన మార్పులు వస్తున్నా మన రూపురేఖలు మనవిగా నిలబెడుతూ వస్తున్నవి దీనివల్లనే!

ఉదానము వలన మననుండి వాక్కు వెలువడుతూ ఉన్నది. దీనివలననే మనకు నిద్రపడుతూ ఉన్నది. చివరిదశలో దీనివలననే మనకు మృత్యువు కూడ ప్రాప్తిస్తూ ఉన్నది.

సమానము వలన మనం తీసికొన్న ఆహారం యొక్క సారం మనలోని శరీర భాగాలన్నింటికీ సమానంగా పంచబడుతూ ఉన్నది. అలాగే శరీర భాగాల ఎదుగుదల సమపాళంగా సాగుతున్నది కూడ దీనివల్లనే.

ఈ పంచప్రాణాల మధ్య శ్రుతి నిలబడటం స్వస్థత. ఈ శ్రుతి ఏమాత్రం చెదిరినా అది అస్వస్థత!

జీవనయాత్ర సాగుతూ ఉండగా అనేకసార్లు మనం ఈ ప్రాణాల ప్రసక్తి పట్టుకువస్తూ ఉంటాం. నా పంచప్రాణాలు నీపైననే పెట్టుకొన్నాను సుమా!—అని అంటూ ఉంటాం. అలాగే ఆత్మీయుడయినవాడు చేరవచ్చినప్పుడు ఇతడు నా ఆరో ప్రాణమండీ! అని చెబుతూ ఉంటాం. ఇన్నివిధాలుగా మనం అనుకొంటూ వస్తూ ఉన్న ప్రాణాల కథ ఇది! బోధపడింది కదా!

## త్రేతాగ్నులు

వైశ్వానరాగ్ని, ఆహవనీయాగ్ని, ప్రాజాపత్యాగ్ని—ఇవి త్రేతాగ్నులు. ప్రాణమయ కోశాన్ని స్వీకరించి వ్యక్తమవుతున్న అగ్నిదేవుని త్రివిధ రూపాలే ఇవి.

మనచేత ఆకలి అనబడుతున్నది వైశ్వానరాగ్ని. మనచేత మేధాశక్తిగా పిలువబడుతున్నది ఆహవనీయాగ్ని. స్త్రీ, పురుషులను దంపతులుగా రూపొందించి వారికి సంతతిని అనుగ్రహిస్తున్నది ప్రాజాపత్యాగ్ని.

ఈ త్రేతాగ్నులను మనం పవిత్రంగా నిలుపుకోవాలి. పవిత్రంగా నడుపుకోవాలి. అలా నిలుపుకొని, నడుపుకోగలిగినప్పుడు మనకు అనుభవానికి వచ్చేది స్వస్థత. ఈ అగ్నులు ఏమాత్రం మైలపడినా, లేక దుర్వినియోగమయినా అనుభవానికి వచ్చేది అస్వస్థత.

ఆకలి వేస్తున్నది కదా అని దేనిని పడితే దానిని ఎప్పుడు పడితే అప్పుడు తినరాదు. అలాగే వేస్తున్న ఆకలిని అశ్రద్ధకూడ చేయరాదు. యజ్ఞగుండంలో హవిస్సును సమర్పిస్తున్నట్లుగా భక్తి శ్రద్ధలతో వైశ్వానరాగ్నికి అన్నపానాలను అందించాలి.

కూడని ఆలోచనలను చేయరాదు. పనికిరాని అంశాలను పట్టి తెచ్చి, అందులో పడవేయరాదు. సత్సంకల్పాలతో, సదాశయాలతో, సత్సంగాలతో, సద్గ్రంథ పఠనాలతో ఆవహనీయాగ్నిని ఆరాధించాలి.

కోరిక ఉండవచ్చు. కాని అది కాంక్ష కారాదు. ముచ్చట ఉండవచు. కాని అది కక్కుర్తిగా రూపొందరాదు. స్త్రీ పురుష సంబంధాన్ని దివ్యంగానూ, సవ్యంగానూ నడుపుకోవడం ద్వారా ప్రాజాపత్యాగ్నిని పరమార్థమెరిగి మనం సేవించాలి.

ఈ మూడు అగ్నులను అర్చించడం చేతనయినవారికి ముక్తస్థితి దానికదిగా అనుభవానికి వస్తుంది. ఈ ముక్తస్థితికి మరొక పేరే స్వస్థత!

## షట్ చక్రాలు

మూలాధారము, మణిపూరకము, స్వాధిష్ఠానము, అనాహతము, విశుద్ధి, అజ్ఞ- ఇవి షట్ చక్రాలు.

ఈ శరీరం ఒక ఒంటిస్తంభం మేడ. ఆ ఒంటిస్తంభమే వెన్నెముక! ఇది ఒక బ్రహ్మదండం. మహిమాన్వితమయిన వ్యక్తీకరణం!

సృష్టిలో పంచభూతాలు ఉన్నాయి. మనలోనూ పంచభూతాలున్నాయి. సృష్టిని బ్రహ్మాండము అంటారు. శరీరాన్ని పిండాండము అంటారు. బ్రహ్మాండాన్ని అనుసరించి పిండాండ మేర్పడుతున్నది. ఆ బ్రహ్మాండానికనుగుణంగా ఈ పిండాండము ముందుకు సాగవలసి ఉన్నది. అలా బ్రహ్మాండ, పిండాండాలు ఒకదానితో నొకటి శ్రుతి కలుపుకొంటూ ముందుకు సాగడానికి గాను రూపొందించినవే ఈ షట్ చక్రాలు.

మూలాధారం భూతత్త్వానికి, మణిపూరకం జలతత్త్వానికి, స్వాధిష్ఠానం అగ్నితత్త్వానికి, అనాహతం వాయుతత్త్వానికి, విశుద్ధి ఆకాశతత్త్వానికి ప్రాతినిధ్యం వహిస్తు ఉంటాయి. ఈ చక్రాలు తగిన విధంగా పనిచేస్తున్నంత వరకూ ఆయా తత్త్వాలన్నీ సమపాళంగా, కావలసిన సమన్వయాన్ని కలిగి వ్యక్తమవుతూ పనిచేస్తుంటాయి. ఆ చక్రాలలో యేమాత్రం తేడాలు వచ్చినా ఆయాతత్త్వాలు చెదురుబాటు చెందుతాయి

కల్లోల పరిస్థితిని పొందుతాయి. అప్పుడు ఆయా పంచభూత స్థితులను ఎంతగా పట్టి చూచినా అంతుపట్టేదేమీ వుండదు. చూడవలసింది ఈ చక్రాల పైవుకు, ఈ చక్రాలు యథాస్థితికి వస్తే శరీరమంతటా వ్యక్తమవుతున్న పంచభూతాత్మకమయిన కల్లోల స్థితులు వాటికవిగా సర్దుకొంటాయి, ఇంటిలో తిరుగుతున్న ఫ్యానులకూ, వెలుగుతున్న లైట్లకూ స్విచ్ బోర్డు ఎలాంటిదో, మనలోని ఈ పంచభూతాత్మక మయిన స్థితిగతులకు షట్ చక్రాలతో కూడిన వెన్నెముక అలాంటిది!

బాగున్నావా, నాయనా!- అంటూ పెద్దలు పిన్నల వెన్నును నిమురుతారు. బాగుండాలి నాయనా!—అంటూ మహనీయులు మన వెన్నును నిమురుతూ ఉంటారు. అలా నిమరబడటంలోని కారణం ఇదే! వారి స్పర్శతో వెన్నెముక శక్తివంతమవు తుంది. వారి ప్రేమకు షట్చక్రగతులు స్థిమిత పడతాయి.

చికిత్స అనగానే బిళ్ళలూ, గోళీలూ మాత్రమే గుర్తుకు రాకూడదు. మనకు స్వస్థతనందించేదే మనకు చికిత్స. అది యే రూపంలోనయినా ఉండవచ్చు. మనకు తెలిసిన రూపాలలో మాత్రమే ఉండాలని లేదు. ఇది మనకు బోధపడాలి.

ఒకచూపుతో, ఒకమాటతో, ఒక స్పర్శతో, చికిత్స జరుగవచ్చు. స్థితి గతులు చక్కబడవచ్చు. ఆశ్చర్యపడవలసిన పనిలేదు! ఆ చర్యను బోధపరచుకో గలిగితే అదే పదివేలు!

కనుక శరీరంలోని భూతత్త్వంలో చెదరుబాటు కలుగుతోంది అనుకోండి. మనం మూలాధారం పైపుకు చూడవలసి ఉంటుంది. అలాగే జలతత్వ విషయంలో మణిపూరకాన్నీ, అగ్నితత్త్వవిషయంలో స్వాధిష్ఠానాన్నీ, వాయుతత్వ విషయంలో అనాహతాన్నీ, ఆకాశతత్త్వం విషయంలో విశుద్ధినీ మనం సంప్రదించవలసి ఉంటుంది.

బొమికల ప్రక్క-కు పెరుగుతోంది అనుకోండి. ఎవరిని సంప్రదించాలి- మూలాధారాన్ని. అంతేగదా! అలాగే ఒకరికి ఒంటికి నీరు పట్టిందనుకోండి మణిపూర కానికి మనం నచ్చచెప్పాలి. ఒకడికి తరచు జ్వరాలొస్తున్నాయనుకోండి. స్వాధిష్ఠా నాన్ని సానుకూలం చేసికోవాలి, మరొకడు వాత వ్యాధులతో బాధపడుతున్నాడను కోండి. అనాహతం అభిమానాన్ని మనం పొందాలి. అలాగే ఇంకొకడికి మాట సరిగ్గా రావడం లేదనుకోండి. వాడి విశుద్ధిని మనం వినిపించగలగాలి. ఆకాశం శబ్ద గుణకం కదా, కనుక మాటలాడటమనే క్రియ విశుద్ధికి సంబంధించింది.

కొన్ని గ్రంథాలలో మణిపూరక, స్వాధిష్ఠానాలపనులు తారుమారుగా చెప్ప బడ్డాయి. మణిపూరకం అగ్నితత్త్వానికీ, స్వాధిష్ఠానం జలతత్త్వానికీ ప్రాతినిధ్యం వహిస్తున్నట్లుగా ఆ గ్రంథాలలో వ్రాయబడి ఉంటుంది. అది సరికాదు అలాంటివి చదివి మీరు కంగారుపడవలసిన పనిలేదు. ఇక్కడ చెప్పిన ఈ పద్ధతి ఇంతకు పూర్వమూ, ఇప్పుడూ కూడ పెద్దలయినవారు ఆమోదించినట్టిది. ఉదాహరణకు ఆది శంకరులు ఇప్పుడు మనం వివరించిన విధంగానే చెప్పి ఉన్నారు. సౌందర్య లహరిలో చూడండి.

మూలాధారం వెన్నెముకకు దిగువన వ్యక్తమవుతుంది. మణిపూరకం నాభికి సూటిగా వెన్నెముక దగ్గర వ్యక్తమవుతుంది. స్వాధిష్ఠానం ప్లీహమునకు సూటిగా వెన్నెముక యందు వ్యక్తమవుతుంది. ఈ ప్లీహమునే మనం స్ప్లీన్ (Spleen) అంటున్నాం. అనాహతం గుండెకు సూటిగా వెన్నెముకయందు వ్యక్తమవుతున్నది. విశుద్ధి కంఠాన గల థైరాయిడ్ గ్రంథికి ఎదురగా వెన్నెముక యందు వ్యక్తమవుతున్నది!

ఇక ఆజ్ఞాచక్రమున్నది. ఇది భ్రూమధ్యమునకు సూటిగా ఆ లోపల వ్యక్త మవుతున్నది. ఇది మనలోని మనస్సుకు ప్రాతినిధ్యం వహిస్తూ వుంటుంది. సృష్టి గతమయిన మనస్సునకూ, మన మనస్సునకూ మధ్య కావలసిన సమన్వయాన్ని సంతరించి పెడుతూ ఉంటుంది. సృష్టిగతమయిన మనస్సును మహత్తు అంటారు. సృష్టిగతమయిన మనస్సుతో దివ్యమయిన శ్రుతిని గలిగినవారిని మహత్తు గలవారు అంటారు.

భ్రూ మధ్యాన్ని అనగా ఆజ్ఞా చక్ర స్థానాన్ని స్మరించడానికీ, దానిని స్పృశించడానికీ ఏర్పడినదే బొట్టు పెట్టుకొనే సంప్రదాయం.

పెద్దయిలనవారు తమ చెంతకు వచ్చిన వారికి ఏ విభూదినో బొట్టుగా పెట్టి ఆశీర్వదించి పంపుతూ వుంటారు. వారి ఆజ్ఞా చక్రాన్ని సృష్టికి అనుగుణంగా వుండమని ఆజ్ఞాపించి పంపుతున్నారన్నమాట! అప్పటినుండి మనస్సు ప్రశాంతతను అనుభవించడం, పరిపూర్ణతను సంతరించుకోవడం మనం గమనిస్తూనే ఉంటాం. ఇదీ పెద్దలు బొట్టుపెట్టి పంపడంలో దాగి ఉన్నటువంటి సూక్ష్మాంశం.

ఇవన్నీ కూడా చికిత్సా విధానాలే! ఏదో పెద్దఎత్తున విచికిత్స జరిగినప్పుడు మాత్రమే చికిత్స జరిగినట్లుగా మనం భావించకూడదు!

సహస్రారం శిరస్సుకు పై భాగంలో వ్యక్తమవుతూ ఉంటుంది. ఇది షట్చక్రాలకు అతీతమైనది. దేవుడు, జీవుడు అన్న స్థితులకు మధ్యగల అనుసంధానం దీనియందు వుంటుంది.

ఇ. కె. మాస్టరుగారు దీనిని గురించి చెబుతూ 'ఇది వీధి లైటులాంటిది'— అన్నారు. దీని వెలుగును మనం అనుభవించవచ్చు. కాని ఇది మనది అని ఇంటిలోనికి తీసుకుపోరాదు-అని వివరించారు.

కనుకనే చక్రాలు అన్నప్పుడు షట్ చక్రాలనే చెబుతారు. సప్త చక్రాలు అనరు. కారణం ఏడవది - అయిన సహస్రారం కేవలం వ్యక్తికి మాత్రమే చెందినది కాదు కనుక. వ్యక్తికి ఎంతగా చెందినదో, సృష్టికీ అంతగా చెంది వున్నది కనుక ! వ్యక్తి యోగ సాధనలో తన ప్రయాణాన్ని మూలాధారంతో ప్రారంభించి, ఆయా చక్రాల మీదుగా అలా అలా పయనించి వచ్చి సహస్రారాన్ని చేరేటప్పటికి దేహగతమైన స్థితి నుండి సృష్టిగతమయిన స్థితికి చేరుకొంటాడు. దేహము నందున్నప్పటికీ తాను దైవమై అంతర్యామిత్వాన్ని అనుభవిస్తాడు.

పెద్దల పాదాలకు సాష్టాంగపడి, ఆ పాదాలకు తన శిరస్సును ఆనించి నమస్కరించే సంప్రదాయం ఇందుకే ఏర్పడింది. ఈ దివ్యస్థితి అందివచ్చేటందుకే ఏర్పడింది.

ఒక్కసారి మన దేవాలయాలను గమనించండి. దేవాలయాలు మన దేహాలయాలను అనుసరించి రూపొందినవే! దేహమే దేవాలయం. అందలి జీవుడే సనాతనుడయిన దేవుడు—అని గదా మన పెద్దలు చెబుతూ వచ్చారు. ఆ దేవాలయంలోని ధ్వజస్తంభం మన వెన్నెముకకు ప్రతీకగా రూపొందినదే! ఆ ధ్వజస్తంభానికి లోహపు తొడుగుంటుంది. అది కణుపులు కణుపులుగా వుండి వెన్నులోని పూసలను గుర్తుకు తెస్తూ వుంటుంది. గమనించండి !

ఇలా మన వెన్నెముక చుట్టూ ఎంతో కథ వుంది. పురాణేతిహాసాలలో వెన్నెముకకు సంబంధించిన గాథలు ఎన్నో వున్నాయి.

అసమర్థుడిని చూపిస్తూ 'వీడికి వెన్నెముక లేదురా!- అంటాం. అండదండలు అందించమని కోరుతూ మీరు నా వెన్ను వెంట ఉండండి చాలు-అంటాం. తట్టుకోలేనంత ద్రోహం ఎవరయినా చేసినప్పుడు - వాడు వెన్నుపోటు పొడిచాడురా- అంటాం. నమ్మకస్థుడయినవాడు వెంట నిలచినప్పుడు ఎవరనుకున్నావ్. ఇతడు

నా వెన్నెముక వంటివాడు. అని తృప్తిగా చెప్పుకొంటాం; తెలిసి వాడుతున్నా, తెలియక వాడుతున్నా ఈ వాక్యాలన్నీ కూడా అర్థవంతమైనవేనని ఇప్పుడు మనకు అర్థమవుతోంది గదా !

## మనలో నవగ్రహాలు

సౌర మండల వ్యూహానికీ, మానవ శరీర వ్యూహానికీ చక్కటి అనుసంధాన ముంది. ఈ అనుసంధానాన్ని అధ్యయనం చేస్తూ వుండటం ఎంతయినా అవసరం.

సూర్యుడు మన నిజ స్థితి. అనగా ఆత్మస్థితి. చంద్రుడు మన మనస్సు. కుజుడు మన శక్తి. బుధుడు మన యుక్తి. గురుడు మన ముక్తి. శుక్రుడు మన తృప్తి. శని మన శ్రమ స్థితి.

కొంచెం దిగువకు వస్తే సూర్యుడు మన కళ్ళు. చంద్రుడు మనలోని జలం. కుజుడు మన రక్తం. బుధుడు మన నరాలు. గురుడు మన జీర్ణక్రియ. శుక్రుడు మన శుక్ర, శోణితాలు. శని మన అస్థిపంజరం.

ఒకనికి ఉన్మాద మొచ్చింది, అంటే ఏమిటి ? చంద్రునితో అతనికి గల అనుసంధానం చెదిరింది. ఒక కుర్రవానికి ఎంత చెప్పినా పాఠం బోధపడటం లేదు. అంటే ఏమిటి? అతని ఎడల బుధుని స్థితి బాగోలేదు. ఒకడు మూర్ఖుడు. బాగు పడమని ఎంత చెప్పినా వినిపించుకోడు. అంటే ఏమిటి ? గురునితో అతనికి మైత్రి కుదరలేదు. ఇలా నవగ్రహ స్థితులనూ గమనించాలి.

ఒక కుర్రవానికి కంటిచూపు మందగిస్తోంది. అంటే ఏమిటి— సూర్యునికీ అతనికీ మధ్యగల సంబంధం ఇబ్బందిగా వుంది. ఒకామెకు ఒంటికి నీరు పడుతోంది. అంటే ఏమిటి ? చంద్రునికీ ఆమెకూ యేదో తేడా వచ్చింది. ఒక కుర్రవానిలో రక్తం తగ్గిపోతోంది. అంటే యేమిటి? కుజునికీ, అతనికీ బాగుగా లేదు. ఒకని కెప్పుడూ నరాల బలహీనత. అంటే బుధునితో శ్రుతి సరిలేదన్న మాట. ఒక డెప్పుడూ అజీర్ణంతో బాధపడుతుంటాడు. అంటే గురునికీ-అతనికీ సరిపడలేదన్న మాట! ఒకనికి పిల్లలు కలగడం లేదు- శుక్ర కణాల స్థితి బాగులేదు. అంటే శుక్రునికీ, అతనికీ మధ్య అవకతవక లేర్పడ్డాయి. ఒకనికి పడినప్పుడల్లా ఎముకలు విరుగుతున్నాయి. అంటే శని అతనిని చల్లగా చూడటం లేదన్నమాట ! వ్యాధి స్థితులను ఇలా గమనించుకోవాలి.

వైద్యునికి జ్యోతిష శాస్త్రంలో ప్రవేశముండటం ఎంతయినా అవసరం-జ్యోతిర్విద్యను అనుభవానికి తెచ్చుకోకుండా దీర్ఘ వ్యాధులకు చికిత్స చేయడం సాహసమే అవుతుంది. దేహం దేవుని నిర్మాణం. దీనిని గూర్చి ఎన్ని విధాలుగా తెలుసుకొంటే అంత మంచిది.

జ్యోతిష శాస్త్రంతో బాటుగా హస్త సాముద్రికాన్నీ, అంగ సాముద్రికాన్నీ అనగలుపుకొని అధ్యయనం చేయడం మన అవగాహనను మరింత పెంచుతుంది. అలాగే వాస్తుశాస్త్రంతో పరిచయాన్ని పెంచుకోవడం కూడా మనకు మేలు చేస్తుంది. ఇవన్నీ కూడా నిజానికి వేరు వేరు శాస్త్రాలు కావు. ప్రధానమయిన జ్యోతిష శాస్త్రానికి ఇవన్నీ అనుబంధ శాస్త్రాలు! వీటన్నిటి గమ్యం కూడా ఒకటే! మానవునికి మేలు కలిగించడం— అదే వీటి అన్నింటికీ గమ్యం!

వైద్యుడు నారాయణ స్వరూపుడని మన సంప్రదాయం కీర్తిస్తున్నది. అంటే అతడు దేవుని రాజ్యంతో పనిచేయవలసిన దైవాంశ సంభూతుడన్నమాట. అతడు దైవజ్ఞుడు కావాలి అతడు దయామయుడు కావాలి. ప్రేమమయుడై అతడు అన్ని వైపులనుండి ఆర్తుని రక్షించుకోవాలి.

# నిజమంగు వైద్యుడు ఎవరు ?

నేను చెప్పదలచింది చిన్న చిన్న కథలుగా చెబుతాను అన్నాడు- పర గురువులలో ఒకడైన జీసెస్ మహాశయుడు. ఆ కథలు హృదయానికి హ కొంటాయి. ఎప్పటికప్పుడు మనుషుల మనస్సులను మేల్కొలుపుతూ ఉంటాయి అని గ్రహించాడు, అలా అనుగ్రహించాడు.

కావలసిన విధంగా కథను చెప్పడం నిజంగా ఒక తపస్సే! విడివిడిగా, మ ముడిగా తనను చేరవచ్చిన ఆహార పదార్థాలను తానుగా స్వీకరించి, రుచికరమై వంటకాలుగా శ్రద్ధతో వాటిని మలచి బిడ్డలకు, తినవచ్చిన బిడ్డలకు ఆదరం అందిస్తూ ఉంటుందీ తల్లి. అలాంటి తపస్సు ! తనను చేరవచ్చిన ఒక లోతై సత్యదర్శనాన్ని తానుగా అందుకొని చిన్న చిన్న కథలుగా దానిని మలచి మ మానవ జాతికి అందించడమన్నది వున్నదే - అది అలాంటి తపస్సు ! మ సంప్రదాయంలో తల్లి వంట అలాంటి తపస్సు ! తండ్రి బోధ అలాంటి తపస్సు గురువు శిక్షణ అలాంటి తపస్సు !

సున్నితమైన హోమియో తత్త్వ శాస్త్రాన్ని మీ కందిస్తున్న వేళలో నేన అలాంటి తపస్సునే నిర్వహిస్తున్నాను. చిన్నచిన్న ఉదాహరణలను తీసికొని, వాటి కథలు కథలుగా మీకు వినిపిస్తూ, అలా అలా అక్కడిదాకా, ఆ తత్త్వదర్శన అంచులదాకా మిమ్ములను తీసికొని వెళతాను. చేయి పట్టుకోవడం మీ వంత నడిపించడం ఇక నా వంతు!

## కాలానికి అనుగుణంగా

అది ఒక పల్లెటూరు. అందులో ఒక వ్యవసాయదారుని ఇల్లు. నడుస్తున్న డిసెంబరు నెల. రాత్రిపూట, ఆరుబయట పలుగులూ, పారలూ అలా పడవే ఉన్నాయి.

ఒక రాత్రివేళ లేచి వాటిని పట్టుకొని చూస్తే ఎలా వుంటాయి? చల్ల ఉంటాయి, చెప్పటానికి అలవికానంత చల్లగా ఉంటాయి. అయిసుముక్క కన్న చల్లగా ఉంటాయి.

అదే రోజున, అదే వేళలో అలా చలిలో అంతసేపూ ఒక మనిషి పని చేస్తున్నాడనుకోండి. పలుగూ, పారల్ని పట్టుకొని చూసిన సమయంలోనే అతణ్ణి కూడా పట్టుకొని చూడండి. అతడు చల్లగా ఉండడు సరికదా, వెచ్చవెచ్చగా ఉంటాడు పైగా!

ఎందుకని ? ఎందుకని ఈ తేడా? ఈ తేడాను కలిగిస్తున్న దెవరు?— ఆలోచించి చూడండి.

అలాగే మే నెల నడుస్తున్నప్పుడు ఆ మండుటెండలో ఇదివరకటి లాగానే పలుగులూ, పారలూ పడి ఉన్నాయనుకోండి. అప్పుడు వాటిని పట్టుకొని చూడండి. అసలు పట్టుకోగలరా ఎంత వేడిగా ఉంటాయవి! నిప్పుకన్నా వేడిగా ఉండవూ!

మరి అదే ఎండలో అంతసేపటినుండి ఒక మనిషి పనిచేస్తున్నాడనుకోండి. అదే సమయంలో అతడ్నికూడా పట్టుకొని చూడండి. ఆశ్చర్యం! అతడు చల్లగా ఉంటాడు. చెమటలు దిట్టంగా పోసి, స్నానం చేయించబడుతున్నట్లుగా ఉంటాడతను.

ఈ మార్పు వ్యక్త మవుతోంది! పలుగూ, పారల్లో జరుగనిది ఏదో మానవ శరీరంలో జరుగుతోంది, ఆ జరుగుతున్నది ఏమిటి ? ఆ జరుపుతున్నది ఎవరు? ఆలోచించండి.

పలుగూ, పారలు వాతావరణ ప్రభావానికి లోనవుతున్నాయి. మానవ శరీరం అలాకాక, వాతావరణానికి తగినట్లుగా ఎప్పటికప్పుడు నిలబెట్టబడుతున్నది. చలిలో వెచ్చగా, ఎండలో చల్లగా, బయటనున్న వేడికి తగినట్లుగా, బయటనున్న వాతావరణానికీ, లోపల ఉన్న దేహస్థితికీ ఎప్పటికప్పుడు శ్రుతి కుదిరేటట్లుగా, ఆ కుదిరిన శ్రుతి నిలిచేటట్లుగా ఒకానొక శక్తి చూస్తూ ఉన్నది. ఏమంటారు!

## గాయానికి అనుగుణంగా

దారి వెంబడి నడుస్తున్నాం. ఎదురుదెబ్బ తగిలింది. రక్తం బయటకు చిందింది. గాయమయినట్లు తెలిసింది. కొంచెం గమనించండి. అప్పుడేం జరుగుతుంది!

రక్తం అలా ఎక్కువసేపు కారదు. క్రమంగా బయటకు కారే ఆ స్రావం చిక్కబడుతుంది. గాయానికి తగినట్లుగా అల్లుకొంటుంది. లోనుండి రక్తాన్ని ఇక పైన బయటకు పోకుండా కాపాడుతుంది.

అదే ఒక నీళ్ళ కుండకు చిల్లి పడిందనుకోండి. ఏమవుతుంది? లోనున్న నీళ్ళన్నీ అలా వెళ్ళిపోతూనే వుంటాయి. కాని ఎదురుదెబ్బ విషయంలో ఇలాంటి స్థితి ఎందుకు ఎదురు కావడంలేదు. రెండు స్థితులకూ గల తేడాను గమనించండి.

సరే, మనం ఏదో కొంత ఉపచారం చేశాం. ఆ ఎదురుదెబ్బను కొంత సాకాము. క్రమంగా ఏం జరుగుతుంది! ఆ గాయంపైన ఒక పెచ్చు కడుతుంది. ఆ పెచ్చులోపల ఏం జరుగుతోంది! ఒకానొక శక్తి గాయమై తొలగిపోయిన శరీర భాగాన్ని మళ్ళీ నిర్మాణం చేస్తోంది.

క్రమంగా నిర్మాణం పూర్తవుతుంది. పూర్తిగా పూర్తికాగానే అక్కడ చిన్న దురద పెడుతుంది. ఏదో పనిలో ఉన్న మనం పరధ్యానంగానే అక్కడ గోకుతాం. ఆ పెచ్చు వూడిపోతుంది. వేలు మిగిలిపోతుంది. అంటే ఏం జరిగింది? నిర్మాణం పూర్తయింది. ఇక ఆ పెచ్చును తీసివేయవచ్చు—అని ఒకానొక శక్తి దురద రూపంలో మనకు చెప్పి మనచేత ఆ పనిని చేయించింది— అన్నమాట. ఎలా ఉంది! ఇదీ పైపెచ్చు కథ!

అలాకాక, తగిలిన గాయాలన్నీ పూడకుండా అలాగే ఉండిపోతున్నాయను కోండి. అప్పుడు మనుషులంతా ఎలా ఉంటారు? చూడగలమా అని! అసలు ఊహించగలమా అని! లేక ప్రతి గాయానికీ ప్లాస్టిక్ సర్జరీ చేయించుకోవలసిన స్థితి వచ్చిందనుకోండి. ఎంతమంది చేయించుకోగలుగుతారు? ఎంతకాలం చేయించుకో గలుగుతారు? ఇలాంటి వాటి అవసరం లేకుండా, రాకుండా కరుణిస్తున్న ఆ శక్తిని మనమేమనాలి?

## అరుగుదలకు అనుగుణంగా

మనం నడుస్తున్నప్పుడు మన కాళ్ళకున్న చెప్పులు అరిగిపోతున్నాయి. మరి చెప్పులు లేకుండా నడిచేవాళ్ళున్నారు. వాళ్ళ కాళ్ళు అరిగిపోవద్దూ? ఎంత గట్టివయిన చెప్పులే అరిగిపోతున్నప్పుడు కాళ్ళు ఇంకెంతగా అరిగిపోవాలి!

అయితే కాళ్ళు అరిగిపోవడం లేదా! అరిగిపోకుండా ఎందుకుంటాయి? అరిగి పోతూనే ఉన్నాయి. అయితే ఆ అరుగుదలలో ఎప్పటికప్పుడు పూరించబడు తున్నాయి. కనుక మన కాళ్ళు మనకు ఎప్పటిలా కనబడుతున్నాయి.

అలాకాక, ఆ అరుగుదలలు ఎప్పటికప్పుడు పూరించబడటం లేదనుకోండి, కాళ్లు అరిగిపోతూనే ఉంటాయి. కొంతమంది మడమలదాకా, కొంతమంది మోకాళ్ళ

కా, ఇంకొంతమంది నడుములదాకా, అలా అలా అరిగిపోతూ కనపడుతూ
ంటారు. ఏమంటారు—అంతేకదా మరి! అయితే అలాంటి దృశ్యాలు మనకంట
కకుండా రక్షిస్తున్న దెవరు? ఆలోచించండి.

అలాగే, మనవాళ్ళు అంట్లు మొదలయినవి తోముతూ ఉంటారు. ఆ తోమే
ప్పుడు కొబ్బరి పీచులాంటిదే అరిగిపోతూ ఉంటుంది. మరి అరిచేతుల మాటేమిటి?
వికూడా అలా అరిగిపోతే, అసలు అలాగని వూహించగలమా అని. అప్పుడు
ఈగ్రహణం ఎంతకష్టమో కదా! అలాంటి స్థితులు దాపురించకుండా అరచేతుల
రుగుదలలను అప్పటికప్పుడు పూరిస్తున్న ఆ శక్తి ఎవరు? ఆలోచించండి.

## అవసరాలకు అనుగుణంగా

మనం శరీరధారులం. శరీరాలను ధరించి వర్తిస్తున్నాం. శరీరాలు నిలబడి
నకు సహకరించేటందుకు అన్నపానాలు అవసరం. అన్నపానాలను మన శరీరా
కి అందించడం మన కర్తవ్యం. మరి వాటిని ఎప్పుడు అందించాలి! అది ఎలా
లుస్తుంది మనకు!

తెలుస్తుంది. ఆకలి వేస్తుంది. మనం ఆహారాన్ని అందిస్తాం. దాహం
స్తుంది. మనం పానీయాన్ని స్వీకరిస్తాం. శరీరం లోపల కలుగుతున్న అవసరాలకు
నుగుణంగా ఈ ఆకలిదప్పులను మనకు కలిగిస్తున్నదెవరు? ఆ శక్తి ఎవరు?

ఆ శక్తి అలా ఆకలిదప్పులను ఎప్పటికప్పుడు కలిగించకపోతే అన్నపానీయా
ను మనం క్రమబద్ధంగా అందించగలమా! అసలు వాటిని అందించాలని మనకు
ర్తుంటుందా? మనకు పనుల వత్తిడి ఎక్కువ కదా! మన ఒత్తిడిలో మనముండి
తే శరీరాలు డీలాపడి, క్రమంగా పడిపోతాయి కదా! అలా పడిపోకుండా శరీరా
కావలసిన వాటిని ఎప్పటికప్పుడు మనకు గుర్తుచేస్తూ, మనచేత అవి శరీరానికి
ందింపబడేటట్లుగా చూస్తున్న ఆ శక్తి ఎవరు? కొంచెం ఆలోచించి చూడండి

అలాగే మననుండి జరుగవలసిన విసర్జన క్రియలను గురించి మనకు తెలియ
ుతున్నది ఎవరు? మల విసర్జనకు వెళ్ళాలి అనిపిస్తున్నది. అలా అని తెలుస్తు
ది. మూత్ర విసర్జనకు వెళ్ళాలనిపిస్తున్నది. అలా అని తెలుస్తున్నది.

అలా ఎప్పటికప్పుడు తెలియజెబుతున్నది ఎవరు? అలా తెలియజెప్పబడక
తే మన పరిస్థితి ఏమిటి? ఒక్కొక్కప్పుడు అర్ధరాత్రిపూట లేపి మరీ తెలియ

జెప్పుతున్నది. ఆ పని చేసిరమ్మని హెచ్చరిస్తున్నది. అవసరాన్ని బట్టి మనలను పరుగెత్తిస్తున్నది. మొత్తంమీద మనను బ్రతికిస్తున్నది. ఇలా మనను నడిపిస్తున్న ఆ శక్తి ఎవరు? ఆలోచించండి.

ఇంతవరకూ నిత్యమూ జరుగుతున్న అంశాలలో శ్రద్ధగా మనం గమనించ వలసిన దృశ్యాలను మీ ముందు ఉంచాను. వాతావరణానికి అనుగుణంగా మనన నిలబెడుతున్నదెవరు? గాయాలకు అనుగుణంగా మనకు రూపుదిద్దుతున్నదెవరు ఆరుగుదలలకు అనుగుణంగా మన రూపును మనకు నిలుపుతున్నదెవరు? అవసరాలకు అనుగుణంగా మనను హెచ్చరిస్తూ నడిపిస్తున్న దెవరు? అని ప్రశ్నించాను అలా ప్రశ్నించుకోవడం ఇప్పటి అవసరమని మీకు నొక్కి చెప్పాను. ఇప్పుడు ఇంకొక దృశ్యం చూపిస్తాను చూడండి.

## గ్రహించగలిగిన శక్తిగా

ఒక ఇంటిలో గృహిణి పాయసం కాచింది. ఆ పాయసం కాచబడిన పాత్ర కిలం పట్టి ఉంది. అది ఆ గృహిణి గమనించుకోలేదు. అందరికీ ఇచ్చింది. అందరితో బాటుగా తానూ త్రాగింది. ఇంతకూ ఎవరూ గమనించలేదు అది కిలం పట్టిన పాత్ర అని.

కొంత సేపటికి ఆ త్రాగిన వారందరికీ క్రమంగా కడుపులో త్రిప్పడం ప్రారంభమైంది. క్రమక్రమంగా ఆ త్రిప్పటం వేగాన్ని సంతరించుకుంటోంది. ఇక వికారపెట్టడం ప్రారంభించింది.

అక్కడికీ అందులో కొందరు, ఆ వికారానికి వక్కపలుకు నంది చూశారు. కాని అది లక్ష్యపెట్టిందికాదు. పైగా ఇంకా విజృంభించసాగింది.

కడుపులో త్రిప్పడం, వికారం, వీటికితోడు తలనొప్పి, కళ్ళు తిరగడం ఎదుటగా ఏమి జరుగుతున్నదో తెలియని స్థితి ఏర్పడటం, ప్రాణంమీదికి వచ్చి నట్లుండటం, ఎదుటివాళ్ళు ఏమయినా అడిగితే, ఏమీ చెప్పలేని స్థితిలో అవస్థపాలు పడటం—అసలుంటామా, పోతామా అన్న భయంతో బెంబేలెత్తిపోవడం!

ఇలా జరిగి జరిగి చివరాఖరికి వాంతులు కావడం కిలంపట్టిన పాయసమంతా బయటకు పోవటం! వాళ్ళ ప్రాణాలకు అమ్మయ్య అనిపించడం. ఎట్టకేలకు బ్రతికి బైటపడ్డాం కదా అని వాళ్ళు సంతోషించడం—ఇలా ఇంత జరుగుతుంది. ఒక్కటి గమనించుకోని కారణాన ఇన్నిటిని చూడవలసి వస్తుంది.

ఇంతకూ ఇక్కడ చెప్పొచ్చేదేమిటీ అంటే—పాత్రకు కిలం పట్టిందన్న విష యాన్ని పాయసాన్ని కాచిన గృహిణి గమనించుకోలేదు. ఆ పాయసాన్ని త్రాగిన కుటుంబ సభ్యులూ గమనించుకోలేదు. వీరెవరూ గమనించని అంశాన్ని లోనుండి గుర్తించినదెవరు? విషమైపోతున్న ఆ ఆహారద్రవ్యాన్ని బయటకు నెట్టివేసి, వారందరినీ రక్షించిందెవరు? అలా రక్షింపబడకపోతే వారేమయిపోయేవారు? ఒక్క సారి ఆలోచించండి!

ఈ దృశ్యాన్ని చూశారు కదా! మరొక దృశ్యాన్ని మీ ముందు ఆవిష్క రిస్తాను శ్రద్ధగా గమనించండి.

## రక్షించగలిగిన శక్తిగా

వూరిలోని వారందరికీ అమ్మవారి జ్వరం సోకుతూ వస్తున్న సమయమది. ఇంటిలోని పిల్లవాడికి కూడా జ్వరం తీవ్రంగా వచ్చింది. కళ్లూ, ఒళ్ళూ ఎర్రబడ్డాయి. ఒంటిమీద చేయివేయడం కష్టంగా ఉంది. అంతగా కాలిపోతోంది జ్వరం.

జ్వరం విజృంభిస్తున్నందుకు పర్యవసానంగా గబగబా పిల్లవాడి వంటిమీద పొక్కులు వచ్చేస్తున్నాయి.

పొక్కులు రావడం పూర్తికాగానే జ్వర తీవ్రత తగ్గింది. క్రమక్రమంగా జ్వరం నెమ్మదించింది. దానికదిగా నెమ్మదించింది.

పొక్కులు తయారయినాయి, పొక్కులనుండి చీము, రసి,బైటకు ఓడుతుంది. ఓడటం పూర్తికాగానే పొక్కులు వాడటం మొదలయింది. వాడిన పొక్కులు క్రమంగా మాడుతున్నాయి. ఆ అవశేషాలు వాటికవిగా ఊడిపోతున్నాయి.

పొక్కులు ఊడి మచ్చలు మిగిలాయి. పథ్యం జాగ్రత్తగా సాగుతూ ఉన్న కొద్దీ మచ్చలు కూడా మాయమయి పోతున్నాయి. మచ్చ మాసిపోతున్నది. శరీరంలో కలసిపోతున్నది. పిల్లవాడు మళ్లీ మామూలుగా తయారవుతున్నాడు.

గమనించారా, ఈ దృశ్యాలను! ఈ వరుస దృశ్యాలను. ఈ దృశ్యాల నడుమ ఎక్కడయినా మన ప్రమేయముందా! ఏ మాత్రం లేదు కదా! మన పాత్ర ఏమీ లేకుండానే, మన పాత్రను ఏమీ కోరకుండానే ఇంత కథ నడుస్తున్నది! ఇంతకథనూ ఇలా నడుపుతున్న ఆ శక్తి ఎవరు? ఆలోచించండి.

ఈ సందర్భంలో మనం చేయవలసింది ఏమిటీ అంటే దానికదిగా జరుగు తున్న దానిలో వేలు పెట్టకుండా బుద్ధిగా దానిని గమనించడమే! వేలుపెడితే ఏమవ్వు

తుంది! ఏదో ఒక కూడని బిళ్ళవేసి, ఆ జ్వరాన్ని అణచివేస్తే ఏమవుతుంది! జ్వరం అణగిపోతుంది. దానితో బైటకు రావలసిన పొక్కులు శరీరానికి లోపలే పోసేస్తాయి. ప్రాణాంతకమైన పరిస్థితి ఏర్పడుతుంది.

ఇదంతా గమనించిన పెద్దలు ప్రతిఒక్కరికీ ఇంతా వివరించడం కష్టమని 'అమ్మవారి జ్వరానికి మందు వేయకూడదు. వేస్తే అమ్మవారికి కోపం వస్తుంది.' అని సామాన్య జనులకు కూడా అర్థమయ్యే భాషలో చెప్పారు. శాస్త్రాన్ని దర్శించడం ఎంత అవసరమో, ఆ శాస్త్రాంశాలను ప్రజలకు కావలసిన భాషలో చెప్పగలగడం కూడా అంతే అవసరం!

బాగున్నది. ఇంతకూ ఈ సన్నివేశంలో మనిషికి ప్రమేయం ఎంత ఉన్నదీ! మనిషి ప్రమేయాన్ని కోరకుండానే ఇన్ని దశలనూ దాటించి, మనిషిని బ్రతికించి బట్టకట్టిస్తున్నదెవరు? ఆలోచించండి!

## ప్రాణశక్తిని పలుకరిద్దాము

మరి ఇప్పుడు చెప్పండి. అన్ని విధాలా మనను పట్టించుకొంటూ, మన ఈ శరీరాన్ని తగినవిధంగా నిలపెడుతున్నదెవరు? కావలసిన చర్యలన్నింటినీ చేపడుతూ, ఈ మనస్స్వస్థతను రక్షిస్తున్నదెవరు? ఒక శక్తి. ఆ శక్తిని మనం నిరంతరం అనుభవిస్తున్నాం. ఆ శక్తినుండి అన్ని విధాలయిన శిక్షణనూ, రక్షణనూ పొందుతున్నాం. దానినే మనం 'ప్రాణశక్తి' అని పిలుచుకొంటున్నాం.

ఇంతవరకూ వచ్చిన తరువాత నేనొకమాట అడుగుతాను చెప్పండి. శరీర అవసరాలను గమనించుకొంటున్నదీ, శరీర రూపురేఖలను పూనికతో నిలబెట్టుకొంటున్నదీ ఆ ప్రాణశక్తి.

అలాగే విషపదార్థాలు సోకినా, అంటువ్యాధులు శరీరాన్ని స్పృశించినా వాటి బారి నుండి మనను బైటపడవేస్తూ, అనుక్షణం కంటికి రెప్పలాగ మనను కాచుకొంటూ వస్తున్నది ఆ ప్రాణశక్తి.

మరి అలాంటి ప్రాణశక్తి ఒక వ్యాధి మనని సోకినప్పుడు చూస్తూ ఊరకొంటుందా, లేదా వ్యాధిని నిష్క్రమింపజేసే ప్రయత్నాన్ని చేపడుతుందా, మీరే చెప్పండి.

వ్యాధిని నిష్క్రమింపజేసే ప్రయత్నాన్ని ప్రాణశక్తి తప్పక చేపడుతుంది. ఏమంటారు! అవునుకదా! అందువల్ల 'నిజమగు వైద్యుడు ఎవరు?'- అన్న ప్రశ్న వచ్చినప్పుడు, ప్రాణశక్తియే 'నిజమగు వైద్యుడు'– అని మనం చెప్పవలసి

ఉంటుంది. మరి బయటనున్న వైద్యుడు? బయటనున్న వైద్యుడు ప్రాణశక్తికి సహకారిగా పనిచేయవలసిన వాడు మాత్రమే! ఇది గుర్తించండి!

బైటనున్న వైద్యుడు ప్రాణశక్తికి సహకరించాలి అంటే ఏం చేయాలి? ముందు ప్రాణశక్తిని పరిచయం చేసికోవాలి. దానిని ప్రసన్నం చేసికోవాలి. దానితో చెలిమి కట్టాలి. అందివస్తున్న చెలిమితో ప్రాణశక్తి చర్యలను నిరంతరం అధ్యయనం చేస్తూ ముందుకు సాగాలి. ప్రాణశక్తితో మనం శ్రుతి కలిపి పనిచేయడం ఎలా? ప్రాణశక్తికి మనం సహకరించగలగడం ఎలా?— అన్న అంశాన్ని గూర్చి తపస్సు చేయాలి. ఎలాంటి సహాయం మన నుండి అందితే, ప్రాణశక్తి బలపడి వ్యాధిని త్వరగా నిష్క్రమింపజేస్తుంది? అన్న ధ్యానంలో మనం నిలువగలగాలి!

నిజానికి ప్రాణశక్తి స్వయంగానే వ్యాధికారణాన్ని బహిష్కరించగలదు. ఇంతవరకూ చెప్పుకొంటూ వచ్చిన ఉదాహరణల్లో మనమీ సత్యాన్ని నిండుగా గమనించాము. కాని ఒక్కొక్కప్పుడు దినచర్యలోని అవకతవకలవల్లా, వారసత్వంగా అందివచ్చిన తీవ్ర దోషాలవల్లా ప్రాణశక్తి శిథిలమయి, తానుగా వ్యాధికారణాన్ని బహిష్కరించలేని స్థితిలో పడిపోతుంది. కానీ బహిష్కరించే ప్రయత్నాన్నిమాత్రం నిరంతరం చేస్తూనే ఉంటుంది. అప్పుడు, అలాంటప్పుడు ప్రాణశక్తి చేస్తున్న దివ్య ప్రయత్నానికి బయటనున్న వైద్యునినుండి సవ్యమయిన సహకారం అవసరమవుతుంది.

మన పూర్వులలో నిండు నూరేళ్ళు జీవించినవారున్నారు. అనారోగ్యాన్ని ఏమాత్రం ఎరుగని వారున్నారు. జీవితకాలంలో వైద్యుని అవసరంరానివారున్నారు. హాయిగా నిండుగా సార్థకంగా జీవించి వెళ్ళేముందు చెప్పి మరీ వెళ్ళిపోయిన వారున్నారు. వారలా ఎలా ఉండగలిగారు? రహస్యం ఒక్కటే—వారి ప్రాణశక్తి మైల పడలేదు! దినచర్యలో వారు దారితప్పలేదు. దివ్యమయిన వారసత్వానికి వారు నోచుకోగలిగారు. ఈ రెండు కారణాలవల్ల వారి ప్రాణశక్తి వారికి కలసి వచ్చింది. చిరకాలం వారిని రక్షించింది. బైటనున్న వైద్యుని పిలువనవసరం లేకుండానే వారి జీవన యాత్రను, సుఖప్రదంగా నిర్వహించింది. కనుక ప్రాణశక్తి మైలపడనిచోట మందులకు పనిలేదు. వైద్యులకు పనిరాదు.

ఆధునిక సమాజంలో వ్యాధిబాధలు లేనివారు అరుదు. ప్రాణశక్తిని మైలపరుచుకొన్నవారే ఎక్కువ సంఖ్యలో అంతటా కనబడుతున్న రోజులివి! మరి ప్రాణశక్తి మైలపడి వ్యాధిని తానుగా బహిష్కరించలేని స్థితిలో పడిపోతున్నవేళ బైటనున్న వైద్యుని పాత్ర ఏమిటి— అన్నది మనం శ్రద్ధతో గమనించవలసిఉన్నది.

# గమనించగలిగిన వేళ

ప్రాణశక్తియే నిజమగు వైద్యుడు అని తెలుసుకొన్నాం. ప్రాణశక్తితో శ్రుతి గలిపి పనిచేయటమన్నది బయటనున్న వైద్యుని కర్తవ్యమని కూడ గమనించు కొన్నాం. ప్రాణశక్తికి సహకరించవలెనన్నచో ప్రాణశక్తి చర్యలను మరింత దగ్గరగా మనం గమనించవలసి ఉన్నది. మరిన్ని సూక్ష్మాలను ప్రాణశక్తినిగూర్చి మనం గ్రహించుకోవలసి ఉన్నది. ఈ అధ్యాయంలో మనం ఆ పనిని చేద్దాము.

## సూక్ష్మాన్ని గమనించండి

కిలం పట్టిన పాత్రలోని పాయసాన్ని త్రాగినవేళ ప్రాణశక్తి వారినెలా రక్షిం చిందీ అన్నది ఇంతకు ముందు చెప్పుకొన్నాం కదా! ఇప్పుడు అదే దృశ్యాన్ని మరొక కోణం నుండి చూద్దాము.

ఈ సందర్భంలో వ్యాధి కారణం ఏమిటి? కిలం పట్టిన పాయసమే వ్యాధి కారణం. వ్యాధి కారణమయిన కిలం పట్టిన పాయసాన్ని నెట్టివేయడానికి గానూ ప్రాణశక్తి చేపట్టిన చర్యలే ఆ సందర్భంలో కలిగిన వివిధ వేదనలు.

కడుపులో త్రిప్పడం, వికార పెట్టడం, తలనొప్పి రావడం, కళ్లుతిరగడం, మనస్సు అయోమయం కావడం, ప్రాణం కడబట్టినట్లుండటం- ఇవన్నీకూడా ఆ సందర్భానికి తగినట్లుగా ప్రాణశక్తి చేపట్టిన చర్యలే!

ఇప్పుడు మనకేం తెలుస్తున్నది? వ్యాధి కారణమన్నది ఒక్కటే ఉన్నది. దానిని నెట్టివేయడానికి జరుగుతున్న ప్రయత్న ఫలితంగా కలుగుతున్న వేదనలు మాత్రం అనేకంగా ఉన్నాయి. వ్యాధి ఒక్కటే! వేదనలు అనేకం. వ్యాధి వేరు. వేదనలు వేరు!

ఏ రోగార్తుని పరిశీలించేటప్పుడయినా ఈ విధంగానే మనం పరిశీలించాలి. వ్యాధి కారణమున్నది. దానిని నెట్టివేయడానికి గాను ప్రాణశక్తి చర్యలు చేపట్టు తున్నది. కనుక వేదనలు వ్యాధులు కావు. వ్యాధిని బహిష్కరించేటందుకు గాను, ప్రాణశక్తి ఆధ్వర్యంలో జరుగుతున్న ప్రయత్నాలు!

వేదనలను వ్యాధులుగా భ్రమించి, వైద్యము పేరిట వాటిని అణచిపెట్టే ప్రయత్నము చేస్తున్నవారున్నారు. వారందరూ ఈ సూక్ష్మాన్ని గమనించాలి. వేదనలను అణచిపెట్టడం ప్రాణశక్తిని వ్యతిరేకించడం అవుతుంది తప్ప, ప్రాణశక్తికి సహకరించడం కానేరదు.

మళ్ళీ కథలోనికి రండి. కిలము పట్టిన పాయసం వాంతి రూపంలో బయటకు వెళ్ళిపోగానే ఇంతవరకూ అక్కడ వ్యక్తమయిన వేదనలన్నీ ఒకటొకటిగా ఇక తప్పుకొంటున్నాయి. అంతవరకూ అలసిపోయిన అతడు అమ్మయ్య అనుకొంటూ ఇక విశ్రాంతిలోనికి ప్రవేశిస్తున్నాడు. కాసిని నీళ్ళను పుక్కిలించి, ఉమ్మివేసి, కాసిని మంచినీటిని త్రాగి ప్రశాంతంగా నిద్రలోనికి జారుకొంటున్నాడు. అంత ప్రశాంతంగానూ నిద్రపోతున్నాడూ అంటే అర్థమేమిటి? ఇక అక్కడ ఏమాత్రం వేదనలు లేవనేగదా! నిద్రపోయి లేచి, హాయిగా, హుషారుగా, తోటివారిని పలుకరిస్తూ, తగుమాత్రంగా ఆహారాన్ని తీసికొనే ప్రయత్నం చేస్తున్నాడు.

ఇక్కడ మనకేం తెలుస్తున్నది! అతడు స్వస్థత పొందినాడని! వ్యాధి కారణం బహిష్కరింపబడగానే వేదనలిక ఉపసంహరింపబడ్డాయని! ప్రాణశక్తికి వేదనలను వ్యక్తంచేయవలసిన ఆవశ్యకత ఇక తొలిగిపోయిందనీ!

వేదనలు వ్యాధులుకావు—అని చెప్పుకొన్నాము. వ్యాధి కారణాన్ని బహిష్కరించడానికి గాను ప్రాణశక్తి చేబడుతున్న చర్యలే వేదనలు అని కూడ చెప్పుకొన్నాము. ఈ వేదనలను వార్తాహరులుగా కూడ మనం పేర్కొనవచ్చు. శరీరము లోపలి పరిస్థితిని ఈ వేదనలు మనకు సూచిస్తున్నాయి కదా!

ఒక ఫ్యాక్టరీలో లోపల ఏదయినా ప్రమాదం జరిగితే సూచించేటందుకుగాను ఒక రెడ్‌లైటు ఉన్నదనుకోండి. ఆ ఎర్రని దీపం వెలిగితే అర్థమేమిటి? లోపల పరిస్థితిలో తేడా వచ్చిందని కదా! తెలియని వాడొకడు దానిని పగలగొట్టాడనుకోండీ, ఇక ప్రమాదంలేదు పొమ్మన్నాడనుకోండి—అది నిజమా? ప్రమాదం తప్పిపోతుందా? తప్పిపోదు సరికదా, పరిస్థితి అంతుబట్టని స్థితిలోనికి వెళ్ళిపోతుంది. లోపల ఏం జరుగుతున్నదో తెలియని అయోమయ స్థితి ఒకటి ఏర్పడుతుంది.

అలాగే వేదనలను వ్యాధులనుకొని, వాటిని చిన్నాభిన్నం చేయబోతే ఏమవుతుంది! వ్యాధి ముదురుతుంది. లేదా వ్యాధి రూపాంతరం చెందుతుంది. పరిస్థితి విషమిస్తుంది. చూస్తుండగానే మనచేతులు దాటిపోతుంది.

గమనించండి! మూత్రంలో షుగర్ పోతున్నది ఆ పోతున్నది అంటున్నాం. శరీరంలో సంధిబంధాలు అంటున్నాం. రక్తప్రసరణలో ఎగుడు దిగుడులు వస్తున్నాయ వస్తున్నది. ఒళ్ళునొప్పులు వస్తున్నాయి అని చెబుతున్నాం— వన్నీ ఏమిటి?-ఇవి వ్యాధులు కావు. వేదనలు!

ఈ వేదనలన్నింటినీ వేరువేరు వ్యాధులుగా గుర్తించి వేరుగా మందులు గుప్పిస్తే జరిగేది ఏమిటి? వేదనలు అణచబ పోతుంది, లేదా రూపాంతరం చెందుతుంది. ప్రాణశక్తి పోన ఇంకాతగ్గి, ఏమీ చేయలేని స్థితిలో పడిపోతుంది. అది చేస్తున్న అణచిపెడ్తున్నాం. మళ్ళీ ప్రయత్నాలు చేయవలసిన స్థితిలో అ లోపున ఔషధాల పేరిట మనం వాడుతూ వస్తున్న అనేకానేక జవాబు చెప్పవలసిన స్థితిలో అది పెట్టబడుతోంది. ఇన్నివిధా ల్లోనై ప్రాణశక్తి అంతకంతకూ శిథిలమయిపోతోంది.

వేదనలను అణచిపెట్టే ప్రయత్నంలో తాత్కాలికంగా లభిస్తోంది. ఇదేదో బాగున్నదని మనమేమో ఉప్పొంగిపో ముందున్న ప్రశాంతస్థితి వంటిదిది! లోపల వ్యాధి ముదిరిపోత రణకు సాధ్యంకాని స్థితికి చేరుకొంటోంది. ఒక క్యాన్స గ్యాంగ్రిన్ వంటి స్థితినో అది పొందుతోంది. శరీరం ఇక వే ఆ వేలం వేయబడుతున్న స్థితిలో చేయగలిగింది లేదు అ పైకెత్తి వేస్తున్నాడు. అసలు ఇంతవరకూ తీసుకువచ్చిన దేవర లుగా భ్రమపడబట్టి కదా ఇంతటి దుర్దశ సంప్రాప్తమవుతున్న

ఒక్కమాట అడుగుతాను చెప్పండి. కొన్ని దశాబ్దాలక్రిత గ్రస్తులున్నారా? ఇంతమంది క్యాన్సరు పేషెంట్లు ఉన్నారా? పిండాలు చెడిపోయిన వారున్నారా? మరి ఇప్పుడెందుకుంటున్నా కుంటున్నారు? వైద్యులకు తెలియక వేదనలను అదేపనిగా అణ కదా! వ్యాధిని ముదరబెడుతూ, ఇలా వేలంపాటల స్థాయికి తీసు కదా—ఇది భావ్యమా? అవగాహనలోని ఈ లోపాన్ని సరిజేసి! వైద్యుల అవగాహనా రాహిత్యానికి మానవజాతి పెద్దఎత్తున బలి పతీ వైద్యులారా! కాస్త నిదానించండి! ప్రశాంతంగా ఈ చెప

గూర్చి పరిశీలించండి! ఏ వేదనలను చూసి, మీరు వ్యాధులని భ్రమపడుతున్నారో మీరు దడుసుకొంటూ, రోగార్తులను దడిపిస్తున్నారో ఆ వేదనలు వ్యాధులు కావు. వ్యాధిని బహిష్కరించడానికి గాను ప్రాణశక్తి చేపట్టిన వివిధ చర్యలే వేదనలు, వాటినిచూసి భయపడవలసిన పనిలేదు! 'అవి మనకుమిత్రులే తప్ప శత్రువులు కావు!' వార్తాహరులే తప్ప అవరోధాలు కావు. గమనించవలసినవే తప్ప అణచిపెట్టవలసినవి కావు! వేదనలను అణచిపెట్టడం ప్రాణశక్తికి ఎదురుతిరగడ మవుతుంది తప్ప, ప్రాణశక్తికి సహకరించడం కాదు. వేదనలను అణచిపెడుతున్న కొద్దీ ప్రాణశక్తి నీరసిస్తుంది, శిథిలమవుతుంది. అప్పుడు వేదనలను అణచిపెట్టడానికి కూడా వీలు దొరకదు. దేహం ధ్వంసమై రాలిపడిపోతుంది.

### కారణాన్ని చూడండి

ఇంకొక దృశ్యాన్ని మీ ముందు ఉంచుతున్నాను చూడండి. ఒక కుర్రవాడు చుట్టుప్రక్కల కుర్రవాళ్ళతో కలసి సరదాగా ఆడుకొంటున్నాడు. ఇంతలో అతని చేతికి పరీక్షఫలితాలు పడ్డ పేపరు అందింది. అతడు దానిని తీసికొని చూడటం మొదలుపెట్టాడు.

చూస్తూ ఉండగానే అతడి ముఖంలో రంగులు మారుతున్నాయి. ఆ పేపరు నేలా చూస్తూనే అతడింటి ముఖం పట్టాడు. ఇంటిలోనికి ప్రవేశించి తన గదిలోనికి వెళ్ళాడు. ఆ గదితలుపులు మూసుకొన్నాయి. లోపల ఏం జరుగుతున్నదీ తెలియని పరిస్థితి ఏర్పడింది.

ఇంటిలోనివారు క్రమంగా జరిగినదానిని ఊహించినవారై అతన్ని తలుపులు తీయమని బ్రతిమిలాడసాగారు. ఎంతకూ అతడు తలుపులు తీయడంలేదు. వాళ్ళు బ్రతిమిలాడుతూనే ఉన్నారు. ఎప్పటికో తీయలేక తీయలేక తీసి బాధగా, విసుగ్గా చూశాడతను. అతణ్ణి చూసినవారికి పరిస్థితి కొంతలో కొంత బోధపడింది. ఇకవారు ఓదార్చసాగారు. అనేక విధాలుగా నచ్చచెప్పసాగారు. కాని అతడు మాత్రం కోలుకున్న జాడలు కనబడటంలేదు.

ప్రొద్దుపోతోంది. అతణ్ణి భోంచేయమంటారు వాళ్ళు. అతడు తల అడ్డంగా త్రిప్పుతాడు. గడ్డం పట్టుకొంటారు వాళ్ళు. ఆ చేతిని ప్రక్కకు తప్పిస్తూ ఏడుస్తాడు అతను—నన్ను వదిలేయండి! నాకు ఆకలిలేదు, నేను ఏమీ తినలేను- ఇప్పుడు నా

నోటికి ఏమీ సయించదు—అంటూ కన్నీరు కారుస్తూ ముఖాన్ని ప్రక్కకు త్రిప్పేసుకుంటాడు. వారికిక ఏం చేయాలో బోధపడలేదు. కాసేపు ఆగి మళ్ళీ ప్రయత్నిద్దాం అని వారు ఇక ఇవతలకు వచ్చేశారు. తలుపులు ఓరగావేసి అతడు తనలో తాను కుమిలిపోతున్నాడు.

ఇంతలో నలుగురు మిత్రులు అటువచ్చారు. వారి చేతిలో పేపరుంది. కేరింతలు కొడుతూ వాళ్ళు ఒక్కసారిగా తలుపులు త్రోసి అతణ్ణి చుట్టుముట్టారు. 'నీవు మాకు పార్టీ ఇవ్వాలి. ఇలా అలా కాదూ, చాలా ఘనంగా ఇవ్వాలి. ఏమిటి ఇలా ఉన్నావు? తప్పించుకొందామని చూస్తున్నావా?- అని అతణ్ణి లేవనెత్తారు.

అతడాశ్చర్యపోయాడు. 'నేను పార్టీ ఇవ్వడమేమిటి? మీరు నన్ను ఎగతాళి చేస్తున్నారు'-అన్నాడు.

'లేదు, ఇదిగో చూడు నీ నెంబరు ఫస్టుక్లాసులో ఉంది. నీవు మహా వస్తే సెకండ్‌క్లాసు వస్తుంది అన్నావు. మరి ఇప్పుడు ఫస్ట్‌క్లాసు వచ్చింది. అందుకని ఘనంగా పార్టీ యివ్వమని అడుగుతున్నాం. తప్పేముంది'-అన్నారు వాళ్లు ఒక్కసారిగా!

అతడు ఆశ్చర్యచకితుడయ్యాడు. తన నెంబరు మరల మరల చూచుకొన్నాడు. 'అసలు నేనిక్కడ చూడనేలేదురా, నా నెంబరు ఇక్కడ ఉంటుందని ఊహించలేదు, పదండి పోదాం. మీరేం చేయమంటే అది చేస్తాను, ఏం కావాలీ అంటే అది ఇస్తాను' అని ఒక్కసారిగా బయటకు గెంతాడు.

అమ్మా! నేను ఫస్ట్‌క్లాసులో ప్యాసయ్యాను, మా వాళ్ళందరితో కలసి బయటకు వెళ్ళిపోతున్నాను. నాకోసం మీరెవ్వరూ ఎదురుచూడొద్దు. నేను ఏదో ఒక వేళకు వస్తాను-అంటూనే బయటకు పరుగెత్తాడు. ఇంకా చెప్పాలీ అంటే పరిగెత్తుతూనే అలా అన్నాడు.

ఇక్కడేం జరిగింది!-ఒక్కసారి చూడండి. మొదట అతడు హాయిగా ఆడుకొంటున్నాడు. అంతలో పరీక్ష ఫలితాలు వచ్చాయి. నంబరు కనబడలేదు. మనస్సు చివుక్కుమంది అంతే! అతడి వశంలో అతడు లేని స్థితి ఏర్పడింది. ఇంటిలోని వారెవరూ అతన్ని ఓదార్చలేక పోయారు.

ఇంతలో మిత్రబృందం వచ్చింది. నెంబరు చూపించింది. ఇంతవరకూ చివుక్కుమన్న మనస్సు ఒక్కసారి గబుక్కున ఎగిరి గంతేసింది. ఆ ఆనందం

పట్టలేక అతడు బయటకు గెంతేశాడు. ఇంటిలోని వారందరూ ఆశ్చర్యపడిపోయారు. 'ఇప్పటిదాకా అలా పడున్నవాడేనా, ఇప్పుడిలా గెంతుతున్నాడు! ఇప్పటిదాకా ఏమీ వద్దన్నవాడేనా ఇప్పుడన్నీ కావాలంటున్నాడు!' అంటూ, అనుకొంటూ అలా చూస్తూ ఉండిపోయారు.

పరీక్ష ఫలితాలు చూడగానే అతని మనస్సుకు ముడిపడింది. దానితో వేదనలెన్నో వ్యక్తమయ్యాయి. మళ్ళీ పరీక్ష ఫలితాలు చూడగానే అతని మనస్సుకు పడిన ముడివిడింది. అంతవరకూ వ్యక్తమవుతున్న వేదనలన్నీ అంతలోనే మాయమయ్యాయి.

ఇక్కడ కూడ వ్యాధి కారణమున్నంతవరకే వేదనలు వ్యక్తమయ్యాయి. వ్యాధి కారణం తొలగిపోగానే వేదనలు మాయమయ్యాయి.

ఇక్కడ మరొక సూక్ష్మాన్ని కూడ మనం గమనించవలసి ఉంది. వ్యాధి కారణం మనస్సులో ఉండగా, వ్యాధి ఫలితాలు ప్రాణ, దేహాలపైన వ్యక్తమవుతున్నాయి. ఇక్కడ వ్యాధి కారణం పరీక్ష తప్పానని అనుకోవడం. ఇది మనస్సులోనూ, ఆపైనా ఆక్రమించి ఉంది. వేదనలు-ఆకలి తగ్గిపోవడం, ఏమీ తినాలని అనిపించక పోవడం, కన్నీరు అదేపనిగా కారడం, శరీరం విలవిలలాడి పోవడం, నీరసం, నిస్సత్తువ, దిగాలుగా అలా పడివుండడం మొదలయినవి

వ్యాధి కారణం మనస్సునందూ, ఆ పైనా గోచరిస్తూ ఉండగా, వ్యాధి ఫలితాలు ప్రాణ, దేహాలలో మనకు వ్యక్తమవుతూ వున్నాయి. ప్రాణ దేహాలలో వ్యక్తమవుతున్న వ్యాధి ఫలితాలను వ్యాధులని భ్రమించి, వాటిని వేటాడే ప్రయత్నం చేయడమున్నదే అది ఎంత కూడని పని!

వ్యాధిని పట్టించుకోకుండా, వ్యాధి ఫలితాలను పట్టుకొని వేటాడినప్పుడు తాత్కాలికమయిన ఉపశమనం లభిస్తుంది తప్ప, శాశ్వతమయిన నివారణ లభించదు! అలోపతీ వైద్య విధానంలో మనం అనుభవిస్తున్నది ఇప్పుడు ఈ స్థితినే !

మూత్రం ద్వారా షుగర్ పోతున్నది. ఇది వ్యాధి ఫలితం. దీనిని వేటాడే ప్రయత్నంలో మనం ఇన్సులిన్ మొదలయినవి వాడుతున్నాం. ఎప్పుడు వాడకపోతే అప్పుడే షుగర్ మళ్ళీ కనిపిస్తున్నది. అందుకని జీవితాంతం దీనిని వాడుతూ వుండమని వైద్యుడు సలహా ఇస్తున్నాడు. వ్యాధి కారణాన్ని స్పృశించకుండా, వ్యాధి ఫలితాలను మాత్రం వేటాడుతూ ఉన్నప్పుడు ఇలాంటి దారుణ స్థితి ఏర్పడుతున్నది.

కిటికిలోనుండి గదిలోని నాపరాయిపైన ఎండ పొడ పడుతున్నది- ఆ ఎండ పొడను తుడవగలమా ! మీరా ఎండ పొడపైన గోనెను పరవేస్తే, దానిపైనే ఆ ఎండ పొడ పడుతుంది. ఆ గోనెను తీసివేసి కాలును అక్కడ పెడితే,కాలిమీదే ఎండపొడ పడుతుంది. లేదూ! ఇలా కాదూ, మేం దీనిని తుడవడం మొదలుపెడతామూ అంటే అలా తుడుస్తూ, వుండటమే మిగులుతుంది. ఎప్పటివరకూ! సూర్యుడు అస్తమించేంతవరకూ! రోగికి కూడా అల్లోపతీ వారు అదే చెబుతున్నారు కదా! జీవితాంతం మందు వాడమని! అంటే అర్థమేమిటి? అస్తమించే వరకూ అలా బాధపడుతూ ఉండమనేకదా !

అలాకాక, కొంచెం తెలివి గలిగి కిటికీ రెక్కను మూశామనుకోండి, ఇక ఎండ పడదు. ఈ కిటుకు తెలియాలి. వ్యాధి ఫలితాన్ని వేటాడకుండా, వ్యాధి కారణాన్ని తొలగించడమంటే ఇదే, ఇలాంటిదే!

ఇలాంటిదే మరో ఉదాహరణ. ఫ్యాను తిరుగుతోంది, దానిని ఆపాలి. అప్పుడు కర్రపెడితే ఏమవుతుంది! ఫ్యాను ఆగకపోగా, పెట్టినవాడు లేచిపోతాడు. అలాకాక గోడకు ఉన్న స్విచ్చును ఆపేశామనుకోండి, ఫ్యాను ఆగిపోతుంది. కర్రతో పనిలేదు. కారణాన్ని గమనించడమంటే ఇదే, ఇలాంటిదే!

పరీక్ష తప్పావనుకొని గదిలో చేరిన కుర్రవానికి ఆ ఇంటిలోని వారు, అతడు పడుతున్న వేదనలను తొలగించాలని చూశారు, సాధ్యపడలేదు, మిత్రులు వచ్చి కారణాన్ని తొలగించారు. అంటే నీవు తప్పలేదూ, ప్యాసయ్యావని నంబరు చూపించారు. అంతే! అతని వేదనలు వాటి కవిగా మాయమయ్యాయి. వాటిని తొలగించడానికి వేరే ప్రయత్నమన్నదే అవసరం లేకపోయింది. కారణాన్ని స్పృశించడమంటే ఇదే, ఇలాంటిదే!

మనస్సుకు కోపము వస్తుంది. కళ్ళు ఎర్రబడుతున్నాయి, మనస్సుకు భయం వేస్తోంది, కాళ్ళు వొణుకుతున్నాయి, మనస్సు విషాదాన్ని చెందుతోంది. నాలుక రుచిని కోల్పోతున్నది. మనస్సుకు దుఃఖము కలుగుతున్నది. కళ్ల వెంట అశ్రువులు కారిపోతున్నాయి. ఇలాంటి సన్నివేశాలన్నింటిలోనూ ఏమిటి మనకు గమనికకు వస్తున్నది ! కారణం మనస్సునందూ, ఆపైనా వున్నది. ఫలితం ప్రాణం మీదుగా, దేహముపైన వ్యక్తమవుతున్నది. కన్నీటిని పరీక్షిస్తే దుఃఖము ఎందుకు కలుగుతున్నదో తెలుస్తుందా! ఆలోచించండి. దేహ భాగాలను పరీక్షించే ముందు ఇంత లోతుగా మనం ఆలోచించవలసి వుంది.

అలోపతీవారి పరీక్షలు దేహ భాగాలనూ, ప్రాణ ప్రక్రియలనూ పట్టి చూప గలవు. అనగా వ్యాధి ఫలితాలను కూలంకషంగా వివరించగలవు. అంతవరకూ బాగానే వున్నది. మరి వ్యాధి కారణం మాటేమిటి? దానిని గమనించకుండా ఎన్ని పరీక్షలు చేసి ఏమి ఫలం? ఆలోచించండి. వ్యాధి ఫలితాలను వ్యాధులుగా చూసే స్థితినుండి బయటపడండి.

## మనస్సు పాత్ర

మరొక దృశ్యాన్ని మీ ముందుంచుతున్నాను. అప్పుడు మనస్సు పాత్ర ఎంతటిదీ అన్నది మీకు మరింతగా బోధపడుతుంది.

ఒకతను మోకాటి నొప్పితో బాధపడుతున్నాడు. ఆ మోకాలు బాగా వాచింది కూడాను! భరించడానికి కష్టంగా వున్న ఆ నొప్పితో పెద్దగా మూలుగుతున్నాడు. 'అమ్మో, నాయనో'– అంటూ అరుస్తున్నాడు. అది రాత్రివేళ. ఇంటిలోనివారు ఇద్దరు ముగ్గురతని చుట్టూ చేరి ఏదో ఒకలా అతనికి ఎంతో కొంత ఉపశమనాన్ని కలిగించాలని చూస్తున్నారు. కాని అతడు చాలా బాధ పడుతున్నాడు. వాళ్ళు చూడలేకపోతున్నారు.

ఇంతలో క్రమంగా కునుకు పట్టింది. ఒక మూడు గంటలపాటు ఆ కునుకు కొనసాగింది. కునుకు నుండి ఇక మెలుకువ వస్తోంది. అలా మెలుకువ వస్తూ ఉండ గానే 'ఓయమ్మో. ఓ నాయనో ఈ మోకాటి నొప్పి నేనుభరించలేను' –అని అరవ సాగాడతను. ఇంక అక్కడినుండి అంతా యథాప్రకారమే అరుపులు, మూలుగులూ కొనసాగుతున్నాయి.

ఇక్కడ మనం గమనించవలసింది ఏమిటీ అంటే కునుకు పట్టిన ఆ కొద్ది గంటలూ అంతటి మోకాటి నొప్పి ఏమయిందీ అని! మోకాలు అలాగే ఉంది. వాపూ అలాగే వుంది. మరి నొప్పి సంగతి ఏమిటి? అది ఏమయింది? ఏమీ లేదు. నొప్పిని అనుభవిస్తున్న మనస్సు నిద్రలోనికి జారుకొన్నది. అందువల్ల నొప్పి ప్రసక్తి ఆ కాసేపూ కానరాలేదు. మళ్ళీ మెలకువ వచ్చేటప్పటికి మనస్సు నొప్పి యెడల మేల్కొని బాధను అనుభవించడం, ప్రకటించడం ప్రారంభించినది.

ఇంతకూ ఇక్కడ నొప్పిని అనుభవిస్తున్నది కాలు కాదు, మనస్సు. నొప్పిని గూర్చి మనకు చెప్పగలిగినది కూడా మనస్సే! ఒకవేళ మనం కాలును ఎక్సరే తీస్తే

అక్కడ వున్నటువంటి చెదురుబాటు యొక్క స్థితిగతులు మనకు తెలుస్తాయి. అంతే! అంతవరకే! ఇక నొప్పి సంగతి మనకు చెప్పగలిగింది మనస్సు మాత్రమే!

మరి ఇప్పుడు చెప్పండి, నొప్పిని గూర్చి మనస్సును అడిగి తెలుసుకోకుండా మోకాటికి మనం వైద్యం చేయవచ్చునా! ఈ మోకాటి నొప్పి విషయములో మోకాలి పాత్ర ఎంత వుంది ? మనస్సు పాత్ర ఎంత వుంది ! మరి వైద్యులు ఎక్సరే ఫోటోకు ఇచ్చిన విలువ నొప్పిని గురించి విప్పి జెప్పే మనస్సునకు ఇవ్వనప్పుడు, ఇవ్వలేనప్పుడు ఇంకా ఆ స్థితిని అతడు ఏమి సరిచేయగలడు!

మోకాటి నొప్పి అనేకాదు. మనిషికి కలిగిన ఏ నొప్పులుగాని, ఏ బాధలు గాని అనుభవిస్తున్నది మనస్సే! వాటిని గూర్చి వివరించి చెప్పగలిగినదికూడ మనస్సే! భౌతిక భాగాల పరిశీలన కేవలం చెదరుబాటు ఏ స్థితిలో ఉన్నదో గమనించడానికి మాత్రమే పనికొస్తుంది. భౌతికమైన ఆ చెదరుబాటు చుట్టూ ఉన్న కథను చెప్పి చూపగలిగింది మనస్సే అవుతుంది. కనుక మనస్సును ఏమీ పట్టించుకోకుండా మనిషికి వైద్యం చేసేస్తాననడం ఏమాత్రం సబబు?

మనస్సును కలుపుకొని, మనిషిని గమనించాలి! ఇంకా చెప్పాలీ అంటే మనిషిని మొత్తంగా గమనించడం మనకు చేతకావాలి!

అలోపతీ వైద్యులు కనిపించే మనిషిని మాత్రం చూస్తున్నారు. కానీ అనిపించే మనిషి ఆ లోపల ఉన్నాడు. ఆ అనిపించే మనిషిని గమనించ గలగడం మనకు చేతకావాలి.

అనిపించే మనిషిలో వ్యాధి కారణముంటున్నది. కనిపించే మనిషిలో ఆ వ్యాధి ఫలితాలు ఉంటున్నవి. వ్యాధి కారణాన్ని తొలగించడమే సరిఅయిన పద్ధతి- అన్న నిర్ణయానికి మనం వచ్చినప్పుడు అనిపించే మనిషిని గూర్చిన మన పరిశీలన బాగా పెరగవలసి ఉంది. ఆ అనిపించే మనిషి అందిస్తున్న వివరాలపైన ఆధారపడి మనం ముందుకు సాగవలసి ఉంటుంది.

అలోపతీ విధానం-కనిపిస్తున్న 'మనిషిని కూలంకషంగా పరీక్షిస్తాను' అంటోంది. హోమియో విధానం -'అది చాలదూ అనిపిస్తున్న మనిషినికూడ మనం సమగ్రంగా పరిశీలించవలసి ఉంటుంది'- అని నొక్కి చెబుతోంది.

అలోపతీ విధానం-'ప్రాణశక్తి చర్యలను సంహరిస్తాను' అంటున్నది. హోమియో విధానం - 'ప్రాణశక్తి చర్యలకు సహకరించాలి' అంటున్నది.

# సమాన ప్రయత్నం

...ాణశక్తి చేపట్టిన చర్యలకు మనం సహకరించాలి. అంటే ప్రాణశక్తి ప్రయత్నాలకు సమానమైన ప్రయత్నాలను మనం జోడించగలగాలి. ప్రాణశక్తి బలపడుతుంది. వ్యాధి కారణాన్ని అతిత్వరలో బహిష్క...గుతుంది. ఇదీ-హోమియో తత్త్వశాస్త్రం మనకు చెబుతున్నది. హోమియో ...ానమయిన అని అర్థం. సమానమైన ప్రయత్నంతో ప్రాణశక్తికి సహక...క వైద్య విధానమని అర్థం.

...న నిత్యజీవితాన్ని పరిశీలిస్తూ సాగినప్పుడు సమానమైన ప్రయత్నంతో మనం సహకరిస్తూ వస్తున్న సన్నివేశాలు అనేకంగా కనబడుతూ మనం వాటిని గమనించగలగాలి. శాస్త్రం పుడుతున్నది గమనికనుండే! ...తు అనుభూతి చెంది ఊరుకొంటాడు. శాస్త్రజ్ఞుడు అనుభూతి చెందుతూనే ...లుగుతాడు.

...ప్పుడు మనం, మనకు తెలియకుండానే మననుండి జరుగుతున్న సమాన ...ను కొన్నిటిని గమనిద్దాము.

### అలసిన వేళ

సాయంత్రం పూట అలసి ఇంటికి వచ్చాము. ఆ రోజున పగలు ఎక్కువ అలసటగా ఉంది. ఒళ్ళంతా నొప్పులు, జ్వరం వచ్చినట్లుంది. వేన్నీళ్ళ ...స్తే బాగుంటుంది అనిపించింది. వేన్నీళ్ళు పెట్టుకొని స్నానం చేశాం. ...నిపించింది. అలసట తీరినట్లయింది. ఆ రాత్రి మంచి నిద్ర పట్టింది.

...కరోజున అలాగే అలసివచ్చాము. అలాగే ఒళ్ళు నొప్పులు, జ్వరం ఉన్న స్థితి. ఆ రోజున వేన్నీళ్ళు పెట్టుకోవడానికి బద్ధకించాం. ...స్నానం చేశాం. ఫలితంగా నొప్పులు ఎక్కువైనాయి. శరీరం అస్థిమి...ి. సలపరం పెరిగింది. ఆ రాత్రి నిద్ర సరిగా పట్టలేదు.

ఇంకొకసారి అలాగే అలసివచ్చాము. అలాంటి స్థితే ఉన్నది. బ
కుండా వేన్నీళ్ళు పెట్టుకొన్నాం. కారణం ఏమిటి! ఒక అంశం మనచేత గ
బడింది. అలాంటి స్థితిలో వేన్నీళ్ళు పోసుకొంటే హాయిగా ఉంటోంది. చ
పోసుకుంటే బాధ పెరుగుతోంది. కారణం ఏమిటి? కారణం మాట అటుంచి,
మాత్రం అలాంటి స్థితిలో వేన్నీళ్ళనే కోరుతున్నాం. వేన్నీళ్ళకే అలవా
తున్నాం.

శ్రమ చెందినప్పుడు,అలసట అనిపించినప్పుడు ఒళ్ళు నొప్పులు వస్తున్నా
శరీరం సలపరంగానూ, వేడిగానూ ఉంటున్నది. అప్పుడు మనం వేడినీళ్ళను
నికి అందిస్తే దేహం చేస్తున్న ప్రయత్నాలకు సహకరించిన వాళ్ళం అవుతు
ఆ సహకారాన్ని అందుకొని, మన మందిస్తున్న ఆ వేడిని అందుకొని ప్రా
బలపడుతున్నది. శరీరం తేలిక పడుతున్నది.

అలాకాక, చన్నీళ్ళతో స్నానం చేసినప్పుడు శరీరం చేస్తున్న ప్రయత్నా
వ్యతిరేకంగా ప్రవర్తించిన వారమయ్యాం. దానితో శరీరం బాధపడుతోంది.
బాధ పెరుగుతోంది.

అలసటను పోగొట్టేటందుకుగాను, శరీరం వేడిని కొంత పెంచింది.
నీళ్ళ ద్వారా మనం మరికొంత వేడిని దానికి అందించేటప్పటికి దాని పని మరి
తేలిక పడింది. దాని ప్రయత్నం ఫలించింది.

అలాకాక శరీరం వేడిని పెంచి వ్యక్తం చేస్తూ ఉండగా, బద్ధకించి మ
చన్నీళ్ళను అందించాం. ఆ చన్నీళ్ళు శరీరం నుండి జరుగుతున్న ప్రయత్నా
హరించివేశాయి. దానితో శరీరం అస్థిమిత స్థితిలోనికి వెళ్ళింది. ఆ రాత్రి
తల్లాడిపోయింది.

ఈ సందర్భంలో మనకేం తెలుస్తోంది. శరీరం నుండి జరుగుతున్న ప్ర
త్నానికి మన ప్రయత్నం తోడయినప్పుడు శరీరం హాయిని అనుభవిస్తోంది. కో
కుంటోంది. మన ప్రయత్నం దానికి వ్యతిరేకంగా ఉన్నప్పుడు శరీరం బాధ
అనుభవిస్తోంది. స్వస్థతను మరింతగా కోల్పోతోంది.

## గాయపడినప్పుడు

ఆలాగే గాయాలు మొదలయినవి అయినప్పుడు కూడా శరీరం ఆ
ప్రాంతాలలో వేడిని ఎక్కువగా ప్రకటిస్తుంది. మన నుండి కూడా వేడినీటి కాప

స్తున్నాం. అది ఆహారపదార్థం కాదు కాబట్టి, ప్రాణశక్తి దానిని స్వీకరించదు. లోన నిలువనీయదు. బహిష్కరించే ప్రయత్నాన్ని వెంటనే ప్రారంభిస్తుంది. ఆ ప్రయత్నం ఆనందమయ కోశంతో ప్రారంభమయి అన్నమయ కోశం వరకూ సాగుతుంది. అనగా కేంద్రంనుండి పరిధివరకూ వ్యక్తమవుతున్నదన్న మాట!

అన్ని కోశాలనుండీ వేదనలు వ్యక్తమవుతాయి. ముషిటి చెట్టుపండు రస మనే ఈ వ్యాధి కారణాన్ని బహిష్కరించేటందుకు గాను, ఆరోగ్యవంతుడయిన మానవుడిలోని ప్రాణశక్తి చేబడుతున్న చర్యలే ఈ వేదనలన్నీ! చిత్రమేమంటే ఈ విధమయిన వేదనలను ఇంక ఏ విషపదార్థాన్ని బహిష్కరించవలసి వచ్చినప్పుడు కూడా ప్రాణశక్తి ప్రదర్శించడంలేదు. అంటే ఏమిటి? ప్రాణశక్తి-ఒక్కొక్క విష పదార్థాన్ని బహిష్కరించడానికి ఒక్కొక్క విధమయిన వేదనా సముదాయాన్ని ప్రత్యేకంగా వ్యక్తం చేస్తున్నది. అది ఒక విషపదార్థము ఎడల ప్రవర్తించినట్లుగా మరియొక విషపదార్థము ఎడల ప్రవర్తించడం లేదు.

ఇది ఇలా ఉండగా ప్రకృతిమాత యొక్క కరుణా విశేషం చేత, మరొక ఆశ్చర్యకరమయిన విశేషాన్ని హానిమాన్ మహాశయుడు గమనించగలిగాడు. అదేమి టంటే వివిధ విషపదార్థాల యెడల మానవునిలోని ప్రాణశక్తి వ్యక్తం చేస్తున్న వేదనా సముదాయాలకు, వివిధ రోగార్తులలో విభిన్నమయిన వ్యాధి కారణాలను బహిష్కరించడానికి గాను ప్రాణశక్తి వ్యక్తం చేస్తున్న వేదనా సముదాయాలకూ పోలికలు కనిపించడం! ఈ పోలికలను చూచి అతడు ఆశ్చర్యానందాలను పొందాడు ఇవి విషపదార్థాలు కావు. ఔషధ పదార్థాలు—అని తెలిసికొన్నాడు. అనగా ప్రకృతిలో ఏ ఒక్క పదార్థమూ కూడా మానవునికి వినియోగపడనిది లేదన్నమాట! అయితే అది ఆహారపదార్థంగానయినా పనికివస్తోంది. లేకపోతే అది ఔషధ పదార్థంగానన్నా పనికి వస్తోంది.

ఇప్పుడు హానిమాన్ మహాశయుడు ఒకపని చేశాడు. ఆరోగ్యవంతులయిన అనుయాయులను బృందాలు బృందాలుగా స్వీకరించి, వారిలో ఒక్కొక్క బృందం పయిన ఒక్కొక్క విషపదార్థాన్ని తగినరీతిలో ప్రయోగిస్తూ వచ్చాడు. వారందరికీ కూడా డైరీలను ఇచ్చి ప్రాణశక్తి వారిలో చేపడుతున్న చర్యలను వారిచేత ఎప్పటి కప్పుడు రికార్డుచేయిస్తూ వచ్చాడు. ఈ కారణం చేతనే హోమియో విధానానికి సంబం ధించిన ఔషధశాస్త్ర గ్రంథంలో అనగా మెటీరియా మెడికాలో ఒక్కొక్క వేదన

ఆ విష పదార్థం ఆ రోగార్తునికి ఔషధ పదార్థమవుతూ వున్నది. ఈ ఔషధ పదార్థాలకూ, రోగార్తులకూ అనుసంధానం ఏర్పడటంతో అస్వస్థత స్థతకు రోగార్తులందరూ తృప్తిగా ప్రయాణం చేసే స్థితి రూపొందుతూ

ప్పుడు మీకు తెలిసింది కదా, హోమియో విధానంలో ఒక రోగార్తుని ఎలా నిర్ణయిస్తారు అన్నది ! రోగార్తుని యొక్క వేదనలన్నీ అన్ని ండీ, అన్ని కోణాల నుండీ క్రోడీకరించుకొంటాం. అప్పుడు క్రోడీకరింప వేదనా సముదాయాన్ని దగ్గర పెట్టుకొని, ఆరోగ్యవంతునిపై ప్రయోగించి ఏ విష పదార్థము యెడల మానవునిలోని ప్రాణశక్తి సరిగా ఇలాంటి సముదాయాన్నే వ్యక్తం చేసిందో ఆ విష పదార్థాన్ని ఈ రోగార్తునికి దార్థంగా స్వీకరిస్తాము.

ఆ ఔషధ పదార్థాన్ని తగు మాత్రంగా, తగిన విధంగా రోగార్తుని మీద స్తాము. అప్పుడు రోగార్తునిలోని ప్రాణశక్తిని ఆ ఔషధ పదార్థం కావలసిన స్పృశిస్తుంది. దానితో ప్రాణశక్తి ప్రబోధనాన్ని చెందుతుంది. ఏ ప్రయత్నా అంతవరకూ తననుండి జరుగుతున్నాయో, ఆ ప్రయత్నాలను అంతకన్నా న రీతిలో వ్యక్తం చేయగలుగుతుంది. బలమైన ప్రయత్నాలు ఇలా వ్యక్తం తో, అంతవరకూ జరుగుతున్న ప్రయత్నాలు ఇక తమ ఉనికిని కోల్పోతాయి. మైన ప్రయత్నాలలో భాగమైపోతాయి. ఈ బలమైన ప్రయత్నాల తాకిడికి గారణం ఇక కదులుతుంది. క్రమంగా బైటకు బహిష్కరింపబడుతుంది.

ఔషధ పదార్థం తగిన విధంగా, తగు మాత్రంగా అందింపబడిన కారణాన షయిన ప్రయత్నాలు నాజూకుగా సాగుతాయి. సాధ్యమయినంత వరకూ ఏ మాత్రం ఇబ్బంది కలిగించని రీతిలో జరిగిపోతాయి. మన గమనికకు అందకుండానే నడచిపోతూ వుంటాయి. మనం ప్రశాంతతను అనుభవిస్తూ . పని మాత్రం జరిగిపోతూనే ఉంటుంది. దక్షత కలిగిన వానికి పని చెబితే ంటుంది! మనకు నిశ్చింత లభిస్తుంది. పని పరిపూర్ణంగా నిర్వహింపబడుతూ ది. ఎక్కడా హడావిడి మాత్రం ఉండదు. అలా ఉంటుంది హోమియో

ఆరం మెటాలికమ్ (బంగారం), అర్జంటం నైట్రికం (వెండి), కుప్రం మెటాలికం (రాగి), జింకం మెటాలికమ్ (తుత్తునాగము) మొదలయినవన్నీ ఖనిజాల నుండి స్వీకరించిన ఔషధాలు.

క్యాప్సికమ్ (పచ్చిమిరప), ఎలియమ్‌సిపా (ఉల్లి), ఎనకార్డియం (నల్లజీడి), ఆరం ట్రిఫిలినమ్(దురదకంద) నక్స్‌వామికా (ముషిణి), మొదలయినవన్నీ వృక్ష జాతికి చెందిన ఔషధాలు.

ఏపిస్ (తేనెటీగ), లెకసిస్ (పాము విషం), లాక్‌కానినమ్ (కుక్క-పాలు), లాక్‌ఫెలినమ్ (పిల్లి పాలు) మొదలయినవన్నీ జంతువుల నుండి స్వీకరించిన ఔషధాలు.

సోరినమ్, మెడోరినమ్, సిఫిలినమ్, ట్యూబర్‌క్యులినమ్ మొదలయినవి మానవుల రోగగ్రస్త స్థితుల నుండి రూపొందింపబడిన ఔషధాలు.

ఇలాకాక ఎలక్ట్రిసిటి నుండి ఎలక్ట్రిన్, మేగ్నటిజం నుండి మ్యాగ్నటాన్— ఇలా ఇలా అనంతంగా ఔషధాలు ఇంకా ఇంకా రూపొందింపబడుతూనే వున్నాయి.

# వేదనా సముదాయం

వైద్యం నేర్చుకొనేటప్పుడు అది ఒక శాస్త్రం. నిర్వహించేటప్పుడు అది ఒక కళ. వేదనా సముదాయాన్ని స్వీకరించే వేళలో దివ్యమయిన ఆ క్రతువును మన మొక కళగా నిర్వహించాలి. రోగార్తుని మనం అడగనిదంటూ ఉండకూడదు. అలాగని 'ఇతడొక వాదస్తుడు సుమా!' అని రోగార్తుడు అడుగుతున్న మనను గూర్చి అనుకోకూడదు.

ఆదరంగా కూర్చోబెట్టుకోవాలి, ప్రేమతో పలుకరించాలి, బాధ్యతతో అతని వ్యాధి స్థితిని గూర్చి అనునయంగా అడిగి తెలిసికోవాలి. ఆత్మీయత ఇరువురి మధ్యా స్నేహ రూపంలో వెల్లివిరియాలి. ఇతడు మనకొక పెద్ద దిక్కు. ఇతడికి గాక మన బాధలు ఎవరికి చెప్పుకొంటాం? కనుక ఇక్కడే మన మనస్సును విప్పి చెబుదాం. మన హృదయాన్ని తెరిచిపరుద్దాం-అన్న ఉన్ముఖత రోగికి అప్రయత్నంగా కలగాలి. అలాంటి సన్నిధి అతనికి అందించబడాలి. అప్పుడు మీ వేదనా సముదాయ స్వీకరణ ఒక ఆత్మీయుల సంభాషణలా, ఒక స్నేహితుల ఇష్టాగోష్ఠిలా అలవోకగా, అలా అలా సాగిపోతుంది.

వ్యాధితో వచ్చినవారు ఆడా, మగా ? వయస్సెంత ? ఎంతవరకు చదువుకొన్నారు ? ఏం చేస్తున్నారు? ఆర్థికమయిన స్థితిగతులేమిటి? గృహపరమైన పరిస్థితులేమిటి ? ఎక్కడ ఉంటున్నారు? ఫోను వసతి మొదలయినవి ఉన్నాయా ? ఇలాంటి వివరాలన్నింటినీ ముందుగా అడిగి వ్రాసుకోవాలి. ఈ అడుగుతున్నప్పుడే వారి పరిస్థితి ఏమిటి అన్నది కొంతవరకు మనకు బోధపడుతుంది.

వేదనా సముదాయ స్వీకరణ సమయాన రోగార్తునితో బాటుగా బాధ్యత కలిగిన వేరొకరు కూడా ఉండటం అవసరం. అప్పుడు మాత్రమే వేదనలు సమగ్రంగా స్వీకరించబడటానికి అవకాశమేర్పడుతుంది. భార్యతోబాటు భర్త, భర్తతోబాటు భార్య, పిల్లలతోబాటు తల్లిదండ్రులు, తల్లిదండ్రులు వృద్ధులయి వచ్చినప్పుడు వారితోబాటుగా అందివచ్చిన వారి బిడ్డలు—బాధ్యతతో వెంట ఉండి వేదనా సముదాయ స్వీకరణకు తగిన విధంగా తో[illegible]

ముఖ్యంగా మనస్సుకు సంబంధించిన అంశాలు, అనగా ప్రవర్తనకు సంబంధించిన వివరాలు అడిగి తెలిసికొంటున్న వేళలో ప్రక్కనుంటున్న వారి సహకారం ఎంతయినా అవసరమవుతుంది. ఎందువల్లనంటే ఎవరి మానసికస్థితిని వారు గమనించడం కష్టం. ప్రక్కనున్న వారికి దానిని గమనించడం తేలిక. మరి వారు వీరి మానసిక స్థితిగతులకు, ఆ ఆటుపోటులకు తరచు గురికావడమో, బలికావడమో జరుగుతూ ఉంటుంది కదా! కనుకవారు బాగా చెప్పగలుగుతారు.

అలాగే చిన్నపిల్లలు వయస్సుచాలక, ఏ వివరాలూ అంతగా చెప్పలేరు. తల్లిదండ్రులు బాధ్యతతో వాటిని చెప్పగలగాలి. పెద్దవయసున ఉన్నవారు మనస్సుకు మరుపుతోడు కావడంవల్ల అన్ని వివరాలూ అంతగా చెప్పలేరు. అంది వచ్చిన వారి బిడ్డలు బాధ్యతపడి వాటినన్నింటిని వివరించాలి.

పిల్లల విషయంలో ఒక్కొక్కప్పుడు తల్లిదండ్రులు మాత్రమే చాలరు. వాళ్ళను పెంచే ఆయాలు, వారికి విద్యగరిపే ఉపాధ్యాయులు కూడా మనకు సహకరించవలసి రావచ్చు. పెద్దవయసున ఉన్నవారి విషయంలో బిడ్డలు మాత్రమే సరిపోకపోవచ్చు. వారి స్నేహితులు, సమవయస్కులయిన వారి బంధువులు మనకు సహకరించవలసిరావచ్చు. మొత్తంమీద బాధ్యత కలిగినవారు ప్రక్కన ఉండటం వేదనా సముదాయ స్వీకరణకు మరీ మరీ అవసరం. ఇది మరచిపోకూడనిఅవసరం!

బాధ్యత కలిగిన వారితో, బాధ్యతపడగలిగినవారితో కలిపి కూర్చుండపెట్టి, రోగార్తునితో ప్రేమపూర్వకమయిన సంభాషణను ప్రారంభించాలి. ముందుగా అతనికే అవకాశమియ్యాలి. నీ బాధలేమిటి? చెప్పమని అడగాలి. అతడు చెబుతాడు. ఆ బాధలను ఎడ ఎడంగా వ్రాసికోవాలి. కావలసినంత ఎడమిచ్చి వ్రాసుకోవాలి. ఇవండీ బాధలు అని అతడు కొన్నిటిని చెబుతాడు. ఇంకా ఏమయినా ఉన్నాయా? ఉంటే చెప్పు-అని అడగాలి. అప్పుడతను గుర్తు చేసికొని ఏమయినా ఉంటే వాటిని చెబుతాడు. అవికూడా వ్రాసుకోవాలి.

అతడు కొన్ని బాధలను చెప్పడానికి వచ్చాడు. ముందు వాటిని గూర్చి అతడ్ని చెప్పనీయాలి. అలాకాక అతడొక బాధను చెప్పగానే ఇదేమిటి-అదేమిటి అని వివరాలను అడగకూడదు. అలా అడిగితే అతడు మానసికంగా ఒత్తిడిని అనుభవిస్తాడు. ఈ అడిగిన వివరాలను చెప్పేలోపున తాను చెప్పదలచిన మిగతా బాధలను గూర్చి మరచిపోతానేమోనని భయపడతాడు. మనమతడిని వివరాలడుగుతున్నాం. అతడి మనస్సు అతడింకా చెప్పదలచిన బాధలపైన ఉన్నది. దానితో

మిస్తుంది? 6) ఎప్పటినుండి ఉన్నది? 7) ఏయే దశలు దాటివచ్చింది? 8) బాధను అనుభవిస్తున్న వేళలో మనస్సునకు ఏమనిపిస్తున్నది?—ఇవి రోగార్తుడు అనుభవిస్తున్న బాధచుట్టూ వ్యక్తమవుతున్న అష్టాంగాలు.

రోగార్తుడు చెప్పిన ప్రతి బాధకూ ఈ అష్టాంగాలను అతడిని అడిగి తెలిసికోవాలి. ఆ తెలిసికోవడంతో అతడు చెప్పిన బాధను, అతడినుండి వ్యక్తమవుతున్న ఒక వేదనగా మనం గమనించుకోగలుగుతున్నాం. ఇలా ఖాళీలను ఈ అష్టాంగాలతో నింపుకొంటూ రావాలి. అప్పుడు బాధలన్నీ క్రమంగా వేదనలుగా రూపుదిద్దుకొంటూ వస్తాయి. దానితో ప్రాణశక్తి చేపడుతున్న చర్యల యెడల మనకొక చక్కని అవగాహన ఏర్పడుతుంది. ఇంతకూ ఖాళీలు ఇందుకు! బాధచుట్టూ ఉన్న భాషను వ్రాసికొనేటందుకు! అతడు చెప్పిన బాధను ఒక వేదనగా దర్శించగలిగేటందుకు! ప్రాణశక్తి నివేదన ఏమిటి అన్నది బోధపరచుకొనేటందుకు!

ఇప్పుడు మనం అష్టాంగాలను గూర్చి తగుమాత్రంగా, బోధ పరచుకుందాం.

మొదటిది—బాధ ఎక్కడ? అతడొక బాధ ఉన్నదీ అని చెబుతున్నాడు. ఇంతకూ ఆ బాధ ఎక్కడ? —అది ముందు తెలుసుకోవాలి. ఒకడు తలనొప్పి అంటాడు. తలనొప్పి అంటే ఎక్కడ వస్తుంది?-అని అడగాలి. కొందరికి తలంతా నొప్పిగా ఉంటుంది. కొందరికి మాడు ఒక్కచే పోటుగా ఉంటుది. కొందరికి ఎడమ కణత నొప్పి, కొందరికి కుడి కణతనొప్పి, కొందరికి రెండు కణతలు. కొందరికి కణతలను వదిలి నుదురు, ఇంకొందరికి సరిగా భ్రూమధ్యంలో. అందరూ తలనొప్పే అంటారు. కాని ఎవరి తలనొప్పి వారిదే! ఎక్కడ అన్నప్పుడు ఒక్కొక్కరు ఒక్కొక్కచోట చూపిస్తారు. ఆ చోటును గమనించి వ్రాసుకోవాలి. కొందరు ఇక్కడెక్కడా కాదండి ముచ్చిలగుంటలో వస్తుంది నొప్పి అంటారు. అదీ తలనొప్పే! గమనించుకోవాలి. అలాగే కొందరు కడుపునొప్పి అంటారు. అంటే ఎక్కడ? బొడ్డుకు క్రింద రావచ్చు, బొడ్డుకు పైన రావచ్చు. ఇది ఒక గమనిక. అలాగే ఆ వచ్చేది ఎడమ వైపున రావచ్చు, లేక కుడివైపున రావచ్చు. ఇది మరో గమనిక. ఇలా గమనించుకొంటూ పోవాలి. ఇంతకూ బాధ ఎక్కడ అన్నది పట్టుకొనగలగాలి.

రెండవది-బాధ ఎప్పుడు వస్తున్నది? కొందరికి రాత్రిపూట రావచ్చు కొందరికి పగటిపూట ఉండవచ్చు. కొందరికి ఉదయం, కొందరికి మధ్యాహ్నం,

కొందరికి సాయంత్రం, కొందరికి సగం రాత్రి వరకూ, కొందరికి అర్ధరాత్రి తర వాత-ఇలా వివిధ సమయాలలో ఏదో ఒక సమయాన్ని ఆ బాధ ఎంచుకోవచ్చు. కొందరికి బాధ ఎప్పుడూ ఉంటుంది. కాని ఒకానొక సమయంలో ఎక్కువవుతూ ఉంటుంది. కొందరిని బాధ నిద్ర మధ్యలో లేపుతూ ఉంటుంది. కొందరికి నిద్ర లేచేటప్పటికి వచ్చేస్తుంది. అలాగే కొందరు ఎండలోకి వెళ్లినప్పుడల్లా బాధకు గురవుతారు, కొందరు వానకు తడిసినప్పుడల్లా బాధకు గురవుతారు. కొందరు మంచులో నడిచినప్పుడల్లా బాధకు గురవుతారు, కొందరు మూడు కాలాలలోనూ ఏదో ఒక కాలం ఈ బాధకు కేటాయిస్తారు. అంటే ఏమిటి! కొందరికి శీతాకాలం అంటే భయం, బాధవచ్చేస్తుంది. కొందరికి వేసవి అంటే భయం, బాధ పడగొడు తుంది. కొందరికి వర్షాకాలమంటే భయం, బాధతో పడుకోవాల్సి వస్తుంది. ఇలా విద్యార్థులకు గంటలు కేటాయించబడినట్టుగా ఈ రోగార్తులకు కాలాలు కేటాయించ బడుతూ ఉంటాయి. అలాగే కొందరికి అలసట చెందినప్పుడల్లా బాధ వచ్చేస్తుంది. కొందరికి అన్న పానాలు ఆలస్యమైతే చాలు బాధ వచ్చేస్తుంది. కొందరు అన్న పానాలు తీసికొంటే చాలు ఇక బాధతో తీసికొంటూ కూర్చుంటారు. కొందరికి నిద్ర తక్కువయితే బాధ వచ్చేస్తుంది. కొందరికిపని ఉంటే బాధవస్తుంది. కొందరికి పని లేకపోతే బాధ వచ్చేస్తుంది. కనుక ఎక్కడ వస్తున్నది అన్నది ఎంత ముఖ్యమో, ఎప్పుడు వస్తున్నది అన్నది అంతే ముఖ్యం.

మూడవదీ-బాధ ఎలా ఉంటుంది-అన్నదీ. తలనొప్పి వస్తున్నది అంటే సరి పోదు, ఆ తలనొప్పి ఎలా ఉంటున్నదీ కూడ తెలియాలి. కొందరికి సుత్తులతో కొడు తున్నట్లు ఉంటుంది, కొందరికి లోపలికి నొక్కుతున్నట్లుంటుంది. కొందరికి గుంజుతున్నట్లు, కొందరికి నములుతున్నట్లు ఉంటుంది. కొందరి తలనొప్పి స్పందనా త్మకంగా ఉంటుంది. ఆ స్పందన భరించలేనట్లుగా ఉంటుంది-ఇలా ఎన్నో విధాలుగా ఉంటుంది. అలాగే కడుపునొప్పి అంటాడు-అది ఎలా ఉంటుందో తెలియాలి. పొట్లు పెడుతున్నట్లుండవచ్చు. మెలిపెడుతున్నట్లుండవచ్చు, బిగపట్టినట్లుండవచ్చు, బరు వెక్కినట్లుండవచ్చు, గుడగుడలాడుతూ ఉండవచ్చు, ఎగతన్నుతున్నట్లుండవచ్చు. ఎన్నోవిధాలుగా ఉండవచ్చు. అలాగే పుండు బాధ పెడుతున్నది అంటాడు. ఆ బాధ ఎలాంటిదో కావాలి. చురుకు చురుకు పొట్లుండవచ్చు. కారం జల్లినట్లుండవచ్చు. కొరివి పెట్టినట్లుండవచ్చు. లోపలికి లాగుతున్నట్లుండవచ్చు. ఉండుండి బాధపెట్ట వచ్చు, ఎన్నెన్నో విధాలుగా ఉండవచ్చు. ఆ విధమేమిటో తెలియాలి. ఆ పైన మేమిటో అతడు చెప్పగలగాలి. బాధ ఎలా ఉంటుంది అన్నదీ చాలా ముఖ్యమయిన

బాగుంటుంది. కొందరికి ఎవరూ ఆ ఛాయల్లో లేకుండా ఉంటే ఉపశమనంగా ఉంటుంది. అలాగే కడుపునొప్పి వచ్చినప్పుడు కొందరికి తినకుండా ఉంటే ఉపశమనంగా ఉంటుంది. కొందరికి తింటేనే హాయిగా ఉంటుంది. కొందరికి విరేచనానికి వెళ్లివస్తే బాగుంటుంది. ఎవరి ఉపశమనం వారిది. అలాగే కొందరు బాధలు పెరిగినప్పుడల్లా తడిగుడ్డలు వేసుకొంటారు. కొందరు అయినుగడ్డలు పెట్టుకొంటారు. కొందరు అలాకాక వేడినీళ్ళతో తమను తడుపుకొంటారు. కొందరికి చల్లదనం వల్ల ఉపశమనమయితే కొందరికి వెచ్చదనంవల్ల ఉపశమనం-ఎవరి ఉపశమనం వారిది! బాధలో ఉన్నప్పుడు కొందరు మాట్లాడరు. కొందరు ఎక్కడో ఉన్న వారిని కూడా పిలిచి కూర్చుండబెట్టుకొని అదేపనిగా మాట్లాడుతూ ఉంటారు. అవతలివాడు లేవబోతూ ఉంటే పట్టి కూర్చోబెట్టి మరీ మాట్లాడతారు. ఆ మాట్లాడటంలో వారికి ఉపశమనం. కొందరు వద్దన్నా కూర్చొని ఏదో ఒక పనిచేస్తూ ఉంటారు. ఆ చేయడంలో వారికి ఉపశమనం. కొందరికి పగలు ఉపశమనం. కొందరికి రాత్రి ఉపశమనం. కొందరికి ఎవరయినా ఉంటే ఉపశమనం. కొందరికి అందరూ వెళ్లిపోతే ఉపశమనం. కొందరికి ఏడిస్తే ఉపశమనం. కొందరికి నవ్వితే ఉపశమనం. కొందరికి అడిగినవి అందిస్తే ఉపశమనం. కొందరికి బ్రతిమాలించుకొంటే ఉపశమనం. కొందరికి వెన్ను రాస్తూ ఉంటే ఉపశమనం. కొందరికి ధైర్య వచనాలు చెబుతూ ఉంటే ఉపశమనం. కొందరికి తన ఇంటికి తాను వెళ్లిపోతే ఉపశమనం. కొందరికి కావలసినంత డబ్బుంటే ఉపశమనం. ఇలా ఎవరి ఉపశమనం వారిది! కనుక రోగార్తుడు ఉపశమనాన్ని ఏ రీతిగా పొందుతున్నాడో అడిగి తెలుసుకోవలసి ఉంటుంది.

ఆరవది-బాధ ఎప్పటినుండి ఉన్నది? ప్రారంభమయి ఎంతకాలమైనది? ఆ బాధ ప్రారంభించడానికి ముందు కథ ఏమయినా ఉన్నదా? ఒకతను వరుసగా నాలుగేళ్ళు హోటల్ భోజనం చేశాడు—అంతే! అతని ఆరోగ్యం చెడిపోయింది. ఒక అమ్మాయికి వివాహమైనప్పటి నుండి అస్వస్థత ప్రారంభమైంది. అంతకుముందు ఆమె బాగానే ఉంది. ఒకతను వ్యాపారంలో దివాలా తీశాడు. అప్పటినుండి ఆస్తమా పైకి లేచింది. ఒకతను మూడురోజులు వరుసగా పొలాన మంచులో పడుకున్నాడు. అప్పటినుండి ఒళ్ళునొప్పులు ప్రారంభమయ్యాయి. ఇలా ఎప్పటినుండి బాధ ప్రారంభమయింది? ఇప్పటికి ఎంతకాలమయింది, అన్నది ఎంత అవసరమో, ఆ ప్రారంభానికి ముందు జీవిత సన్నివేశాలలో మలుపు ఏమయినా ఉన్నదా—అన్నది కూడా గ్రహించడం అంతే అవసరం.

ఏడవది—బాధ ఏయే దశలను దాటివచ్చినది?-అన్నది. ఒకతనికి మొదట శీతాకాలంలో ఉబ్బసం వచ్చేది. తరువాత వర్షాకాలంలో కూడ రాసాగింది. ఇప్పుడిక మూడు కాలాలలోనూ వస్తున్నది. కానీ ఒక తేడా ఉన్నది. వేసవిలో కన్నా వర్షా కాలంలోనూ, వర్షాకాలంలో కన్నా శీతాకాలంలోనూ బాధ ఎక్కువగా ఉంటుంది. అలాగే మరొకనికి మొదట చలిజ్వరమొచ్చింది. దానిని అణచిపెట్టాడు. తలనొప్పి వచ్చింది. దానిని అణచిపెట్టాడు. అప్పుడు కీళ్లబాధ వచ్చింది. దానినీ అణచి పెట్టాడు. ఇప్పుడు గుండె బరువు వచ్చింది. మందుకని వచ్చాడు. జ్వరబాధతో ప్రారంభయిన ఇతని వ్యాధిస్థితి ఎన్ని దశలు దాటి ఇలా గుండెబరువుగా రూపొందినదీ-ఒక్కసారి గమనించండి. అణచి పెట్టడానికి ప్రయత్నించినప్పుడల్లా వ్యాధి ముదురు తున్నది. తన రూపాన్ని మార్చు కొంటున్నది. ఇలా రోగార్తుని బాధ ఏయే దశలను దాటి ఇంతవరకూ వచ్చినదీ అడిగి తెలిసి కోవాలి. ఆయాదశలలో అతదేమి చేస్తూ వచ్చినదీ కూడా కనుక్కోవాలి.

ఎనిమిదవది—బాధను అనుభవించే వేళలో మనస్సుకు ఏమనిపిస్తున్నది?-అన్నది. ఒకతను పార్శ్వపు నొప్పితో వచ్చాడు. కుడిపైవు పార్శ్వపు నొప్పిః విలవిలలాడుతున్నాడు. తలను గోడకు కొట్టుకొని చనిపోవాలని ఉంది అన్నాడు. ఆ బాధను అనుభవిస్తున్నవేళలో అతని మనస్సుకు అలా అనిపిస్తున్నది. ఒకామెకు బాధ ఎక్కువయినప్పుడల్లా మృత్యువు ముంచుకొస్తున్నట్లు అనిపిస్తున్నది. తాను పోతే భర్తా, పిల్లలూ ఏమయిపోతారోనని బాధపడుతుంది. భయపడుతుంది. ఇంతలో బాధ కొంచెం ఉపశమిస్తుంది. ఇక ఆ ఆలోచనలుండవు. దినచర్యలో పడిపోతుంది. కొందరికి ఈ వ్యాధి ఇక తగ్గదు అనిపిస్తుంది. నిరాశ కలుగుతుంది. కొందరికి దేనిలోనికి దించుతుందోఇది అనిపిస్తుంది. భయమేస్తుంది. కొందరికి మృత్యువు వస్తుందేమోననిపిస్తుంది. వణుకు పుడుతుంది. కొందరికి ఆ వచ్చేదేదో పూర్తిగామంచాన పడకముందువస్తే బాగుండును అనిపిస్తుంది. ఎవరిచేతా చేయించుకొనే అవసరం లేకుండా దాటి పోవాలన్నది వారి కోరిక. కొందరికి విరక్తి కలుగుతుంది. కొందరికి ఇంకా బ్రతకాలనిపిస్తుంది. కొందరికి ఎలా జరగాలో అలా జరుగుతుంది అనిపిస్తుంది. కొందరికి, ఇలాంటి బాధలు ఇంకెవరికయినా ఉన్నాయా?-అని అనుమానమొస్తుంది. ఇలా ఎవరి మానసిక స్పందన వారిది! అడిగి తెలుసు కోవాలి.

ఇలా ఎక్కడ, ఎప్పుడు, ఎలా ఉంటుంది, ఏది ఉద్రేకం, ఏది ఉపశమనం, ఎప్పటి నుండి, ఏయేదశలు దాటి వచ్చింది. ఏమనిపిస్తున్నది—అనే ఈ అష్టాంగాలను

ప్రతి బాధ విషయంలోనూ అడిగి తెలిసుకుని వ్రాసుకోవాలి. కడుపునొప్పి అన్నా ఈ ఎనిమిదీ వ్రాయాలి. నడుము నొప్పి అన్నా ఈ ఎనిమిదీ వ్రాయాలి. కాలినొప్పి అన్నా, వేలినొప్పి అన్నా ఈ ఎనిమిదీ వ్రాయాలి. అతడు బాధ అంటేచాలు, ఆ బాధ చుట్టూ ఉన్న ఈ ఎనిమిది విశేషాలనూ అడిగి తెలిసికోవలసిందే! అతడు చెప్పిన అన్నిబాధలకూ ఎనిమిది విశేషాలతో కూడిన ఈ సమగ్రరూపాన్ని సంతరింపి పెట్టవలసిందే!

ఇప్పుడు అతడు చెప్పిన బాధలను వేదనలుగా మనం రూపొందించాము. బాధచుట్టూ ఉన్న భాషను అడిగి వ్రాసుకున్నాము. ప్రాణశక్తిచేస్తున్న ప్రయత్నాల్ని పొడగట్టించుకునేందుకుగాను కృషిచేశాము. ప్రాణశక్తి చేస్తున్నది ఏమిటి, ఆ చేస్తున్న దానిలోని విధివిధానమేమిటి అన్నది గమనించు కోవడానికే ఇన్ని ప్రశ్నలూ, ఇంతకథా !

రోగార్తుడు చెప్పుకొన్న బాధలను ఇలా వేదనలుగా రూపొందించిన తరువాత పంచకోశాలను పరిశీలించడం ప్రారంభించాలి. ఈ పరిశీలన అన్నమయ కోశంతో ప్రారంభించి, ఆనందమయకోశం వరకు సాగాలి.

## అన్నమయ కోశం

రోగార్తుని దేహ స్థితి ఎలా ఉన్నది? శరీరం వయస్సుకు తగినట్లుగా ఉన్నదా లేదా?— అన్నది గమనించాలి. కొందరు మరీ సన్నగా ఉంటారు. కొందరు మరీ బొద్దుగా ఉంటారు. కొందరు ఉన్న వయస్సుకన్నా తక్కువగా కనబడతారు. కొందరు ఉన్న వయస్సుకన్నా ఎక్కువగా కనబడతారు. కొందరి దేహం ఒడలి పోతుంది. కొందరికి సడలిపోతుంది. కొందరికి బడలిపోతుంది. కొందరికి చిన్న వయస్సుననే వృద్ధాప్యం వచ్చినట్లుంటుంది. కొందరికి చిన్నతనంలోనే జుట్టు తెల్ల బడిపోతుంది. కొందరు పుట్టడమే రంగుమారి పుడతారు. కొందరికి పుట్టిన తరువాత రంగు మారుతుంది. కొందరు నల్లకప్పు వేస్తారు. కొందరికి బొల్లి మచ్చలు వస్తాయి. కొందరికి చర్మం ముందుగా ముడతలు పడుతుంది. కొందరి చర్మం తరుచుగా బ్రద్దలవుతుంది. కొందరికి కాళ్ళు, చేతులు పాసిపోతూ ఉంటాయి. కొందరికి పళ్ళు పుచ్చుతాయి. కొందరికి కనురెప్పలు ఊడిపోతాయి. కొందరికి జుట్టు ఎక్కువగా ఊడుతూ ఉంటుంది. కొందరికి రావలసిన జుట్టురాదు. కొందరికి అక్కరలేనిచోట్ల రోమాలు వస్తాయి. కొందరి జుట్టు చిక్కుపడుతుంది. కొందరికి

జుట్టు రంగు మారుతుంది. అలాగే శరీర భంగిమలు కూడా గమనించాలి. కొందరు ముందుకు వంగుతారు. కొందరు ప్రక్కకు ఒరుగుతారు. కొందరు మాట్లాడు తున్నప్పుడు చిత్రవిచిత్ర భంగిమలు పెడతారు. కొందరికి పులిపిరికాయలు, కొందరికి మొటిమలు, కొందరికి గడ్డలు, కొందరికి కురుపులు, కొందరికి ఒరుపులు ఉంటూ ఉంటాయి. కొందరు చర్మవ్యాధులు అణచిపెట్టి ఉంటారు. కొందరు మొలలు మొదలయిన వాటికి ఆపరేషను చేయించి ఉంటారు. కొందరికి బొమికలు ముందరికి పొడుచుకు వస్తాయి. కొందరికి మూడు కలవదు. మొత్తంమీద శక్తరమూ, శక్తర భాగాలు ఎలా ఉన్నదీ సావధానంగా గమనించుకోవాలి.

గోళ్ళను పరిశీలించాలి. గోళ్ళు బలహీనంగా ఉంటే గుండె బలహీనంగా ఉన్నట్లే! గోళ్ళు నీలిరంగుకు తిరిగితే గుండెలో రంధ్రమున్నట్లే! అనగా గుండెలో రంధ్రముండి మంచి రక్తము, చెడు రక్తమూ కలిసిపోతున్నదన్నమాట! అలాగే పిల్లలు ఏడ్చినప్పుడు నల్లగా మారుతున్నారనుకోండి—అర్థమిదే,! గుండెలో రంధ్ర మున్నదనే! నల్లగా కాక గోళ్ళు పచ్చగా ఉంటే, అప్పుడు కాలేయము దెబ్బ తిన్నట్టు. అంటే లివరు చెడిపోయిందన్నమాట!

అరచేతులు, అరికాళ్ళు గరుకుగా ఉన్నట్లు గమనించారనుకోండి, అతనికి కుష్టువ్యాధి స్థితి రాబోతున్నదన్నమాట! అరచేతులిలా కలిపిరాస్తే గరగరమంటాయి- మధ్యలో గండ్ర ఇసుక ఉన్నట్లుగా! అలాగే అరచేతులు, అరికాళ్ళు చెమటలు పోసేవాళ్ళుంటారు. అలా ధారాపాతంగా వాటివెంట నీరుకారే వారుంటారు. ఈ స్థితి ఏమిటో తెలియక అణచిపెట్టే ప్రయత్నంచేస్తే, తరువాత అది కుష్ఠువ్యాధి స్థితికి దారి తీస్తుంది. వీటిని సక్రమంగా నివారణ చేయవచ్చు. దారుణ వ్యాధిబాధల బారినపడ కుండా వారిని కాపాడవచ్చు. ఇలాంటి విశేషాలను కూడ గమనించుకోవాలి. అవి ఏమాత్రం ఉన్నా ఏ స్థితిలో ఉన్నదీ వివరంగా వ్రాసుకోవాలి.

## ప్రాణమయ కోశం

జీర్ణక్రియ, శ్వాసక్రియ, రక్త ప్రసరణ క్రియ, పంచేంద్రియ ప్రవృత్తులు- ప్రాణమయ కోశంలోని ప్రధాన అంశాలు.

ఆకలి, దాని వైఖరులను కనుక్కోవాలి. కొంతమందీ ఆకలికి ఆగలేరు? వారికి కొన్ని ఇబ్బందులు కలుగుతాయి. కొంతమందీ వేళతప్పి తింటే అటుపైన

తట్టుకోలేరు. కనుక రోగార్తుని ఆకలికి ఆగగలవా? ఆలస్యమైతే ఎలా ఉంటుంది? వేళ తప్పితింటే తేడా ఏమయినా చేస్తుందా? ఆకలికి తగినట్లుగా తినగలవా? ఆలస్యమైతే ఆకలి చచ్చిపోదుకదా.అప్పుడుకూడ అన్నం మామూలుగా సహిస్తుందా?ఒక వేళ ఆకలి వేసినప్పుడు ఏమీ తినడానికి వీలుపడకపోతే ఎలా ఉంటుంది? భోజనం తరువాత వెంటనే పనిచేయగలవా? పడుకోవలసిన అవసరం ఉంటుందా? మొదలయిన వివరాలన్నింటినీ అడిగి తెలుసుకోవాలి. అలాగే జీర్ణక్రియ స్థితికూడా అడగాలి. అరుగుదల ఎలా ఉంటుంది. మల విసర్జనకు సంబంధించిన ఎగుడుదిగుడులు ఏమయినా ఉన్నాయా—అన్నది అడిగి తెలుసుకోవాలి.

కొందరికి మాటిమాటికీ ఆకలి వేస్తుంటుంది. కొందరికి ఎప్పటికోగాని ఆకలి వేయదు. కొందరికి ఎంత తిన్నా ఆకలి తీరినట్లు అనిపించదు. కొందరికి తిని లేవగానే మళ్ళీ ఆకలివేస్తుంది. తినాలో తెలియదు, మానాలో తెలియదు. అది ఆకలో తెలియదు, కాదో తెలియదు. ఇలాంటి విశేషాలేమయినా ఉంటే ప్రత్యేకంగా వ్రాసుకోవాలి.

శ్వాసక్రియ ఎలా ఉన్నది? శ్వాసకోశమెలా ఉన్నది? శ్వాసక్రియలో ఎగుడుదిగుడులు లేవుకదా! ఊపిరి పీల్చడంలో గాని, ఊపిరి విడవడంలో గాని అసౌకర్యం ఏమయినా గమనింపబడితే దానిని గూర్చి వ్రాసుకోవాలి. కొందరికి మెట్లెక్కుతున్నప్పుడు శ్వాసక్రియ ఇబ్బంది పడుతుంది. కొందరికి బరువులు ఎత్తుతున్నప్పుడు శ్వాసక్రియ అసౌకర్యంగా ఉంటుంది. కొందరు మాటిమాటికీ నిట్టూర్పులు విడుస్తూ ఉంటారు. కొందరు నిద్రలో గుర్రు పెడుతూ ఉంటారు. ఈ గుర్రు మళ్ళీ రెండు విధాలు. కొందరు శ్వాస పీల్చేటప్పుడు గుర్రు పెడతారు. ఇంకొందరు శ్వాస విడిచేటప్పుడు గుర్రు పెడతారు. కొందరికి నిద్రలో భంగిమ కుదిరేటంత వరకూ శ్వాస అసౌకర్యంగా ఉంటుంది. కొందరికి పని ఉందంటే శ్వాసవేగం పెరుగుతుంది. కొందరికి పని కాకపోతే శ్వాసకు వేగం పెరుగుతుంది. కొందరు పని కాలేదు అన్నప్పుడు నిట్టూర్పులు విడుస్తూ సోలిపోతారు. ఇలాంటి విశేషాలన్నింటిని గమనించుకోవాలి.

అలాగే శ్వాసక్రియతో పాటు స్వేదక్రియను కూడా గమనించుకోవాలి. కొందరికి చెమట బాగా పడుతుంది. కొందరికి చెమట అసలు పట్టదు. జీవితకాలంలో చెమటపట్టని వారుంటారు. ఒక పదహారేళ్ళ అమ్మాయి 'మాస్టరుగారూ! నాకు ఒక సారయినా చెమట పట్టించండీ!' అని ప్రాధేయపడింది. ఆమె ఉంటున్నది విజయ

వాడ, క్లాసులు జరుగుతున్నది రేకులషెడ్డులో. ఎండతోపాటుగా రేకులూ, ఆమె కూడా వేడెక్కిపోతున్నారు. ఎంతకూ చెమట పట్టదు. శరీరం పేట్లిపోతుందేమోనని పిస్తుంది.—ఇదీ ఆమెకథ! కొందరికి పట్టవలసినదానికన్నా ఎక్కువ పడుతుంది. వారు నిరంతరం స్వేదస్నానం చేస్తూ ఉంటారు. కొందరికి కొన్ని అవయవాలకు మాత్రమే తరచు చెమట పడుతుంది. కొందరికి కొన్ని ప్రత్యేక సమయాలలో మాత్రమే చిత్రమయిన చెమట కారుతుంది. ఒకతనికి అన్నం తింటున్నప్పుడు వెన్నువెంట చెమట ఓడుతూ ఉంటుంది. ఇంకెక్కడా ఉండదు. కొందరికి పనికాకపోతే చెమట. కొందరికి ఆలస్యమవుతున్న కొద్దీ చెమట. కొందరికి కంగారుపడిన కొద్దీ చెమట. కొందరికి పెట్టిన వస్తువు కనబడకపోతే పెద్దఎత్తున చెమట కొందరికి భయంకొద్దీ చెమట. కొందరికి బాధకొద్దీ చెమట. కొందరికి నిద్రలో చెమట. నిద్రలో నిలువెల్ల చెమట.

కొందరి చెమటలు వాసనలు కొడతాయి. ఒకతని చెమట వెల్లుల్లి వాసన వేసేది. అలాగే కొందరి చెమటలు రంగులు రంగులుగా ఉంటాయి. బనీన్లపై, చొక్కాలపై రంగుల ముద్రలు పడతాయి. దేశపటాల వంటివి ముద్రింపబడుతూ ఉంటాయి. పసుపుపచ్చ, ఆకుపచ్చ, ఊదారంగు, నలుపు, ఎరుపు మొదలయిన రంగులు బట్టలపై కనబడతాయి. కొందరి చెమటలు ఈస్ట్‌మన్ కలరులో ఉంటాయి. కలగలుపు రంగులు, కలనేత రంగులు, రంగులలో రంగులు. ఇలా రంగులూ, వాసనలూ వ్యక్తమయ్యేవారుంటారు. చెమటలలో రంగులూ, వాసనలూ ఇలా వ్యక్తమవుతున్నాయి అంటే విలువయిన దేహధాతువులు అలా బయటికు తరలిపోతున్నాయన్న మాట!

కొందరి చెమటలు జిడ్డుగా ఉంటాయి. నూనెలాంటి జిడ్డు. చెమటతో కూడిన వారిదేహాన్ని నలచిన కొద్దీ మట్టి వస్తుంది. చొక్కాకాలరు తొందరగా నల్లబడిపోతుంది. ఇలాంటి విశేషాలన్నీ కూడా గమనించుకోవలసినవే!

రక్తప్రసరణ ఎలా ఉన్నది? ఆటుపోటులు ఏమయినా ఉన్నాయా? రక్తపోటులు గమనించబడ్డాయా? దీనికి సంబంధించిన పరీక్షలు ఏమయినా జరిగాయా? వాటి సూచనలు ఏమిటి? కొందరిలో హైబి.పి. ఉండవచ్చు, కొందరిలో లోబి.పి. ఉండవచ్చు. ఆ రికార్డు ఏమయినా ఉన్నదా? రక్తప్రసరణలోని ఎగుడు దిగుడులకూ, మానసికమయిన ప్రవర్తనలకూ ఉన్న సంబంధం ఎలాంటిది? ముఖ్యంగా రక్తప్రస

రణలోని ఎగుడు దిగుడుల ప్రభావం దేహంపైనా మనస్సుపైనా ఎలా కనబడు తున్నది. ఈ వివరాలను సేకరించాలి.

అలాగే మూత్రవిసర్జన క్రియ ఎలా సాగుతున్నది, దీనికి సంబంధించిన అసౌకర్యాలు ఏమయినా ఉంటే వాటిని అడిగి తెలుసుకోవాలి. కొందరికి మూత్రం ఎక్కువగా పోతూ ఉంటుంది. కొందరికిమూత్రం తక్కువగా పోతూ ఉంటుంది. కొందరు మాటిమాటికీ మూత్రవిసర్జనకు వెళుతూ ఉంటారు. కొందరు ఎప్పుడో గాని వెళ్ళరు. కొందరికి మూత్రవిసర్జన పగటిపూట ఎక్కువ. కొందరికి రాత్రిపూట ఎక్కువ. కొందరు మేల్కొన్నంత వరకూ వెళ్ళివస్తూనే ఉంటారు. కొందరు నిద్ర మధ్యమధ్యలో లేచి వెళుతూ ఉంటారు.

మూత్రానికి రంగులున్న వారుంటారు. మూత్రంద్వారా వివిధ పదార్థాలు పోతున్న వారుంటారు. మూత్రవిసర్జన సమయంలో గాని, అంతకుముందు గాని, ఆ తరువాత గాని అసౌకర్యాన్ని అనుభవిస్తున్న వారుంటారు. మూత్రానికి వెళ్ళవలసి వస్తే ఆగలేనివారుంటారు. దగ్గినా, తుమ్మినా, ఆవలించినా మూత్రం బొట్లుబొట్లుగా పడిపోయేవారుంటారు. ఆకస్మికంగా ఏదయినా ఒకవార్తను విన్నా, కాని వేళలో తలుపు చప్పుడయినా మూత్రం బొట్లుగా పడేవారుంటారు.

అలాగే రాత్రిపూట నిద్రలో ప్రక్కలుతడిపే వాళ్ళుంటారు. ఇలాంటివారు పిల్లలలో ఎక్కువమంది ఉంటారు. యుక్తవయస్సు వచ్చిన తరువాత కూడా ఇలా ఇబ్బంది పడేవారున్నారు. ఒకసారి ఒక తండ్రి తన కుమార్తెను వెంటబెట్టుకుని వచ్చాడు. నమస్కరించి, 'రక్షించాలి'—అన్నాడు. ఆ అమ్మాయికి వివాహం నిశ్చయ మైంది. ముహూర్తాలు పెట్టుకోబోతున్నారు. కాని ఆమె ఇంకా ప్రక్కను తడుపు తోంది, రాత్రికి రెండుసార్లు చొప్పున. ఇప్పటిదాకా ఏం చేస్తున్నావయ్యా!-అన్నాను. హోమియోలో ఇలాంటి అవకాశముంటుందని ఇప్పుడే తెలిసింది—అన్నాడు. సరే వీ అదృష్టమన్నాను. వైద్యం ప్రారంభమైంది. ఆమెకు గుణం కనిపించింది. వారు సంతోషించారు. నేను—'పెళ్లికొడుకు అదృష్టవంతు'డన్నాను. ఇలాంటి చిత్రమయిన విశేషాలుంటే వాటిని కూడా అడిగి వ్రాసుకోవాలి.

పంచేంద్రియ ప్రవృత్తులను గమనించాలి. కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మం—ఇవి పంచేంద్రియాలు. వీటి నిర్మాణ వైఖరులను గూర్చి ఇదివరకే మనం గమనించి ఉంటాం. ఇప్పుడు వీటి నిర్వహణలో తీరుతెన్నులను గూర్చి పరిశీలించ వలసి ఉంటుంది.

చూపు సరిగా కనపడని వారుంటారు. మసక మసకగా కనబడే వారుంటారు. పొగమంచుగా కనబడేవారుంటారు. బట్టతెరకట్టినట్లుగా కనబడేవారుంటారు. దగ్గరవి మాత్రమే చూడగలిగే వాళ్ళుంటారు. దూరానివి మాత్రమే గమనించగలిగే వాళ్ళుంటారు. రేచీకటి కలవారుంటారు. కనులముందు ఏవో ఆకారాలు మెదిలేవారుంటారు. అలలు అలలుగా, రింగులు రింగులుగా, నిప్పురవ్వలు లేచినట్లుగా, పురుగులు ఏవో ఎగిరినట్లుగా గోచరించే వారుంటారు. ఒక వస్తువును రెండు వస్తువులుగా చూచేవారుంటారు. ఇలాంటివారు సభలో ఉపన్యాసికులయితే అక్కడున్న వందమంది రెండు వందలమందిగా కనిపిస్తారు. దానితో మనస్సు సంబరపడుతుంది. కొందరికి పుస్తకం చదువుతుంటే ఒక అక్షరం మరొక అక్షరం మీదకు ఎక్కినట్లు కనపడుతుంది. ఇలాంటి పైనాలు అనేకాలు.

ముక్కును గురించి విశేషాలేమయినా ఉంటే కనుక్కోవాలి. వాసనలు అంతగా తెలియనివారున్నారు. అసలు ఏ వాసనా ముక్కుకు పట్టని వారున్నారు. మురుగుకాలవల ప్రక్కగా కూడా నిశ్చింతగా నడచి పోగలరు. ముక్కులు మూయవలసిన పనిలేదు. దూరాన ఎక్కడో ఊరవతల కుక్క చచ్చిపడి ఉంటే, ఆ వాసనను ఇక్కడనుండి అందుకొనగల ఘనులున్నారు. ఏవేవోరకాల వాసనలు అక్కడ ఏమీ లేకుండానే అనుభవానికి వచ్చే వారున్నారు. ఇలాంటి చిత్రాలు అనేకం.

చెవిని గురించి గమనించాలి. సరిగా వినబడని వారు, అతిగా వినబడేవారు, ఏమీ వినబడనివారు రకరకాలు. ఒకాయనకు చెముడుండేది. పెద్దగా మాట్లాడితే వినబడేది కాదు. రహస్యం చెప్పినట్లు చెబితే వినబడేది. కొందరికి చెవుల్లో ఏవో ధ్వనులు వినబడతాయి. టుప్ టుప్ మనే శబ్దాలు వినబడేవారు, నిరంతరం చెవిలో ఝుంకారం వినబడేవారున్నారు. ఇలాంటి విశేషాలు ఎన్నెన్నో ! ఇక చెవులనుండి చీము కారడం, దానికి రంగులూ వాసనలు ఉండటం- మొదలయిన విశేషాలుంటే వాటిని ఇప్పటికే మనం గమనించి ఉంటాం కదా! ఒకతనికి మనస్సు ఒత్తిడి ననుభవించినప్పుడల్లా చెవినుండి బొట బొటా చీము కారేది. ఇలా ఎక్కడ ఏ పైచిత్రి కనబడినా, దాని వెనకనున్న మనస్సుయొక్క పాత్రను గమనించుకొంటూ ముందుకు సాగాలి మనం.

నాలుక గురించి గమనించాలి. నాలుక ఎలావున్నది? కొంతమందికి నాలుకపై తెల్లగా ఉంటుంది. కొంతమందికి గోధుమరంగు ఉంటుంది. ఒక్కొక్కరి నాలుక పైన రంగులు రంగులుగా, పొడలు పొడలుగా ఉంటుంది. ఇలా నాలుకపైన

ఏదో ఒక కోటింగ్ వున్నవారుంటారు. నాలుక ఎంత గీసినా ఈ కోటింగ్ మిగిలి పోతూనే ఉంటుంది.

కొంతమందికి నాలుకా, నోరు వాసన కొడుతూ ఉంటాయి. నాలుక ఉబ్బి ఉంటుంది. నాలుకపై పళ్ళ గుర్తులు వున్నవాళ్లు ఉంటారు. మాట్లాడుతున్నప్పుడు నాలుక తిరగడం కష్టమవుతున్నవాళ్ళు ఉంటారు. నాలుకను మాటిమాటికీ కొరుక్కునే వారుంటారు. నాలుక బద్దలు బద్దలుగా చీలిన వారుంటారు. అదే పనిగా నోటిపూత వచ్చే వారుంటారు. నోరంతా పుళ్ళు పడిపోయేవారుంటారు. మాటిమాటికీ కొండనాలుక వాలిపోయే వారుంటారు. టాన్సిల్స్ మాటిమాటికీ వాచిపోయే వారుంటారు. నోటివెంట లాలాజలం అదేపనిగ కారేవారుంటారు. మాట్లాడుతున్నప్పుడల్లా ఉమ్ము తుంపరలతో ఎదుటివారిని ముంచెత్తేవారుంటారు.

రుచులు సరిగా తెలియని వారుంటారు. ఏది తిన్నా ఉప్పగా వుండే వారుంటారు. ఏది తిన్నా తీయగా వుండేవారుంటారు. ఏది తిన్నా ఏ రుచీ అనుభవానికి రానివారుంటారు. ఏది తింటున్నా మట్టి తింటున్నట్లే వుంది-అని చెప్పాడొకాయన. నాకు జాలివేసింది. అతడిని కూడా సరదాగా ఉంచాలని ఇలా అన్నాను-అన్నిపదార్థాలూ మట్టిలో నుండే వస్తున్నాయి కదా, మీకా మూల పదార్థమయిన మట్టిరుచే అందుతోంది, కానివ్వండి! అతడు నవ్వాడు నాకు మాత్రం అతడి స్థితి బాధ కలిగించింది. తరువాత అతడికి రుచులన్నీ తెలిసాయనుకోండి. ఇలా నానా రకాల నాలుకలు మనకు దర్శనమిస్తూ ఉంటాయి.

ఇక చరాన్ని గూర్చి పరిశీలించాలి. స్పర్శను గూర్చి అడిగి తెలుసుకోవాలి. శరీరమంతటా స్పర్శజ్ఞానం ఒకే విధంగా వున్నదీ కదా—అన్న అంశాన్ని ధృవపరచుకోవాలి. కొందరికి కొన్నిచోట్ల స్పర్శ తగ్గుతుంది. కొందరికి కొన్నిచోట్లు వుండవలసిన దానికన్నా స్పర్శ ఎక్కువగా ఉంటుంది. కొందరికి కాలివేళ్ళ గాని, చేతి వేళ్ళ గాని తరచు కొంకర్లు పోతూ ఉంటాయి. వీటినే ఈడ్పులు అని కూడా అంటారు. ఇలాంటివన్నీ గమనించుకోవాలి.

కొందరికి తరచుగా తిమ్మిర్లు వస్తూ వుంటాయి. కాసేపు ఎక్కువ కూర్చుంటే కాలు తిమ్మిరెక్కుతుంది. బండబారుతుంది. లేచి నడవడం కష్టమవుతుంది. కొంతసేపటిదాకా స్పర్శ తెలియదు. కాసేపటికి తెలుస్తుంది. ఇలా అప్పుడప్పుడూ జరుగుతూనే వుంటుంది. స్పర్శ తాత్కాలికంగా పోయి మళ్ళీ వస్తూ వుంటుంది. దీనర్థమేమిటి ? సాధ్యమైనంత త్వరలో పక్షవాతం రాబోతున్నది అన్నమాట. ఇక్కడ

సాధ్యమైనంత త్వరలో అంటే ఒక పది సంవత్సరాలు. ఈ లోపున హోమియో విధానంతో జాగ్రత్తపడితే ఏ వాతమూ వుండదు. మా ఊరిలో ఒక టూరింగ్ సినిమా హాలుండేది. సినిమా ప్రారంభం చేయడానికి ఒక పావుగంట ముందు నుండి హాలు నిర్వాహకులు ఒక పని చేసేవారు. హాలు గుమ్మాల దగ్గర వున్న లైట్లను రెండు మూడు నిముషాల కొకసారి ఆర్పుతూ, మళ్ళీ వేస్తూ వుండేవారు. ఇలా అయిదారుసార్లు చేసిన తరువాత ఇక పూర్తిగా ఆర్పేసేవారు. సినిమా ప్రారంభమయ్యేది. ఈ తిమ్మిర్లు సరిగా అలాంటివి. ప్రాణశక్తి ఆ హాలు నిర్వాహకుడి లాంటిది. తిమ్మిర్లు వచ్చిపోవడం ఆ లైట్లు ఆర్పి మళ్ళీ వేయడం లాంటిది. ఇలా చేసి చేసి ఎప్పుడో పూర్తిగా తీసివేస్తా సుమా!-అన్న హెచ్చరిక అందులో ఉన్నది. హాలు నిర్వాహకుడు ప్రేక్షకులను హెచ్చరిస్తున్నాడు. బయటనుండి లోపలికి రమ్మని- ప్రాణశక్తి మనను లోననుండి హెచ్చరిస్తున్నది. హోమియో విధానాన జాగ్రత్త పడమని! తిమ్మిరెక్కింది, ఇక తిక్కరేగేవరకూ నాన్చకండీ! అని.

ఇలా పంచేంద్రియ ప్రవృత్తులను సావధానంగా గమనించాలి. ఎగుడు దిగుడు లేమయినా వుంటే కావలసినంత వివరంగా వ్రాసుకోవాలి. అటుపైన ప్రాణశక్తి ఏమాత్రం దృఢంగా వున్నదీ గమనించాలి. వయస్సుకు తగిన శరీరమున్నదా-అని అన్నమయ కోశంలో చూశాం వయస్సుకు తగిన ఓపిక ఉన్నదా అని ఇక్కడ చూడాలి. వయస్సుకు తగిన ఓపిక వున్నదా! ఆహారాన్ని తగినంతగా స్వీకరించ గలుగుతున్నాడా ? తీసికొన్న ఆహారం ఓపికగా మారుతున్నదా? ఒడలు వంచి పని చేయగలుగుతున్నాడా? కాసేపటికే అలసిపోవడం లేదు కదా! పని పట్టుకొని సాగుతున్నాడా, పనిని పట్టుకొని వ్రేలాడుతున్నాడా? నీరసం, నిస్త్రాణ, నిట్టూర్పులు మొదలయినవి కనబడుతున్నాయా? ఒకసారి పనిలోకి దిగితే కొన్ని గంటలపాటు ఏ ధ్యాసా లేకుండా పని చేయగలడా? ఆ మాత్రం ఓపిక ఉన్నదా-మొదలయిన అంశాలన్నింటినీ గమనించుకొని వ్రాసుకోవాలి. ప్రాణశక్తికీ, దేహానికీ మధ్య నున్న పొత్తు ఎలా ఉన్నదీ గమనించుకోవాలి. ఒకవేళ తేడాలేమయినా గమనికకు వస్తే వాటిని గూర్చి కావలసినంత వివరంగా వ్రాసుకోవాలి. ఇలా శరీరం యొక్క రూపు రేఖలను గూర్చి అన్నమయ కోశంలోనూ, శరీరం యొక్క శక్తియుక్తులను గూర్చి ప్రాణమయ కోశంలోనూ మనం పరామర్శించాలి.

# మనోమయ కోశం

ఆహార స్వీకరణలో అభిరుచులు, విధి నిర్వహణంలోని విధానాలు, విశ్రాంతి విహారాల పోకడలు, దాంపత్యానుబంధంలోని మంచి చెడులు, నిద్ర — దాని తీరు తెన్నులు-వీటి పరిశీలన మనోమయకోశం క్రిందకు వస్తుంది.

## ఆహార స్వీకరణ

ఆహార స్వీకరణకు సంబంధించిన విశేషాలను పరిశీలించాలి. అందరూ ఆహారం తీసికొంటున్నా ఎవరి అలవాట్లు వాళ్ళకుంటాయి. ఎవరి అభిరుచులు వాళ్ళ కుంటాయి. ఎవరి విలక్షణత వారి కుంటుంది. కొందరు ఉప్పు బాగా తింటారు. ఇంట్లో అందరికీ సరిపోయే ఉప్పు వారికి సరిపోదు. అందుకని భోంచేసేటప్పుడు ఆ ప్రక్కన కొంచెం ఉప్పును ఉంచుకొంటారు. మధ్య మధ్యలో నంచుకుంటారు. కొందరు తీపి బాగా తింటారు. అందరకూ సరిపోయే తీపి వారికి చాలదు. మరికొంత తీయగా ఉండాలనిపిస్తుంది. కూరల్లో వాటిల్లో కూడా మరికొంత బెల్లం వేసుకోవా లనిపిస్తుంది. టిఫిన్ చేసినప్పుడల్లా పంచదార నంచుకోవాలనిపిస్తుంది. కొందరు మళ్ళీ మెత్తగా ఉండే తీపి పదార్థాలు తినరు. అంటే హల్వా మొదలయినవన్నమాట. గట్టిగా ఉండే అక్బరీలు, లడ్డూలు లాంటివి మాత్రం అదే పనిగా తింటారు. కొందరు కారం పదార్థాలే ఇష్టపడతారు. లడ్డూలు మొదలయినవి ప్రక్కవారి చేతిలో పెట్టి బూందీ, కారప్పూసలాంటివి తాము తినేస్తూ వుంటారు. కొందరికి పులుపంటే వెర్రి. అవకాశం వచ్చినప్పుడల్లా నిమ్మకాయలను డైరెక్టుగా తినేవారున్నారు. అలాగే కొందరికి వగరు ఇష్టం. మజ్జిగ కొందరు తాజాగా పోసుకుంటారు. కొందరికి అలా నచ్చదు. పులిసిన మజ్జిగ కావాలనిపిస్తుంది. తాజా మజ్జిగ చప్పగా ఉన్నట్లుంటుంది.

కాఫీ మొదలయిన పానీయాలు కొందరు మరీ వేడిగా త్రాగుతారు. కొందరు పనిపేళా చలారపెట్టుకొని మరీ త్రాగుతారు. కొందరికి బిందెలో మంచినీళ్ళు త్రాగినా బాగానే ఉంటుంది. కొందరికి కుండలో మంచినీళ్ళే కావాలి. బిందెలోనివి త్రాగితే వారికి దప్పిక తీరినట్లుండదు. ఇంకొందరికి ఇంకా చల్లగా ఉండాలి. ఎంత చల్లగా ఉంటే అంత ఇష్టపడతారు. కొందరు మంచినీళ్ళు అదేపనిగా త్రాగుతారు. కొందరు కావలసిన మాత్రము కూడ త్రాగరు. కాబట్టి వారికి దాహము ఎక్కువా? తక్కువా? అది ఎలాంటి దాహము అన్నది మనకు స్పష్టం కావాలి.

ఆహార పదార్థాలు వేడివేడిగా ఉండాలి కొందరికి. ఎంత నిలవవుంటే అంత బాగుంటుంది కొందరికి. కొందరు భోజనం వేగంగా చేస్తారు. కొందరు తీరికగా చేస్తారు. కొందరు భోంచేసేటప్పుడు మాట్లాడరు. కొందరు అప్పుడే మాట్లాడతారు. కొందరు పరధ్యానంగా తింటారు. కొందరు మనస్సంతా పెట్టి లొట్టలు వేస్తూ తింటారు. కొందరు రుచులను పట్టించుకోరు. కొందరు రుచులను గూర్చి చర్చిస్తారు. కొందరికి అన్నం మెత్తగా వుండాలి, కొందరికి బిరుసుగా వుండాలి. కొందరికి మెకుల్లా వుండాలి.

కొందరికి కొన్ని కొన్ని ఆహార పదార్థాలంటే బాగా ఇష్టముంటుంది, వాటిని బాగా తింటారు కూడా! అలా కాకుండా కొందరికి కొన్ని కొన్ని ఆహార పదార్థాలంటే విపరీతమైన కోరిక ఉంటుంది. వాటిని తింటేనే గాని ఉండలేరు. కాని తింటేనేమో సరిపడదు. తేడా చేస్తుంది. కాని తింటారు. కొందరికి పులిహోర అంటే వెర్రి ఇష్టం. తింటే తేడా చేస్తుంది. కడుపు నొప్పి, విరేచనాలు వస్తాయి. మర్నాడుఉశలవుపెట్టవలసి వస్తుంది. కొందరికి గోంగూర పచ్చడి అంటే వెర్రి మమకారం. తింటే తెల్లారే పాటికి నడుం పట్టేస్తుంది.

కావాలనుకోవడం రెండు విధాలు. మొదటిది ఇష్టపడటం, రెండవది కాంక్షించడం. ఇష్టానికీ, కాంక్షకూ తేడా ఉంది. ఇష్టమంటే ఏమిటి? కావాలని కోరుకొంటారు. లభిస్తే సంతోషిస్తారు. కాంక్ష అంటే ఏమిట? లేనిదే ఉండలేరు. దొరికే వరకూ నిద్రపోరు. ఆ అనుభవం అందేవరకూ వారి ఆత్రం తీరదు. కనుక మన దగ్గరకు వచ్చిన వారికి ఆహార స్వీకరణ విషయంలో ఇష్టాలు ఉన్నాయా, కాంక్షలు ఉన్నాయా అన్నది గమనించుకోవాలి. ఇక్కడొక చిత్రముంది. ఇష్టము అనే స్థితిలో ఉన్నది ఇముడుతుంది. కాంక్ష అనే స్థితికి వచ్చేసరికి ఇక ఇమడదు. సరిపడదు. ఇబ్బంది పెడుతుంది పడగొడుతుంది. కాంక్ష ఉన్నవాడు దానిని నిలుపుకోలేడు. అరిగించుకోలేడు.

కొందరు కొన్ని పదార్థాలను అసలు ఇష్టపడరు. కొందరు పాలు త్రాగరు. కొందరు పాలకు సంబంధించిన ఏ పదార్థాలూ తినరు. కొందరు చిలకడదుంప తినరు. కొందరు ములగకాడ ముట్టరు. కొందరు బంగాళాదుంపను బరిలోనికి రానివ్వరు. ఇలాంటప్పుడు ఒకటి అడగాలి. ఒకవేళ ఆ ఇష్టపడనివి తిన్నారు అనుకోండి, ఎవరయినా మిమ్మల్ని మొహమాటబెట్టి తినిపించారూ అనుకోండి, అప్పుడేమవుతుంది? ఎలాంటి తేడా మీలో వస్తుంది. అని అడిగి తెలుసుకోవాలి.

మనస్సు ఆహార స్వీకరణకు ఎలాంటి స్థానాన్ని ఇస్తున్నదీ-అన్నది తెలుసుకోవాలి. కొందరు 'కోటి విద్యలు కూటి కొరకే' అంటారు. అంటే ఆహార స్వీకరణను గమ్యంగా భావించారన్నమాట! కొందరు తిన్నది ఎవరు చూశారు, కట్టింది చూస్తారు గాని, అంటారు. అంటే ఆహార స్వీకరణ అంత ప్రధానం కాదు అన్నమాట. కొందరు-పనిలో ఉంటే నాకు ఆకలి కూడా తెలియదు అంటారు. దానిని పట్టించుకోను అంటారు. అంటే ఆహార స్వీకరణను నిర్లక్ష్యం చేస్తున్నారన్నమాట! కొందరు అవకాశమొచ్చినప్పుడల్లా వివిధ వంటకాలను గూర్చి వివరిస్తూ ఉంటారు. ఫలానప్పుడు ఫలానావిడ గోంగూర పచ్చడి చేసింది. పచ్చడి అంటే అదీ—అంటూ మరోసారి లొట్టలు వేస్తారు. గుత్తి వంకాయ కూర అంటే అసలు ఎలా వండాలో నీకు తెలుసా అంటూ పాఠం మొదలు పెడతారు. ఇలా వారి మనస్సు ఎంతసేపూ కూడా ఆహార స్వీకరణ చుట్టూనే తిరుగుతూ ఉంటుంది. ఇలాంటి వివరాలన్నీ కూడా స్వీకరించాలి.

## విధి నిర్వహణ

విధి నిర్వహణను గురించి ఇక గమనించాలి. చేస్తున్న పని ఏమిటి ? అది ఈ వ్యక్తి యొక్క జీవ లక్షణానికి తగినదేనా ? పని చేస్తున్నది ఎక్కడ ? అది ఈ వ్యక్తికి అనువైన వాతావరణమేనా? పని వేళలు ఏమిటి ? సహజమయిన వేనా?-మొదలయిన అంశాలను అడిగి తెలుసుకోవాలి. కొంతమంది షిప్టు డ్యూటీలలో పని చేస్తుంటారు. దానితో ఆహార విహారాలు దారి తప్పుతూ ఉంటాయి. కొంతమంది కలుషిత వాతావరణంలో పనిచేస్తూ ఉంటారు. దానితో మందులు కూడా పని చేయలేని స్థితి ఏర్పడవచ్చు. కొంతమంది అసహజమయిన వాతావరణంలో పని చేస్తారు. ఉదాహరణకు ఎ. సి. గదిలోనుండి మామూలు గదిలోనికి మాటిమాటికి తిరుగుతూ వుంటారు. దానితో శరీర కోశాలు దద్దరిల్లుతాయి. అలాగే కొంతమందికి క్రింది ఉద్యోగస్తులు మాట వినరు.కొంతమందిని పై ఉద్యోగస్తులు బ్రతకనియ్యరు. దీనితో మనస్సు కలత పడుతుంది. స్వస్థత చెదిరిపోతుంది. ఇలాంటి సంగతులన్నీ రాబట్టుకోవాలి.

## ఏమనుకొని

కొంతమంది సంతోషపడుతూ పని చేస్తారు- కొంతమంది ఇది మన బాధ్యత అనుకొని పని చేస్తారు. కొంతమంది ఇది మనకు దించుకొనవలసిన బరువు-అనుకొంటూ పని చేస్తారు. కొంతమంది చేయక తప్పదు కదా, బండి నడవాలి కదా-

అని చెప్పి పని చేస్తారు. ఇంతకూ మన దగ్గరకు వచ్చిన రోగార్తుడు ఏ స్థితిలో పని చేస్తున్నాడు ? చేస్తున్న పని అతనికి సంతోషమా, బాధ్యతా, బరువా,తప్పనిసరియా? —గమనించుకోవాలి.

### ఎలా చేస్తున్నారు

కొందరు అశ్రద్ధగా పని చేస్తారు. అశ్రద్ధ అంటే ఏమిటి?చేద్దాంలే, అదే అవుతుందిలే, కాకపోతుందా, అప్పుడే చూద్దాము-అనిపించడం. కొంతమంది నిర్లక్ష్యంగా పని చేస్తారు. నిర్లక్ష్యమంటే ఏమిటి ? చేసేదేమిటిలే, అయినప్పటికే అవుతుందిలే, కాకపోతే మాత్రం ఇప్పుడేమిటిలే మనకిదొక్కటే పనా, — ఇలా అనిపించడం. కొంతమంది పని చేస్తూ ఒత్తిడి ననుభవిస్తారు. ఒత్తిడి అంటే ఏమిటి? పని అయిపోవాలి. అనుకొన్న సమయంలో పూర్తి చేయాలి. సమయం తక్కువగా ఉన్నది. లేదా ఈ అవకాశం మరల రాదు-అన్న భావనలతో మనస్సు మధనపడుతున్న స్థితి. అయిపోవాలి, అయిపోవాలి, ఎలాగయినా అయిపోవాలి. అన్న ఒత్తిడి ఇక్కడ ఉంటుంది. కొంతమంది కంగారుపడుతూ పని చేస్తారు. పని అవుతుందా, కాదా, చేయగలమా లేదా, మాట దక్కుతుందా, లేదా మొదలయిన భావనల మధ్య నుండి వ్యక్తమయ్యేదే కంగారు. ఈ కంగారులో కొంత భయంపాలు కూడా కలసి ఉంటుంది. కొంతమంది హడావిడి పడుతూ పనిచేస్తారు. ఇదేమిటి, అదేమిటి, ఇదేమయింది, అదేమయింది అంటూ నిలకడ లేని స్థితిని అనుభవిస్తారు. తాము ఇబ్బంది పడతారు.తోటివారిని ఇబ్బంది పెడతారు. ఇంతకూ మన దగ్గిరకు వచ్చిన రోగార్తుడు విధినిర్వహణలో దేనిని వ్యక్తం చేస్తున్నాడు. అశ్రద్ధా,నిర్లక్ష్యమా,ఒత్తిడా,కంగారా, హడావిడా, లేక ఇవేమీ లేకుండా హాయిగా, ఉల్లాసంగా పని చేయగలుగుతున్నాడా!- గమనించగలగాలి.

### ప్రేరణ

సాధారణంగా చేస్తున్న పని వెనుక ఏదో ఒక ప్రేరణ ఉంటుంది. కొందరు ఆశపడుతూ పనిచేస్తారు. నేను ఈ పిల్లవాణ్ణి పెంచుతున్నాను, వీడు పెరిగి పెద్దయి నన్ను చూస్తాడు అనుకుంటారు-ఇది ఆశ. కొందరు కోరికతో పనిచేస్తారు. ఒకతను నా జీవిత కాలంలో నలభై ఎకరాలు సంపాయించాలి. అందుకే ఈ శ్రమంతా!' అన్నాడు ఇది కోరిక. కొందరు పగతో పనిచేస్తారు. 'వాడి అంతుచూడాలి. అంత వరకూ నాకు విశ్రాంతిలేదు' అంటారు- ఇది పగ. కొందరు భయంతో పనిచేస్తారు.

'పడే శ్రమేదో ఇప్పుడే పడాలి. పదేళ్ళ తరువాత నేను పడగలనో లేదో, అప్పటి పరిస్థితులెలా ఉంటాయో !'- అంటారు-ఇది భయం. కొందరు బాధతో పనిచేస్తారు. 'ఆయన అకాలంగా శరీరం విడిచిపెట్టారు. ఈ పిల్లలతో నేను ఇలా మిగిలాను. లాగలేక లాగలేక ఈ బండిని లాగుతున్నాను'-అంటారు-ఇది బాధ. కొందరు పోటీపడి పనిచేస్తారు. ఎలాగయినా ఎదుటివాడిని మించిపోవాలి. అని పెద్దఎత్తున సాహసిస్తారు-ఇది పోటీ. కొందరు అసూయతో పనిచేస్తారు. 'వాడేనా కారుకొనేది. నేనామాత్రం కొనలేనా, తనకే ఉన్నట్లు నా ముందర కారువేసికొని వెళతాడా!'- అంటూ పిడికిలి బిగిస్తారు- ఇది అసూయ. కొందరు అహంకారంతో పనిచేస్తారు. 'ఈ ఊరిలో నన్ను మించిన వాడులేడు, ఉండకూడదు. నేనందరికన్నా ఎప్పుడూ పైనే ఉండాలి! ఎప్పుడూ నాదే పైచేయి కావాలి'-అంటూ శ్రమిస్తారు-ఇది అహంకారం. కొందరు అలవాటుగా పనిచేస్తారు. ఇలా చేయటం అలవాటైంది. ఆలా చేస్తున్నాం, అంతే,అంతకంటే పెద్ద విశేషం ఏమీలేదు. 'ఉద్దేశాలూలేవు, ఆశయాలూ లేవు'-అంటారు. ఇది అలవాటు. ఇంతకూ మనదగ్గరకొచ్చిన రోగార్తుడు ఏ ప్రేరణతో పనిచేస్తున్నాడు, ఆశా, కోరికా, పగా, భయమా, బాధా, పోటీనా, అసూయా, అహంకారమా, అలవాటా—గమనించుకోవాలి. స్వస్థతలో ఉన్నవాడికి ఈ ప్రేరణలేవీ ఉండవు. అతడు పనిచేయటానికి ప్రేరణ అక్కరలేదు. అది అతడి నుండి అప్రయత్నంగా సాగిపోతూ ఉంటుంది. పని మనవలన జరగడంలేదు, మన ద్వారా జరుగుతున్నది-అని అతనికి తెలుస్తుంది. నిమిత్తమాత్రంగా నిలబడగలగటమే ఒక తపస్సు - అని అతనికి బోధపడుతుంది. నిమిత్తమాత్రం అంటే నిర్లక్ష్యం మాత్రం కాదు. పనికి తగ్గట్టుగా ఎక్కువా కాకుండా తక్కువా కాకుండా ఒదిగి సర్వ సన్నద్ధతతో నిలబడగలగటం! అలాకాక ఏవిధమయిన ప్రేరణను మనస్సు అపేక్షించినా అది అస్వస్థతే అవుతుంది.

## ఉద్దీపన

పనిచేస్తున్నవాడు సర్వ సాధారణంగా ఏదో ఒక ఉద్దీపనాన్ని కోరుతూ ఉంటాడు. కొంతమంది ప్రాణంమీదికొస్తే తప్ప పనిచేయరు. ఆ చుట్టూ ఉన్నవాళ్ల అంత ఒత్తిడి తేగలగాలన్నమాట. అప్పుడు ఆ ఒత్తిడి ఉద్దీపనగా రూపొంది, వారిక పనిచేస్తారు. కొంతమంది తమకు ఇష్టులయినవారు తమతో ఉన్నప్పుడు మాత్రమే పనిచేస్తారు. లేనప్పుడలా పడిఉంటారు. ఇక్కడ వీరికి స్నేహమే ఉద్దీపన అవుతుంది. వీరితో పనున్నవారుకూడా, వీరి దగ్గరికి రాకుండా వీరి స్నేహి

ని దగ్గరికి పోతారు. 'అయ్యా! మీరు రావాలండీ, మీరు వచ్చి అక్కడ నిలబడితే, యన మాకు పనిచేసిపెడతాడు' అంటారు. కొంతమంది డబ్బులున్నంతవరకూ నిచేయరు, డబ్బులిక అయిపోయినాయి, డబ్బులొస్తేనే బండినడుస్తుందిక-అన్న తి వచ్చినప్పుడు చకచకా పనిచేస్తారు. మళ్లీ ఆ నాలుగు డబ్బులూ చేత పడగానే న్నాళ్ళపాటు పనిచేయరు. అలాంటివాళ్లు మనకు పనిచేసిపెట్టాలీ అంటే, వాళ్ళు ంచి డబ్బు అవసరంలో ఉన్నప్పుడు మనం వెళ్ళాలి. ఇక్కడ వీరికి డబ్బు వసరమే ఉద్దీపనగా పనిచేస్తుంది. కొంతమంది వారికి నచ్చిన వస్తువులు ఎవరం స్తే వారికి పనిచేసిపెడతారు. ఒక ప్రొఫెసర్‌గారు విద్యార్థి తీసుకువచ్చిన గుంటూరు ోగాకుకు సంతోషించి, అతడొక్కణ్ణే కూర్చోబెట్టి పనివేళా పాఠాలు చెప్పాడు. ొగాకునుండి లభించిన ఉద్దీపనమది. అలాగే కొందరు బందరు లడ్డూలకు, కొందరు ాకినాడ కాజాలకు, కొందరు పుల్లారెడ్డి స్వీట్స్‌కు వశులయి, పరవశులయి పనిచేసి ెట్టేస్తుంటారు. ఇక్కడ ఈ వస్తువులు ఇస్తున్న ఉద్దీపన ఉన్నదే అది వారికి మరొక ిధంగా లభించదు. బందరు లడ్డూలకు బదులు బండెడు డబ్బులిచ్చినా అతడు పని ేయడు. వస్తువుమీద ఉన్న భ్రాంతి అలాంటిది! కొందరికి వస్తువులు లాభంలేదు. ాళ్లు నాకేమిటి? అని అడుగుతారు. చేతిలో డబ్బు పడితేనే చేతలలోనికి దిగుతారు. ప్పటివరకూ అలాగే ఉంటారు. వాళ్ళకేమయినా వస్తువులు ఈయబోయినా 'ఇవన్నీ ాకెందుకయ్యా!, వీటి బదులుకూడా డబ్బే ఇవ్వు' అని అడుగుతారు—వాళ్ళకు డబ్బే ద్దీపనం. అలాగే కొందరికి ధూమపానం ఉద్దీపనం. ప్రక్కకు పిలిచి సిగిరెట్ ేతిలో పెట్టేస్తే పనిచేసి పెట్టేస్తారు. అందునా వారిబ్రాండ్ ఏదో తెలిసికొని ఇచ్చా నుకోండి, ఇక చెప్పక్కరలేదు. అలాగే కొందరికి కాఫీ, టీలు కొందరికి మద్య ానం ఉద్దీపనం. కొందరికి స్త్రీలోలత ఉద్దీపన-ఇవన్నీ కూడా వ్యసనపరమైన ఉద్దీ నలు-ఇలాకాక కొందరికి ఇష్టదైవం ఉద్దీపనగా పనిచేస్తాడు. మేమూ వారిశిష్యులమే ండీ!-అని అనగానే మన స్వామికే వీరు నమస్కరిస్తున్నారన్నమాట అని మురిసి ోయి, పనిచేసిపెట్టే వారుంటారు. ఇదీ గమనించి, ఆ పేరుచెప్పుకొని వీరిదగ్గర పని ేయించుకొనేవారు తయారవుతారు. కొందరు తమను పొగిడితేచాలు పనిచేసి పెడ తారు. వారికి ఇంకేమీ అక్కరలేదు. కొందరు గుర్తింపు కోరుతారు. వారిస్థాయిని గుర్తించాలీ అని అభిలషిస్తారు. అవతలివాడు గుర్తించినట్లుంటే చాలు. పనిచేసి పెట్టేస్తారు. కొందరు పద్ధతిని కోరుతారు. అవతలివాడు పద్ధతిగా ఉంటేచాలు పని చేసి పెడతారు. కొందరు ప్రోత్సాహాన్ని కోరుతారు. అవతలివారు తమను ప్రోత్స హిస్తేచాలు. పనిచేసిపెడతారు. కొందరు ఓదార్పును కోరుతారు, లాలనను అపేక్షి

స్తారు. అవి లభిస్తేచాలు పనిచేసిపెడతారు. కొందరు, ఎదుటివాడు తమ కులమయితే చాలు ఉద్దీపన చెందుతారు. మంచీ చెడూ చూసుకోకుండా పనిచేసి పెడతారు. అలాగే కొందరు మతాన్నిబట్టీ, కొందరు వర్గాన్నిబట్టీ, కొందరు పార్టీని బట్టీ, కొందరు దేశాన్నిబట్టీ ఉద్దీపన చెందుతారు. ఇలా ఇన్నిరకాల ఉద్దీపనలు అందుతూ ఉంటాయి, కావలసినవారికి కావలసిన విధంగా! ఇంతకూ మన రోగార్తు డెక్కడున్నాడు? అత డెలాంటి ఉద్దీపనను కోరుతున్నాడు?-అదీ మనకు కావాలి. ఆ ఉద్దీపనంలోని ఔచిత్య మేమిటో,అనౌచిత్యమేమిటో మనం గమనించుకోగలగాలి. స్వస్థతలో నున్న వానికి ధర్మమే ఉద్దీపనం. ధర్మ నిర్వహణమే అతని ఆశయం. ఇవికాక ఇంకేవిధమయిన ఉద్దీపన అవసరమయినా, అది ఆ మేరకు అస్వస్థత అవుతుంది.

## ఫలితంపైన

ఫలితాన్నిగూర్చి మనస్సు ఎలా స్పందిస్తుంది?-ఇది గమనించాలి. కొందరు పని ప్రారంభించకుండానే ఫలితాన్నిగూర్చి అదేపనిగా ఆలోచిస్తారు. కొందరు పని చేస్తున్నంతసేపూ ఫలితాన్ని గూర్చి ఆలోచిస్తూనే ఉంటారు. కొందరు పనిపూర్తి చేసి ఫలితంకొరకు నిరీక్షిస్తుంటారు. కొందరు ఫలితాన్నిగూర్చి కలుగుతున్న ఉద్వేగంలోపడి పని చెడగొట్టుకొంటారు. కొందరు ఫలితాన్ని నిర్లక్ష్యం చేస్తారు-ఇవన్నీకూడా అస్వస్థతలోని భాగాలే! మన రోగార్తుడు ఈ స్థితులలో దేనికి చెంది ఉన్నాడు?-గమనించాలి. స్వస్థతలో నున్నవాడు పనిపైన శ్రద్ధను పెడతాడు. వచ్చిన ఫలితాన్ని వచ్చినట్లుగా స్వీకరిస్తాడు. మంచి చెడులను సరిజూచుకొంటాడు. పని తరువాత పనిని చేసుకొంటూ వెళ్ళిపోతాడు. అతడి దృష్టి అంతా పనిపైననే ఉంటుంది. మరి మన రోగార్తుడు ఎలా ఉన్నాడు?-గమనించండి.

## మధ్యలో

అయిపోతుందనుకొన్నపని వాయిదా పడితే ఎలా ఉంటుంది! జరుగుతున్న పనికి మధ్యలో విఘ్నం వస్తే ఎలా ఉంటుంది? ఇవ్వాల్టితో అయిపోతుందనుకొన్న పని రేపటికికూడా మిగిలితే ఎలా ఉంటుంది? పని అనుకొన్నట్లుగా కాకపోతే ఎలా ఉంటుంది? చేస్తున్నపనికి నలుగురూ కలసిరానివేళ ఏమనిపిస్తుంది? నలుగురూ తరలి వచ్చిన తరువాత, తాను పనికి సిద్ధంకాలేకపోతే ఏమనిపిస్తుంది? ఈ స్పందనలన్నీ రోగార్తుని నుండి గమనించాలి,

చిన్న చూపులు

ఎదుటివారు చిన్నచూపుచూస్తే ఏమనిపిస్తుంది! తనను పట్టించుకోకపోతే ఏమనిపిస్తుంది? తనను పూనుకొని అవమానిస్తే ఏమనిపిస్తుంది?

ఎవరయినా పరుషంగా మాట్లాడితే ఏమనిపిస్తుంది. దగ్గరవారు అలా మాట్లాడితే ఏమనిపిస్తుంది. దూరం వారు అలా మాట్లాడితే ఏమనిపిస్తుంది. ఒంటరిగానున్నప్పుడు అలా మాట్లాడితే ఏమనిపిస్తుంది. తెలిసిన వారి మధ్య అలా మాట్లాడితే ఏమనిపిస్తుంది. క్రొత్తవాళ్ళ మధ్య ఉన్నప్పుడు అలా మాట్లాడితే ఏమనిపిస్తుంది, తప్పుతనది ఉన్నప్పుడు ఏమనిపిస్తుంది, తప్పు తనది లేనప్పుడు ఏమనిపిస్తుంది!— ఈ వివరం కావాలి.

ఎవరో, ఎక్కడో కానిమాటలు అన్నారని తెలిస్తే ఏమనిపిస్తుంది? అపవాదులు వచ్చినప్పుడు ఏమనిపిస్తుంది, అభాండాలు వేయబడినప్పుడు ఏమనిపిస్తుంది? దుష్ప్రచారాలు సాగితే ఏం చేయాలనిపిస్తుంది. ఎదుటివాడు నటిస్తుంటే ఏమనిపిస్తుంది? ముందొకమాట, వెనకొకమాట మాట్లాడుతుంటే ఏమనిపిస్తుంది!— ఈ వివరం **కావాలి.**

కోపతాపాలు

కోపతాపాలు ఉన్నాయా? ఉంటే అవి ఎలాంటప్పుడు వ్యక్తమవుతాయి, ఎలా వ్యక్తమవుతాయి?—ఇవి కావాలి! కోపతాపాలు ఉన్నవారు నలుగురు ఉన్నారనుకోండి, వారు నలుగురూ కోపస్వభావులే కావచ్చు. కాని వారికి కోపం ఎప్పుడు వస్తుంది, ఎక్కడ వస్తుంది-అన్నచోట వారు విడిపోతారు. ఒకరికి ఎదురు చెబితే కోపం వస్తుంది. ఒకరికి లేనిమాట అంటే కోపం వస్తుంది. ఒకరికి తనను పట్టించుకోకపోతే కోపం వస్తుంది. ఒకరికి జేబులో డబ్బులు అయిపోతే కోపం వస్తుంది. ఇలా ఎవరి కోపం వారిది! అలాగే కోపాన్ని వ్యక్తీకరించడంలో కూడా ఎవరివైఖరి వారికుంటుంది. ఒకరు కోపం వస్తే పరుషంగా మాట్లాడతారు. ఒకరు కోపం వస్తే అరుస్తారు గాని, అందులో పరుషవాక్కు ఉండదు. గొంతు పెరుగుతుంది అంతే! ఒకరు కోపం వస్తే మౌనమయిపోతారు. ఒకరు కోపమొస్తే అలా బయటకు వెళ్లిపోతారు. ఇలా ఎవరి వ్యక్తీకరణ వారికి ఉంటుంది. మనం మాత్రం వీరందరినీ కోప స్వభావులనే అంటాం. ఇది లోకువగా అనేమాట. ఎవరిని వారిని విడివిడిగా చూడవలసిందే! ఇంతకూ మన చెంతకు వచ్చిన రోగార్తుని యొక్క కోపతాపాల వైఖరి ఎట్టిది, వాటిని గమనించుకొని వ్రాసుకోవాలి,

ఆపేక్షలు - అనురాగాలు

ఆపేక్షలూ, అనురాగాలూ ఎలా వ్యక్తం చేస్తారు? కొందరికి ఆపేక్ష లుంటాయి. కాని ఉన్నట్లు కనబడరు. కొందరు ఆపేక్షలను మాటలలో చూపిస్తారు. చేతల దగ్గర తప్పుకొంటారు. కొందరు మాటలలో దొరకరు, చేతలలో నిలబడ తారు. కొందరెప్పుడూ కేకలేస్తున్నట్టే ఉంటారు. కాని ప్రాణానికి ప్రాణం పెడతారు. కొందరు తమ అనురాగాన్ని నాజూకుగా వ్యక్తంచేస్తారు. మృదువుగా, సున్నితంగా, పువ్వులా ప్రవర్తిస్తారు. ఎదుటివారిని కూడా నలగకుండా చూచుకొంటారు. కొందరు ఆపేక్షలను మోటుగా వ్యక్తం చేస్తారు. హింసాయుతమయిన ఆపేక్షను ప్రదర్శిస్తారు. ఒకతను ఆపేక్ష పొందినప్పుడల్లా స్నేహితుని వీపుపైన ఒక్క చరుపు చరిచేవాడు. ఒకామె ముద్దు పొంగుకొచ్చినప్పుడల్లా పిల్లవాణ్ణి పీకి పాకం పట్టేది. ఇలా ఎన్నో రకాల వ్యక్తీకరణలు! వీటిలో మన రోగార్తుడు ఎక్కడ ఉన్నాడు! గమనించి వ్రాసుకోవాలి. ఆపేక్షలు అందరికీ ఉన్నా వ్యక్తీకరణలో ఎవరి తరహా వారిది. మనకు ఆ తరహా కావాలి.

భయాలు - అనుమానాలు

భయాలు ఏమయినా ఉన్నాయా: గమనించాలి. కొందరికి మృత్యువు ముంచు కొస్తుందేమోనన్న భయం వెన్నాడుతుంది. ఒకసారి ఒక యువకుడు నా దగ్గరకు వచ్చాడు. అక్కడికీ సందు దొరకని పనులు పెట్టుకొన్నాడు. అయితేనేం! సందులో సందు చూసుకొని, మృత్యువు అతడికి గోచరిస్తోంది. భయం వెన్నాడుతోంది. క్రమంగా అతడు చిక్కి శల్యమయిపోతున్నాడు. ఆ స్థితిలో అతడు మన దగ్గరకు వచ్చాడు. మందు పడింది. దట్టాగా ఉన్నాడు. మృత్యువూ లేదు, వెన్నాడడమూ లేదు. అలాగే పిల్లకు పెళ్ళి చేయలేనేమోననే భయం. పిల్లలను స్థిరపరచలేనేమో ననే భయం. ఒకవేళ నేను చనిపోతే ఈ కుటుంబ సభ్యులందరూ ఏమయిపోతారో ననే భయం! ఇలా ఎన్నో రకాల భయాలు! మన చెంతకు వచ్చిన రోగార్తునికి ఈ భయస్థితులేమయినా ఉన్నాయేమో గమనించాలి.

అనుమానాలేమయినా ఉన్నాయా? ఒకావిడకు తనపైన అత్తగారు చేతబడి చేసిందని అనుమానం. ఒక యువకునికి దయ్యమొకటి వెన్నాడుతున్నదని అను మానం. ఒక గృహస్థునికి తన ఇంటిక్రింద ఆ భూమిలో ఎముకలు ఉన్నాయని అనుమానం. ఒక పెద్దాయనకు ఏదో ఒక పెద్ద వ్యాధి తనకు రాబోతున్నదని అను మానం—ఇలా ఎన్నో రకాల అనుమానాలు! మన చెంతకు వచ్చిన రోగార్తునికి ఇటు వంటి అనుమానస్థితులు ఏమయినా ఉన్నాయా-అన్నది గమనించుకోవాలి,

### నమ్మకాలు - విశ్వాసాలు

నమ్మకాలు ఏమయినా ఉన్నాయా! కొందరకు శకునాలు అంటే ఎనలేని నమ్మకం. కొందరకు శకునాలనేవి లేవు అనేది నమ్మకం. కొందరికి దయ్యాలున్నాయని ఒక నమ్మకం, దయ్యాలు లేవు అని కొందరి నమ్మకం. ఆచారాలన్నీ మంచివి అని కొందరి నమ్మకం. ఇవన్నీ మూఢ విశ్వాసాలు అని కొందరి నమ్మకం-ఇలా ఇవన్నీ నమ్మకాలే! అవునన్నా నమ్మకమే, కాదన్నా నమ్మకమే! ఏదో ఒక నమ్మకం మనిషికి ఉంటూనే ఉంటుంది. కొందరికి ఫలానా వారు దేవుడు అని నమ్మకం. కొందరికి కాదు అని నమ్మకం. కొందరికి వారం వారం ఆంజనేయుడు తమ మీదకు వస్తాడని ఒక నమ్మకం, ఇదంతా బూటకమని కొందరి నమ్మకం—ఇలా రకరకాల నమ్మకాలతో నరులు నడుస్తూ ఉంటారు. మన చెంతకు వచ్చిన రోగార్తునికి ఎలాంటి నమ్మకమున్నదో తెలిసికోవడం అవసరం!

### ఆశలూ - ఆశయాలు

ఆశలూ, ఆశయాలూ ఎలాంటివి! ప్రతివారికీ కొన్ని ఆశలూ, ఆశయాలూ ఉంటాయి. ఇంతకూ ఆశకూ, ఆశయానికీ తేడా ఏమిటి? మనకు మాత్రమే చెందినదయితే అది ఆశ. పదిమందికీ చెందినదయితే అది ఆశయం. మన చెంతకు వచ్చిన రోగార్తుడు ఆశల స్థాయిలోనే ఉన్నాడా? ఆశయాల స్థాయిలో ఉన్నాడా? ఎలాంటి స్థితిలో ఉన్నాడు. ఎలాంటి ఆశలూ, ఆశయాలూ కలిగి ఉన్నాడు? ఇంతకూ అతనిది ఆశావాదమా? నిరాశా వాదమా? భవిష్యత్తు బాగుంటుందంటున్నాడా? ఇంకా భవిష్యత్తేమిటండీ-అంటున్నాడా? భవిష్యత్తును గూర్చిన అతని ఆలోచనలు ఎలా సాగుతున్నాయి? ఆ ఆలోచనల స్వరూపమేమిటి, స్వభావమేమిటి?-ఇదంతా కావాలి.

### విశ్రాంతిలో

కాస్తంత ఖాళీ దొరికినప్పుడు మనస్సు దేనిని గూర్చి ఆలోచిస్తున్నది? కొందరు సమయం చిక్కగానే గతం లోనికి వెళ్లి పోతారు. కొందరు భవిష్యత్తును గూర్చి ఊహిస్తూ ఉంటారు. కొందరు వర్తమానాన్ని గూర్చి మథనపడుతూ ఉంటారు. ఆ ఆలోచన, ఆ ఊహ, ఆ మథనం ఎలా సాగుతున్నది? దాని వైఖరి ఏమిటి?-అన్నది మనకు కావాలి.

### బాధలో

ఏదయినా బాధ కలిగినప్పుడు కొందరు తమలో తామే బాధపడతారు. కొందరు బయటకు చెప్పుకొంటారు. కొందరు తమచే ఎంపిక చేసికోబడిన కొద్ది

మందికి మాత్రమే చెబుతారు. కొందరు బయటపడరు. కొందరు బయటపడతారు. కొందరు బయటపడటానికి ఇష్టపడరు. కొందరు గుట్టుగా ఉంటారు.కొందరు రోడ్డున పడతారు. ఇలాంటి వైఖరులను కూడ గమనించాలి.

### షోకడ

కొందరు ఊరికే బాధపడిపోతారు. కొందరు దేనికయినా తట్టుకొంటారు. కొందరు ఊరికే చిరాకు పడతారు. కొందరు అన్నిటినీ కడుపులో పెట్టుకొంటారు. కొందరు మరచిపోతారు. కొందరు మరచిపోరు. కొందరు క్షమిస్తారు. కొందరు క్షమించరు. కొందరు పట్టుకొని వ్రేలాడుతారు. కొందరు కాలానికి వదిలేస్తారు. కొందరికి ఓర్పు ఉంటుంది. కొందరికి ఉండదు. కొందరికి నేర్పు ఉంటుంది. కొందరికి ఉండదు. కొందరు శ్రద్ధ పెట్టగలరు. కొందరు శ్రద్ధ పెట్టలేరు.-ఇలాంటి అంశాలన్నిటినీ గమనించుకోవాలి. ఇంతకూ రోగార్తుని స్వభావమేమిటి అన్నది మనకు అంతుబట్టాలి. అతడి టెంపరమెంట్ ఏమిటి అన్నది మనకు స్పష్టం కావాలి. అతని విధి నిర్వహణ విధానమెలాంటిది అన్నది మనకు బోధపడాలి. అతడి జీవన విధానమేమిటి అన్నది మనం దర్శించగలగాలి. అతడిలోని అనిపించే మనిషిని మనం సమగ్రంగా పొడగట్టించుకోగలగాలి. ఆ అనిపించే మనిషే గదా కనిపించే రూపురేఖల ద్వారా ప్రవర్తనా రూపంలో వ్యక్తమవుతున్నాడు. ప్రవర్తనలోని పోకడలను బట్టి అతడి స్థితిని మనం గ్రహించగలగాలి.

### పరిధి

ప్రతి మనిషికీ ఒక పరిధి ఉంటుంది. ఒక్కొక్కడికి తానే ముఖ్యం. తన కొరకే భార్యా, పిల్లలూ, బంధువులు. వారు తన తరువాతి వారే! తనకు చేయడం కొరకు ఏర్పడినవారే! తనమీద ఆధారపడి ఉన్నవారే!- ఇలా సాగుతుంది అతడి ఆలోచన. ఇంకొకడుంటాడు. అతనికి తాను అంటే తనవారందరూ. భార్యా, బిడ్డలూ, బంధువులూ-వారితోటివాడే తానుకూడా! ఇందాకటివాడు వారందరినీ అవతల నిలుచోబెట్టాడు. ఇప్పుడితను, వారందరినీ కలుపుకొని తాను అంటున్నాడు. అంటే ఇతని పరిధి అంతవరకూ విస్తరించిందన్నమాట.ఇంకొకడుంటాడు. అతడికి అందరూ తనవారే! సృష్టిలో తనవారు కానివారు ఎవరూ అతనికి లేరు. అనగా అతనికి పరిధేలేదన్నమాట! అంతటి విశాలత్వం అనుభవిస్తున్నాడన్నమాట!అలాగే కొందరు అడిగినా సహకరించరు. కొందరు అడిగితే సహకరిస్తారు. కొందరు మనము అడగకుండానే తాముగా వచ్చి సహకరిస్తారు. ఇలా ఎన్నో కక్ష్యలలో జీవిస్తున్నవారు

ఉంటారు. మన దగ్గరకు వచ్చిన రోగార్తుడు ఏ కక్ష్యలో ఉన్నాడు? ఎలాంటి భావనను కలిగి ఉన్నాడు? అతడి పరిధి సంగతి ఏమిటి?-దీనిని మనం గమనించాలి.

ఫస్టుతారీకున జీతమందగానే హోటలుకి వెళ్ళిపోయి ఇష్టమయిన టిఫిన్లు తిని, కాఫీత్రాగి తృప్తిపడిపోయే ఉద్యోగస్తులుంటారు. వారికి ఆ సమయంలో ఇంటిదగ్గర ఉన్న భార్యా, బిడ్డలూ గుర్తుకు వస్తున్నారా? వస్తే వారలా చేయగలరా? కొందరు గుడ్డిలో మెల్లగా తాము తిని ఇంటిలోని వారికి కూడా పట్టుకొని వెళుతూ ఉంటారు. కొందరు అలాకాక, కొన్నివి ఇంటికి తీసికొని వెళ్లి ఇంటిలోని వారికి తినిపించి, అప్పుడు మిగిలితే తాము తింటారు. ఇలా, ఇన్నిరకాలుగా ప్రవర్తించే వారుంటారు. వీటన్నింటినీ మించినది ఒకటి చెబుతాను. భార్యా, నలుగురు బిడ్డలు అలా చూస్తూ ఉండగా, ఇంటియజమాని ఇడ్లీలు తింటున్నాడు. పిల్లలకు నోరూరుతోంది. అడగలేరు, ఆగలేరు. తల్లి చెప్పింది—నాన్న పెద్దవారు. మనందరికీ సంపాదించి పెడుతున్నవారు. కాబట్టి ఆయన టిఫిన్ చేస్తారు. మీరిలా చూడకూడదు. తప్పు ఆయనకు మాత్రమే తెప్పించి పెట్టాలి.' పిల్లలు నోట్లో వేలు వేసికొని కూర్చుండిపోయారు.— ఇలా ఎవరి పరిధిల్లో వాళ్ళుంటారు. వారికదీ తగినట్లుగానే కనబడుతూ ఉంటుంది. మనం మాత్రం లోతుపాతులను గమనించుకోవాలి.

కొందరు క్రొత్తవారితో దూరంగా ఉంటారు. కొందరు అధికారులంటే భయపడతారు. కొందరు నలుగురితో కలవరు, తమకు తాముగా ఉండిపోతారు. ఆ చిన్న పరిధినుండి బయటికి రారు.

### శక్తియుక్తులు

ఇలా మనస్సు యొక్క ప్రవర్తనలన్నింటినీ గమనించుకొంటూ వచ్చిన తరువాత మనస్సుయొక్క శక్తియుక్తుల స్థాయిని గమనించాలి. గ్రహణశక్తి ఎలా ఉన్నది? ఇతరులు చెప్పిందిగాని, గ్రంథాలనుండి చదివినది గాని చక్కగా గ్రహించ గలుగుతున్నారా, లేదా? కొంతమందికి తొందరగా బోధపడదు. ఎంతచెప్పినా అర్థం కాదు. కొంతమందికి మనం ఒకటి చెబుతూఉంటే వారికి ఇంకొకటి అర్థమవుతుంది. అదికాదు ఇది అని చెప్పినా వారు వినిపించుకోరు. ఇలా గ్రహణశక్తికి సంబంధించి, విభిన్న స్థితులు ఉంటాయి. గమనించాలి!

ధారణశక్తి ఎలా ఉన్నది: అనగా గ్రహించినది మనస్సున చిరకాలం నిలబడుతున్నదా? గుర్తుఉంటున్నదా? దీనినే మనం జ్ఞాపకశక్తి అంటున్నాం. అదీ ఎలా ఉన్నది? దానిస్థితి ఏమిటి?

వ్యక్తీకరణశక్తి ఎలా ఉన్నది? చెప్పినది గ్రహిస్తారు. గ్రహించినది గుర్తు ఉంటుంది. గుర్తు ఉన్నది తిరిగి చెప్పవలసి వచ్చినప్పుడు ఎలా ఉంటుంది? ఆ భావ వ్యక్తీకరణ సమగ్రంగా ఉంటుందా? లేక అసమగ్రంగా ఉంటుందా?

ఆలోచించగలిగిన శక్తి ఎలా ఉన్నది: ఆలోచన చక్కగా సాగుతున్నదా, లేదా? ఒకటి ఆలోచించపోతే మరొకటి గుర్తొచ్చేవారుంటారు. కాస్త ఆలోచించేటప్పటికి బుర్ర వేడెక్కిపోయే వారుంటారు. ఆలోచనకు పూనుకోగానే అయోమయమయిపోయే వారుంటారు. ఇంతకూ స్వస్థతలో ఉన్నవాడు ప్రణాళిక వేస్తాడుతప్ప, అతిగా ఆలోచించడు. ఆలోచనలో పడి తెమలని వారుంటారు. అంటే స్వస్థతకు వారు అమడదూరంలో ఉన్నారన్న మాట!

ఊహించగలిగిన శక్తి ఎలా ఉన్నది! మంచి ఊహలు చేయగలుగుతున్నారా, అక్కరలేని ఊహలు వస్తున్నాయా? అలాగే భావించగలిగిన శక్తి ఎలా ఉన్నది? మంచి భావనలు కలుగుతున్నాయా, ఇబ్బందికరమయిన భావనలు మిగులుతున్నాయా?

సమయస్ఫూర్తి ఎలా ఉన్నది? సమయానికి కావలసినవి తడుతున్నాయా, లేదా? సమయం దాటిపోయిన తరువాత కావలసిన అంశాలు గుర్తుకువచ్చే వారున్నారు. అప్పటిదాకా గుర్తుంచుకొని అప్పుడే మరచిపోగలిగిన వారున్నారు. ఏ సమయానికి ఏమి చేయాలి అన్నది, ఎంతచెప్పినా బోధపడని వారుంటారు. సమయానికి తగినట్లుగా ప్రవర్తించలేని వారు ఉంటారు—వివరంగా గమనించుకోవాలి.

నచ్చిన సిద్ధాంతాలు ఏమిటి? ఇష్టానిష్టాలు ఏమిటి? కోరికలూ, కాంక్షలూ ఏమిటి? జీవితగమ్యం ఏమిటి? ఈ జీవితానికి పరమార్థంగా వారు దేనిని భావిస్తున్నారు?-ఈ వివరాలు కావాలి.

### డబ్బుతో

చివరిగా డబ్బుతో ఎలా ప్రవర్తిస్తున్నారు? కొందరు, డబ్బు ఖర్చుపెట్టడానికి ఇష్టపడరు. కొందరు డబ్బును పద్ధతిలేకుండా వృథా చేస్తారు. కొందరు తమకు మాత్రమే ఖర్చుపెట్టుకొంటారు. కొందరు తమను వదిలి మిగిలిన అందరికీ ఖర్చుపెట

తారు. కొందరు ఆడంబరాల కొరకు ఖర్చుపెడతారు. కొందరు పేరుప్రతిష్ఠల కొరకు ఖర్చుపెడతారు. ఇలా డబ్బును ఎలా ఖర్చు పెడతారు? ఎందుకు ఖర్చు పెడతారు? డబ్బుకు వారిస్తున్న స్థానమేమిటి!- ఇవన్నీ మనకు కావాలి, కొందరు 'ధనం మూలం ఇదం జగత్' అంటారు. కొందరు, ధనాన్ని మనం సంపాదిస్తున్నామా, ధనం మనని సంపాదిస్తోందా', అని ప్రశ్నిస్తారు. ఎవరి తరహా వారిది. ఆ తరహా మనకు కావాలి!

### విధి నిర్వహణ అంటే—

ఒకాయన, 'నేను విధినిర్వహణకే ప్రాధాన్యమిస్తాను'— అన్నాడు. ఎలా ఇస్తున్నదీ వివరిస్తూ నా మనస్సు ఎప్పుడూ ఆఫీసు విషయాలపైననే ఉంటుంది. నాకు ఇంటిని గురించిన స్పృహే ఉండదు. ఇంట్లోవాళ్ళు ఏదయినా కావాలని చెప్పినా అక్కడే మరచిపోతాను'— అని సగర్వంగా చెప్పాడు. విధి నిర్వహణకు ప్రాధాన్యమీయడమంటే ఇదా! విధి నిర్వహణ అంటే ఆఫీసుపనేనా? అందులో ఇంటిపని లేదా! ఆలోచించవలసిన అంశమిది. అలాగే ఇంకొకాయన ఆఫీసులో కూర్చొని ఇంటికి సంబంధించిన జమాఖర్చులు వ్రాసుకొంటున్నాడు. అతనికి విధినిర్వహణ మంటే ఇంటిపనేనన్న మాట! ఆ ఇంటిపనికి కావలసిన డబ్బులకోసమే ఇలా ఆఫీసు కొచ్చి కనబడుతున్నాడన్న మాట! ఆఫీసు సమయాన్ని కూడా ఇలా ఇంటికే కేటాయించగలుగుతున్నాడన్న మాట! ఇంకొకాయన డబ్బులొచ్చే పనినే విధినిర్వహణగా భావిస్తున్నాడు. డబ్బులు రానిపనిని ప్రక్కన పెట్టేస్తున్నాడు. మరొకాయన పేరు ప్రతిష్ఠలొచ్చే పనినే విధినిర్వహణగా భావిస్తున్నాడు. ఇంటిలో భార్య మంచమెక్కింది. ఆమెను పట్టించుకోడు, ఆమెను పట్టించుకొంటే వచ్చే గుర్తింపు ఏముంది? అదే బయటవారికి సహకరిస్తే నలుగురూ గుర్తిస్తారు. పేపర్లో ఫొటోలు కూడా వేస్తారు.- ఇలా ఎవరికి తోచినదానిని వారు విధి నిర్వహణ అంటున్నారు. ఎవరికి నచ్చినదానిని వారు విధినిర్వహణ పేరున చేస్తున్నారు. ఇంతకూ విధి నిర్వహణమంటే ఏమిటి? మనం చేయవలసిన మొత్తం కార్యక్రమం అంతాకలిపి మన విధి నిర్వహణ అవుతుంది. అందులో యే ఒక్కవైపుకు మొగ్గినా అది అస్పష్టత అవుతుంది. అసమగ్రమవుతుంది. కనుక ఆ వచ్చిన రోగార్తుని దృక్పథంలో విధినిర్వహణమంటే ఏమిటని అతడనుకొంటున్నాడు-ఎలా దానిని నిర్వహిస్తున్నాడు? మరి మిగిలిన వాటిమాటేమిటి-ఈ వివరాలను కూడా మనం కనుక్కోవాలి. I am duty minded అనగానే సంతోషించ కూడదు. లోతులకు వెళ్లాలి. లోటులను పట్టుకోవాలి.

## విశ్రాంతి-విహారాలు

విధినిర్వహణా విధానాన్ని సాకల్యంగా పరిశీలించిన తరువాత ఇక విశ్రాంతి విహారాల దగ్గరకు రావాలి. ఎలాంటి విశ్రాంతిని కోరుకొంటున్నారు. ఎలాంటి విహారాలను ఆపేక్షిస్తున్నారు—ఇది మనకు తెలియాలి. కొందరకు ఏకాంతంలో విశ్రాంతి లభిస్తుంది. కొందరికి అలా నలుగురిలోకి వెళితే హాయిగా ఉంటుంది. కొందరికి సన్నిహితులతో కబుర్లు చెబితే బాగుంటుంది. కొందరికి నాటకాలకో, సినిమాలకో వెళితేనే తృప్తిగా ఉంటుంది. కొందరికి పుస్తకపఠనంలో విశ్రాంతి. కొందరికి ప్రకృతి దృశ్యాలలో విశ్రాంతి.

కొందరికి అవకాశం వచ్చినప్పుడల్లా పడుకోవడం విశ్రాంతి. కొందరికి సందు దొరికినప్పుడల్లా ఆటపాటలలో విశ్రాంతి. కొందరికి సన్నిహితులతోడి కార్యక్రమాలలో విశ్రాంతి. ఇంకొందరికి క్రొత్త క్రొత్త పరిచయాలలో విశ్రాంతి. కొందరికి పూజా పునస్కారాలలో విశ్రాంతి. కొందరికి విందు భోజనాలలో విశ్రాంతి.— ఇలా ఎవరి విశ్రాంతి వారిది.

కొందరికి విహారయాత్రలు ఇష్టం. కొందరికి తీర్థయాత్రలు ఇష్టం కొందరికి విదేశయాత్రలు ఇష్టం. కొందరు వీలు దొరికినప్పుడల్లా ఏదో వైపుకు వెళ్ళిపోతూ ఉంటారు. ఉత్తరదేశ యాత్రలో, దక్షిణదేశ యాత్రలో చేసివస్తూ ఉంటారు. కొందరికి యాత్రలు ఇష్టం ఉండవు. 'మనలోనే ఉన్నదంతా! మన ఇల్లు మనకు చాలు. ఈ పనులు ఇలాచేస్తే చాలు. ఇలా చెబుతూ ఉంటారు. కొందరు ప్రయాణాలంటే యిష్టపడతారు. కొందరు ఇష్టపడరు. కొందరు ప్రయాణానికి హడావిడి చేస్తారు కొందరు ఎలాఉన్నా ప్రయాణం చేయగలుగుతారు.

కొందరు పనిని పూర్తిచేసి విశ్రాంతి తీసుకొందామనుకొంటారు. కొందరు పనిని మధ్యలో అలా ఉంచి కాస్త విశ్రాంతిని పొందుదామనుకొంటారు. కొందరు ముందు విశ్రాంతిని పొంది ఆటుపైన సావధానంగా పనిని మొదలు పెడదామను కొంటారు. కొందరు పని ఏ మాత్రం తెమలకపోయినా, దానినక్కడ వదిలి విశ్రాంతి లోనికి వెళ్ళిపోతారు.

నాకు తెలిసిన ఒకాయన సంక్లిష్ట పరిస్థితి ఏర్పడినప్పుడల్లా సినిమాకు వెళ్ళిపోతూ ఉంటారు. అతడు సినిమాకు వెళ్తాడూ అంటే, ఆ వెనుక ఒక సమస్య ఉన్నట్టన్న మాట! ఇది హాయిని కోరి సినిమాకు వెళ్ళడం కాదు. బాధకు తట్టుకోలేక, ఇంకా చెప్పాలి అంటే బాధకు బదులు దొరకక సినిమాకు వెళ్ళడం!

ఒక చిత్రం చెబుతాను. ఒకామె ఉన్నది. ఆమెది చాలా భారీ శరీరం. కదలడం గగనం. అడగడం అనవసరం. అలాంటామెను పట్టుకొని, 'మీరు విశ్రాంతిని ఎలా అనుభవిస్తారు.' అని అడిగారు మనవాళ్లు. ఆమె చెప్పింది కదా-'భోంచేసి వరండాలో కూర్చుంటాను. కోడళ్లిద్దరూ ఈ చేతి ప్రక్క వేరుశనగపప్పులూ, ఆ చేతిప్రక్కన జీడిపప్పులూ ఉంచుతారు. అడపా దడపా వాటిని తింటూ, రోడ్డు మీద వెళ్లేవారిని చూస్తూ ఉంటాను. కాలం గడిచిపోతుంది నాకు.' మన వాళ్ళన్నారు కదా-'రోడ్డు మీద చూడటానికేముంటుందండీ'—అని. ఎంత అజ్ఞానం-అన్నట్లుగా ఒక చిరునవ్వు నవ్వి ఆమె ఇలా అన్నది; ఏముంటుందా? వెళ్లిన మనిషి వెళ్ళడు. కనబడిన మనిషి కనబడడు. ఎప్పుడూ క్రొత్తగా ఉంటుంది. అంత క్రొత్తదనం ఇంకెక్కడ కనబడుతుందీ!' మనవాళ్ళ ఆశ్చర్యానికి అంతులేదు. ఎవరి విశ్రాంతి వారికి ఉంటుంది ఇలా! కనుక్కోవాలి.

## దాంపత్యానుబంధం

విశ్రాంతి విహారాలనుండి దాంపత్యానుబంధం దగ్గరకు వద్దాం. రోగార్తునికి వివాహమైనదా-అన్న అంశం ముందు కనుక్కోవాలి. వివాహాన్ని గూర్చి, వివాహ వ్యవస్థను గూర్చి అతని భావనలు ఏమిటి—ఇది కూడా తెలియాలి. వివాహమయినది అన్నప్పుడు, దంపతులకు శ్రుతి కుదిరినదా! దేహాలకు శ్రుతి కుదరాలి, లేకపోతే అవి అల్లాడుతాయి. మనస్సులకు శ్రుతి కుదరాలి, లేకపోతే అవి ఘర్షణ పడతాయి. ఆత్మలకు శ్రుతి కుదరాలి. లేకపోతే అవి ఆనందపడలేవు. ఇలా మూడు శ్రుతులూ కుదిరినప్పుడే మూడు ముళ్ళకు సార్థకత! ఆ సార్థకత ఎలా ఉన్నదీ గమనించాలి!

కొందరికి వివాహమైనప్పటినుండీ ఆరోగ్యంలో తేడా వస్తుంది. కొందరికి పెళ్ళయినప్పటి నుండీ ఒళ్ళొస్తుంది. కొందరికి పెళ్లి తరువాతనుండీ మానసిక ప్రవర్తనే మారిపోతుంది. ఇలాంటి తేడాలు గమనించుకోవాలి. భర్తకు అంతకు ముందు సుఖవ్యాధులు వచ్చి అణచిపెట్టబడ్డాయనుకోండి. వాటి ప్రభావం భార్యపైన పడుతుంది. ఆనందమయకోశం నుండి అన్నమయకోశం వరకూ ఆమె స్థితి చెదరిపోతుంది. 'ఇంతకుముందు ఏ అనారోగ్యమూ ఎరగదండీ! వివాహానంతరమే ఇలా ఒకదాని తరువాత ఒకటి వస్తున్నాయి-అంటారు. అప్పుడు ఆమెకు మాత్రమే మందు వాడితే సరిపోదు. అతడు కూడా వాడాలి. ఆమె మాత్రమే వాడితే ఏమవుతుంది? మందువల్ల నయమవుతుంది. అతడి వల్ల మళ్ళీ వస్తూ ఉంటుంది. కనుక ఇద్దరూ వాడటం ఎంతయినా అవసరం.

పిల్లలు కలగని వారుంటారు. సామాన్యంగా అభాండం ఆడవారిమీదే పడుతూ ఉంటుంది. వారే కారణమన్నట్లుగా అందరూ వారిపైపు వేలెత్తి చూపెడతారు. కాని ఎక్కువసందర్భాలలో కారణం మగవారిదగ్గరే ఉంటుంది. శుక్రకణాల సంఖ్య చాలక పోవడంగాని,గమ్యాన్ని చేరేవరకూ అవి జీవించి ఉండకపోవడంగాని, అసలు శుక్ర కణాల ఉత్పత్తే లేకపోవడం గాని-జరుగుతూ ఉంటుంది. కనుక ఒకమాట చెబు తాము. పిల్లలు కలుగని సందర్భాలలో దంపతులిద్దరూ మందు వాడాలని. ఇది చాలా అవసరం. చాలా మంచిది కూడా! వారసత్వ దోషాల నుండి బైటపడి, స్వస్థతను పరిపూర్ణంగా పొంది, క్రొత్త తరానికి రూపునివ్వడం ఎంతటి అదృష్టం! కనుక ఇలాంటి సందర్భాలలో ఇద్దరూ మందు వాడాలి.

కొందరు పురుషులు శీఘ్రస్ఖలనంతో ఇబ్బంది పడుతూ ఉంటారు. కొందరు స్త్రీలు రహస్యావయవం పొడారిపోయి దాంపత్యక్రియకు భయపడుతూ ఉంటారు. ఇలాంటి లోతుపాతులన్నీ వారిని వేరుగా కూర్చోపెట్టి ప్రశాంతంగా అడిగి తెలిసి కోవాలి. దాంపత్యక్రియ ఆ దంపతులకు పరితృప్తి నిస్తున్నదా, లేదా అన్నది తెలి యాలి. అక్కడ పరితృప్తి లభించకపోతే, ఆ అసంతృప్తి మిగిలిన జీవిత సన్ని వేశాలలో ప్రతిఫలిస్తూ ఉంటుంది. ఆరోగ్యాలు కూడా అన్ని విధాలా దెబ్బతింటూ ఉంటాయి. కనుక ఇలాంటి విషయాలు మొహమాట పడకుండా వారు చెప్పాలి.వేదనా సముదాయాన్ని స్వీకరిస్తున్నవారు, వారికంతటి విశ్వాసపాత్రులయి మనగలగాలి.

కొందరికి సందు దొరికినప్పుడల్లా కామ సంబంధమైన ఆలోచనలు వస్తూ ఉంటాయి. కొందరికి ఎవరిని చూసినా కామ భావనే కలుగుతూ ఉంటుంది. కొందరు యువకులు హస్తప్రయోగము వంటి విపరీతాలకు అలవాటు పడతారు. కొందరు వృద్ధులు కామ సంబంధమయిన పత్రికలను చాటుగా చదువుకొంటూఉంటారు. నగ్న చిత్రాలున్న దృశ్యాల కొరకు కొందరు వెంపరలాడతారు. కొందరికి రోజూ దాంపత్యానుభవం కావాలి. లేకపోతే ఉండలేరు. కొందరికి వృద్ధాప్యంలో కూడా దాంపత్యానుభవం కావాలనిపిస్తుంది. దానికొరకు అర్రులు చాస్తారు. అస్తవ్యస్త మయిన ఈ సన్నివేశాలన్నీ కూడా అస్వస్థత లోని భాగాలే!

అలాగే కొందరికి వివాహమంటే ఇష్టముండదు. కొందరు వివాహాన్ని ద్వేషి స్తారు. కొందరు వివాహమంటే భయపడతారు. కొందరు వివాహం చేసికోకుండా ఉండటం ఒక ఆదర్శంగా స్వీకరిస్తారు. కొందరు వివాహాన్ని సాధనకు అడ్డమని భ్రమిస్తారు-ఇవన్నీ కూడా అస్వస్థతలోని భాగాలే! ఇలాంటి విలక్షణమయిన అంశా లన్నింటినీ గమనించుకొంటూ ఉండాలి.

ఒకరోజున ఒకతడు అనుమతిని పొంది లోపలికి వచ్చాడు. చుట్టూ ఎవరూ లేరని నిశ్చయించుకున్న తరువాత ఇలా చెప్పాడు:నేను మీకు అన్ని విషయాలు చెప్పాలి. కాని మీరు నా భార్యను వెంటబెట్టుకొని రమ్మన్నారు. అలా వస్తే కొన్ని విషయాలు చెప్పలేను. ఆ కొన్ని విషయాలు చెప్పడానికి ఇలా వచ్చాను. మామూలు విషయాలన్నీ రేపు మా ఆవిడతో కలసి వచ్చి అప్పుడు చెబుతాను. మా ఆవిడ నన్ను శ్రీరామ చంద్రుడని అనుకుంటున్నది! కాని కాను. మీకు నిజం చెబుతాను. నేను ఆ పొందులేకుండా రాత్రిని గడుపలేను. ఉద్యోగరీత్యా క్యాంపులలో ఉండ వలసి వస్తుంది. అక్కడ దారులు వెతుక్కొనక తప్పదు. వెతుక్కుంటున్నాను. ఇంకా చెప్పాలీ అంటే ఆవిడ ఇంట్లోకి రాకూడని ఆ మూడు రోజులూ నాకు నర కంగా ఉంటుంది. అందుకని ఏం చేస్తానంటే ఆ మూడు రోజులూ నేను క్యాంపుల్లో వెళ్ళిపోయేట్లుగా చూసుకొంటాను. నా పరిస్థితి ఇదీ! ఇవేవీ ఆవిడకు తెలి యవు. హోమియో ప్రకారం ఈ స్థితికూడా వ్యాధికి సంబంధించిందే అయి ఉంటుంది-అని అనుకుంటున్నాను. నన్ను దీని నుండి బయట పడవేయండి, మీకు ఋణపడి ఉంటాను.

దీనిని బట్టి ఏమి తెలుస్తున్నది. వేదనా సముదాయాన్ని స్వీకరించడానికి బాధ్యత కలిగినవారు ప్రక్కన ఉండటం ఎంత అవసరమో, స్వీకరణ పూర్తయ్యే లోపున వారితో ఏకాంతంగా కొంతసేపు గడపడం కూడా అంతే అవసరం! ఇప్పుడి తడు బయటకు చెప్పాడు. బాగున్నది. కొందరు ఇలా చెప్పడానికి కూడా మొహ మాట పడేవారుంటారు. కనుక వ్యక్తిగతంగా చెప్పవలసిన రహస్యాంశాలు ఉంటే కాగితం మీద వ్రాసి ఇమ్మని, అలా వ్రాయించి తీసికోవడం ఇంకా మంచిది. అప్పుడు వాళ్లు కావలసినంత వివరంగా వ్రాయగలుగుతారు. ఈ విషయాలనే కాదు. బయటకు చెప్పలేనివి ఇంకా కొన్ని ఉండవచ్చు. అవి కుటుంబ గతమయినవి కావచ్చు. అందు వలన ఆరోగ్యం దెబ్బతింటూ ఉండవచ్చు. వాటిని కూడా ఇలా ఏకాంతంగానో, లేక కాగితం పైన వ్రాయించో స్వీకరించడం మంచిది.

ఒకామె ఒకసారి కళ్ళనిండా నీళ్ళు పెట్టుకొంటూ ఇలా చెప్పింది. మాస్టరు గారూ! నా పరిస్థితిని ఏమి చెప్పనూ. నా బిడ్డల ముందు నేనొక దొంగలా మెలగ వలసి వస్తున్నదండీ, వాళ్ళకు యుక్తవయసు వచ్చింది. నిజానికి వాళ్ళ పెళ్లిళ్ళు ఇప్పటికి ఎప్పుడో చేయవలసి ఉంది. అది జరుగలేదు. అది జరుగకపోగా వాళ్ళం దరూ హాలులో పడుకొని ఉండగా, నేనాయన గదిలోనికి వెళ్లి తలుపు వేసుకోవలసి

వస్తున్నది. మళ్లీ ప్రొద్దున్నే తలుపు తీసికొని రావలసి వస్తున్నది. ఈ స్థితి నాకు ఇష్టంలేదు. కాని తప్పడం లేదు. నేను కాదంటే ఆయన ప్రక్కదారులు పడతారేమో నన్న భయం. అప్పుడు ఇంకా ఇబ్బంది కదా. దానికన్నా నా బిడ్డల చూపుల్లో నేను ముద్దాయిగా మిగలడమే మంచిదనిపిస్తున్నది. 'అమ్మ ఏమిటి, ఇంత వయస్సు వచ్చిన తరువాత కూడా నాన్న గదిలోనికి వెళ్లి తలుపు వేసికుంటుంది'-అని వారికి అని పిస్తుంది కదా! ఇలా వాళ్ళకు అనిపిస్తుంది అన్న భావన నన్ను తొలిచివేస్తోంది. దీనితోనే మిగిలిన అనారోగ్యమంతా వస్తోంది. నన్ను రక్షించండి. మీకు గాక ఇంకె వరికి చెప్పుకుంటాను. ఇలాంటి కథలు ఎన్నో ఎన్నో ఎన్నెన్నో!

ఇలా దాంపత్య అనుభవాన్ని అతిగా కోరేవారు కొందరయితే, పెళ్లి చేసు కొని కూడా దాంపత్యానుభవానికి దూరంగా ఉండాలని కోరుకొనేవారు కొందరు. ఇలా ఎన్నో తరహాలు. మన చెంతకు వచ్చినవారి తరహా ఏమిటి, గమనించుకోవాలి.

## నిద్ర-తీరుతెన్నులు

ఇక నిద్ర-తీరుతెన్నులు దగ్గరకు వద్దాం. నిద్ర సరిగా పడుతున్నదా, కావలసి నంత తృప్తిని అందిస్తున్నదా-అన్న అంశాలను గమనించుకోవాలి. కొందరు కొద్ది గంటల కన్నా నిద్రపోలేరు. కొందరు ఎన్ని గంటలయినా నిద్రపోగలరు. కొందరు సందు దొరికితే చాలు నిద్రలోనికి వెళ్ళిపోతారు. ఇంకొందరు సిటీబస్సులో నిల్చుని కూడా నిద్రపోగలరు? కొందరు పిల్లలు తరగతి గదులలో కళ్ళుతెరచి నిద్రపోగలి గిన ఘనత చెంది ఉంటారు.

నిద్ర లేచేటప్పటికి ఎలా వుంటుంది: కొందరికి హాయిగా ఉంటుంది. అప్పుడు ఇబ్బందిలేదు. కొందరికి నిద్రలేచేటప్పటికి భారంగా ఉంటుంది. బద్ధకంగా ఉంటుంది. కొందరికి నిద్రలేచేసరికి బాధలన్నీ ఉద్రేకిస్తాయి.కొందరికి ఎంతపోయినా నిద్రతీరదు. కొందరికి ఎంత ప్రయత్నించినా నిద్ర పట్టదు. రోజుల తరబడి నిద్రపోయేవారు న్నారు. సంవత్సరాల తరబడి నిద్రను ఎరుగని వారున్నారు! గమనించాలి. కొందరు కప్పుకొని పడుకుంటారు. ఇందులో తలవరకూ కప్పుకునేవారు కొందరు, పూర్తిగా కప్పుకునేవారు కొందరు. కొందరసలు చలికాలంలో కూడా పూర్తిగా కప్పుకోరు.

నిద్రలో భంగిమలు ఉంటాయి. కొందరు ఎడమప్రక్కకు తిరిగి పడుకొం టారు. కొందరు కుడి ప్రక్కకు తిరిగి పడుకొంటారు. కొందరు వెల్లకిలా పడుకొం టారు. కొందరికి బోర్లా పడుకుంటే కాని నిద్ర పట్టదు. కొందరికి వెల్లకిలా పడు కొంటే ఎదరొమ్ము బరువెక్కుతుంది. దానికి తట్టుకోలేక పలవరించే వారుంటారు.

'ందరు మునగ దీసికొని పడుకొంటారు. కొందరు కాళ్ళు బారజాపి పడుకొంటారు. 'ందరు శరీర భాగాలను ఇష్టం వచ్చినట్లు అలా పడేసి పడుకొంటారు. ఇంకా ప్పాలంటే పడుంటారు. కొందరు నిద్రలో పళ్ల కొరుకుతారు. కొందరు చొంగ 'రుస్తారు. కొందరు నిద్రలో లేచి నడుస్తారు. కొంతదూరం అలా వెళ్ళి వచ్చి మళ్ళీ డుకొంటారు. కొందరు మూలుగుతారు. కొందరు మధ్యలో లేచి మాట్లాడతారు. •ని వారికది తెలియదు.

కొందరు నిద్రలో కలలు కంటారు. కన్నకలలు కొందరికి గుర్తుంటాయి. 'ందరికి గుర్తుండవు. కొందరికి పగలు జరిగినవి రాత్రి కలలోకి వస్తాయి. పగలు ౹రిగేవన్నీ రాత్రి కలగంటూ, పైకి కలవరించేవాళ్ళుకూడా ఉంటారు. కొందరికి ౹నచర్యలోని అంశాలు కలల్లోకి వస్తాయి. కొందరికి పూర్తికాని పనులు కలల్లో కన ుడతాయి.

కొందరికి చుట్టాలలో బ్రతికున్నవాళ్ల కలలోకి వస్తారు. కొందరికి చుట్టాలలో చనిపోయినవారు కలలోకి వస్తారు. కొందరికి ఎవరో చనిపోయినట్లు కలవస్తుంది. కొందరికి తానే చనిపోయినట్లు కలవస్తుంది.

కొందరికి కలలో దొంగలు వస్తారు. కొందరికి పోలీసులు కలలోకివస్తారు. కొందరికి గిట్టనివాళ్ళు తరిమి కొడుతున్నట్లు కల. కొందరికి అగ్ని ప్రమాదాలు, కొందరికి భూకంపాలు, కొందరికి రక్తపాతాలు, జుట్టు విరబోసుకున్నట్లుగా, నాలు కలు చాస్తున్నట్లుగా ఇలా ఏవేవో భయంకరమైన కలలు, పీడకలలు!

కొందరికి కలలో జరిగింది తరువాత ఇలలో జరుగుతుంది. మనుషులు కలు స్తారు. ఆ ప్రాంతాలు తారసపడతాయి. కలలో జరిగిన సన్నివేశాలే మళ్ళీ జరుగు తాయి. కొందరికి కలలో భవిష్యత్తు సూచింపబడుతుంది. కొందరికి సమస్యలకు పరిష్కారాలు లభిస్తాయి.

కొందరికి కలలో పాములు కనబడతాయి. పాము లేకుండా కల నడవదు కొందరికి కలలో జంతువులు కనబడతాయి. ఏదో మూలన, ఏదో ఒక జంతువు కొందరికి కలలో ఏవో ఆకారాలు, విచిత్రాలు, గాలిలో ఎగరడాలు, ఆకాశాన విహారాలు!

కొందరు కలలో పరీక్షలకు వెళుతుంటారు, రిటైరయిన తరువాత కూడా! కొందరు ఎప్పుడూ ట్రైనెక్కుతూ ఉంటారు. కొందరికి కలనిండా ప్రయాణాలే!

తనదాకా వచ్చి సినిమా టికెట్టు దొరకనట్లుగా కల. తనను మాత్రమే కండక్టరు బస్సులో నుండి దింపేసినట్లు కల.

కొందరికి కల సీరియల్‌గా వస్తుంది. రెండవ భాగం, మూడవ భాగం అన్నట్లుగా, కొన్నాళ్ళకొక భాగం చొప్పున వడుస్తూ ఉంటుంది! కొందరు కల మధ్యలో నిద్రలేచి బాత్రూమ్‌కు వెళ్ళివచ్చి పడుకుంటారు. మళ్ళీ కల కొనసాగు తుంది. ఇది సినిమా వంటి కల. మధ్యలో విరామం వచ్చిందన్నమాట. కొందరు మూత్రాన్ని విసర్జిస్తున్నట్లుగా కలగంటూ ఇలలో నిజంగా విసర్జిస్తారు.

కొందరికి కామ సంబంధమయిన కలలు. అంతలోనే స్ఖలనాలు. ఇలా కలలు ఎన్నెన్నో రకాలు. కలవచ్చింది అన్నప్పుడు ఆ కల 'వరంగా' ఉన్నదా, కలవరంగా ఉన్నదా—అన్నది కనుక్కోవాలి.

కొందరికి కలలవల్ల నిద్ర చాలనట్లు అనిపిస్తుంది. కొందరికి నిద్రలో గుర్రు వస్తుంది. అంటే సౌండ్ స్లీప్‌కు బదులు 'రీసౌండ్ స్లీప్' వస్తుందన్నమాట! బందరు నుండి ఒకాయన వచ్చాడు. అతని గుర్రువల్ల ఆ వాడవారికి నిద్ర బంద్ అవుతున్నదట. పెద్ద ఇబ్బంది అవుతున్నదట. ఇలాంటివన్నీ గమనించుకోవాలి.

## విజ్ఞానమయ కోశం

కాళ్ళూ, చేతులు, మలమూత్ర అవయవాలు ఇవి కర్మేంద్రియాలు. అంటే పనిచేసి పెట్టేవి. కన్నూ, ముక్కూ, చెవి, నాలుక, చర్మం—ఇవి జ్ఞానేంద్రియాలు. పని చేయడానికి కావలసిన తెలివిని అందిస్తాయివి! అయిదు కర్మేంద్రియాలు. అయిదు జ్ఞానేంద్రియాలు. మొత్తం పది ఉపకరణాలు. ఈ పది ఉపకరణాలతో పనులను చక్కపెట్టేది మనస్సు. ఈ ఉపకరణాలనే పనివాళ్ళకు మనస్సు మేస్త్రీ వంటిది.

మనస్సూ, ఇంద్రియాలు కలసి పనిచేస్తున్నప్పుడు వ్యక్తమయ్యే ఆ సమాహార రూపాన్ని 'చిత్తము' అంటారు. ఇది ఆఫీసు పని చేయడం లాంటిది. ఆఫీసు అంటే కేవలం బల్ల లూ, కుర్చీలూ కాదు. అలాగని కేవలం మనుషులూకాదు. వారందరినీ కలుపుకొని, వారినుండి వ్యక్తమయ్యేది. చిత్తము ఇలాంటిది. మనస్సుకూ, ఇంద్రియాలకూ నడుమ శ్రుతి కుదరాలి. లేకపోతే చిత్తము శోభ వనుభవిస్తుంది. శ్రుతి కుదిరితే శోభ, శ్రుతి చెదిరితే క్షోభ. మనస్సు ఇంద్రియాలను వినియోగించగలుగుతున్నదా, ఇంద్రియాలనుండి చిందిపోతున్నదా? ఇక్కడ మనస్సుకు బుద్ధి సాయం అవసరమవుతుంది. దీనినే మనం 'విజ్ఞానమయం' అంటున్నాం.

తనముందు వెనుకలను విజ్ఞానమయంగా నడపగలిగిన ఉపకరణమిది. మనసు. ద్ధిపై పుకు మొగ్గినప్పుడు బుద్ధిగా ఉంటుంది. అప్పుడు విచక్షణ వెలుగుతుంది. చిత్యం పాటింపబడుతుంది. ధర్మాధర్మాలు తెలుస్తాయి. ఇండి పట్టాలు తప్పవు. ర్ణయాలు సరిగా సాగుతాయి. తగినవిధంగా జరుగుతాయి. ఆలోచన క్రమబద్ధంగా ంటుంది. ఆవేశాలు అర్థవంతంగా ఉంటాయి. ప్రవర్తన ప్రయోజనకరంగానూ, రమార్థాన్ని సాధించేదిగానూ ఉంటుంది. విజ్ఞానమయకోశం చక్కగా పనిచేస్తు న్నప్పుడు వ్యక్తమయ్యే దివ్యస్థితి ఇది. దీనికి ఏమాత్రం భిన్నంగా ఉన్నా ఆ మేరకు జ్ఞానమయకోశం చెదరుబాటును అనుభవిస్తున్నట్లే!

బుద్ధి ఇటు మనస్సుపైనా, మనస్సు ఇంద్రియాలతో కూడి పనిచేస్తున్నప్పుడు ర్పడే చిత్తము పైన, అటు అహంకారము పైన కూడా పనిచేస్తూ ఉంటుంది. అహం గారం ఉప్పులాంటిది. అది తగ్గితే ఆహారానికి రుచి ఉండదు. అది ఎక్కువయితే ఆహారాన్ని మనం నోట పెట్టలేం. అది తక్కువా కాకూడదు. ఎక్కువా కాకూడదు. సమపాళంగా ఉండాలి. అహంకారం సమపాళంగా ఉన్నప్పుడు ఆత్మవిశ్వాసంగా వ్యక్తమవుతుంది. తగ్గినప్పుడు ఆత్మవిశ్వాసం తగ్గి మనిషి అసమర్థుడవుతాడు. అహంకారం ఎక్కువయితే కన్నుమిన్ను గానని అహంకారి అవుతాడు.

కనుక విజ్ఞానమయ కోశమన్నప్పుడు మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకార ముల స్థితిగతులు ప్రవర్తన ద్వారా ఎలా వ్యక్తమవుతున్నదీ గమనించాలి.

## ఆనందమయ కోశం

ఆనందమయ కోశమంటే మన నిజ స్వరూపం. ఆనందమూ లేక ప్రేమ- ఇదే మన నిజస్వరూపం. దీనినుండే మిగిలిన అన్ని కోశాలూ వ్యక్తమవుతున్నాయి. ఆనందంగా ఉండగలుగుతున్నామా లేదా, ప్రేమగా ప్రవర్తించ గలుగుతున్నామా లేదా, ఎంతవరకు ఆనందపడగలుగుతున్నాము. ఎంతవరకు ప్రేమను చూపగలుగు తున్నాము అని గమనించినప్పుడు ఆనందమయ కోశం యొక్క స్థితి ఏమిటన్నది ఇట్టే బోధపడిపోతుంది.

కొందరు ఎలాంటి జటిల సన్నివేశాన్నయినా ఆనందమయ స్థితినుండి నిర్వ హించగలుగుతారు. కొందరు ప్రతి చిన్న సన్నివేశానికీ ఆనందమయ స్థితి నుండి చెదరిపోతారు. కొందరు మామూలుగా ఉన్న పరిస్థితులలో కూడా బాధలనూ, దుఃఖా లనూ గుర్తు చేసికొని మరీ దుఃఖిస్తూ ఉంటారు. కొందరికి పరిస్థితులు సహజావుగా

నడిస్తే బాగుండదు. అందుకని కావాలని చెడగొట్టి దుఃఖాన్ని ఆహ్వానిస్తారు. కొందరు ఆనందంగా ఉందామనుకొంటారు గాని, ఆ ఉండటం చేతగాదు.

ఆనందస్థితి అంటే అది ఎలా ఉంటుంది? సుఖశాంతులతో నిండి ఉంటుంది. ప్రేమస్థితి అంటే అది ఎలా ఉంటుంది? జగత్కళ్యాణాన్ని అది కోరుతూ ఉంటుంది. అందరూ బాగుండాలని కోరితే, అందులో మనం లేమా-అదే ప్రేమ! అలాగాక, నేను బాగుండాలని కోరితే అది స్వార్థమవుతుంది. ప్రేమను స్వార్థస్థితికి సంకుచిత పరుస్తున్నామన్నమాట! నేను బాగుండాలి, ఎదుటివాడు మాత్రం బాగుండకూడదు అంటే, ఇక్కడ స్వార్థంతోపాటు ద్వేషం కూడా కలుగుతోంది. ఇలాంటివన్నీ చెడిన ప్రేమమయకోశం నుండి వినబడే అపశ్రుతులు.

నేనేమయిపోయినా సరే, వాడినిమాత్రం నాశనంచేసి తీరుతాను—అని దీక్ష బూనే వారుంటారు. నేనుండగా వాడు బాగుండటమా, వాడివన్నం తిననిస్తే ఇంత నా గొప్పదనమేమిటి-అని గర్జించేవారుంటారు. ఇలాంటి అపశ్రుతులు సమాజ జీవితాన్ని అల్లకల్లోలం చేస్తూ ఉండటం మనం చూస్తూనే ఉన్నాం కదా! ఇదంతా కూడా అస్వస్థతలోని భాగమే!

అలాగే కొందరికి జీవించాలని ఉండదు. చనిపోవాలని ఉంటుంది. చనిపోవాలి, చనిపోవాలి అని అనిపిస్తూ ఉంటుంది. ఆత్మహత్య చేసికోవాలనిపిస్తుంది. మృత్యువు దానికదిగా వస్తే బాగుండుననిపిస్తుంది. మృత్యువుకోసం ఎదురుచూడాలనిపిస్తుంది. అంటే జీవితేచ్ఛ నశిస్తోంది. ఆనందమయ కోశం అంతగా చెదరిపోయిందన్న మాట! జీవితేచ్ఛ జీవికి సహజ లక్షణం. దారుణమయిన వ్యాధి బాధలలో ఉన్నవాడు కూడా బ్రతికి బయటపడాలనే కోరుకొంటాడు. దుర్భర దారిద్ర్యంలో ఉన్నవాడు కూడా ఎలాగోలా పొట్టపోసుకొని బ్రతుకుదామనుకొంటాడు. అలాంటిదేది చనిపోవాలనిపిస్తోంది అంటే ఆనందమయ కోశం అంతగా కదిలిపోయిందన్న మాట. ఇలాంటి అంశాలన్నీ గమనించుకోవాలి.

మనోమయకోశాన్ని గురించి మనం పరిశీలిస్తున్నప్పుడే విజ్ఞానమయ, ఆనందమయ కోశాలు ఎలా పనిచేస్తున్నదీ, ఎంతలో ఉన్నదీ మనకు అవగాహనకు వస్తూనే ఉంటుంది. మనస్సుయొక్క ప్రవర్తనలో ఇటు ఔచిత్యస్థితీ, అటు ఆనందస్థితి ఎలా వర్తిస్తున్నదీ మనకు అందుతూనే ఉంటుంది కదా! కనుక హోమియోలో మానసిక వేదనలు అన్నప్పుడు-మనస్సు వరకూ వ్యక్తమవుతున్న వేదనలు -- అని అర్థం చేసికోవాలి. హోమియో ఔషధ శాస్త్రగ్రంథాలను అధ్యయనం చేసేటప్పుడు ఇలాంటి అవగాహనతో చేయాలి.

రోగార్తుడు చెప్పేటప్పుడు ఇన్ని స్థితులనూ కలగలుపుగా చెబుతూ ఉంటాడు. మనం అతడిని కాదనకుండా విని, తగిన విధంగా ఆ వివరాలను వ్రాసుకొంటూ ఉండాలి. అలాగే రోగార్తుని పట్టుకొని ఇలా ఉంటుందా, అలా ఉంటుందా?– అని అడగకూడదు. ఎలా ఉంటుందో అతనినే చెప్పనీయాలి. ఆ చెప్పేటందుకు కావల సిన దోహదాన్ని అందించాలి. అలాకాక ఇలా ఉంటుందా, అలా ఉంటుందా-అని మనమే అడిగితే ఆ రోగార్తుడు అందులో ఏదో ఒకదానికి తల ఊపి ఊరుకొంటాడు. అప్పుడది చెప్పించినట్లవుతుంది గాని అతడు చెప్పినట్లు కాదు. ఇంకా చెప్పాలీ అంటే అది మన కేస్‌షీట్ అవుతుంది కాని, అతడి కేస్‌షీట్ కాదు. మనస్సు బాగుండ లేదూ అన్నాడనుకోండి. ఆ బాగుండకపోవడమేమిటో అతడినే చెప్పనీయండి. అంతేగాని చచ్చిపోవాలని ఉంటుందా, అలాంటి ఆలోచనలు వస్తుంటాయా- అని అడగకండి! అది తప్పు. ఒక్కొక్కప్పుడు మీ మాటతీరుకు సమ్మోహితుడై రోగా ర్తుడు, మీరేం చెబితే దానికి 'అవునండీ అలాగే ఉంటుంది' అని అంటూ ఉంటాడు. లేదా ఒకొక్కడు—ఇంత పెద్దవాడు అడిగినప్పుడు అలా ఉండే ఉంటుందని అను కొని, మీమీద గౌరవంతో ఒప్పేసుకొంటాడు. ఇవన్నీ వేదనలనుకొని మీరతనికి మందిచ్చే ప్రయత్నం చేస్తారు. అందువల్ల అతడిని చెప్పనీయండి. అందుకు దోహదం చేయండి. సాధ్యమైనంత వరకు రోగార్తుని భాషలోనే వేదనలను వ్రాయండి. మన భాషను ప్రక్కన పెట్టండి. అతని భాషలో అతని బొమ్మ కనపడు తుంది. 'ఏం బాధండీ బాబూ! ప్రాణం పోయినట్లవుతుందంటే నమ్మండి!'- అని చెప్పాడనుకోండి. అది అలాగే వ్రాయండి. అలాగాక ఇతడు చాలా బాధపడుతున్నాడు అని వ్రాశారనుకోండి. ఆ చాలా బాధ ఏమిటో అది మీ వాక్యంలో ఇమడలేదు.

## పూ ర్వ చ రి త్ర

రోగార్తుని పూర్వచరిత్ర ఏమిటి? జీవితకాలంలో ఇంతవరకూ ఎలాంటెలాంటి వ్యాధి బాధలను అనుభవిస్తూ వచ్చాడు? ఏయే వ్యాధుల పేరిట అతడి కింతవరకు ఎలాంటి వైద్యం జరుగుతూ వచ్చింది?వాడబడిన ఔషధాల వల్ల వ్యాధి తిరిగిన మలు పులు ఏమిటి? ఔషధాల ప్రభావంవల్ల సరిక్రొత్త వేదనలేమయినా మొలకెత్తడం జరిగిందా?

అలాగే నడచిన జీవితంలో తిరిగిన పెద్ద మలుపులు ఏమిటి? జీవితంలోని మలుపులకూ, ఈ వ్యాధి బాధలకూ సంబంధమున్నదా? జీవితంలోని ఆటుపోటుల్తో

ఇలా ఇప్పటి వ్యాధిబాధలుగా రూపొందలేదు కదా!—ఈ వివరాలను అడిగి తెలిసికొని వ్రాసుకోవాలి.

## పూర్వుల చరిత్ర

తల్లిదండ్రుల ఆరోగ్య స్థితులు ఏమిటి? ఆ స్థితిగతులకూ, రోగార్తుని ఇప్పటి వ్యాధి స్థితులకూ సంబంధమున్నదా? సామ్యమున్నదా?- గమనించాలి. తల్లివైపున గాని, తండ్రివైపున గాని ఉన్నటువంటి పూర్వులు ఎలాంటి వ్యాధి బాధలను అనుభవించారో అడిగి తెలిసికోవాలి. అప్పుడు ఆ వారసత్వం రోగార్తుని మీద ఎంత వరకూ వ్యక్తమవుతోందో మనకు అవగాహనకు వస్తుంది. అలాగే వారసత్వంలో అకాలమరణాలు మొదలయినవి ఉన్నట్లయితే ప్రత్యేకంగా ఆ వివరాల్ని వ్రాసి కోవాలి.

చిన్నపిల్లల కేసు షీటు వ్రాస్తున్నప్పుడు వారసత్వాన్ని గూర్చి వ్రాస్తూ తల్లిదండ్రుల తరహాలను గూర్చి కావలసినంత వివరంగా గ్రహించి వ్రాసికోవాలి. అప్పుడు చిన్నపిల్లల లక్షణాలు తల్లికి దగ్గరగా ఉన్నాయో, తండ్రికి దగ్గరగా ఉన్నాయో మనకు బోధపడుతుంది.

## స్త్రీల విషయంలో

స్త్రీల విషయంలో ఇంతవరకూ చెప్పుకొన్న వివరాలతో బాటుగా మరికొన్ని వివరాలు మనకు కావాలి. స్త్రీ శరీరం సున్నితమైనది. కాని అడుగడుగునా ఆమెకే పెద్ద మార్పులు వచ్చిపడతాయి. పెద్దమనిషి కాకముందూ, అయిన తరువాత, వివాహం కాకముందూ, అయిన తరువాత, బిడ్డలు కలుగక ముందూ, కలిగిన తరువాత-ఈ దశలలో ఆమె ఆరోగ్యంలో పెద్ద మార్పులు వచ్చే అవకాశమున్నది. ఇవి శరీరానికి సంబంధించినవి.

అలాగే పుట్టినింటినుండి మెట్టినింటికి వచ్చిన తరువాత. ఇది ఒక పెద్ద మలుపు. ఈ క్రొత్త వాతావరణానికి ఆమె అలవాటు పడవలసి ఉంటుంది. అక్కడ ఏమాత్రం తేడా వచ్చినా, ఆమె ఆరోగ్యం పెద్ద ఎత్తున దెబ్బ తినడానికి అవకాశ మొంటుంది. తన ఊరు, తన పరిసరాలు, తన సన్నిహితులు అందరినీ, అన్నిటినీ ఒక్కసారిగా వదులుకొని, పూర్తిగా ఒక క్రొత్త ప్రపంచంలోనికి రావడం జరుగుతుంది కదా. కనుక ఈ దశ చాలా విలువైనది. పరిస్థితులు కలసిరానిపేళ ఇది చాలా జటిలమైనది అవుతుంది. అక్కడ నుండి అస్వస్థత ప్రకటితమవుతుంది.

అలాగే పెద్ద వయస్సున భర్త సారథ్యం నుండి బిడ్డల సారథ్యంలోనికి వెళ్ళవలసి వచ్చినప్పుడు మళ్ళీ అది ఒక మలుపు. కలసిరానివేళ అది ఒక కుదుపు. స్వస్థతను కదిపివేయగలిగిన కుదుపు అది. ఈ మలుపులూ, మార్పులూ మానసికమైనవి. వీటినన్నింటినీ గమనికలోనికి తీసికోవాలి.

ముఖ్యంగా నెలసరుల విషయాన్ని గూర్చి వివరంగా అడిగి తెలిసికోవాలి. నెలసరులు కొందరికి ముందుగా వస్తాయి. కొందరికి ఆలస్యమవుతాయి. కొందరికి ఋతుస్రావం అధికంగా ఉంటుంది. కొందరికి ఋతుస్రావం అంతగా ఉండదు. నెలసరికి ముందు కొందరు, నెలసరి సమయంలో కొందరూ, నెలసరి తరువాత కొందరూ తీవ్రవేదనలకు గురి అవుతారు. ఈ వివరాలు కావాలి.

ఈ అంశాలను గమనించే వేళలో స్త్రీల కేసు షీట్లను స్త్రీలే రూపొందిస్తే బాగుంటుంది. పురుషుల కయితే వారు వివరంగా చెప్పడానికి మొహమాట పడవచ్చు.

## మన గమనిక

ఇంతవరకూ రోగార్తుని నుండి మనం వేదనా సముదాయాన్ని స్వీకరించవలసిన విధి విధానాన్ని గురించి చెప్పుకున్నాం. రోగార్తుడు తాను చెప్పగలిగినంత వరకూ తాను చెబుతాడు. ప్రక్కనున్నవారు అతడు చెప్పలేని వాటిని పూరిస్తారు. మొత్తంమీద అడిగిన వాటికి జవాబులు వస్తాయి.

ఆ తరువాత మనమొక పని చేయాలి. అతడిని గూర్చిన మన గమనికలు ఏమిటో వాటిని చివరగా వ్రాసుకోవాలి. మనకు ఎలా కనిపించాడో, ఎలా అనిపించాడో, మన ఎదుటనున్న ఆ సమయంలో ప్రవర్తనలో ఎలాంటి విచిత్రాలను చూపించాడో, ఆ అంశాలన్నింటినీ క్రోడీకరించి వ్రాసుకోవాలి.

కొందరు అసహనంగా కనబడతారు. కొందరు స్థిరంగా కూర్చోలేరు. కొందరు ఇంకా ఎంతసేపు వ్రాస్తారండీ అని అడుగుతారు. కొందరు మధ్యలో విశ్రాంతిని కోరతారు. కొందరు రేపు మళ్ళీ కూర్చుందాంలెండి అంటారు. ఇవన్నీ అవసరమంటారా ? అని అడుగుతారు కొందరు. చేతులు కాళ్ళు చిత్రంగా కదిపేవారు, పెదవి కొరుక్కుంటూ ఉండేవారు, నోరు తెరచి అలాగే ఉండిపోయేవారు, పరిశుభ్రత లేకుండా ప్రవర్తించేవారు, మనముందే పిల్లల్ని పట్టుకుని బాదేవారు ఇలా ఎన్నో రకాలుగా ఉంటారు. వారి ప్రవర్తనలో చెప్పుకోదగ్గ అంశాలుగా కనబడినవన్నీ మన గమనికలుగా వ్రాసి పెట్టుకోవాలి.

క్రోడీకరణ

ఇక ఇప్పుడు వ్రాసి కొన్నదంతా ఒక దగ్గర పెట్టుకుని సారాంశాన్ని రూపొందించాలి. ఈ సారాంశాన్ని రూపొందించేటప్పుడు పైనుండి దిగువకు రావాలి. ముందు మానసిక వేదనలను క్రోడీకరించాలి. మనస్సువరకు వ్యక్తమవుతున్న ప్రధానమయిన వేదనలను ఎంచి వ్రాయాలి. ఆనందమయ, విజ్ఞానమయ, మనోమయ కోశాలు ఎలా ఉన్నది మనకు ఆ వాక్యాలలో స్పష్టంగా గోచరించాలి.

ఆ తరువాత ప్రాణమయకోశం చెంతకు రావాలి. బాధలు ఎప్పుడు ఉద్రేకిస్తున్నాయి! ఎప్పుడు ఉపశమిస్తున్నాయి. మొత్తంమీద ఉద్రేక, ఉపశమనాల స్వరూపమేమిటి అన్నది స్పష్టం కావాలి. అలాగే బాధలు ఎడమవైపున కేంద్రీకృతమవుతున్నాయా? కుడివైపున కేంద్రీకృతమవుతున్నాయా-అన్న అంశాన్నికూడా పరిశీలించాలి. ఎక్కువమందిలో ఈ అంశం స్పష్టంగా తెలుస్తుంది. వారే బాధలయినా చెప్పనీయండి. కొందరిలో ఆ బాధలన్నీ ఎడమవైపుకు వస్తాయి. మరికొందరిలో ఈ బాధలన్నీ కుడివైపునే ఉన్నాయని తెలుస్తుంది. కొందరిలో మాత్రం కుడి ఎడమలుగా ఉంటాయి. అంటే వారి విషయంలో ఈ అంశానికి సంబంధించి ప్రత్యేకత లేదన్నమాట. ఇంకొందరిలో ఒకసారి కుడివైపునా, ఇంకోసారి ఎడమవైపునా వస్తూ ఉంటాయి. అంటే తారుమారు అవుతూ ఉంటాయి. ఇలాంటి అంశాలన్నీ స్పష్టమయ్యేట్లుగా క్రోడీకరించుకోవాలి.

మొత్తం మీద రోగికి ఎలాంటి వాతావరణమంటే ఇష్టం. ఇది తెలియాలి. కాలాలలో ఏ కాలం ఇష్టం? రోజు మొత్తం మీద ఏ సమయమిష్టం. గృహ వాతావరణం ఎలా ఉంటే ఇష్టం? కార్యక్షేత్రం ఎలా ఉంటే ఆనందం?-ఇలాంటి ఇష్టాలన్నీ ఏమిటి-అన్నది క్రోడీకరింపబడాలి. ఆహార, విహారాలకు సంబంధించిన అభిరుచులు కూడా స్పష్టం చేయబడాలి.

వస్త్రధారణలోని అభిరుచులు కూడ క్రోడీకరించబడాలి. మొత్తం మీద ఏ కోణంలో ఎలాంటి స్థితిని ఇష్టపడుతున్నారు-అన్నది మనకు స్పష్టం కావాలి.

ఆటుపైన అన్నమయ కోశానికి సంబంధించిన విశేషాలుంటే వాటిని ఎంచి వ్రాయాలి. ఆ తరువాత మన గమనికలోని ప్రధాన అంశాలను ఉటంకించాలి. ఈ సారాంశం నుండి రోగార్తుని వేదనామయ చిత్రం మనకు స్పష్టం కావాలి. ఒక్కొటి

గమనించండి. సహజస్థితికన్నా భిన్నమైన స్థితి ఎక్కడ, ఏ కోశంలో, ఏ మాత్రం కనబడినా అది మనచేత స్వీకరింపబడవలసినదే.

వేదనా సముదాయాన్ని స్వీకరించడం ఒక కళ అని చెప్పాను. ఆ కళను బాగా అభ్యసించాలి. వేదనా సముదాయాన్ని సక్రమంగానూ, సమగ్రంగానూ స్వీకరించ గలిగితే, రోగార్తునికి వ్యాధి సగం తగ్గిపోయినట్లే!

ఈ వేదనా సముదాయాన్ని చెంతనిడుకొని ఇప్పుడు ఔషధ శాస్త్రాన్ని స్మరించాలి. అవసరమయితే సంప్రదించాలి. ఆరోగ్యవంతుని శరీరంపైన ఏ ఔషధ పదార్థం, సరిగా ఇలాంటి వేదనా సముదాయాన్ని వ్యక్తం చేసి ఉన్నదో, దానిని గమనించాలి. అప్పుడు ఆ ఔషధ పదార్థం ఈ రోగార్తునికి అందించబడవలసినదిగా నిర్ణయమవుతున్నదన్నమాట. దీనినే మనం ఔషధ నిర్ణయంలేక 'డ్రగ్ సెలక్షన్' అంటున్నాం. ఇక్కడ ఔషధాన్ని సూచిస్తున్నది రోగార్తునిలోని ప్రాణశక్తి. ఆ సూచనను సక్రమంగా అందుకొనవలసిన వాడు బైటనున్న వైద్యుడు. నిజానికి ఔషధాన్ని నిర్ణయిస్తున్నది ప్రాణశక్తియే !

# సూక్ష్మీకరణం

అప్పటికి హానిమాన్ మహాశయుడు ఇంకా అలోపతీ వైద్యునిగానే ఉన్నాడు. ఆ రోజుల్లోనే ఒక చిత్రమయిన సన్నివేశం జరిగింది. ఆ సన్నివేశమే తరువాత తరువాత ఇప్పటి ఈ సూక్ష్మీకరణ విధానానికి కావలసిన బాటను తీర్చిపెట్టింది.

రోగార్తులలో ఒకడు ఉబ్బసంతో బాధపడుతున్నాడు. ఒకరోజు రాత్రి అమిత మయిన బాధతో అతడు వచ్చాడు. అతనికి ఈయవలసిన మందు సీసాలో నిండు కొన్నది. ఏమి చేయాలో తోచలేదు. కాసిని నీటిని ఆ సీసాలో పోసి తగు మాత్రంగా కుదిలించి, ఆ రోగిచేత త్రాగించి పంపించాడు. సీసా గోడలకు అంటుకొని ఉన్న ఏ కాస్తమందో ఆ నీళ్ళలోనికి జారి రాబోతుందా-అన్నది హానిమాన్ మహాశయుని ఆశాభావం. అంత మాత్రం చేయగలిగామని తృప్తిపడ్డాడతను.

కాని ఒక విచిత్రం జరిగింది. రోగార్తునికి ఉబ్బస స్థితి ఉపశమించింది. స్వస్థత చిక్కడం మొదలుపెట్టింది. ఆశ్చర్య పోయాడు హానిమాన్. ఆ ఆశ్చర్యంలోనుండే ఆ చర్యను ఇక గమనించసాగాడు.

'ఔషధ ద్రవ్యాన్ని ఎంత తక్కువగా వాడితే అంత మంచిది. అంతేకాదు, ఔషధం పదార్థత్వాన్ని సన్న్యసిస్తున్న కొద్దీ గుణాత్మకంగా అది విజృంభిస్తున్నది'. అన్న సత్యాన్ని దర్శించాడు.

ఒక పదార్థానికి భౌతిక, రసాయనిక లక్షణాలుంటాయని మనకు తెలుసు. ఆ భౌతిక,రసాయనిక లక్షణాలకు పైన గుణాత్మకమయిన ఔషధ లక్షణాలు నిహితమై ఉంటాయని, సూక్ష్మీకరణ విధానం ద్వారా వాటిని మేల్కొలుపవచ్చునని దర్శించాడు హానిమాన్ మహాశయుడు.

మనమున్నాం. మనలో భౌతిక, రసాయనిక స్థితులు ఉన్నాయి. అటుపైన గుణమయమయిన స్థితి ఉన్నది. ఆపైన మనమున్నాము. సరిగా చూడగలిగినప్పుడు ప్రతి పదార్థములోనూ ఈ స్థితులు మనకు కనబడతాయి. ఇన్ని స్థితులూ మనకు కన బడతాయి.-ఇదీ అతడి దర్శనం.

మనము నిద్రపోతున్నాం. అప్పుడు మన భౌతిక స్థితి ఉన్నది. రసాయనిక స్థితి నడుస్తున్నది. గుణమయస్థితి నిద్రిస్తున్నది. మిత్రుడొకడు మనను తగు మాత్రంగా స్పృశించాడు. మెలుకువ వచ్చింది. గుణమయస్థితి వర్తించడం వెంటనే ప్రారంభమైంది. ఒక పదార్థానికి అలాంటి మేలుకొలుపునందించటమే సూక్ష్మీకరణ విధానంలో జరుగుతూ ఉన్నది. సూక్ష్మీకరణ విధానానికి నోచుకోని పదార్థం నిద్రిస్తున్న మానవుని వంటిది. సూక్ష్మీకరణ విధానానికి నోచుకున్న పదార్థం మేల్కాంచిన మానవుని వంటిది. నిద్రించినస్థితికీ, మేల్కాంచిన స్థితికీ ఉన్న తారతమ్యాన్ని మనం స్పష్టంగానే గమనించగలం గదా!

అలోపతీవారు నిద్రించిన పదార్థాన్ని ఔషధంగా వాడుతున్నారు. భౌతిక, రసాయనిక స్థితులవరకే దానిని వినియోగపరచుకోగలుగుతున్నారు. హోమియోపతీ వారు మేల్కాంచిన పదార్థాన్ని పదార్థంగా వాడుతున్నారు. ఆనందమయ కోశం నుండి, అన్నమయకోశం వరకు ఆ ఔషధస్పర్శను అందించగలుగుతున్నారు. అలోపతి ఔషధం మనిషిని రసాయనిక స్థితి వరకే ముట్టుకొంటున్నది. హోమియో ఔషధం మనిషి యొక్క నిజస్వరూపాన్ని కూడా స్పృశించి సేదతీర్చగలుగుతున్నది.

ఈ సందర్భంగా వ్యాఖ్యానిస్తూ ఇ. కె. మాస్టరుగారు 'అలోపతీ విధానం వైద్యశాస్త్రంలోని భౌతికవాదం'-అన్నారు. నేను ఇంకొకమాట కలుపుతున్నాను. అలోపతీవారు పదార్థాన్ని పదార్థంగా వాడుతున్నారు. కాగా, హోమియోపతీ వారు పదార్థాన్ని ఔషధంగా వాడగలుగుతున్నారు. ఆ పదార్థంనుండి పరమార్థాన్ని సాధించగలుగుతున్నారు.

సల్ఫరు అంటే గంధకం ఉన్నది. అలోపతీవారు దీనిని రసాయనిక కక్ష్య వరకే వాడుకొంటూ ఉండగా, హోమియోపతీవారు దీనిని సూక్ష్మీకరణ విధానాన మేలుకొలిపి రోగార్తుని జీవన విధానాన్నే సంస్కరిస్తున్నారు. ఒక సరిక్రొత్త జీవితాన్ని అతడికి ఈ ఔషధం ద్వారా అనుగ్రహిస్తున్నారు. రాగిని 'కాగు'గా వాడుకోవడానికీ, విద్యుత్తు ప్రవహించే తీగగా వాడుకోవడానికీ ఎంత తేడా ఉన్నది! కాగుగా అది వేడినీళ్ళను మాత్రమే అందిస్తున్నది. తీగగా అది విద్యుత్తును అందిపుచ్చుకొన్న వేళ ఎన్ని మహిమలను వ్యక్తం చేస్తున్నది! పదార్థం ఔషధంగా మేల్కాంచినవేళ దాని నుండి వ్యక్తమవుతున్న విశేషాలు ఇటువంటివి. రాగి ఒక్కటే, వాడుకొనే తీరులోనే తేడా! పదార్థమొక్కటే, వినియోగించే వైఖరులలోనే ఈ వైవిధ్యం.

కనుక మేమూ సల్ఫరు వాడుతున్నాం గదా, అనరాదు. ఎలా వాడుతున్నామూ, ఎలా వాడవలసి ఉన్నదీ-ఇదీ తెలియాలి.

## వి ధా న ము

విశేషమయిన ఈ సూక్ష్మీకరణ విధానాన్ని గూర్చి తగుమాత్రంగానే నేను మీకు పరిచయం చేస్తున్నాను. విధానాన్నంతటినీ మీ ముందు ఉంచడం లేదు. అందులో మనకు బోధపడేటందుకు కావలసినది మాత్రం తగిన విధంగా మీ ముందు ఉంచుతున్నాను. విధానాన్నంతా వర్ణించడంగా గాక, విధానమేమిటో బోధపడేలా చేయటమే నా ఉద్దేశం.

తగిన పద్ధతి ననుసరించి ఔషధ పదార్థంనుండి మూలద్రవ్యాన్ని రూపొంది స్తారు. ఒకవంతు మూలద్రవ్యం, 99 వంతులు స్వచ్ఛమైన జలం కలిపి, తగిన విధంగా కుదిలించాం అనుకోండి. 1 వ పొటెన్సీ అంటే '1C' రూపొందుతుందన్న మాట. ఇప్పుడు 1C గా రూపొందిన ద్రవ్యంనుండి ఒక వంతును తీసికొని దానికి 99 వంతులు స్వచ్ఛమయిన జలం కలిపి తగిన విధంగా మళ్ళీ కుదిలించామనుకోండి. 2C రూపొందుతుంది. 2C గా రూపొందిన ద్రవ్యంనుండి మళ్ళీ ఒకవంతు తీసికొని, దానికి 99 వంతుల స్వచ్ఛమయిన జలాన్ని కలిపి తగిన విధంగా కుదిలించామను కోండి 3C రూపొందుతుంది. ఇలా ఈ పద్ధతిని అనుసరిస్తూ పోతుంటే 6C, 30C, 200C, 1000C, 10,000C, 50,000C, 1,00,000C ఇవన్నీ కూడా వస్తాయి.

పొటెన్సీ పెరుగుతున్న కొద్దీ ఔషధం శక్తిమంత మవుతున్నదని మనందరకూ అనుభవమే! అయితే పొటెన్సీ పెరుగుతూ వస్తున్నకొద్దీ దానిలోని ఔషధ ద్రవ్యం తరుగుతూ వస్తున్నది. ఔషధ ద్రవ్యం తరుగుతూ వస్తున్నకొద్దీ, దాని యొక్క శక్తిరూపం విజృంభిస్తూ వస్తున్నది. 6C లో ఉన్న ద్రవ్యం 30C లో ఉండదు. 30C లో ఉన్న మాత్రంకూడా 200C లో ఉండదు. ఇలా వెళుతున్న కొద్దీ ఔషధం ద్రవ్యంగా తగ్గుతున్నది. శక్తిగా పెరుగుతున్నది. ఔషధం తన పదార్థత్వాన్ని వన్నె్రసిస్తూ ఇక గుణాత్మకంగా విజృంభిస్తున్నదన్నమాట! ఇది సృష్టి చిత్రం! సృష్టిలోని చిత్రం! హానిమాన్ మహాశయునికి ఈ సృష్టి తానుగా విప్పి చెప్పిన దివ్యమయిన చిత్రం. చిత్రమయిన సత్యం!

ఇక్కడ 'C' అంటె సెంటిసిమల్ (Centesimal) అని అర్థం. అనగా శతాంశ పద్ధతిని సూక్ష్మీకరించబడినది అని భావం. అలాగే ఉదాహరణకుగాను నేను

ఔషధ ద్రవ్యానికి స్వచ్ఛమయిన జలాన్ని కలిపి కుదిలించినట్లుగా చెప్పాను. ఇప్పుడు స్వచ్ఛమయిన జలానికి బదులుగా స్పిరిట్ ఆల్కహాలును వాడుతున్నారు. ఇలా వాడటం వలన ఔషధం దెబ్బతినకుండా ఉంటుంది.

## వి ని యో గ ము

ఒక నలుగురు వ్యాధిగ్రస్తులు ఒకేవిధమయిన వేదనా సముదాయాన్ని కలిగి ఉన్నారని అనుకొందాం. ఆ నలుగురికీ కూడా ఒకే ఔషధం సూచింపబడుతుంది అన్నది స్పష్టమేకదా! అయితే వేదనా సముదాయానికి సంబంధించిన లేత ముదుళ్ళు వారిలో ఉంటాయి. తీవ్రతలో తేడా ఉంటుంది. అదే వేదనా సముదాయం ఒకరిలో ఒక మాదిరిగా ఉండవచ్చు. ఒకరిలో తగు మాత్రంగా ఉండవచ్చు. ఒకరిలో గాఢంగా ఉండవచ్చు. ఒకరిలో గాఢతరంగా ఉండవచ్చు. ఇప్పుడేం చేయాలి? వేదనా సముదాయ వ్యక్తీకరణంలోని స్థాయీ భేదాలను వైద్యుడు తగిన పొటెన్సీల ద్వారా స్పృశించగలగాలి. అలా స్పృశించడానికే, స్పృశించగలగడానికే సూక్ష్మీకరణ విధానము ప్రత్యేకంగా రూపొందింపబడిందని గమనించుకోవాలి, గ్రహించుకోవాలి.

ప్రాణశక్తి వ్యాధి కారణాన్ని బహిష్కరించడానికై నిరంతరం ప్రయత్నిస్తూ ఉంటుంది. ఈ ప్రయత్నం కేంద్రం నుండి పరిధికి జరుగుతూ ఉంటుంది. అనగా ఆనందమయ కోశం నుండి అన్నమయ కోశం వరకు సాగుతూ ఉంటుంది. మన దగ్గరకు చేర వస్తున్న రోగార్తులలో ఈ ప్రాణశక్తి చేస్తున్న ప్రయత్నాలు వివిధ కక్ష్యలలో సాగుతున్న వారుంటారు. ఏయే కోశాలలో ప్రయత్నాలు ఏమాత్రంగా కనబడుతున్నదీ సావధానంగా గమనించుకొని, దానినిబట్టి వాడబడవలసిన పొటెన్సీ ఏమిటన్నది గ్రహించుకోవాలి.

వేదనలు అన్నమయ ప్రాణమయ కోశాలలో ప్రముఖంగా కనబడుతున్నాయనుకోండి. అప్పుడు 6 పొటెన్సీతో మనం వైద్యం ప్రారంభించాలి. అన్నమయ, ప్రాణమయ కోశాలతోబాటుగా, మనోమయకోశంలో కూడా చెప్పుకోదగిన విధంగా వేదనలు గోచరిస్తున్నాయనుకోండి. అప్పుడు 30 పొటెన్సీతో వైద్యాన్ని ప్రారంభించాలి.

అన్నమయ, ప్రాణమయ కోశాలకన్నా, మనోమయ కోశంలోనే వేదనలు గాఢంగా కనబడుతున్నప్పుడు 200 పొటెన్సీతో వైద్యాన్ని ప్రారంభించాలి. అన్న

మయ, ప్రాణమయ కోశాలను చేరకుండా, వేదనలు మనోమయ కోశాన్నే కల్లోల పరుస్తున్నప్పుడు 1Mతో వైద్యాన్ని ప్రారంభించాలి.

ఈ విధంగా వ్యాధియొక్క గాఢతను బట్టి పొటెన్సీ నిర్ణయింపబడాలి. నిజానికి పొటెన్సీ ప్రాణశక్తి చేతనే నిర్ణయింపబడి, వేదనల తీవ్రత రూపంలో మనకు సూచింపబడుతున్నది. ఆ సూచనను సూటిగా అందుకొనగలగడమే బయటనున్న వైద్యునకు చేతకావలసి ఉన్నది.

అవసరమయినప్పుడు అనగా ఆ అవసరాన్ని ప్రాణశక్తి సూచించినప్పుడు 10M వేయడానికయినా వెనుకాడకూడదు. అవసరం లేనప్పుడు అంత తీవ్రతను ప్రాణశక్తి చూపనప్పుడు 6 పొటెన్సీ అవసరమయినచోట 30 పొటెన్సీ వేయడానికి తొందరపడకూడదు.

ప్రాణశక్తిని బట్టి పోవాలితప్ప స్వంత నిర్ణయాలు చేయకూడదు. సొంత నమ్మకాలు కూపొందించుకోకూడదు. కొంతమంది చిన్న పొటెన్సీలంటే ఇష్టపడతారు. కొంతమంది పెద్ద పొటెన్సీలను వేయడానికి ముచ్చట పడతారు. ఇక్కడ మన ఇష్టాలతో, ముచ్చటలతో పనిలేదు. ప్రాణశక్తి చేస్తున్న నిర్ణయాన్ని అమలు పరచడమే మనం చేయవలసింది.

ఒక పెద్దాయన ఉన్నాడు. మనకు మిత్రుడు, హోమియో వైద్యుడు. ఒకసారి వాళ్ళ అబ్బాయికి ఎదురుదెబ్బ తగిలింది. 'ఆర్నికా' లక్షణాలు వచ్చాయి. ఆయన ఆర్నికా 200 వేశాడు. ఫలితం కనబడలేదు. బాధలు తగ్గలేదు. కొడుకు గొడవచేశాడు. అతడిని నా దగ్గరకి పంపించాడు ఆ మిత్రుడు. జరిగింది విన్నాను. జరగకూడనిది జరిగింది అని గమనించుకొన్నాను. ఇక్కడ వేదనలు ప్రధానంగా అన్నమయ, ప్రాణమయ కోశాలనుండి వ్యక్తమవుతున్నాయి. ఆర్నికా 6 వేస్తే పనిపోతుంది. ఆయన ఆర్నికా 200 వేశాడు. అది వెళ్ళి పై అంతస్తులో కూర్చుంది. ఇంటిలో పనిమనిషి రాలేదని ప్రధానమంత్రికి ఫోను చేసినట్లయింది. అప్పుడు నేను ఆ ఆర్నికా 200 ప్రభావాన్ని రద్దుచేసి ఆర్నికా 6 అతనికి అందించాను. వెంటనే గుణం కనిపించింది. అతడు హాయిని అనుభవిస్తూనే ఆశ్చర్యపోయాడు. 'నాన్న వేసినదీ ఇదే మందు కదా, కాని అప్పుడు తగ్గలేదు, ఇప్పుడు తగ్గింది'-అని. పొటెన్సీని గ్రహించడంలో నిపుణత అవసరమని అతనికి చెప్పాను. అదే ఇప్పుడు మీకూ చెబుతున్నాను. హోమియోలో ఔషధాన్ని గమనించడం ఒక తపస్సు అయితే,

పొటెన్సీని గమనించడం మరొక తపస్సు. సిద్ధహస్తులయిన వైద్యుల సన్నిధిలో సంవత్సరాల తరబడి రోగార్తులను సేవిస్తూ సంతరించుకోవలసిన నైపుణ్యమిది! ఇక్కడ అధ్యయనం చాలదు. అనుభవం కావాలి! అధ్యయనం అనుభవంగా రూపొందడానికి సిద్ధహస్తులయిన వారి సాహచర్యం మనకు లభించాలి! అది లభిస్తే అంతా లభించినట్లే!

దగ్గరగా ఉన్నవారి చెవి దగ్గర బిగ్గరగా అరిస్తే ఏమవుతుంది? వారికి బుర్ర పోతుంది. చిన్న పొటెన్సీ వేయబడవలసినచోట, పెద్ద పొటెన్సీ వాడటం ఇలాంటిదే! దూరంగా ఉన్నవారిని చిన్నగా, గొణుగుతున్నట్లుగా పిలిస్తే ఏమవుతుంది? మనకు ఆ గొణుగుడు మిగులుతుంది. పెద్ద పొటెన్సీని వేయవలసినచోట, చిన్న పొటెన్సీని వాడటం ఇలాంటిదే!

ఈ అధ్యాయంలో పొటెన్సీల వినియోగాన్ని గూర్చి చేయబడినది స్థూలమయిన విభజన మాత్రమే! మరికొంతదూరం పోయిన తరువాత, మరొకసారి ఈ పొటెన్సీల ప్రసక్తి తెస్తాను. మరికొన్ని సూక్ష్మాలు అక్కడ వివరిస్తాను.

### తిరిగి ఎప్పుడు

ఔషధం గమనించబడింది. పొటెన్సీ నిర్ధారింపబడింది. రోగార్తునికి ఒక 'డోసు' మందు ఈయబడింది. అంత వరకు బాగున్నది. డోసు తిరిగి ఎప్పుడు వేయాలి? ఇది ఒక పెద్ద ప్రశ్న. తగిన తపస్సుతో సమాధానాన్ని అందుకొనవలసిన ప్రశ్న ఇది!

కొంతమంది-'రోజూ ఒక డోసు వేసికొంటూ ఉండండి'- అంటున్నారు. కొంతమంది, ఒకరోజున ఉదయం ఒక డోసు, రాత్రి ఒకడోసు వేసి కొంతకాలం వేచి ఉండండి అంటున్నారు. వరుసగా రెండురోజులు రెండు డోసులు వేసి వేచి ఉండండి అంటున్నారు కొందరు. మూడు రోజులు మూడుడోసులు వేసి వేచి ఉండండి అనేవారున్నారు. నిజం చెప్పాలంటే ఇవన్నీ అలవాటుగా చెప్పబడుతున్నవే, అవసరముండి చెప్పబడుతున్నవి కావు.

మరి చేయవలసింది ఏమిటి? ఒకే ఒక డోసు వేయాలి. వేసి వేచి ఉండాలి. అది పనిచేస్తూ ఉంటుంది. చేస్తున్నట్లుగా మనకు తెలుస్తూ ఉంటుంది. వేదవల తీవ్రతలో మనకు చక్కని మార్పు కనబడుతుంది. ఆ మార్పు అలా సాగుతున్నంత వరకూ మళ్ళీ డోస్ వేయకూడదు.

ఒకడోసు పనిచేస్తూ ఉండగా మరొక డోసు వేస్తే ఏమవుతుంది? ఒక పని మనిషి పనిచేస్తూ ఉండగా, మరొక పనిమనిషిని కోరి రప్పిస్తే ఏమవుతుంది? సరిగా అదే జరుగుతుంది! రెండుడోసులూ ఘర్షణ పడతాయి. కథ అక్కడే నిలచిపోతుంది. కనుక వేయబడిన డోసును పనిచేయనీయాలి. మరొక డోసును దాని మీదకు పంప కూడదు.

కొందరు ఫలానా మందు ఒకడోసు ఇన్ని రోజులపాటు పనిచేస్తుంది అని లెక్కలు కడుతున్నారు ఆ లెక్కల ప్రకారం డోసులు వరుసగా అందించేస్తున్నారు. ఇది భావ్యంకాదు. అన్నాళ్ళే పనిచేయాలని ఎక్కడ ఉంది? కొందరిలో అంతకన్నా తక్కువరోజులు పనిచేయవచ్చు. కొందరిలో అంతకన్నా ఎక్కువరోజులు పని చేయవచ్చు. అది వారి వారి తత్త్వాలపైనా, వేదనల తీవ్రతలపైనా ఆధారపడి ఉంటుంది. కనుక లెక్కలుకట్టడం అంత మంచిపని కాదు.

మరి ఇంతకూ రెండవడోసు ఎప్పుడు వేయాలి? కంగారు పడవలసిన పని లేదు. రెండవడోసు ఎప్పుడు వేయబడాలన్నది ప్రాణశక్తి మనకు సూచిస్తుంది. ప్రాణశక్తి స్పష్టంగా సూచించేవరకూ వేచి ఉండటమే మన పని.

ప్రాణశక్తి ఎలా సూచిస్తుంది? 'రిపిటీషన్' అన్న మాటలోనే ఈ సూక్ష్మం దాగిఉన్నది. రి-పిటీషన్ పెట్టినప్పుడు! అనగా ప్రాణశక్తి తిరిగి అడిగినప్పుడు!

ప్రాణశక్తి తిరిగి ఎలా అడుగుతుంది? ఇదివరకు ఎలా అడిగిందో, ఇప్పుడూ అలాగే అడుగుతుంది! తగ్గినట్లుగా కనబడుతున్న వేదనలు, అలా కనబడుతున్నంత కాలం డోసు పనిచేస్తున్నట్లే! మళ్ళీ మరొక డోసు కావాలి అంటే ప్రాణశక్తి ఒకపని చేస్తుంది. తిరిగి వేదనలన్నింటినీ ప్రకటిస్తుంది. అన్ని కోశాలనుండి అంత తీవ్రం గానూ ప్రకటిస్తుంది. అలాంటి ప్రకటన జరిగితే ప్రాణశక్తికి మరొక డోసు మనం అందించవలసి ఉన్నదన్నమాట!

ఒకొక్కప్పుడు వేదనలు పై కోశాలలో తగ్గినట్లుగా గోచరిస్తూ, క్రింది కోశా లలో అనగా ప్రాణమయ, అన్నమయ కోశాలలో ఉద్రేకాన్ని ప్రకటిస్తాయి. అలాం టప్పుడు ప్రాణశక్తి మళ్ళీ అడుగుతున్నదని భావం త్వరపడకూడదు. ప్రాణశక్తి మళ్ళీ అడగడమే జరిగితే అన్నికోశాలనుండి అడుగుతుంది. మరి ఇక్కడ జరుగు తున్నది ఏమిటి? దీనిని ఎలా అర్థం చేసికోవాలి! అంటే మందు పనిచేస్తున్నది. ఆ ప్రయత్నంలో భాగంగానే దిగువ కోశాలలో ఈ ఉద్రేకస్థితి ప్రాప్తించింది. కొద్ది

కాలంలో ఈ స్థితినికూడా మందు దారికి తెస్తుంది. ఇది వ్యాధికారణం బహిష్క-రింపబడుతున్నవేళ అవసరమయి వచ్చిన ఉద్రేకం తప్ప మరొకటి కాదు. మరొక డోసు అవసరంలేదు. లోపలనున్న డోసు ఇంకా పనిచేస్తూనే ఉన్నది.

ఒకొక్కప్పుడు మధ్యమధ్యలో కొద్దిరోజులపాటు వేదనలన్నీ ఎక్కువయినట్లుగా కనబడతాయి. మహాఉంటే రెండు మూడు రోజులపాటు అలా ఉంటాయి. మళ్ళీ తగ్గిపోతూ ఉంటాయి. ఈలోపున తొందరపడి మరొక డోసు వేయకూడదు. ఎందువల్ల ఇలా జరుగుతుంది? నివారణ సరళరేఖవలే సాగదు. నీటి అలల వలె నడుస్తుంది. కనుక ఆమాత్రం ఎగుడు దిగుడులు కనబడతాయి. 

తిరిగి కనబడినప్పుడు డోసు వేయమన్నాము కదా అని ఆస్తమా, మూర్ఛల వంటి స్థితులలో అవి కనబడినప్పుడల్లా డోసు వేయకూడదు. తిరిగి కనబడటమన్న మాటను అర్థం చేసికోవడంలో తొందరపడకూడదు. ఆనందమయకోశంనుండి అన్నమయ కోశం వరకూ సావధానంగా గమనించుకొని, నిర్ధారించుకోవలసిన అంశమిది! కేవలం అటాక్ కనబడిందనో, స్ట్రోక్ వచ్చిందనో డోసు వేసేయకూడదు. అలా వేస్తే వ్యాధిని నయంకాకుండా మనమే చూస్తున్నామన్నమాట! అయితే ఒక పని చేయాలి! ఆయా లక్షణాల యొక్క తీవ్రతను గమనించుకొంటూ ఉండాలి. ఆస్తమా స్థితి మరల మరల కనబడవచ్చు. కాని తీవ్రత మాత్రం క్రమంగా తగ్గుతూ వస్తుంది. మూర్ఛలు ఇంకా రావచ్చు. వస్తాయి కూడా! ఎందువల్లనంటే అప్పటివరకూ అవి అలోపతీ వైద్యంచేత అణగద్రొక్కబడి ఉంటాయి కదా-ఇక్కడ మనం వాటిని తొక్కిపెట్టం కదా! కనుక మరల మరల వచ్చినట్లుగా కనబడతాయి. కాని క్రమంగా వాటి తీవ్రత తగ్గుతూ వస్తుంది. ఇలా మందు పనిచేస్తున్న విధానాన్ని ఒడుపుగా గమనించుకొంటూ ఉండాలి. 

ఏతావాతా చెప్పేదేమంటే, ప్రాణశక్తి మొదట ఎన్ని కోశాలనుండి ఎంత తీవ్రంగా వేదనలను ప్రకటించిందో, అన్నికోశాల నుండీ, అంత తీవ్రంగానూ మరల ప్రకటించినప్పుడు మాత్రమే మనం మరల ఇంకొక డోసువేయాలి—అని! అంత వరకూ డోసు వేయకూడదు. వేయాలన్న ఉబలాటం మనకు కూడదు.

అలాగే ఒకొక్కప్పుడు డోసు పనిచేసి నివారణ కొంతవరకు వచ్చి అక్కడనుండి కదలకుండా అలా నిలబడిపోతుంది. అప్పుడు కూడా మరొక అవసరమవుతుంది. ఇక్కడకూడా ప్రాణశక్తి సూచిస్తున్నది. కథ ఇంత వచ్చినది. ఇక కదలడంలేదు, మరొక డోసు అందించండి! అని. ఇలా ప్రా అడుగుతున్న వైనం ఖరారయితే తప్ప, మనం ఇంకొక డోసు అందించకూడ

కావలసిన డోసు పడిన తరువాత ఆ డోసు వారాలపాటు ప వారున్నారు. నెలల తరబడి పనిచేసిన వారున్నారు. సంవత్సరాల తరబడి ప వారున్నారు. అసలు ఆ డోసు అవసరమేరాని వారున్నారు. కాబట్టి త్వరపడకు

ఒకసారి ఒకామె ఉబ్బసంతో బాధపడుతూ వచ్చింది.'ఆర్సనికం అయో అనే ఔషధం ఆమెకు సూచించబడింది. 30 పొటెన్సీతో ఒక డోసు దానితో ఆమెకు ఇంతవరకూ మరొక డోసు అవసరం కాలేదు. కనుక గమనించాలి. ప్రాణశక్తి సూచించినప్పుడు అలక్ష్యం చేయకూడదు. ప్రా అడగనప్పుడు తగుదునమ్మా అని వేయకూడదు.

ఈ సందర్భంలో రోగార్తులు కూడ మనను తమకు తెలియకు తప్పుదారి పట్టిస్తుంటారు-'క్రిందటి సారి ఇచ్చిన మందు బాగా పనిచేసిందండీ-మరొకడోసు ఇప్పించండీ' అని అడుగుతూ ఉంటారు. ఆహాఁ, అలాగా, కంటేనా!-అని సంబరపడుతూ మరొక డోసు ఇచ్చేయకూడదు. ఒడ ప్రవర్తించాలి.

హోమియోలో ఔషధం చేస్తున్న పని ఏమిటి! ప్రాణశక్తికి కావ ప్రచోదనాన్ని అందించడం! ఆ ప్రచోదనం అలా అందివస్తున్నంత వరకూ మ డోసు యొక్క అవసరం ఏముంది! ఆలోచించండి. మరొకసారి ప్రచో అవసరం అయినప్పుడు కదా, మనం డోసు వేయాలి. ప్రచోదనం అవసరమం ప్రాణశక్తి తప్పక అడుగుతుంది కదా!

అయితే అనుభవజ్ఞులయిన వైద్యులు ఒక రోగార్తుని పరిశీలించి. రోజులకొక డోసు చొప్పున ఇన్ని డోసులు వాడి మళ్లీనాకు చెప్పవలసిం అంటున్నారు. ఇక్కడ వారు చేస్తున్నదేమంటే—తమకు గల అనుభవంతో రోగా

యొక్క ప్రాణశక్తిని పలుకరించి, దానితో శ్రుతిగలిపి ఈ నిర్ణయం చేయగలుగుతున్నారు. కాని, ప్రస్తుత లోకంలో ఇలా అనుభవంతో చేస్తున్నవారు అరుదుగా కనబడుతున్నారు. అలవాటు చొప్పునా, అభిరుచుల చొప్పున సాగిపోతున్నవారే ఎక్కువమంది. ప్రాణశక్తి ఎక్కడో, వీరెక్కడో! ప్రాణశక్తి ప్రభుసమ్మితమైనది. అది ఇటువంటి ఆకతాయి తనాలను అంగీకరిస్తుందా! అంగీకరించదు. కనుకనే సిద్ధహస్తులయిన హోమియో వైద్యులు అక్కడక్కడా తప్ప, మనకు కనబడటం లేదు. పట్టాలు అందుకోవడం చాలదు, ఈ పట్టాలను మనం ఎక్కగలిగి ఉండాలి! ఇది ఒక పట్టాన అంది వచ్చే విషయంకాదు. ఇందుకు మనం తపస్సు చేయాలి!

### పెంచుట ఎప్పుడు !

పొటెన్సీని పెంచవలసిన అవసరం ఎప్పుడు వస్తుంది? ఆ అవసరాన్ని కూడా ప్రాణశక్తే మనకు సూచిస్తుంది.

ఇందుకు ఉదాహరణగా ఒక దృశ్యాన్ని మీముందు ఉంచుతాను. అప్పుడు మీకు బాగా బోధపడుతుంది. ఒక రోగార్తుడు మన చెంతకు వచ్చాడు. వేదనా సముదాయాన్ని స్వీకరించాము. అతడికి కావలసిన ఔషధం 'నక్స్‌వామికా' అని గమనించాము. వేదనల స్థాయినిబట్టి 30 పొటెన్సీలో ఒక డోసు వేశాము.

ఒకనెల రోజులు అతనికి సుఖవుగా ఉంది. తరువాత వేదనలు కనబడ్డాయి.అంత తీవ్రంగానూ కనబడ్డాయి. ప్రాణశక్తి సూచనను అనుసరించి 30 పొటెన్సీలో మరొక డోసు వేశాము. ఈసారి కూడా నెలరోజుల పాటు హాయిగా ఉన్నాడతను. మళ్లీ వేదనలు అంత తీవ్రంగానూ కనబడ్డాయి. 30 పొటెన్సీలో మరొక డోసు వేశాము. ఈసారి 15 రోజులు మాత్రమే సుఖవును అనుభవించాడతను. వేదనలు మళ్లీవచ్చాయి. 30 పొటెన్సీలో ఇంకొక డోసు వేశాము. ఈసారి ఏడురోజుల పాటు హాయిగా ఉన్నాడతను. మళ్లీ వేదనలు వచ్చాయి. మళ్లీ 30 పొటెన్సీలో డోసు వేశాము. ఈసారి మూడు రోజులకే వేదనలు వచ్చేశాయి. మళ్లీ 30 పొటెన్సీలోనే డోసువేశాము. ఈసారి సుఖవు చిక్కలేదు.వేదనలు అలాగే ఉన్నాయి. అంటే ఏమిటన్నమాట. ఈ పొటెన్సీ ఇక పనిచేయదని ప్రాణశక్తి మనకు చెబుతున్న

దన్నమాట! సుళువు చిక్కుతున్న సమయం తగ్గుతూ రావడం ప్రారంభించినప్పటి నుండీ, మనకు ఈ విషయాన్ని ప్రాణశక్తి సూచిస్తూ వస్తున్నదన్నమాట! అప్పుడు మనం అది గమనించుకొని'200' పొటెన్సీలో ఒక డోసు వేశాము. అతడిక హాయిగా ఉన్నాడు.

ఇలా ప్రాణశక్తి పొటెన్సీని ఎప్పుడు ఎలా పెంచవలసినదీ ఎప్పటికప్పుడు సూచిస్తూనే ఉంటుంది. ప్రాణశక్తి అడుగుతున్న విధంగా అమర్చిపెట్టడమే మనం చేయవలసిన పని !

సర్వసాధారణంగా వైద్యాన్ని ప్రారంభించేటప్పుడు ప్రాణశక్తి సూచిస్తున్న పొటెన్సీ కన్నా, క్రింది పొటెన్సీని మొదటగా ఇస్తాం. అప్పుడేం జరుగుతుంది! ముందు, మందు అదేనని ఋజువవుతుంది. ఆ పొటెన్సీ కొద్దిరోజులపాటు పనిచేసి పై పొటెన్సీని అడుగుతుంది. ఇక అక్కడనుండి నివారణ ప్రారంభమవుతుంది. ప్రాణశక్తి యెడల ఆచితూచి అడుగు కదిపే ప్రయత్నమిది!

ఈయబడవలసిన దానికన్నా మరీ తక్కువ పొటెన్సీ ఇస్తే ఏమవుతుంది ? అప్పుడు రెండు విధాలుగా జరగవచ్చు. మొదటిది-మందు చాలా కొద్దికాలం మాత్రమే పని చేయవచ్చు. రెండవది—వేదనలన్నీ కదపబడి ఉద్రేకస్థితి ప్రాప్తించవచ్చు. ఇది ఎక్కువ కావడం కాదు. కేవలం కదలడం! వేసిన పొటెన్సీ కదిలించగలిగింది గాని, సముదాయించలేక పోతోందన్న మాట !

ముగ్గు ఉన్నది. దానిని పోయవచ్చు, వేయవచ్చు. పోసినప్పుడు చూడలేము. వేసినప్పుడు ఆనందించగలం! ఔషధం ఆ ముగ్గులాంటిది. పోయడం తేలికే, వేయడానికి వేయి విధాల కృషి కావాలి. వేయి కన్నుల గమనిక కావాలి. వేయింతల శ్రద్ధ కావాలి.

## మార్చుట ఎప్పుడు ?

రోగార్తుడు మన చెంతకు వస్తాడు. ఒకానొక ఔషధం అతడినుండి సూచింపబడుతుంది. తగిన పొటెన్సీలో దానిని అతడికి అందిస్తాం. అవసరాన్ని బట్టి పొటెన్సీని హెచ్చిస్తాం. బాగున్నది. అంతవరకు బోధపడుతున్నది. మరి ఆ ఔషధం ఒక్కటే అతనికి స్వస్థతను అందించగలుగుతుందా? లేక మరొక ఔషధం కూడా అవసరమవుతుందా ? ఒకవేళ అవసరమయితే ఎలా తెలుస్తుంది?

మొదటగా సూచింపబడిన ఔషధమే పూర్తి నివారణను అందించవచ్చు. కొన్ని సందర్భాలలో మరొక ఔషధం కూడ అవసరం కావచ్చు. అలాంటప్పుడు ప్రాణశక్తే మనకు ఆ అవసరాన్ని సూచిస్తుంది. అంతవరకూ వ్యక్తమవుతున్న వేదనా సముదాయాన్ని ఉపసంహరించుకొని తనకు అవసరమయిన నూతన ఔషధం యొక్క వేదనా సముదాయాన్ని స్పష్టంగానూ, సమగ్రంగానూ ప్రకటిస్తుంది. మనం గుర్తుపట్టగలిగేటట్లుగా ప్రకటిస్తుంది.

ఒక ఔషధం నుండి మరొక ఔషధానికి రోగార్తుడు మారడం చిత్రంగా జరుగుతుంది. సినిమాహాలులో చలనచిత్రం మారినట్లుగా ఇక్కడ వేదనా సముదాయం మారిపోతుంది. హాలు అదే, చిత్రం మారింది! రోగార్తుడు అతడే, వేదనా సముదాయం మారింది.

సర్వసాధారణంగా అంతకు ముందటి ఔషధంతో అనుబంధమున్న ఔషధమే సూచింపబడుతుంది. మనలో స్నేహాలూ,చుట్టరికాలూ ఉన్నట్లుగానే ఔషధాల మధ్య కూడా స్నేహాలూ, చుట్టరికాలూ ఉన్నాయి.మనకుశుభ కార్యాలు వచ్చినప్పుడు మన బదులువారు వచ్చి నిలబడినట్లుగానే ఇక్కడ కూడా ఆయా ఔషధాలు వ్యక్తమవుతూ ఉంటాయి. మనమూ, మన బంధుమిత్రుల వ్యవస్థ ఎటువంటిదో, ఔషధాల వ్యవస్థ కూడా అటువంటిదే! ఎవరికొరకు ఎవరొస్తారో తెలిసినట్లుగానే, ఏ ఔషధం తరువాత ఏఔషధం వ్యక్తంకావచ్చునోకూడా మనకు తెలుస్తూనే ఉంటుంది. ఇది సృష్టిగతమయిన ఒక ఏర్పాటు!

ఈ సందర్భంగా ఒక జాగరూకతను పాటించాలి. ప్రాణశక్తి ఒక ఔషధం నుండి, మరొక ఔషధానికి తరలుతున్న వేళ ఆ సంధిసమయంలో మనం జాగ్రత్తగా మెలగాలి! క్రొత్త ఔషధమేమిటన్నది పూర్తిగా స్పష్టమయ్యేవరకూ, పాత ఔషధం మీదనే రోగార్తుని ఉంచాలి. తొందరపడి క్రొత్త ఔషధాన్ని వేసేయకూడదు. వేస్తే పరిస్థితి అస్తవ్యస్తమవుతుంది.

మేం చదువుకొనే రోజుల్లో మచిలీపట్నంలో సినిమా హాళ్ళవాళ్ళు కొన్ని చిత్రాలు చేసేవారు! రెండు మూడు రోజుల్లో ఉన్న చిత్రం మారుతుంది అనంగానే క్రొత్త చిత్రాల బోర్డులు పెట్టేసేవారు. ఆ బోర్డులను బట్టి తొందరపడి, టికెట్టుకొని హాల్లులోనికి జొరబడినవారికి, తాము అదివరకు చూసిన పాత చిత్రమే దర్శన

మిచ్చేది. ఇక్కడ జరిగింది ఏమిటి? వారు బోర్డులను దూరాన ఉండి చూశారు గాని, దగ్గరకు పోయి చూడలేదు. దానితో వారు తారీకును గమనించలేదు. అలాగే ఆ బోర్డులలాగా క్రొత్త ఔషధం యొక్క ఛాయలు కనబడుతాయి. ఆ ఛాయలను చూసి, వెంటనే ఆ ఔషధాన్ని వేసేయకూడదు. ఆనందమయ కోశం నుండి అన్నమయ కోశం వరకూ, ఆ నూతన ఔషధం యొక్క వేదనా సముదాయం సమగ్రంగా సుస్పష్టమయ్యేవరకూ వేచి ఉండాలి. అనగా ప్రాణశక్తి పూర్తిగా ంతతో అడిగేటంత వరకూ మన చేయి ఆ ఔషధం పైపుకు పోరాదు.

ఇలా ఒకటో, రెండో, మూడో, నాలుగో ఔషధాలను ఒక దాని తరువాత ఒకటిగా అడిగి తీసికొని రోగార్తునికి పరిపూర్ణమయిన స్వస్థత అంది వచ్చేటంత వరకూ, ఆడుకొంటూ ఉంటుంది ప్రాణశక్తి.

## ఇంకొక సూక్ష్మం

ఇంకొక సూక్ష్మ మేమిటంటే ఎట్టి సందర్భంలో కూడా రెండు ఔషధాలు సూచింపబడవు. ఒక సమయాన ఒకే వేదనా సముదాయముంటుంది. ఒకే ఔషధం సూచింపబడుతుంది.

ఒక్కొక్కప్పుడు అనగా మనం ప్రాణమయ కోశం వరకే చూస్తున్నప్పుడు ఒకటికి రెండు ఔషధాలు సూచింపబడుతున్నాయా అని అనిపిస్తుంది. అది సరికాదు. మన చూపు ఆపై వరకు సాగాలి. మనోమయ కోశంనుండి ఆనందమయ కోశం వరకు మన దృష్టిని మనం సారించగలిగిన వేళ మనకు ఇలాంటి సందేహాలు రావు. మనస్సు వరకూ ఉన్న వేదనలు ఎప్పుడూ స్పష్టంగా ఉంటాయి. వాటి వెలుగులో దిగువ కోశాల వేదనలను మనం సరిజూచుకోవలసి ఉంటుంది. మనిషికి తల ఎటు వంటిదో, వేదనా సముదాయానికి మానసిక వేదనలు అటువంటివి. మనిషిని ముఖ్యంగా మనం దేనినిబట్టి గుర్తుపట్టగలుగుతున్నాం? తలనుబట్టే కదా! తలను అవతల పెట్టి, మనిషి ఇవతలకు వచ్చాడనుకోండి, మనం గుర్తు పట్టగలమా? అప్పుడు మనం అనుమానించగలం గాని, గుర్తుపట్టలేము. అలాగే మానసిక వేదనలను పట్టించు కోకుండా ప్రాణమయ కోశం వరకే మనం చూడగలిగినప్పుడు ఔషధం ఇదా, అదా అని అనుమానించగలుగుతున్నాం తప్ప, గుర్తు పట్టలేకపోతున్నాము. గుర్తుపట్టలేక

పోగా ఆ అసమర్థతను దాచిపెడుతూ, ఇక్కడ రెండు ఔషధాలు సూచింపబడుతున్నా యేమిటి-అంటూ, ఆశ్చర్యపడుతున్నాము. ఇక్కడ ఆశ్చర్యపడటమనగా ఇక పడటమే! ప్రాణమయం వరకే చూస్తున్నవారికి ఈ అయోమయం తప్పదు! అయిదు కోశాలనూ చూడగలిగిన వారికి ఇక అనుమానం ఉండదు. ఒక సమయాన రోగార్తుని నుండి ఒకే వేదనా సముదాయం వ్యక్తమవుతుంది. అది ఒకే ఔషధాన్ని సూచిస్తుంది. ఆయుర్వేదంలో దీనినే 'ఏక మూలికా ప్రయోగ'మంటారు.

ఈ విధంగా ప్రాణ శక్తి తన ఆధ్వర్యంలో ఇంత కథనూ నడిపిస్తున్నది. తానే ఔషధాన్ని సూచిస్తున్నది. తానే పొటెన్సీని నిర్ధారిస్తున్నది. తానే·తిరిగి డోసును ఎప్పుడు వేయవలసినదీ తట్టి చెబుతున్నది. తానే పొటెన్సీని ఎప్పుడు హెచ్చించ వలసినదీ మనకు హెచ్చరిక చేస్తున్నది. తానే మరొక ఔషధం అవసరమా కాదా అన్న అంశాన్ని కూడా తేల్చి చెబుతున్నది. అవసరమైతే ఆ ఔషధాన్ని తానే అడిగి తీసికొంటున్నది. ఇలా ఇన్ని విధాలుగా పని చేస్తూ, బయట వున్న వైద్యుని తనకు అన్ని విధాలా కలసి రమ్మని ప్రేమ పూర్వకంగా కోరుతూ ఉన్నది. తనను సమగ్రంగా గమనించుకొంటూ, తన చర్యలను బోధపరచుకొంటూ, తనకు కట్టుబడి పని చేయవలసిందిగా అతడికి వెన్నుతట్టి చెబుతున్నది. అతడిని నిలబెట్టి వదుపు తున్నది. అతడి ఆసరాతో అఖిల జగత్తుకు నిండయిన స్వస్థతను అనుగ్రహించ గలను అంటున్నది. వైద్యుడా! నాకు నీవు ఈమాత్రం ఆసరాగా నిలబడితే చాలు! నేనిక మానవ జాతిని ఏమాత్రం వ్యాధి బాధలకు బలి కానీయను! రా, కదలిరా! రా కలిసి రా! రా తెలిసి రా! అంటూ చేతులు చాచి ఆహ్వానాన్ని పలుకుతూ ఉన్నది. తన గుండెలకు మనను హత్తుకోనున్నది.

# నివారణ – వైఖరులు

చేరవచ్చిన రోగార్తుని నుండి వేదనా సముదాయాన్ని స్వీకరించాము. వేదనా సముదాయం ఏ ఔషధాన్ని సూచిస్తున్నదీ గమనించుకొన్నాం. వేదనల స్థాయినిబట్టి తగిన పొటెన్సీని నిర్ధారించుకొని ఆ ఔషధాన్ని ఒక దోసు రోగార్తునికి ఇచ్చాము. ఇక రోగార్తునిలో నివారణ ప్రారంభం కావలసి ఉన్నది. ఆ నివారణను గమనించడం ఎలా? ఆ నివారణ యొక్క వైఖరులు ఎలా ఉంటాయి? ఎలా ఉంటే మనం నిశ్చింతగా ఉండవచ్చు? ఎలా ఉంటే మనని మనం సరిజూచుకోవలసి ఉంటుంది?– ఈ అంశాలను ఈ అధ్యాయంలో చెప్పుకొందాం.

## కేంద్రం నుండి పరిధికి

ఈ సృష్టి కేంద్రంనుండి పరిధికి వ్యక్తమవుతున్నది. పద్మము ఎలా విచ్చుకొంటున్నది. అలా విచ్చుకొంటున్నది. నారాయణుని నాభినుండి వెలువడిన పద్మములో బ్రహ్మదేవుడు కూర్చొని ఉన్నాడన్నా, లక్ష్మీదేవి పద్మాన్ని తన ఆసనంగా స్వీకరించింది అన్నా భావమిదే! మనకు ఈ సూత్రాన్ని ఉపదేశించడమే!

ఇక మన సంగతికి వద్దాం. ఆనందమయకోశం మనకు కేంద్రం. అన్నమయ కోశం మనకు పరిధి. కేంద్రమునుండి పరిధికి వ్యక్తమవుతూ ఉన్నాం మనం. సృష్టిలో ఏమి జరుగుతున్నదో మనలోనూ అదే జరుగుతున్నది.

వ్యాధి కారణాన్ని నిష్క్రమింపజేసే ప్రయత్నం కూడా కేంద్రం నుండి పరిధి వరకు ప్రాణశక్తి అధ్వర్యంలో జరుగుతూ ఉంటుంది. అందుకనే వేదనాసముదాయాన్ని స్వీకరించేవేళ ఆనందమయ కోశంనుండి అన్నమయ కోశం వరకు, ప్రాణశక్తి చేస్తూ వస్తున్న ప్రయత్నాలను సావధానంగానూ, సాకల్యంగానూ గమనించవలసి ఉంటుంది అని చెప్పుకోవడం జరిగింది.

వేదనా సముదాయాన్ని బట్టి తగిన ఔషధాన్ని కావలసిన విధంగా అందిస్తాము. అప్పుడు ప్రాణశక్తి ఆ ఔషధంచేత ప్రబోధింపబడుతుంది. ఇక నివారణ ప్రారంభమవుతుంది. ఆ నివారణ కూడ కేంద్రమునుండి పరిధికి వ్యక్తమవుతుంది.

ఔషధాన్ని అందించిన వైద్యుడు ఈ విధమయిన చూపును కలిగి ఉండాలి. ద్రుమునుండి పరిధికి వ్యక్తమవుతూ వస్తున్న నివారణను అతడు గమనించుకో ఉండాలి. నివారణ అలా జరుగని పక్షంలో తాను దారితప్పినట్లు కూడ అతడు ెకోగలిగి ఉండాలి.

మనం వేసిన ఔషధం సరి అయినదా, కాదా?-ఈ అంశాన్ని ప్రాణశక్తి తేల్చి చెబుతుంది. మనం మందు వేసే ముందూ ప్రాణశక్తి వైపునకే చూడాలి. తరువాత కూడ ప్రాణశక్తి వైపునకే చూడాలి. గురువును శిష్యుడు అనుస రిస్తున్నట్లుగా, మనం ప్రాణశక్తిని అనుసరించాలి. ప్రాణశక్తి అవునూ అంటే ను, కాదూ అంటే కాదు-అని తెలిసికొంటూ, దాని ప్రకారం నడుచుకొంటూ ాలి.

ఒక ఉదాహరణ చెబుతాను. ఒకతనికి చనిపోదామనిపిస్తున్నది. చేయగలిగి ఏమీ కనిపించడం లేదు. నిద్ర పట్టడం లేదు. అజీర్ణస్థితి ఉన్నది. కురుపులు న్నాయి. శ్రద్ధగా గమనించండి. ఇందులో ఒక్కొక్క వేదన ఒక్కొక్క ానికి సంబంధించి ఉంది. చనిపోదామని అనిపించడం—ఆనందమయ కోశానికి ంబంధించిన వేదన. చేయగలిగినది కనిపించక పోవడం విజ్ఞానమయ కోశానికి ంబంధించిన వేదన. నిద్రపట్టక పోవడం మనోమయ కోశానికి సంబంధించిన న. అజీర్ణస్థితి ప్రాణమయ కోశానికి సంబంధించిన వేదన. కురుపులు లేవడం న్నమయ కోశానికి సంబంధించిన వేదన—ఇలా అన్ని కోశాలూ అస్వస్థతలో బపడుచుకొంటున్నాయి.

సరే, రోగార్తుణ్ని కూర్చోపెట్టి వేదనలన్నింటినీ, అన్ని కోశాల నుండీ గమ చుకొని, సూచింపబడుతున్న ఔషధమిది అని ఒక నిర్ణయానికి వచ్చి, తగిన టెన్సీలో అతనికి ఒక డోసు ఇచ్చాం. ఇచ్చి గమనిస్తున్నాం.

ముందుగా అతనికి చనిపోదామన్న భావన కరిగింది. చేయగలిగినది ఉన్నది ని అటుపైన తెలిసి వచ్చింది. ఇక నిద్రపట్టడం ప్రారంభమైంది. క్రమంగా జీర్ణస్థితి సర్దుకుంది. కురుపులు కొంతకాలం పాటు విజృంభించి, శలవు తీసు న్నాయి. అంటే ఇక్కడ నివారణ సృష్టి సూత్రానికి అనుగుణంగా కేంద్రం నుండి రిధికి చక్కగా వ్యక్తమైంది. మననుండి అందినది సరైన ఔషధమన్నమాట!

అలాకాక, లోపలి కోశాలకథ అలాగే ఉండగా కురుపులు మాత్రం త
ఊరుకున్నాయనుకోండి. రోగి సంతోషంగానే చెబుతాడు. కనబడుతున్నవి తగ్గాయి
మరి! మనం సంతోషించకూడదు. తప్పు జరిగిందని తెలిసికోవాలి! నివారణ కేంద్ర
నుండి పరిధికి క్రమంగా వ్యక్తం కాకుండా, ఒక్కసారిగా పరిధిపైన కనబడి ఊ
కొంది. అంటే ఔషధం గురి తప్పింది. కాని మందు పడింది. మనం రోగిని కాకుం
రోగాన్ని చూసి ఉంటాం. ఆ రోగాన్ని కూడా పూర్తిగా చూడకుండా, కురుపు
పైన మన దృష్టిని నిలిపి ఉంటాం. మనం కురుపుల వరకే చూసేటప్పటికి ఇప్ప
డింత పని జరిగింది. ఇది ఎంత ప్రమాదమో తెలుసా! లోపలి కోశాలలో క
అలాగే ఉండి పరిధిపైన ఉపశమనం రావడమంటే ఇక లోపలి కోశాలు భరిం
లేనంత ఉద్వేగాన్ని పొందుతాయి. ప్రాణశక్తి ఆ కురుపులను మళ్ళీ తీసుకు
వచ్చేంత వరకూ నిద్రపోదు. అయినా పెళ్లి కాకుండానే పందిరి తీసేస్తామంటే ఎలా
ఎవరొప్పుకుంటారు. కనుక ఇలాంటి కాని పనులు తలపెట్టకూడదు. వైద్యుడు
కేవలం చర్మం పైననే గురిపెట్టకూడదు. ఒకవేళ గురిపెట్టి, తాత్కాలికమయిన వి
యాన్ని మనం పాక్షికంగా సాధించినా, ప్రాణశక్తి సహించదు. అలా చేసిన వారి
క్షమించదు.

ప్రాణశక్తి తగినంతగా ఉన్నప్పుడు నివారణ కేంద్రం నుండి పరిధికి అన్ని
కోశాలలోనూ ఏకకాలంలో వ్యక్తం కావడానికి వీలు కుదురుతుంది. అలా కాక
ప్రాణశక్తి తగిన స్థితిలో లేనప్పుడు, నివారణ కేంద్రం నుండి ప్రారంభమై,
పరిధికి క్రమక్రమంగా, అంచెలంచెల మీద అందివస్తుంది. అలా అందివస్తున్నప్పుడు
రోగార్తుడు అన్నమయ, ప్రాణమయ కోశాలలోని వేదనలను చూపుతూ-'ఇంకా తగ్గ
లేదు, ఇంకా తగ్గలేదు.-అని అంటాడు. మనం మాత్రం లోపలి కోశాల వైపు చూస్తూ
ఊరట పొందుతూ ఉండాలి. కేస్‌షీట్ దగ్గర పెట్టుకుని, ఆ లోపలి కోశాలలో స్థిర
పడుతున్న నివారణను గూర్చి మరల మరల గమనించుకొంటూ ఉండాలి. ఈ పై
కోశాలకు కూడా నివారణ అందిరాబోతున్నదని రోగార్తునికి తెలియజెప్పాలి. డోసు
మళ్లీ వేసుకుంటూ, పొరబడి, త్వరపడి మందును మార్చివేయకుండా జాగరూకతతో
మెలగాలి.

రోగార్తులు చిత్రంగా ప్రవర్తిస్తూ ఉంటారు. వారు తగ్గినవి సామాన్యంగా
చెప్పరు. తగ్గవలసినదే ఎప్పటికప్పుడు ఏకరువు పెడుతూ ఉంటారు. మనం తగ్గిన
వాటిని గూర్చి అడుగుతూ ఉంటాం. అది తగ్గిందని ఇదివరకే మీకు చెప్పాం

దండీ!—అంటారు వాళ్ళు. తగ్గవలసింది మనం చెబుతుంటే, తగ్గిన దానిని గూర్చి మళ్లీమళ్లీ అడుగుతారేమిటి?-అన్నది వాళ్ల భావన. అది తగ్గింది కదా! అలాగే ఇవి కూడా తగ్గుతాయి—అన్నది మన దర్శనం. రోగార్తుని అనునయిస్తూ కథను ముందుకు నడపడమే కర్తవ్యం!

## పైనుండి దిగువకు

నివారణ కేంద్రం నుండి పరిధికి వ్యక్తమయినట్లుగానే, పైనుండి దిగువకు కూడా వ్యక్తమవుతుంది.

ఒక రోగార్తునికి తలనొప్పి, నడుమునొప్పి, మోకాళ్ళనొప్పి ఉన్నాయనుకోండి. కనబడితే మూడిటిలోనూ ఒకే గుణం కనబడుతుంది. లేకపోయినట్లయితే ఒకదాని తరువాత ఒకటి పైనుండి దిగువకు తగ్గుతూ రావడం కనిపిస్తుంది. ముందు తలనొప్పి తగ్గుతుంది. అటుపైన నడుము నొప్పి తగ్గుతుంది. ఆ తరువాత మోకాళ్ళ నొప్పి తగ్గుతుంది.

కొన్ని సందర్భాలలో నొప్పి పైనుండి క్రిందకు దిగడం కూడా కనిపిస్తుంది. తలనొప్పి తగ్గి నడుము నొప్పి పెరుగుతుంది. పెరిగి అలా కొన్నాళ్ళపాటు ఉంటుంది. తరువాత నడుము నొప్పి తగ్గి మోకాళ్ళనొప్పి పెరుగుతుంది. మోకాళ్లు అలా కొంతకాలంపాటు మొండికేస్తాయి. తరువాత మెల్లగా చీలమండలకు చేరుతుంది ఆ నొప్పి. అక్కడ కొంతకాలముండి అలా, అలా అంతర్ధానమవుతుంది.

వస్తున్న రోగార్తుడు, 'నడుము నొప్పి చంపేస్తోందండీ!-అంటాడు. మరి తలనొప్పి మాటేమిటి అంటే, అది ఇప్పుడు లేదనుకోండి. నిజం చెప్పాలంటే నేనిప్పుడు దానిసంగతి మరచిపోయాను అంటాడు. అప్పుడు పైనుండి దిగువకు నొప్పి దిగివస్తున్న వైనాన్ని అతడికి తగుమాత్రంగా చెప్పి అతడి కంగారును పోగొట్టగలగాలి. మందు చక్కగా పనిచేస్తున్నదని మనం గమనించుకోవాలి.

అలాగాక, తలనొప్పి, నడుం నొప్పి అలాగే ఉండగా మోకాళ్ళ నొప్పిమాత్రం ముందుగా తగ్గిందనుకోండి. కొంప మునిగిందన్నమాట! దారి తప్పామన్నమాట! కానిమందేదో పడిందన్నమాట! ప్రాణశక్తి మనను ఇలా హెచ్చరిస్తున్నదన్నమాట!

## ప్రధానమైన భాగాలనుండి అప్రధానమైన భాగాలకు

నివారణ కేంద్రంనుండి పరిధికీ, పైనుండి దిగువకూ వ్యక్తమయినట్లుగా ప్రధానమయిన భాగాలనుండి అప్రధానమైన భాగాలకు కూడ వ్యక్తమవుతుంది.

ఒక రోగార్తుడు ఇటు గుండెబరువు తోనూ, అటు సంధి బంధాల వాపు తోనూ వేదన చెందుతున్నాడు. చికిత్స సరైనదయినప్పుడు ముందు అతనికి గుండె బరువు తగ్గుతుంది. ఆ తరువాత క్రమక్రమంగా, అంచెలంచెల మీద సంధిబంధ వాపులు సర్దుకుంటాయి.

అలాకాక, చికిత్స ప్రారంభమయిన వెంటనే గుండె బరువు అలాగే ఉండి సంధిబంధాల వాపులలో గుణం కనిపించినట్లుగా ఉన్నదనుకోండి. సంతోషించకండి తప్పు జరిగింది! ముప్పు ముంచుకొస్తోంది. ఇప్పుడు గుండె బరువు ఇంకా పెరుగుతుంది. మనిషి ఉనికికే ప్రమాదం వాటిల్లగలిగిన స్థితి ఇది! వెంటనే దానికి రండి! సరైన ఔషధాన్ని అతడికి అందించే ప్రయత్నం చేయండి. ప్రాణశక్తి హెచ్చరికను గమనించుకోండి!

ప్రధాన భాగమయిన గుండె బరువును అనుభవిస్తూ ఉండగా, అప్రధాన భాగమైన సంధిబంధాలు తేలిక పడవచ్చునా! గమనించండి! ఎక్కడికక్కడ, ఎప్పటికప్పుడు ఇలాగే గమనిస్తూ ఉండండి!

## వ్యతిరేక క్రమాన

నివారణ ప్రాణమయకోశం వరకు దిగివచ్చిన తరువాత ఒక చిత్రం జరుగుతుంది. వ్యాధి ఏయే దశలను దాటివచ్చిందో, ఆయా దశలను దాటుకొంటూ వెళ్ళిపోతుంది.

ఈ వెళ్ళేటప్పుడు, చివరలో వచ్చిన దశలు ముందుగా తగులుతాయి. మొదటగా వచ్చిన దశలు చివరకు తగులుతాయి. ఒక రైలు విశాఖపట్టణం నుండి విజయవాడకు వచ్చిందనుకోండి. అది మళ్ళీ విశాఖకు తిరిగి వెళుతోంది. అప్పుడేం జరుగుతోంది! ఇందాక చివరకు తగిలిన స్టేషన్లు ఇప్పుడు ముందుగా వస్తున్నాయి. అప్పుడు ముందుగా తగిలిన స్టేషన్లు ఇప్పుడు చివరకు వస్తాయి అంతేకదా! సరిగా చికిత్స జరిగేటప్పుడు కూడా అలాగే జరుగుతుంది.

ఒకతను ఉద్యోగ రీత్యా ఏజన్సీ ప్రాంతానికి వెళ్ళాడు. అచట అతనికి చలి జ్వరం వచ్చింది. దానికి క్వినైన్ వాడారు. చలిజ్వరం మళ్ళీ మళ్ళీ వచ్చింది. వచ్చినప్పుడల్లా క్వినైన్ వాడారు. తరువాత తరువాత చలిజ్వరం వెనకబడి తలనొప్పి వచ్చింది. అలోపతీ వైద్యంతో తలనొప్పిని ఒక పట్టుబట్టారు. తరువాత తరువాత తలనొప్పి వెనుకబడి సంధిబంధాల నొప్పులు వచ్చాయి. అలోపతీవారు సంధి బంధాలను గురిచూసి కొట్టారు. తరువాత తరువాత ఆ నొప్పులు వెనుకబడి గుండె బరువు వచ్చింది. బరువెక్కిన గుండెతో అతడు మన చెంతకు వచ్చాడు—ఇలా ఇన్ని దశలు దాటి వచ్చాడు!

మన చికిత్స ప్రారంభమైంది. బరువెక్కిన గుండె తేలికపడసాగింది. గుండెకు అలా స్థాయి చిక్కుతున్నకొద్దీ సంధిబంధాల నొప్పులు బైటపడ్డాయి. ఇప్పుడు గుండె బాగున్నది. సంధిబంధాల నొప్పులు మాత్రం సందు దొరికిన చోటల్లా వ్యక్తమవుతూనే ఉన్నాయి. ఇలా కొంతకాలం గడిచింది. సంధిబంధాల నొప్పులు సర్దుకొని, ఇక తలనొప్పి తలెత్తింది. అతడు తలపట్టుకొని కూర్చున్నాడు. అలా కొంతకాలం గడిచింది. ఒక శుభ ముహూర్తాన చలిజ్వరం పైకి ఉబికింది. ఇంటిలోని దుప్పట్లన్నీ కప్పారు. ఇంటిలోనివారంతా అతనిపైన కూర్చున్నారు. అతికష్టంమీద అందులోని ఒకడు మనదగ్గరికి వచ్చి విషయం చెప్పాడు. 'అమ్మయ్య!' అనుకొన్నాను. జ్వరం కాదిది 'వరం'—గ్రహించమన్నాను. జ్వరాన్ని మర్యాదగా సాగనంపాము. అతడు ధన్యుడై పైకిలేచాడు. ఇక అతడికి హాయిగా ఉన్నది. పట్టినది వదిలిపోయింది. ఏయే దశలను దాటివచ్చిందో, ఆయా దశలను తానుగా దాటుకొంటూ వెళ్ళిపోయింది.

తెలియనివారు 'పాతవన్నీ బైటపడుతున్నాయి' అంటారు. తెలిసినవారు 'పాత వాటినుండి బైటపడుతున్నా'మని గ్రహించుకొంటారు. గ్రహణం విడిచినట్లవుతుంది. ఋణం తీరినట్లవుతుంది. అప్పు తీర్చినవేళ ఎంత హాయిగా ఉంటుంది. అంత హాయిగా ఉంటుంది!

అయినా అలోపతీవారు ఎప్పటికప్పుడు అణచిపెట్టకపోతే, వ్యాధి ఇలా ఇన్ని దశలు దాటిరాదుకదా! రాలేదుకదా! ఆలోచించండి. ఆ చలిజ్వరం వచ్చినప్పుడు సరైన హోమియో చికిత్స జరిగించింపే, ఇలా గుండె బరువెక్కేవరకూ కథ నడచి రాదుకదా! గ్రహించండి. హోమియో వైద్యం అలోపతీవారు సంక్రమింపజేసిన విషమస్థితులనుండి రోగిని బైటపడవేస్తున్నదని దర్శించండి! చిన్నతనంనుండీ

హోమియో విధానంలోనే చికిత్స పొందడమన్నది జరిగితే పై స్థితులు చాలావరకు తారసపడవని కూడా తెలిసికోండి.

ఇలా నివారణను నాలుగువిధాలుగా ఎప్పటికప్పుడు గమనించుకొంటూ ఉండాలి. కేంద్రమునుండి పరిధికి, పైనుండి దిగువకు, ప్రధాన భాగాలనుండి అప్రధాన భాగాలకు, నివారణ వ్యక్తమవుతూ వస్తున్నదికదా!—అని ధృవపరచు కొంటూ ఉండాలి. అలాగే ప్రాణమయకోశము వరకూ వచ్చిన తరువాత ఏయే దశ లను దాటివచ్చిందో, అలాగే దశలను దాటి వెళ్ళిపోవడాన్నికూడా గమనించుకోవాలి. అలా వెళ్ళిపోతున్నవేళ తొందరపడి డోసువేయడంగాని, మందు మార్చడంగాని చేయకూడదు. ప్రాణశక్తి సూచనలను గమనించుకొంటూ, జాగరూకతతో మెలగాలి.

వైద్యం మనం చేయకూడదు. మనచేత చేయబడాలి! మనద్వారా జరగాలి! ప్రాణశక్తి అనే కృష్ణుని ముందు మనం అర్జునుడిగా నిలబడాలి! ప్రాణశక్తి సూచనల మేరకు నిమిత్తమాత్రంగా నిలబడి, కర్తవ్యాన్ని నిర్వహించడం జరగాలి!

## వేదనల ఉద్రేకం

హోమియోమందు వాడితే పాతవన్నీ బయటపడతాయి—అన్న జనవాక్యానికి అర్థమేమిటో చెప్పుకొన్నాం. అలాగే హోమియోమందు ఎక్కువచేసి తరువాత తక్కువచేస్తుంది—అన్న వాక్యం కూడా జనంమధ్య ఉన్నది. అయితే ఈ వాక్యం ఎప్పుడూ నిజంకాదు. ఎప్పుడో ఒకసారి మాత్రమే నిజమవుతుంది. నూటికి తొంభయి కేసుల విషయంలో ఈ ఉద్రేకం కనబడదు. ఒక పదికేసుల సందర్భంలో మాత్రం ఎంతో కొంత ఉద్రేకం కనబడుతుంది. ముఖ్యంగా వేదనలు అస్థిపంజరంలో పాతుకు పోయిన సందర్భాలలో ఇలా జరుగుతుంది. అనగా సంధిబంధాల వాపులూ, నొప్పులూ మొదలయిన స్థితిగతులలో నన్నమాట! ఆ పాతుకొనిపోయిన వేదనలను పెళ్ళగించ వలసిన పరిస్థితి ఏర్పడుతుంది నివారణకు అలా చేయడం తప్పనిసరి అవుతుంది. అలాంటి ప్రత్యేక సందర్భాలలో మాత్రమే ఇలాంటి ఉద్రేకం మనకు కనబడుతుంది. ఈ అనుభవం తప్పనిసరి అవుతుంది. మిగిలిన సందర్భాలలో అసలు ఉద్రేకం అన్నది కనపడదు.

అలాగే చికిత్స జరుగుతూ ఉండగా కొందరికి మాటిమాటికీ జ్వరం వస్తూ ఉంటుంది. నిజానికి ఇది జ్వరం రావడంకాదు. జ్వరం బయటకు రావడం, జ్వరం బయటకు వెళ్ళిపోవడం ఇక్కడ జరుగుతున్నది. రోగార్తుని విషయంలోగాని, అతని వారసత్వంలోగాని జ్వరాలు వచ్చి, అణచిపెట్టబడిన చరిత్ర ఉన్నప్పుడు ఇలా

ంది. మన చికిత్సవల్ల, ఆ అణచిపెట్టబడిన జ్వరం కదులుతుంది. ఒకే యటకువస్తే రోగార్తుడు తట్టుకొనలేడు గనుక, అప్పుడప్పుడూ కనబడుతూ చెలంచెలుగా బయటకు వెళ్ళిపోతుంది. రోగార్తుడు కూడ అంచెలంచెలమీద సంతరించుకొంటూ ఉన్నట్లుగా మనకు బోధపడుతుంది. జ్వరం వచ్చిన అతడి గ్రహణం కొంతవదిలినట్లుగా మనకు స్పష్టమవుతుంది. ఇలాంటిసంద ఆ జ్వరాన్ని ఓర్పుగా, నేర్పుతో బయటకు సాగనంపాలి. రోగార్తుడు ఆలోపతీ మందు వాడితే అందివస్తున్న స్వస్థతను మళ్ళీ కోల్పోయిన ను. కనుక వైద్యుడుగాని, రోగిగాని తొందరపడరాదు. కంగారుపడవల లేదు. ఈ అంశాలన్నీకూడా సిద్ధహస్తులయిన వైద్యుల సన్నిధిలో క్రొత్త ం ఒంటబట్టించుకోవలసినవి!

ాక చర్మంమీద కనబడుతూ ఉండే వ్యాధిబాధల సంగతి—హోమియో రోనికి దిగగానే ఇవి తప్పక పెరుగుతాయని అందరికీ తెలిసిన విషయమే! కొన్ని చర్మబాధలు అణచిపెట్టబడి ఉంటే, అవి మళ్ళీ బయటపడతాయని ందరికీ తెలుసు. ఇలా ఎందుకు జరుగుతుంది? ప్రాణశక్తి వ్యాధికారణాన్ని .రిస్తున్న సమయాన ఆ బహిష్కరణకుగాను కొన్ని కొన్ని దారులను చేసుకొంటుంది. ఆ దారులే చర్మపరమయిన ఈ వ్యాధిబాధలు. ఇవి వ్యాధి .రణ మార్గాలు. ఈ మార్గాలను మూయకూడదు. ఈ మార్గాలపైన అవీ, యకూడదు. మూస్తే, పూస్తే కథ మళ్ళీ మొదటకు వస్తుంది. మన చికిత్స మయిన తరువాత ఆ దారులు మరింత తెరవబడతాయి. దానితో ఈ బాధలు ఎక్కువ అయినట్లుగా కనబడతాయి. కంగారు పడవలసిన పనిలేదు. కథ గా దారికి వస్తున్నట్లుగా గమనించుకోవాలి. వంటింటిని కడుగుతున్నప్పుడు, న్నంతవరకూ ఎంతో కొంత తూముబెంట నీరు వస్తూఉండడం సహజమే వస్తున్న నీటిని అడ్డుపెట్టి, ఆపాలని వివేకవంతుడెవ్వడూ అనుకోడుకదా! మయిన వ్యాధిబాధలు ఇలాంటివి. ఇవి ఉన్నవి పెరుగుతూ ఉండడంగాని, తగ్గి మళ్ళీ వస్తూఉండటంగాని జరుగుతూ ఉంటుంది. నివారణ కార్యం ్యవరకూ ఈ స్థితిగతులు ఇలా అడపాదడపా కనబడక తప్పదు. ఔషధ యన పైపూతలు వీటిపైన ఎన్నడూ రాయకూడదు. కొబ్బరినూనె, వెన్నపూస యనవి రాయవచ్చు. అంటే వీటిని సముదాయించాలి తప్ప, అణచిపెట్ట —అని అర్థం.

స్తే, హోమియో ఔషధాలను అతిగా వాడినప్పుడు కలిగే దుష్పరిణామాలు రింత గాఢంగానూ, మరింత తీవ్రంగానూ కూడా ఉంటాయి.

మనుషులలో చుట్టరికాలు ఉన్నట్లుగానే, ఔషధాల మధ్యకూడా చుట్టరికాలు టాయని చెప్పుకొన్నాం. మనుషులలో కొందరికి సరిపడని వారు ఉన్నట్లుగానే, హోమియోలో కొన్నికొన్ని ఔషధాలకు సరిపడని ఔషధాలు ఉంటాయి. వైద్యుడు గా వెళుతున్నప్పుడు ఔషధాల చుట్టరికాలు అతడికి ఉపయోగపడతాయి. లాగాక వైద్యుడు దారితప్పి ఎడాపెడా ప్రవర్తించినప్పుడు సరిపడీ, సరిపడని షధాలు వరుసగా రోగార్తుని మీద పడిపోయే అవకాశముంది. జాగ్రత్తగా ంవాలి! ఒకదాని తరువాత ఒకటి సరిపడని ఔషధాలు పడినప్పుడు మళ్లీ కథను రికి తెచ్చుకోవడం అది ఒక క్రతువు. అలా పడవలసిన అవసరం తెచ్చుకొన్న ్పుడు ఒడుపు చూప వలసి ఉంటుంది. ముందుగా వేయబడిన ఔషధాన్ని రద్దుచేసి, రువాత నూతన ఔషధాన్ని అందించవలసి ఉంటుంది. ఈ ఒడుపులన్నీ సిద్ధ స్తులయినవారి వెంటనుండి అందుకోవలసినవే!

## సిమ్ప్టమాటిక్ ట్రీట్‌మెంట్

కొందరు కొందరు రోగార్తుని వేదనా సముదాయాన్ని సమగ్రంగా పట్టించు కుండా, కొట్టవచ్చినట్లుగా కనబడుతున్న, లేదా రోగార్తుని బాగా ఇబ్బంది పెడుతున్న ఒకటి రెండు వేదనలను ప్రధానంగా తీసికొని ఆ మేరకు మాత్రమే పరిశీలించి, ఔషధాన్ని నిర్ణయించి ఇచ్చేస్తూ ఉంటారు. అంటే సమాన ప్రయత్నాన్ని ఒకటిరెండు వేదనల వరకే చూస్తారు. ఇటు రోగార్తునిగాని, అటు ఔషధాన్నిగాని అంతకు మించి పట్టించుకోరు. అంతవరకు పని జరిగితే చాలు అన్నట్లు చూస్తారు.

అప్పుడు ఆ ఒకటి రెండు వేదనల విషయంలో ఎంతో కొంత ఉపశమనం తాత్కాలికంగా కనిపిస్తుంది. అది ఉపశమనమేగాని, నివారణము కాదు. ప్రాణశక్తి అందుకు అంగీకరించదు. ఈ సందర్భంలో వైద్యుడు ప్రాణశక్తిని మొహమాటపెట్టి, ఇంకా చెప్పాలంటే బలవంతపెట్టి సాధించు కొంటున్నాడు. ప్రాణశక్తికి ఇది అంగీకారం కాదుగనుక అవి తాత్కాలికంగా తగ్గినట్లే తగ్గి మళ్లీ వచ్చేస్తాయి. దీనినే హోమియోలో 'సిమ్ప్టమాటిక్ ట్రీట్‌మెంట్' అంటారు.

ఒక రోగార్తుడు ఉన్నాడు. వేదనాసముదాయాన్ని బట్టి అతడు '
నైట్రికం' అనే ఔషధానికి చెందినవాడు. ఒక వైద్యుడు అతనిని చర్మంవర
ఆ చర్మంపైనున్న 'కరిమేహ' స్థితికి 'గ్రాఫైటీస్' అనే ఔషధాన్ని ఎక్కు
అప్పుడేమి జరిగింది? కరిమేహం తగ్గినట్లుగా కనిపించింది. కొన్నాళ్ళకి మ
బయట పడింది. అంటే మూత్రంలో షుగర్ పోవడం మొదలుపెట్టిం
చర్మబాధ పొడచూపసాగింది. అప్పుడతడు మన దగ్గరకు వచ్చాడు. '
నుండి పరిధికి' అన్నసూత్రం ప్రకారం అతడిని పరిశీలిస్తే అంతకు
వైద్యుడు చేసినదేమిటి! లోపల కోశాల స్థితి అలాగే ఉన్నది. ఇంకా చెప
అంతకన్నా తీవ్రంగా ఉన్నది. పరిధి పైన మాత్రం కాస్తంత ఉ
తీసుకురాబడింది. ఇలా చేయవచ్చునా! ఇది ఎటువంటిదీ అంటే పిల్లవా
పాశంపెట్టి మాటవినిపించడం లాంటిది. అతడు ఎంతవరకు వింటాడు, మ
వరకు పెడతాము? అయినా ఇది ఏమంత మంచిపని? పిల్లవాడు మన
ముచ్చటపడి తానుగా మాటవినాలిగాని, మనకు భయపడి చేసిపెడితే అది ఒ
ఇలా రద్దయిన వేదనలను ప్రాణశక్తి మళ్లీ పెద్దఎత్తున ప్రయత్నం
తీసుకు వస్తుంది ఎందుకొరకు? మనను రక్షించేందు కొరకు!

అప్పుడతనికి 'ఆర్జంటం నైట్రికం' ఇస్తూ ఈ ఉపశమించినవికూడ
బయట పడతాయి, ఆ తరువాత వీటన్నిటి నుండీ సీవు బయటపడటం జరుగ
అని చెప్పడం జరిగింది.

నివారణ కేంద్రంనుండి పరిధికీ, పైనుండి దిగువకూ, ప్రధాన భాగ
అప్రధాన భాగాలకూ వ్యక్తమవుతూ వస్తుందని చెప్పుకొన్నాం. అందుకు
జరిగినప్పుడు వైద్యుడు తాను దారితప్పినట్లుగా గ్రహించాలని కూడా చెప్పుక
దారి తప్పడమంటేఇదే! కొట్టవచ్చినట్లుగా కనబడే వేదనలను మాత్రమే
వాటిని కొట్టివేయాలనే తలంపుతో ఇలా సిమ్టమాటిక్ ట్రీట్ మెంట్ చేయడమే!
ఇలాచేసిన ప్రతిసారీ లోపల వ్యాధి మరింత ముదురుతుంది. క్రమంగా ని
సాధ్యం కాని స్థితికి వచ్చేస్తుంది. ఇలా వైద్యుడు తన సిమ్టమాటిక్ ట్రీట్
ద్వారా క్రమంగా వ్యాధిని ముదరబెడుతూ నివారణకు సాధ్యం కాని స్థితి
గ్రస్తుణ్ణి నడిపిస్తున్నాడన్నమాట! ఉపశమనానికని అతడు చేస్తున్న ప్రతి ప్ర
రోగార్తుని నివారణకు దూరం చేస్తున్నది. నోటు తిప్పి వ్రాసినట్లు అవు
వడ్డీకూడా అసలులో కలుస్తున్నది. వేలాం పాటకు కాలం దగ్గరపడుతున్నది!

మొన్న మొన్నటి వరకూ ఈయనకు చాలా కోపముండేదండీ, ఇప్పుడు లేదనుకోండి, ఈమధ్యవరకూ ఎంతో హడావిడి చేసేవారు. ఇప్పుడు చేయడం లేదను కోండి. నిన్న మొన్నటివరకూ ప్రతిదీ పట్టించుకునేవారు. ఇప్పుడు మానేసారను కోండి-ఇలా ఒక రోగార్తుని గూర్చి చెప్పుకొంటూ వస్తున్నారంటే ఇక కథ చివరకు వస్తున్నదన్నమాట ! నివారణ అసాధ్యము-అన్న స్థితికి వస్తున్నదన్నమాట! చూశారా! ఇది నివారణకు వీలున్న స్థితి. ఇది నివారణకు వీలులేని స్థితి అని మనకు ప్రాణశక్తే సూచిస్తున్నది!

నివారణకు వీలున్న స్థితులలో సిమ్ప్టమాటిక్ ట్రీట్‌మెంట్ ఎన్నడూ చేయ రాదు. నివారణకు వీలులేని స్థితులలో సిమ్ప్టమాటిక్ ట్రీట్‌మెంట్ ద్వారా రోగార్తునికి ఉన్నంతలో ఉపశమనాన్ని అందించవచ్చు. ఈ సూక్ష్మాన్ని మనం గ్రహించాలి!

అలాగే రోగార్తుని చివరి స్థితులలో, అనగా ప్రాణశక్తి వ్యాధి కారణం యెడల ఇక స్పందించలేని స్థితిలో పడిపోయినప్పుడు ఆపద్ధర్మంగా అలోపతీ వైద్య సహకారాన్ని అందుకోవచ్చు.

ఇలా ఏ విధానాన్ని ఎంతవరకూ, ఎక్కడెక్కడ వినియోగించుకోవాలి - అన్న విచక్షణను మనం కలిగి ఉండాలి! అలాంటి విచక్షణను కలిగి ఉన్నప్పుడు ఆయా సందర్భాలలో ఆయా విధానాల సహకారాన్ని మనం అందుకొనవచ్చు.

మరొకమాట. మనోమయకోశం వరకూ ఉన్న వేదనలను ప్రాణశక్తి ఉప సంహరించినవేళ నివారణకు ఇక అవకాశము లేదని నిర్ణయానికి వస్తున్నవేళ సిద్ధ హస్తుడయిన హోమియో వైద్యునికి ఆ రోగార్తుడు దగ్గరయినాడనుకోండి. ఆ సిద్ధ హస్తుని కృషివల్ల ప్రాణశక్తి తాను ఉపసంహరించుకొన్న వేదనలను తిరిగి ప్రక టించవచ్చు. ఇది దేవుడు వరమీయడం లాంటిది. ప్రాణశక్తి ఆ సిద్ధహస్తుని కృషికి మెచ్చి రోగార్తుని కరుణ జూచింది అన్నమాట! వేదనలు తిరిగి అలా వ్యక్తమయి నప్పుడు నివారణకు అవకాశం ఈయబడినట్లుగా మనం బోధపరచుకోవాలి. అప్పుడు సావధానంగా వేదనా సముదాయాన్ని అనుసరించి వైద్యసేవను అందించాలి!

కనుక నివారణకు సాధ్యముకాని స్థితిలోనికి రోగార్తుడు వెళుతున్న వేళ అత డిని సిద్ధహస్తుడయిన వైద్యునిముందు ఉంచాలి. అతడు ప్రాణశక్తిని పలుకరించి చూస్తాడు. ఏమాత్రం అవకాశమున్నా ప్రాణశక్తి అతడి పిలుపును అందుకొంటుంది. అవకాశం ఏమాత్రం లేనప్పుడు ఆ సంగతిని అది చెబుతుంది. అప్పుడు ఆ తప్పని

స్థితులలో, తప్పును సరిచేయలేని పరిస్థితులలో సింప్టమాటిక్ ట్రీట్‌మెంట్ తప్పనిసరి అవుతుంది. ఇలాంటి ప్రత్యేక సందర్భాలలో తప్ప సింప్టమాటిక్ ట్మెంట్ జోలికి మనం పోకూడదు.

పై దుష్టుడు ఏడు సంవత్సరాలపాటు నిద్రపోతే రోగికి అప్పుడు క్యాన్సరు మీదకు వస్తుంది-అని హానిమాన్ మహాశయుడు చెప్పాడు. అంటే ఏమిటి! ఏడు త్సరాల ముందుగానే మనోమయ కోశంవరకు ఉన్న స్థితులలో క్యాన్సరుయొక్క వ్యక్తమవుతుందన్న మాట! అప్పుడతనికి సరైన హోమియో చికిత్స జరిగితే కారణం బహిష్కరింపబడి నిండయిన స్వస్థత లభిస్తుంది. అలాగాక, అశ్రద్ధ వప్పుడు అలోపతీ విధానాన కాలక్షేపం చేస్తూ వచ్చినప్పుడు క్రమంగా ఆ దారుణ దిగువ కోశాలకు దిగివస్తుంది. ప్రాణమయ అన్నమయ కోశాలకు అది చేరికొనే ప్రాణశక్తి ఇక మానసిక లక్షణాలను ఒకటొకటిగా ఉపసంహరించు తుంది. శరీరాన్ని ఆ వ్యాధి ఫలితానికి అప్పగిస్తుంది.

అంత ముదిరిన స్థితిలో అలోపతివారు ఆ వ్యాధి సోకిన శరీర భాగాలను కసవిధానాన కాల్చివేసే ప్రయత్నాలు చేస్తున్నారు. రోగిని అంత పీడించవలసిన అతేదు. హోమియో విధానంలో నివారణకు సాధ్యంకాని ఆ స్థితిలో కూడ సింప్ట మాటిక్ ట్రీట్‌మెంట్ ద్వారా తియ్యని ఉపశమనాన్ని అందించవచ్చు. బ్రతికిన ఉగురోజులా హాయిగా బ్రతికేటట్లు చూడవచ్చు. వ్యాధి తగ్గిపోయింది అని వారికి అనిపిస్తుంది. వ్యాధి తగ్గలేదు బాధ తగ్గింది— అని మనకు తెలుస్తుంది. కనుక నివా రణకు సాధ్యముకాని దారుణ మారణ స్థితులలో కూడా హోమియో విధానంలో చక్కటి ఉపశమనాన్ని మనం అందించవచ్చు.

ఇంకొక్కమాట. నివారణకు వీలున్న స్థితులలో సింప్టమాటిక్ ట్రీట్‌మెంట్ చేయకూడదు అని చెప్పుకొన్నాం. నివారణకు వీలుకారని స్థితులలో సింప్టమాటిక్ ట్రీట్‌మెంట్ ద్వారా ఉపశమనాన్ని అందించవచ్చు అని కూడ చెప్పుకొన్నాం. ఇప్పుడు ప్రత్యేకంగా చెబుతున్నది-ఏమిటీ అంటే నివారణకు వీలుకాని స్థితులలో సింప్టమాటిక్ ట్రీట్‌మెంటే చేయాలి తప్ప, కాన్‌స్టిట్యూషనల్ ట్రీట్‌మెంట్ చేయ కూడదు. అనగా మనిషి తత్త్వానికి అప్పుడు వైద్యాన్ని ప్రారంభించకూడదు అని! నివారణకు వీలున్న స్థితులలో మనిషిని మొత్తంగా పట్టించుకోవాలి. నివారణకు వీలు లేని స్థితులలో, ఆ ఒకటి రెండు వేదనలను తప్ప, ఆ పైకి చూడకూడదు. మనిషి మొత్తాన్ని కదపవలసిన సందర్భం కాదది! కాలక్షేపం చేయవలసిన సమయమది.

అప్పుడు కూడా అసలు అతని ఔషధమేమిటి అన్నది గమనించుకొని ఉంచాలి. గమనిక ఎందుకూ అంటే ఆ ఔషధం పడకుండా ఉండటానికి! కనుక ఏది నివార చేయవలసిన స్థితీ, ఏది కాలక్షేపం చేయవలసిన స్థితీ అన్నది స్పష్టంగా తెలియా

నివారణకు వీలున్న దశలో రోగార్తుని మొత్తంగా పట్టించుకోవడమెలా నివారణకు వీలులేని స్థితిలో రోగార్తుని పైపైన మాత్రమే ముట్టుకోవడం ఎలా అన్న అంశాలకు సిద్ధహస్తులయిన వైద్యుల సన్నిధిలో నిరంతరం శుశ్రూష చే మనం అందిపుచ్చుకోవలసి ఉంటుంది. ఇలాంటి శాస్త్రసత్యాలను గ్రంథాల ద్వా తెలిసికోవడం ఎంత అవసరమో, అనుభవజ్ఞులయినవారి అడుగు జాడలలో నడు కోవడం మొదలుపెట్టి మన అనుభవంలోనికి వాటిని తెచ్చుకోవడం కూడా అం అవసరం.

## మరొక సూక్ష్మం

నివారణ కేంద్రం నుండి పరిధికి వ్యక్తమవుతుంది అని చెప్పుకొన్నాం. ఇ మూడు విధాలుగా జరుగవచ్చు. మొత్తం అన్ని కోశాలలోనూ ఒకేసారి నివా గోచరించవచ్చు. ఇది ఒక పద్ధతి. పై కోశాలలో మొదలుపెట్టి, దిగువ కోశా నివారణ క్రమంగా వ్యక్తం కావచ్చు. ఇది రెండవ పద్ధతి. వేదనలు పై కో నుండి దిగువ కోశాలకు దిగి రావచ్చు. ఇది మూడవ పద్ధతి. ఈ సందర్భము జరిగేది ఏమంటే ఒక కోశంలో నివారణ వ్యక్తమవుతుంది. ఆ అస్వస్థత ఆ త వాత కోశంలోనికి చేరుకొంటుంది. తరువాత ఆ కోశానికి స్వస్థత చిక్కుతుంది. తరువాత కోశానికి బరువు పెరుగుతుంది. అంటే ఒక కోశం నుండి మరో కో నికి ఆ అస్వస్థత 'షిఫ్టు' అవుతున్నదన్నమాట! కోశం నుండి కోశానికి మా తున్నది. కోశం నుండి కోశానికి చేరుతున్నది. ఇలా దిగువ కోశం వరకు స వచ్చి, ఇక అక్కడినుండి సెలవు తీసికొంటున్నది. మనవాళ్ళు ఇంటిని ఊడుస్తు ప్పుడు సరిగా ఇలాగే చేస్తారు. ఒక గదిలో మొదలుపెడతారు. ఆ గదం ఊడ్చుకు వచ్చి, ఆ కసువంతా ఎత్తి ముందుగది లోనికి పోస్తారు. మళ్ళీ గదం ఊడుస్తారు. ఆ కసువునంతా తిరిగి ముందుగదిలోకి వేస్తారు. ఇలా ఇల్లం ఊడ్చుకొంటూ వస్తారు. చివరకు కసువంతా ఎత్తి దూరంగా పోస్తారు. ఈ మూడ పద్ధతిలో ప్రాణశక్తి సరిగా ఇలా చేస్తుంది. ఇల్లు ఊడ్చినట్లు చేస్తుంది.

ఈ సందర్భంగా కోశం తరువాత కోశం గాఢమైన వేదనలను కొంతకాలం నుభవిస్తాయి. ఇది ఎక్కువవడంకాదు. దిగుతూ రావడం. కంగారుపడవల లేదు. తొందరపడవలసిన పనిలేదు. ప్రాణశక్తిని గమనించుకొంటూ ఉంటే ధను పూర్తి చేయగలదు. ఏమి జరుగుతున్నదీ అన్నది మనకు తెలియాలి

కథ ఇలా సాగుతున్నప్పుడు మనోమయ కోశం దగ్గరకు వచ్చేటప్పటికి పాలు మొదలయినవి ఇదివరకటికన్నా ఎక్కువవుతాయి. కొన్నాళ్ళ తరు ఈ పరిస్థితి సర్దుకొంటుంది. కథ ప్రాణమయ కోశాన్ని చేరుకొంటుంది. ప్రాణ వలకు సంబంధించిన వేదనలలో తీవ్రత పెరుగుతుంది. కొంతకాలమలా కథ అన్నమయ కోశానికి చేరుకొంటుంది. కనుక ఈ స్థితులను గమనించు యా మనం ముందుకు సాగాలి. ప్రాణశక్తిని కలవరపరచకుండా, మనం ందికి గురికాకుండా, కథను నడపడంలో ఒడుపును చూపాలి.

## నా లు గు ర కా లు

చికిత్స జరుగుతున్నప్పుడు నాలుగు రకాల స్థితిగతులు మనకు తారసపడే కాశముంది. రోగి బాగున్నాడు. వేదనలూ తగ్గుముఖం పట్టాయి. ఇది మంచి . కథ సజావుగా సాగిపోతున్నదన్నమాట. వైద్యుడూ, రోగార్తుడూ కూడ ్రంతగా ఉండవచ్చు.

రోగి బాగున్నాడు, వేదనలు మాత్రం ఎక్కువైనాయి. ఈ స్థితిలో ద్యునకు సంతోషంగా ఉంటుంది. ఎందువల్లనంటే రోగి స్థితి మెరుగుపడుతోంది నుక. రోగార్తునికి మాత్రం కొంచెం ఇబ్బందిగా ఉంటుంది. వేదనలన్నీ కదలి దివరకటి కన్నా బాధపెడుతున్నాయి కనుక!

రోగి బాగుండలేదు. వేదనల స్థితి బాగున్నది. ఈ స్థితిలో వైద్యునకు లవరం పెరుగుతుంది. కారణం రోగి నీరసిస్తున్నాడు. రోగి మాత్రం సంతో షిస్తాడు. బాధలలో కొంత ఉపశమనం కనబడుతోంది గనుక! వైద్యుడు తనను తాను పరిజూచుకోవలసిన స్థితి ఇది! రోగి నీరసిస్తూ ఉండగా, అనుభవానికి వస్తున్న ఉపశమనం సంతోషింపదగినదికాదు. సిమ్ప్టమాటిక్ ట్రీట్మెంటు వల్ల ఇలా జరగ వచ్చు. లేదా వేదనలకూ, మనస్సునకూ మధ్యనున్న అనుసంధానం తెగిపోవడంవల్ల ఇలా జరగవచ్చు.

రోగి బాగుండలేదు. వేదనల స్థితి బాగుండలేదు. ఇది ప్రమాదకరమయిన స్థితి. కథ వశంలోనికి రావడంలేదన్నమాట! సరయిన మందు పడకపోయినా ఇలా జరుగుతుంది. సరిఅయిన మందు పడినప్పటికీ, ప్రాణశక్తి దానియెడల స్పందించక పోయినా ఇలా జరుగుతుంది.

ప్రాణశక్తి మందును స్వీకరిస్తేనే కథ. ప్రాణశక్తి మందును స్వీకరించనివేళ అది రోగార్తుని నాలుకపై ఉన్నా ఒక్కటే, మన దగ్గర సీసాలో ఉన్నా ఒక్కటే.

ఈ నాలుగు రకాల స్థితులలో మొదటి రెండు స్థితులు మనం సంతోషింప దగినవి. చివరి రెండు స్థితులూ మనం ఆలోచింపదగినవి.

## పథ్యపానాలు

సరి అయిన చికిత్సనుండి సత్ఫలితాలను పొందాలి అన్నప్పుడు రోగార్తుడు అందుకు తగిన విధంగా పథ్యపానాలను పాటించడం కూడా అవసరం.

హోమియోలో డోసు అంటే అయిదునుండి పది మాత్రలు. తెల్లకాగితంలో కట్టాలి. అది ఇంకేది కాకూడదు. అంటే అద్దుడు కాగితంలా పనిచేయకూడదు. ఆ తెల్ల కాగితానికి లోపల గ్లాసు పేపరును వాడగలిగితే ఇంకా మంచిది.

మందును తీసుకువెళ్లి వాసనలు ఏదీ లేనిచోట పెట్టుకోవాలి. కర్పూరం, అగరవత్తులు మొదలయిన వాటి దగ్గరగా పెట్టకూడదు. పొట్లం విప్పి నోట్లో వేసు కోవాలి. ఆ వేసుకొనేటప్పుడు మాత్రలకు చేయి తగలకుండా ఉండటం మంచిది. పంచదారను చప్పరించినటు చప్పరించాలి. మందు నోట్లో కరిగిపోవాలి. మందు వేసుకొన్న తరువాత కనీసం మూడు గంటలపాటు నోటికి ఏమీ తగలకుండా ఉండటం మంచిది. మంచినీళ్ళు మొదలయినవి కూడా గంటలోపున త్రాగకూడదు. అందుకే సర్వసామాన్యంగా రాత్రిపూట పడుకునే ముందు మందు వేసుకొని పడుకో మంటాము. మందు వేసుకొనే పూట భోజనంలో ఉప్పుకారాలు తగలకుండా ఉండటం మంచిది. ఉప్పు, కారాలు తగలకుండా భోజనంచేసి,మంచినీళ్ళు ఏమయినా కావాలంటే ముందే త్రాగి, కాసేపాగి తరువాత మందువేసుకోవాలి.

మందు వేసికొన్న రోజు రాత్రి నిద్ర కాయకూడదు. విశ్రాంతిగా ఉండటం మంచిది. మందు వేసుకొన్న తరువాత కొద్దిరోజుల లోపున అధికమయిన శ్రమకు గురి కాకూడదు. అలా చేస్తే మందు ప్రభావం తగ్గిపోయే అవకాశముంది. అలాగే

చికిత్స జరుగుతున్న కాలంలో తీవ్రమయిన కోపతాపాలకు, అస్తవ్యస్తమయిన సన్నివేశాలకూ గురికాకుండా ఉండటం మంచిది.

మందు సున్నితమైనది. అది బెదరిపోకుండా, చెదరిపోకుండా, దానికి కావలసిన వాతావరణంలో మనని మనం నిలుపుకోవడం ఎంతయినా అవసరం.

అవి మంచివి కానీ, చెడ్డవికానీ ఘాటయిన వాసనలకూ, రుచులకూ గురి కాకూడదు. గురి అయితే మందు ఇబ్బంది పడుతుంది. ఒక్కొక్కప్పుడు అది పని చేయడం పూర్తిగా మానేయవచ్చు. ఒక్కొక్కప్పుడు తన ప్రభావాన్ని కొంతలో కొంత కోల్పోవచ్చు. ఈ సూత్రాన్ని మన ప్రాంతానికి అన్వయించుకొన్నప్పుడు సుగంధ ద్రవ్యాల మధ్యనా, మురుగు వాసనల మధ్యనా రోగార్తుడు తానుండ కూడదు.

అలాగే ఉల్లి, వెల్లుల్లి, గరంమసాలా, ఇంగువ, ఆవపెట్టినకూరలూ, పచ్చళ్ళు మొదలయిన ఘాటుపదార్థాలను ఏ విధంగానూ స్వీకరించకూడదు. చికిత్సలో ఉన్నంతకాలం ఈ నియమాన్ని పాటించాలి. మందు వేసికొన్న మరునాడు తినవచ్చు నాండీ!—అని కొందరడుగుతారు. తినకూడదు. మందు మనపైన విద్యుత్తువంటి ప్రభావాన్ని కలిగి ఉంటుంది. ఈ ఘాటు తగలగానే ఆ ప్రభావం తగ్గుతుంది. అలాగే కొందరు ఉడికినవి తినవచ్చునాండి అని అడుగుతారు. అదీ మంచిది కాదు. మనమొక సత్ఫలితాన్ని కోరుతున్నప్పుడు మధ్యలో ఈ రాయితీలను అడుగవచ్చునా! కొందరు గృహిణులు తాము తినరుగాని ఇంటిలోనివారికోసం ఉల్లిని తరుగుతూ ఉంటారు. తరిగితే ప్రభావం కూడ తరుగుతుంది. తిన్నప్పుడు కన్న, తరుగుతున్న ప్పుడే ఘాటు ఎక్కువ ఉంటుంది. తినడంతోపాటు తరగడం కూడ తప్పాలీ అంటే అసలు కొనడం మానేస్తే సరిపోతుంది. ఈ మాట మొదట వినడానికి ఇబ్బందిగానే ఉంటుంది గాని, తరువాత బాగానే ఉంటుంది. అల్లోపతివారు కొందరిని ఉప్పు మానమంటున్నారు. కొందరిని పంచదార మానమంటున్నారు. కొందరిని అన్నమే

మానమంటున్నారు. మనమలా మానమనడం లేదుకదా! కేవలం ఘాటైన రుచులనూ, వాసనలనూ వదిలిపెట్టమంటున్నాం. ప్రాణావసరాలను వదిలిపెట్టమనడం లేదు కదా!

అల్లం కూరల్లో, ఉప్మాలో వాడుకోవచ్చు. అల్లపు రసం త్రాగకూడదు. కషాయాలేమీ తగలకూడదు. ఘాటు ఉంటుందికదా! అలాగే మిరియాలను నేతిలో వేయించి తినవచ్చు. యాలకులూ,లవంగాలు తగలరాదు. పచ్చకర్పూరం ఎక్కువగా తగలకూడదు. అది ఏదయినా సరే ఘాటు అన్నస్థితి రాకూడదు. కొత్తిమీర మితిమీరి తినకూడదు. కాకర చేదుగా తగలకూడదు.

కాఫీగాని, టీ గాని రోజుకు రెండుసార్ల కన్నా ఎక్కువగా త్రాగకూడదు. ధూమపానం పనికిరాదు. మద్యపానం కూడదు. జరదాకిళ్ళీ తగలరాదు. నశ్యం కూడ మంచిది కాదు. ఘాటైన వక్కపొడి తినరాదు.

అతిగా సువాసన వచ్చే ద్రవ్యాలను వాడరాదు. పెళ్ళిళ్ళు మొదలయిన వాటిలో ఇటు పందిళ్ళలోనూ, అటు విందు భోజనాల మధ్యనా జాగ్రత్తగా ఉండాలి. అన్నీ వాసనలే ఉంటాయి కదా!

అమృతాంజనం మొదలయినవి వాడరాదు. ఇన్‌హేలర్ మొదలయినవి పీల్చరాదు. చర్మబాధలకు పైపూతలు పూయరాదు. చెమటకాయలనూ, మొటిమలనూ అణచిపెట్టటందుకై పౌడర్లనూ, క్రీములనూ వాడరాదు.

మాంసాహారులు మసాళా తగలకుండా జాగ్రత్తపడాలి. చేప తగలడం మంచిది కాదు. గ్రుడ్డు తినవచ్చు. మసాళా తగలకుండా మిగిలిన మాంసాహారం తినవచ్చు.

ఇవికాక ఎవరికి వారికి సరిపడనివి అని కొన్ని పదార్థాలుంటాయి. శరీర స్థితి దారికి వచ్చేవరకూ వాటిని ముట్టుకోకుండా ఉంచేనే మంచిది. ఆ తరువాత అన్నీ సరిపడతాయి.

చికిత్స జరుగుతుండగా మధ్యలో ఏ విధమయిన తేడా వచ్చినా ఇతర విధానాల మందులు వాడరాదు. ఆ తేడాలను గూర్చి ఇక్కడే చెప్పాలి. ఆ బాధ వేరు. ఈ బాధలు వేరు కదా అని అనుకోకూడదు. మీరు ఏ బాధలు చెప్పినా మిమ్మల్ని మొత్తంగా పట్టించుకొంటుంది హోమియో! వైద్యము జరుగుతున్నది మీకు. మీ బాధలకు కాదు. కనుక ఏ విధమైన తేడా వచ్చినా ఇక్కడే చెప్పాలి !

ముఖ్యంగా జ్వరాలు అవీ వచ్చినప్పుడు కంగారుపడి అలోపతి మందు వేయకూడదు. అలా చేస్తే ఇంతవరకూ జరిగినదంతా మీ తొందరపాటువల్ల పాడవుతుంది. పని చేస్తున్న హోమియోమందు జ్వరాన్ని అవతలకు పంపుతోంది. అది తెలియక మీరు అలోపతివైద్యంతో దానిని లోపలకు అణగద్రొక్కుతున్నారు. దీనితో కథ మొదటికి వస్తున్నది. కనుక అలా చేయరాదు. కంగారు పడవలసిన పనిలేదు.

ఇలా ఘాటైన వాసనలను, రుచులను గమనించుకొంటూ వాటికి దూరంగా మసలుతూ ఉండాలి. ఉదాహరణకు మాత్రమే ఇక్కడ కొన్ని అంశాలను ఉటంకించడం జరిగింది. ఎవరికి వారు తామున్న దేశకాల పాత్రాలను బట్టి ఈ ఘాటైన రుచులలోనికి ఇంకా ఏమేమి చేరుతున్నాయన్నది గమనించుకొంటూ ఉండాలి! చికిత్స పూర్తయిన తరువాత, పూర్తయినదని వైద్యుడు చెప్పిన తరువాత అప్పుడిక ఇబ్బంది లేదు. అన్నీ తగలవచ్చు! అంటే స్వస్థతకు భంగం కలిగించని వన్నీ తగలవచ్చు. స్వస్థత నిలబడేట్టుగా నిత్య జీవితాన్ని ఎలా నడుపుకోవాలి అన్నది మన "నిత్య జీవితానికి నియమావళి" అన్న గ్రంథంలో ఉన్నది. దానిని తరచుగా అధ్యయనం చేయడం ఎంతయినా అవసరం.

# తరుణవ్యాధులు - దీర్ఘవ్యాధులు

ఇవి తరుణవ్యాధులు, ఇవి దీర్ఘవ్యాధులు అని వ్యాధులను విడదీసి శాస్త్రీయంగా వివరించగలిగిన స్థితి ఇప్పటికీ అలోపతీలో అంతగా లేదు. త్వరగా తగ్గిపోతే తరుణవ్యాధి. అలా తగ్గకుండా మొండికేసినా, చిక్కుపడినట్లు గోచరించినా- అది దీర్ఘవ్యాధి. ఇదీ అలోపతీవారి అవగాహన.

కేసు 'క్రానిక్' అయిందని డాక్టరుగారు చెప్పారు అని రోగార్తులు అంటూ ఉంటారు. మనం వింటూ ఉంటాం. అది ఎలా సాధ్యం? కేసు అప్పటికప్పుడు క్రానిక్ అవుతుందా? ఇది సరైన అవగాహన ఇంకా వారికి కలుగలేదని సూచించడం లేదా!

హోమియో విధానంలో తరుణ, దీర్ఘవ్యాధులను గూర్చి చక్కగా విడమరిచి చెప్పారు. తరుణ, దీర్ఘవ్యాధులను గూర్చి హోమియో చేసిన విశ్లేషణ, ఇచ్చిన వివరణ మానవజాతి చరిత్రను ఒక పెద్దమలుపునే త్రిప్పాయి.

ఒక ప్రారంభస్థితి, ఒక విజృంభణ దశ, ఒక నివారణస్థితి వాటికవిగా ఏ వైద్యప్రమేయమూ లేకుండానే కలిగి ఉన్నటువంటివి తరుణ వ్యాధులు. వ్యాధి ప్రారంభమవుతుంది. విజృంభిస్తుంది. నివారణస్థితికి దానికదిగానే దిగివస్తుంది. ఇలా మూడుదశలనూ ఒకదాని తరువాత ఒకటి క్రమంగా కలిగి ఉన్నటువంటి వ్యాధి తరుణవ్యాధి అవుతుంది.

అలాకాక ఒక ప్రారంభస్థితీ, ఒక విజృంభణదశా కలిగి, అటుపైన దానికదిగా నివారణస్థితికి దిగిరాలేనటువంటిది దీర్ఘవ్యాధి అవుతున్నది. దీనిలో కూడా ప్రారంభస్థితి ఉన్నది. విజృంభణదశ ఉన్నది. కాని అది అలా విజృంభిస్తూనే ఉంటుంది. నివారణదశగా దానికదిగా దిగిరాదు, దిగిరాలేదు. సరిఅయిన వైద్యం తగినరీతిలో జరిగినప్పుడు మాత్రమే నివారణ స్థితి అన్నదీ ఇక్కడ సాధ్యమవుతుంది. దీనితో దీర్ఘవ్యాధి తరుణవ్యాధి కన్నా భిన్నంగా గోచరిస్తూ, మనచేత స్పష్టంగా గుర్తింపబడుతున్నది.

అయితే తరుణవ్యాధులలో వైద్యం అవసరంలేదా అన్న అనుమానం కలుగవచ్చు. అవి వాటికవిగా దారికివస్తాయి. సరైన వైద్యం అందినప్పుడు మరింత త్వరగా దారికి వస్తాయి. అంతే తేడా! దీర్ఘవ్యాధులలాకాదు. సరైన వైద్యం అందనిదే నివారణమన్నది అక్కడ సాధ్యపడదు. మృత్యువు వైపుగా విజృంభణ సాగుతూనే ఉంటుంది.

తరుణవ్యాధులు మూడువిధాలు. 1) మిధ్యాతరుణవ్యాధులు 2) మారీవ్యాధులు 3) నిజమయిన తరుణవ్యాధులు.

## మిధ్యా తరుణవ్యాధులు

ఇవి తరుణవ్యాధుల వలె కనబడతాయి గాని తరుణవ్యాధులు కావు. వచ్చి పోతూ ఉంటాయి అన్నమాట నిజమేగాని అలా వస్తూనే ఉంటాయి.

ఒకడు వర్షంలో తడిశాడు. జలుబు, తుమ్ములు, తలభారంవచ్చాయి. క్రమంగా తగ్గాయి. కాని ఇది తరుణవ్యాధి అనడానికి వీలులేదు. ఎప్పుడు వర్షంలో తడిసినా ఇలా వస్తూనే ఉంటాయి గనుక.

వచ్చి తగ్గిపోతున్నది కాబట్టి తరుణవ్యాధిగా కనబడుతున్నది. ఎప్పుడు వర్షంలో తడిసినా ఇలా బయట పడుతున్నది కాబట్టి, ఇది ఒక దీర్ఘవ్యాధి అని ఋజువవుతున్నది. తరుణవ్యాధిగా కనబడుతున్నది, దీర్ఘవ్యాధిగా నిలబడుతున్నది. కనుక దీనిని 'మిధ్యా తరుణవ్యాధిగా' పరిగణించడమైనది.

అలాగే ఎండలోనికి వెళ్ళినప్పుడల్లా తలనొప్పి వచ్చేవారున్నారు. మంచు కాస్త సోకినప్పుడల్లా మంచాన పడేవారున్నారు. నెలసరి వచ్చినప్పుడల్లా కడుపు నొప్పితో బాధపడే స్త్రీలు ఉన్నారు. ఇలాంటివన్నీ తరుణవ్యాధులుగా కనబడుతున్నాయిగాని, నిజానికివి దీర్ఘవ్యాధుల రూపాలే!

ఈ మిధ్యాతరుణ వ్యాధులు అప్పులవాళ్ళలాంటివి. అప్పులవాడు అప్పుడప్పుడు తనఅప్పును గూర్చి హెచ్చరించినట్లుగా సమయమూ, సందర్భమూ కలసి వచ్చినప్పుడల్లా ఇవి బయటపడుతూ ఉంటాయి. కనుక వీటినుండి బయటపడే మార్గం చూడాలి. తరుణవ్యాధులని భ్రమపడి కూర్చుండిపోకూడదు.

## మారీ వ్యాధులు

తడపర, పొంగు, ఆటలమ్మ, మశూచి మొదలయినవి మారీ జ్వరాలు. వీటన్నింటిలో కూడా ఒక ప్రారంభస్థితి, విజృంభణదశ, నివారణస్థితి కనబడుతున్నాయి

గనుక తరుణ వ్యాధులుగా అనబడుతున్నాయి. నిజానికి ఇవి అంటువ్యాధులు. వీటిని అంటించుకోగలిగిన దీర్ఘవ్యాధి స్థితి ఒకటి మానవుని లోపల ఉన్నప్పుడు మాత్రమే ఇవి సోకుతాయి. మిగిలినవారిని ఇవి తాకలేవు.

అంటువ్యాధులనగానే ఇవి అంటుకొనేవి అని అనిపిస్తున్నది. అది నిజంగాదు. ఇవి మనం అంటించుకోగలిగినవి-అని గ్రహించాలి. వాటికవిగా ఎవరినీ అంటుకోవు. మనం అంటించుకోగలిగినప్పుడు కాదనవు.

నీటిద్వారా, గాలిద్వారా, వాతావరణ పరిస్థితుల ద్వారా ఈ అంటువ్యాధులు సోకుతున్నాయని అనుకొంటూ ఉంటాం. అలా అయితే అందరికీ అంటుకోవాలికదా! అందరూ వాటిని వినియోగిస్తున్నారుకదా! కొందరినే అంటుకోవడమెలా జరుగుతున్నది? ఆలోచించాలి. వ్యాధినిరోధకశక్తి లేకపోవడం వల్ల ఇవి అంటుకొంటున్నాయి-అని అంటున్నారు. మరి వ్యాధినిరోధకశక్తి ఆ కొందరిలో ఎందువల్ల లోపిస్తున్నది? అంటే, 'అది తెలియదు' అంటున్నారు.

ఇక్కడ జరుగుతున్నది ఏమంటే, ఒకానొక దీర్ఘవ్యాధి ప్రభావం వల్ల కొందరిలో వ్యాధినిరోధక శక్తి తగ్గిపోతున్నది. దానితో వారు అంటువ్యాధులను ఆహ్వానించగలుగుతున్నారు. కనుక ఇవి తరుణవ్యాధులుగా కనబడుతున్నప్పటికీ, తరుణవ్యాధులు కావు. వీటిని ఆహ్వానించగలిగిన దీర్ఘవ్యాధి స్థితి ఒకటి ఆ లోపల ఉన్నదికదా! ఆ దీర్ఘవ్యాధిని గూర్చి మనం ముందు ముందు చెప్పుకొంటాము.

ఇక్కడ ఇంకొక సూక్ష్మాన్ని కూడ మనం గ్రహించాలి. అంటువ్యాధులను ముందుగా ఆకర్షిస్తున్నది మానవుని మనస్సే! ఆటుపైన గాలి, నీరు, వాతావరణం కథ నడపడానికి పనికివస్తున్నాయి.

అమ్మవారు పోసిన అమ్మాయిని కన్నతండ్రి తన గుండెలపైన పడుకోబెట్టుకొని జోకొడుతున్నాడు. అంటువ్యాధులకు గురైన వందలకొద్దీ రోగార్తులను వైద్యాలయాల్లో వైద్యులూ, నర్సులూ సేవిస్తున్నారు. వారెంత దగ్గరగా ఉంటున్నారు! వారికి అంటుకోవేమి? వారిలో ప్రేమఉన్నది. విశ్వప్రేమ ఉన్నది కనుక అంటుకోలేవు.

అదే భయపడి చూడండి, ద్వేషించి చూడండి వెంటనే అంటుకొంటాయి. మనిషి చుట్టూ ఒక తేజోవలయముంటుంది. దీనినే 'ఆరా' అంటారు. భయ, ద్వేషాలు కలిగినప్పుడు ఇది బీటలిస్తుంది. ఈ బీటలే అంటువ్యాధులకు బాటలుగా

పనిచేస్తాయి. ఈ భయద్వేషాలకు మానవుడు లోనయ్యేటట్లుగా చేయగలిగిన దీర్ఘవ్యాధి ఒకటి ఉన్నది. మనం దానివైపుకు చూడగలగాలి. అప్పుడు అంటు వ్యాధులకు బలికాకుండా మానవజాతిని కాపాడగలము!

ఒక్కటి గుర్తించండి, విశ్వప్రేమ కలిగి ఉండటమన్నది ఒక ఆశయంకాదు, ఒక అవసరం. సమస్తవ్యాధి బాధలకు అతీతమయిన స్థితిలో మానవుని నిలుప గలిగింది విశ్వప్రేమ మాత్రమే!

## నిజమయిన తరుణ వ్యాధులు

మనకు తరుణ వ్యాధులుగా కనబడుతున్న వాటిలో ఎక్కువశాతం అటు మిథ్యా తరుణ వ్యాధులుగాని, ఇటు మారీ వ్యాధులుగాని అవుతున్నాయి. మరి ఇంతకూ నిజమైన తరుణ వ్యాధుల సంగతిఏమిటి? ఇక వాటికథ చూద్దాం.

మనవికాని, మనకు అలవాటులేని అన్నపానాలకుగాని, వాతావరణ పరిస్థితులకుగాని, ఒక్కసారిగా మనం గురైనప్పుడు మనకు ఇబ్బంది కలుగుతుంది. వాటికి అలవాటు పడేలోపున మనకు కొంత తేడాచేస్తుంది. ప్రాణశక్తి కొంత సంక్షుభిత మవుతుంది. వేదనామయ మయిన స్థితి ఒకటి తాత్కాలికంగా అనుభవ మవుతుంది. ఇదే నిజమయిన తరుణ వ్యాధి.

ఉన్నట్లుండి దక్షిణదేశంవాడు ఉత్తరదేశం వెళ్లాడనుకోండి, పట్టణ ప్రాంతం వాడు గిరిజనప్రాంతం వెళ్లాడనుకోండి. ఆ సందర్భాలలో ఏం జరుగుతున్నదీ గమనించండి! ఆకస్మికంగా వచ్చిన ఆ మార్పుకు ప్రాణశక్తి కొంత అలజడి ననుభవిస్తున్నది. ఆ అలజడినే మనం నిజమయిన తరుణ వ్యాధి అని అనవలసి ఉన్నది.

ఇక దీర్ఘవ్యాధులు. ఇవి రెండు విధాలు. ఒకటి—మిథ్యా దీర్ఘవ్యాధులు, రెండు- నిజమైన దీర్ఘవ్యాధులు.

## మిథ్యా దీర్ఘ వ్యాధులు

మానవ శరీరం ఆహారపదార్థాన్ని స్వీకరిస్తుంది, విషపదార్థాన్ని తిరస్క-రిస్తుంది—అని తెలుసుకొన్నాం. ఆహారపదార్థాలు కానివన్నీ కూడా విషపదార్థాలని గమనించు కొన్నాం.

అలోపతీవారు ప్రాణశక్తి వ్యక్తంచేస్తున్న ప్రతి వేదననూ ఒక ప్రత్యేక మయిన వ్యాధిగా గుర్తించి ఇన్ని వ్యాధులున్నాయని లెక్కించి వాటిపైన అన్ని

రకాల మందులను వరుసగా, సంవత్సరాల తరబడి గుప్పిస్తూఉంటారు. ఈ విషపదార్థాలన్నింటికి కూడా ప్రాణశక్తి బదులుచెప్పవలసి ఉంటుంది. ఆ బదులు చెప్పడంలో ప్రాణశక్తి అలసిపోతుంది. అంతేగాక, ఈ విషపదార్థాలను నెట్టి వేయడానికై ప్రాణశక్తి కొన్ని ప్రత్యేకమయిన వేదనలను రూపొందించ్వవలసి వస్తుంది. వీటినే మనం 'ఆఫ్టర్ ఎఫెక్ట్స్' అంటూ ఉంటాం. అంటే ఔషధాలు వాడిన తరువాత కలిగిన నూతన పరిణామాలన్నమాట! ఈ నూతన పరిణామాలన్నీ కలిసి ఒక మిథ్యాదీర్ఘవ్యాధిగా రూపొందుతాయి.

ప్రాణశక్తి నిజమయిన వ్యాధి కారణాన్ని బహిష్కరించడానికిగాను కావలసిన చర్యలను ఒకవంక చేపడుతూనే, మరొకవంక ఈ విషపదార్థాలకు బదులు చెప్పవలసి రావడంతో ఈ పరిస్థితి ఏర్పడుతున్నది. అణచిపెడుతున్న కారణాన ఉన్న వ్యాధి ముదురుతున్నది. మందులు ఈ విధంగా వాడుతున్న కారణాన నూతన వేదనలకు శ్రీకారం చుట్టబడుతున్నది—మొత్తం మీద ప్రాణశక్తి బలహీనపడి పోతున్నది. వేదనల స్థితి కలగలుపుగా ఇంకా చెప్పాలంటే గజిబిజిగా తయారవు తున్నది. ఏవి నిజమయన వేదనలు, ఏవి ఔషధ ద్రవ్యాలవలన కలిగిన వేదనలు అని పరిశీలనగా చూడవలసిన స్థితి ఏర్పడుతున్నది. ఇలా ఔషధాల వలన రూపొందింప బడుతున్నవే మిథ్యా దీర్ఘ వ్యాధులు, అనగా ఔషధాల యొక్క కూడని వినియోగమే ఈ మిథ్యా దీర్ఘ వ్యాధులను రూపొందిస్తున్నది.

అలాగే తెలిసీ తెలియని హోమియో వైద్యులు అదేపనిగా, అతిగా కూడని ఔషధాలను వాడినప్పుడుకూడా ఇలాంటి స్థితులు సంప్రాప్తంకావచ్చు. అనగా ప్రాణశక్తి చేస్తున్న పనికి సహకరించకపోగా దానికి మరికొంత క్రొత్తపని పెడుతున్నామన్న మాట!

సరి అయిన హోమియో వైద్యుడు ఈ మిథ్యా దీర్ఘ వ్యాధుల నుండి రోగార్తుని ఒడుపుగా విడిపించగలడు. అప్పుడు అక్కడ ఉన్న నిజమయిన వేదనలు మిగిలి మనకు కనబడతాయి. రోగార్తుని వైద్యం ద్వారా సేవించడానికి అప్పుడు మనకు దారి దొరుకుతుంది.

## నిజమైన దీర్ఘవ్యాధులు

అలోపతీ వారి దృష్టితో చూచినప్పుడు దీర్ఘవ్యాధులు అసంఖ్యాకంగా ఉన్నట్లు మనకు అనిపిస్తుంది. ప్రతి వేదనమూ ఒక ప్రత్యేకమయిన వ్యాధిగా గుర్తిస్తున్నారు గనుక ఎన్ని వ్యాధులయినా ఉండటానికి అక్కడ అవకాశముంది.

ఈ దీర్ఘకాలిక వేదనలకు వెనుక నిజమయిన దీర్ఘవ్యాధులున్నాయని హానిమాన్ మహాశయుడు దర్శించాడు. దశాబ్దానికి పైగా తపస్సుచేసి ప్రధానంగా మూడు దీర్ఘవ్యాధులు మానవజాతిని కృంగదీస్తున్నాయని అతడు ప్రకటించాడు. అవి 1) సోరా 2) సైకోసిస్ 3) సిఫిలిస్. ఈ దీర్ఘవ్యాధుల స్వరూప స్వభావాలను శాస్త్రీయంగా వివరించాడాయన. వీటిని నివారణచేయడంలో వైద్యుడు ఎలాంటి ఒడుపును చూపించవలసినదీకూడ కావలసినంత వివరంగా ఉపదేశించాడాయన!

హానిమాన్ తరువాత హానిమాన్ శిష్యులు ట్యూబర్‌క్యులార్ దీర్ఘవ్యాధిని నాల్గవ దీర్ఘవ్యాధిగా పేర్కొంటూ వచ్చారు. ఇ.కె. మాస్టరుగారు ఈ దీర్ఘవ్యాధి యొక్క స్వరూప స్వభావాలను గూర్చి లోతులకు వెళ్లి వివరించారు.

నరజాతిని పట్టి పీడిస్తున్న ఈ నాలుగు దీర్ఘవ్యాధులను గూర్చి వరుసగా పరిచయం చేసికొందాం. ఈదీర్ఘ వ్యాధుల బారినుండి మానవజాతికి దివ్యమయిన తన చికిత్సా విధానంతో విమోచనాన్ని అనుగ్రహించిన హానిమాన్ మహాశయునకు ఏటికోళ్లు సమర్పిద్దాం.

# సోరా

దీర్ఘ వ్యాధులలో మొదటిది సోరా. మిగిలిన దీర్ఘవ్యాధులకు మూలమయినది కూడా ఇదే! ఇది ఉంటే మిగిలిన వాటికి అవకాశమేర్పడుతుంది. ఇది లేకపోతే మిగిలిన వాటికి ఆస్కారముండదు. ఇంత పెద్ద దీర్ఘవ్యాధికి కారణం ఒక చిన్న అపచారం—అని తెలిసినప్పుడు ఆశ్చర్యంగా ఉంటుంది.

జరుగుతున్నది ఏమిటి అన్నది తెలియజెబుతాను గమనించండి. ఏదైనా ఒక భయంకరమయిన దృశ్యాన్ని దగ్గరగా చూచినప్పుడు గాని, లేక తాదాత్మ్యం చెందుతూ ఒకానొక గ్రంథంలో అలాంటి దృశ్యాన్ని గూర్చి చదివినప్పుడు గాని మనస్సు తాత్కాలికంగా సంక్షుభితమవుతుంది. ఆ సంక్షోభం నుండి మనను రక్షించడం కోసం ప్రాణశక్తి పరిశ్రమిస్తుంది. ఆ సంక్షోభం వలన ఏర్పడిన మాలిన్యాన్ని ఆనందమయకోశంనుండి అన్నమయకోశం వరకూ త్రోసుకొంటూ వస్తుంది. అలా వచ్చి వచ్చి శరీరంమీద ఒక గజ్జిపొక్కులాంటి స్థితిని రూపొందించి ఆ మాలిన్యాన్ని దానిలోనికి నెడుతుంది.

మనం కాస్త ఓర్పు పట్టి దానిని ఏమీ చేయకుండా ఉండగలిగితే కొద్దికాలం మనను సలిపి, ఆపైన చీమును బయటకు నడిపి అది మాయమవుతుంది. ఆ పని అంతటితో అయిపోయినట్లవుతుంది.

అలాకాక ప్రాణశక్తి ప్రయత్నాన్ని మనం గమనించుకోలేక నలుగురిలో గజ్జిపొక్కుతో అలా ఉండవలసి రావడం నామర్దా అనిపించి దానిపైన ఏదో ఒక పైపూతను పూశామనుకోండి. ఆ పైపూతతో గజ్జిపొక్కును విజయవంతంగా అణచిపెట్టగలిగామనుకోండి. అంతే ఇక కథ అడ్డం తిరుగుతుంది. ఆనందమయ కోశంనుండి అన్నమయ కోశం వరకు తీసుకురాబడిన ఆ మాలిన్యం మనం చేసిన ఈ అపచారం వల్ల మళ్ళీ అన్నమయ కోశంనుండి ఆనందమయ కోశం వరకు ఎగబ్రాకుతుంది. దానితో మనిషి మొత్తానికి ఇక గ్రహణం పట్టినట్లు అవుతుంది.

గదిలో ఒక మూలకు ఊడవబడిన కసువును పిల్లవాడు తెలియక మళ్ళీ గది మొత్తం విరజిమ్మాడనుకోండి. అప్పుడెలా ఉంటుంది. ఇంతకన్నా ఊడవకముందే నయంగా ఉంది-అనిపించదూ! ఒకసారి ఊడ్చి తిరిగి విరజిమ్మేటప్పటికి అంతటి వికృత స్థితి వస్తున్నది. సరిగా ఇక్కడ మనిషిలో కూడ ఇదే జరుగుతున్నది. గజ్జిపొక్కు ఎడల మన ప్రవర్తన సరిగా ఆ పిల్లవాని చేష్టలా పరిణమిస్తున్నది.

గజ్జి పొక్కును దాని కదిగా తగ్గిపోనిస్తే అది ఒక చిన్న తరుణ వ్యాధి. తెలియక దానిని అణచిపెట్టేటప్పటికి అది మనం ఊహించలేనంత పెద్ద దీర్ఘవ్యాధిగా రూపొందుతూ ఉన్నది.

ఒక దీర్ఘవ్యాధివిపాకంగా రూపుదిద్దుకొంటూ ఉన్నది. హోమియో పరిభాషలో దీనినే మనం 'మియాజమ్' (Miasm)అంటున్నాము. గజ్జిపొక్కు అణచిపెట్టబడి ఇలా దీర్ఘవ్యాధి విపాకంగా రూపొందిన తరువాత ఇక ఇది 'సోరా'గా పిలువబడుతున్నది. ఈ దీర్ఘవ్యాధి సంప్రాప్తమవడంతో మనిషి తన తేజస్సును కోల్పోతాడు. క్రమంగా ఒక జీవచ్ఛవంగా రూపొందుతాడు. అడపా దడపా శరీరంపైకి గజ్జికురుపుల వంటి స్థితులు వస్తూనే ఉంటాయి. వాటికి పైపూతలు పూస్తున్నకొద్దీ, లోపల సోరా మరింతగా ముదిరిపోతూ ఉంటుంది. చర్మంపైకి ఉబుకుతున్న వ్యాధి స్థితులకు పైపూతలు పూయడం, ఆ పూతలతో వాటిని అణచిపెట్టాలని చూడటం ఎంతటి ప్రమాదమో గమనించండి. ఇది తెలియక చర్మంపైకి ఉబుకుతున్న వ్యాధి స్థితులకు పైపూతలు పూసే రోగార్తులూ, వారికి అలా పూయమని సలహాలనిస్తున్న వైద్యులూ ఈ రోజున కూడ ఉన్నారూ అంటే ఏమనాలి? ఏమి చెప్పాలి! ప్రాణశక్తిని పలుకరించలేకపోగా, ప్రాణశక్తిని మలినపరుస్తున్నారు కదా, మైలపరుస్తున్నారు కదా! మానవ జాతిని దారుణమయిన దీర్ఘవ్యాధికి గురి చేస్తున్నారు కదా, బలి చేస్తున్నారు కదా! ఇది భావ్యమా? ఈ అజ్ఞానంనుండి మనం బయటపడకపోవడం క్షంతవ్యమా? ఆలోచించండి.

గజ్జిపొక్కును అణచిపెట్టి, సోరా అను దీర్ఘవ్యాధిగా దానిని రూపొందించి, మానవుని పంచకోశాలనూ దానికి అప్పగించిన వేళ ఆ అయిదు కోశాలూ ఎలా

అల్లాడిపోతాయో మానవుని దుశ్చర్యకు ఫలితంగా ప్రాణశక్తి ఎంతటి ఘోషను అనుభవిస్తుందో మనిషిని బ్రతికించేటందుకుగాను ఎంతటి తీవ్ర ప్రయత్నాలను అదీ చేయవలసి వస్తుందో ఇక గమనించుకొందాం.

## అన్నమయ కోశం

శరీరం కళాకాంతులను కోల్పోతుంది. వడిలిపోతుంది. బిడలిపోతుంది. ఇల కరుచుకుపోతుంది. లావణ్యాన్ని కోల్పోతుంది. నేవళంగా ఉండదు. తాజాదనం ఒంటిమీద కనబడదు. స్నానం చేసినా చేయనట్లే ఉంటుంది. వయస్సుకు తగిన కళ ఉండదు. ఆ అందచందాలు ఉండవు. ఉన్న వయస్సు కన్నా ఎక్కువ వయస్సు కనబడుతుంది. వృద్ధాప్యం ముందుగానే వస్తున్నట్లు ఉంటుంది. బక్కచిక్కి బొమికల గూడులా ముందుకు వంగి ఈసురోమంటూ ఉంటారు. ప్రాణాలు కళ్ళల్లో కనబడతాయి. మనుషులు నరాలమీద నిలబడతారు.

శరీర భాగాలతో బాటుగా ఇటు గోళ్ళు, అటు జుట్టూ కూడా జీవకళను కోల్పోయి వికృతంగా గోచరిస్తాయి. శరీరంపైన ఎక్కడో అక్కడ ఒరుపులుగాని, కురుపులు గాని ఉండి, వాటికి సంబంధించిన సలుపులు అనుభవానికి వస్తూ ఉంటాయి. చీములు, రక్తాలు బయటకు ఓడుతూ ఉంటాయి. వాటికి సంబంధించిన వాసనలు ఉంటాయి.

శరీరం ఉడుకుతున్నట్లుగా ఉంటుంది అణువణువునా ఆ లక్షణం కనిపిస్తుంది. అంటకాగుతున్నట్లుగా అనిపిస్తుంది. ఎక్కువసేపు నిలబడలేరు. ఎక్కువసేపు కూర్చోలేరు. ప్రశాంతంగా పడుకోలేరు. ఈ శరీరంలో ఈ శరీరంతో విలవిలలాడు తున్నారని మనకు తెలుస్తూనే ఉంటుంది.

## ప్రాణమయకోశం

శరీరం దృఢత్వాన్ని కోల్పోతుంది. ఓపిక ఉండదు. నీరసం, నిస్త్రాణ, పని చేయలేదు, పడుకోలేదు. శక్తి చాలదు. తీసికొన్న ఆహారం శక్తిగా ఎంతవరకూ మారుతున్నదీ అన్నది ఒక పెద్ద ప్రశ్న అవుతున్నది. ఉద్వేగం కనబడుతుంది. విట్టూర్పులు గోచరిస్తాయి. చేయలేని స్థితి, ఆగలేని స్థితి! ఒకానొక అస్థిమిత స్థితి అనుభవానికి వస్తుంది. ప్రాణం సుఖంగా లేదని తెలుస్తుంది. సుఖంగా ఉండలేక

పోతోంది అని కూడా తెలుస్తుంది. ఉండటం దానికి చేతకావడం లేదని కూడా తెలుస్తుంది.

వాతావరణానికి తగినవిధంగా రూపొందగల శక్తి తగ్గిపోతుంది. వాతావరణం ఏమాత్రం మారినా తట్టుకొనలేని స్థితి వస్తుంది. ఎండలో నడిచినా, వానలో తడిసినా, మంచులో తిరిగినా తేడా చేస్తూ ఉంటుంది. వాతావరణంలోని మార్పులకు తట్టుకొనలేని స్థితి, వాతావరణంతో శ్రుతి కలపలేని స్థితి వచ్చేస్తుంది. మిథ్యా తరుణవ్యాధులు అని మనం చెప్పుకొన్నవన్నీ వీరికి అనుభవానికి వస్తాయి. లోపల ఒక దీర్ఘవ్యాధి ఉండి, సందర్భం వచ్చినప్పుడల్లా తరుణ వ్యాధిగా కనబడిపోతున్నది—అని అక్కడ చెప్పుకొన్నాం. సోరానే 'ఆ దీర్ఘ వ్యాధి'—అని ఇప్పుడు తెలుసుకొంటున్నాం!

వ్యాధి నిరోధకశక్తి తగ్గిపోతుంది. దానితో అంటువ్యాధులకు ఇక్కడి నుండి ఆహ్వానమందుతుంది. మీరు రావచ్చును నన్ను సోకవచ్చును. అందుకు కావలసిన దౌర్బల్యంతో నేను సిద్ధంగా ఉన్నాను—అని అంటువ్యాధులను పిలిచినట్లవుతుంది. సోరా గలవాడు అంటువ్యాధులకు ఓడరేవుగా పనిచేస్తున్నాడు-అన్న ఇ.కె. మాస్టరుగారి వాక్యాన్ని ఇక్కడ మనం మననం చేసికోవలసి ఉంది. ఓడలు ఓడరేవును చేరవచ్చినట్లుగా, అంటువ్యాధులు సోరాకలవాడిని చేరవస్తాయిసుమా!-అని తెలిజెబుతున్నారాయన! ఇప్పుడు తరుణ వ్యాధుల సందర్భంగా మారీ వ్యాధులను గూర్చి మనమేమి చెప్పుకొన్నామో గుర్తుకుతెచ్చుకోండి. ఒకానొక దీర్ఘవ్యాధి వ్యాధినిరోధక శక్తిని సంహరించివేయగా, ఈ అంటువ్యాధులు అంటుకొనగలుగుతున్నాయని చెప్పుకొన్నాం కదా! వ్యాధి నిరోధకశక్తి కొందరిలో లేకపోవడానికి అలోపతీ వైద్యులు కారణాన్ని కనుగొనలేకపోతున్నారు. కారణమిదే! సోరా దీర్ఘవ్యాధి ఆవహించిన వేళ అనుభవానికి వస్తున్న దీనస్థితి ఇది! ఇది తెలియక ఒక్కొక్క అంటువ్యాధికి ఒక్కొక్క 'వ్యాక్సిన్'ను రోగికి అందిస్తున్నారు. ఆ జాబితాలో లేని అంటు వ్యాధి వచ్చి అంటుకొంటే అప్పుడేమి చేస్తారు! కనుక వ్యాక్సిన్లు ఇస్తూ పోవడంకాదు చేయవలసింది. మానవుడు ఈ సోరా వ్యాధి నుండి బైటపడే మార్గాన్ని చూడాలి. సోరానుండి బైటపడినవేళ ఇక ఏ అంటువ్యాధీ అతడిని సోకలేదు. ఈ సూక్ష్మం మనకు తెలియాలి!

ప్రాణ ప్రక్రియలయిన జీర్ణక్రియ, శ్వాసక్రియ, రక్తప్రసరణక్రియ గతులు తప్పుతాయి. దానితో ఈ ప్రక్రియల విషయమై అడుగడుగునా అసౌకర్యం ఎదురవుతూ ఉంటుంది ఆకలిలో తేడాలు, అరుగుదలలో తేడాలు, మల విసర్జనలో తేడాలు, ఉచ్ఛ్వాస నిశ్వాసలలో ఆటు పోటులు, స్వేదక్రియలో విలక్షణ స్థితులు, రక్తప్రసరణలో ఎగుడుదిగుడులు, మూత్రవిసర్జనలో ముప్పుతిప్పలు ఇవన్నీకూడా సోరా వ్యాధియొక్క ఫలితాలుగా అనుభవమవుతాయి.

అలాగే పంచేంద్రియ ప్రవృత్తులలో చెదరుబాటు అనుభవానికి వస్తుంది. కన్ను-కంటిచూపు, చెవులు-వాటి వినికిడి, ముక్కు-వాసన చూడగల శక్తి, నాలుక-అది రుచిని అందుకొనగలపైనం, చర్మం-అది స్పర్శను అనుభవించగలతీరు వీనిలో పెద్దఎత్తున మార్పులు వస్తాయి. పంచేంద్రియ ప్రవృత్తులను గమనిస్తున్నప్పుడు ప్రాణశక్తి పట్టు తగ్గుతున్నది, ప్రాణశక్తి పట్టు తప్పుతున్నది అని మనకు స్పష్టమవుతూ ఉంటుంది.

వ్యాధి చర్మముపైకి ఉబికినప్పుడల్లా మనం అణచిపెడుతూ ఉండటంచేత చేసేది లేక ప్రాణశక్తి వ్యాధికి లోపల భాగాలను అప్పజెప్పవలసి వస్తున్నది. వ్యాధి ఇలా దేహ భాగాలను వశపరుచుకొంటున్నది అనిగ్రహించలేక ఆయాభాగాల పేరిట వ్యాధిని పిలుస్తూ కాలక్షేపం చేస్తున్నారు వైద్యులు. ఇది ఎముకల జబ్బు, ఇది నరాలజబ్బు ఇది లివరు జబ్బు అంటూ ఎన్నో జబ్బులు ఉన్నట్లుగా భ్రమపడుతున్నారు. నిజానికి జరుగుతున్నది ఏమిటి? వ్యాధి ఆయా భాగాలను ఆక్రమిస్తున్నది. అప్పుడు మనమెలా బోధపరచుకోవాలి? వ్యాధి లివరును వశపరుచుకొన్నది. వ్యాధి నరాలను ఆక్రమించినది. వ్యాధి కొంపకేలను లొంగదీసుకొన్నది. ఇలా అనగలగాలి. ఇలా అని తెలిసికోగలగాలి! ఈ గ్రహింపులేక ఆ భాగాలను పట్టుకు వేలాడుతున్నారు వైద్యులు. దానితో వ్యాధి మరింత ప్రధానమయిన భాగాలను స్వీకరించవలసి వస్తున్నది. లేదా నివారణకు సాధ్యంకాని స్థితిని ప్రకటించవలసి వస్తున్నది. ఇదీ జరుగుతున్నది! కనుక సోరాక్రిష్టవ్యాధి కలవారు అల్సరు నుండి క్యాన్సరువరకూ ఏ వ్యాధి స్థితినయినా పొందగలరు. అది మనకు తెలియాలి!

అల్సరు, క్యాన్సరు అన్నప్పుడు కూడా వైద్యులు చిత్రంగానే ప్రవర్తిస్తున్నారు. ఫలానాచోట అల్సరు ఉన్నది అంటున్నారు. ఫలానా భాగానికి క్యాన్సరు వచ్చింది అంటున్నారు. దానిని తొలగిస్తాము అంటున్నారు. ఈ గ్రహింపు సరికాదు. శరీరమంతటికీ అల్సరువంటి స్థితివస్తున్నది. అది అనుకూలమయిన చోట ముందుగా

వ్యక్తమవుతున్నది. శరీరమంతటికీ క్యాన్సరువంటి స్థితి వస్తున్నది. అనుకూలమయిన చోట ముందుగా కనపడుతున్నది. మామిడికాయకు చుక్కదిగిందీ అంటే అర్థ మేమిటి? కాయమొత్తం పలకమారిందనేగా! అలాకాదు ఈ చుక్కదిగిన చోట మాత్రమే పలకమారింది అనవచ్చునా? ఆలోచించండి! కనుక వ్యాధిని గూర్చిన అవగాహనలో అలోపతీ వైద్యులు ముందుకు వేయవలసిన అడుగులు చాలా ఉన్నాయి. హానిమాన్ అడుగుజాడలలో సరిగా వారి అడుగులు పడాలి! అప్పుడు మాత్రమే వారు నిజమైన వైద్యాన్ని లోకానికందించగలరు. దేహభాగాల పేరిట వ్యాధిని విడదీయరాదు.వ్యాధి కొక పేరును పెట్టి దానికొక వైద్యము చేస్తూ కూర్చుండి పోరాదు. అప్పుడు వైద్యము పేరుకు జరుగుతున్నది తప్ప వ్యాధికి కాదు. రోగికి అసలే కాదు !

## మనోమయ కోశం

నోరా సోకిన మనస్సు అవశ్యకతలనుండి కోరికలపై పుకు మళ్లుతుంది. అవసరాల నుండి భోగాల పై పుకు మొగ్గుతుంది. దానికి అంతస్తు కావాలి. హోదా కావాలి. పదవి కావాలి. పదిమంది గుర్తింపు కావాలి. వీటన్నింటిలోపడి, వీటన్నిం టికి లోబడి నిజమయిన జీవితాన్ని అది కోల్పోతుంది. కాని విలువలను కోరుతూ, సుఖశాంతులకు దూరమతుంది.

## రుచుల వైపుకు

ఆహారమిచ్చే పోషణకన్నా, ఆహార మందించే రుచిని ఆలోచిస్తుంది. పోషక విలువలను పోగొట్టు కొనయినా సరే రుచులను అనుభవించాలి అని కోరుకొంటుంది. దంపుడు బియ్యం మంచివి అని దానికి తెలుసు. కాని మరబియ్యాన్నే మరీమరీ అడ కోరుకొంటుంది. వార్చిన అన్నం పిప్పివంటిది అని దానికి తెలుసు. కాని వార్చక తప్పదు అని ప్రకటిస్తుంది. అలాగేపేపళ్లనుకోరుతుంది. ఊరగాయలను అడుగుతుంది, అప్పడాలు, వడియాలు ఇష్టపడుతుంది. వరిగేదేమీ లేదని తెలిసినా వరుగులకోసం తాపత్రయపడుతుంది. ఉప్పుకారాల మోతాదు పెంచుతుంది. పదార్థమిచ్చేశక్తి కన్నా, పదార్థమిచ్చేరుచి ముఖ్యం-అంటూతాను రుచినసుభవిస్తూ,జీర్ణాశయానికిఅనవసరమయిన అంశాలను పంపుతుంది.

నిమ్మరసం త్రాగవచ్చు. అందులో తేనెను కలుపవచ్చు. నారింజ, బత్తాయిల వంటివి గ్రహించవచ్చు. ద్రాక్షపళ్లను స్వీకరించవచ్చు. ఇలా ఫలరసాల నెన్నింటినో

అందుకోవచ్చు. కాని ఫలరసాలను ఆవలపెట్టి పానీయాలను కోరుతుంది మనస్సు. శీతల పానీయాలను సేవిస్తానంటుంది. ఆ పానీయాలలో ఏమీ లేదని దానికి తెలుసు. అయినా ఆ రుచికోసం వెంపరలాడుతుంది

ఇంటిలో చేసికొని తినేటందుకవకాశముండగా, హోటళ్ళవైపుకు మొగ్గుతుంది. హోటలులో లాగా ఇంట్లో ఉండటం లేదని కసురుతుంది. ఏదో ఒక వంకపెట్టుకొని, హోటళ్ళకూ, బేకరీలకూ వెళ్ళిపోతుంది. గతచరిత్ర నొకసారి చూస్తే మనకొక సత్యం బోధపడుతుంది. అలోపతీవైద్యం మనదేశంలో ప్రవేశించి, పెద్దఎత్తున వ్యాధుల అణచివేతను మొదలుపెట్టి సోరాను విజృంభింప జేసిన తరువాతనే మనం ఇలా బజారు తిండ్లకు అలవాటు పడ్డామనీ, ఇన్ని హోటళ్లు అందుకే వెలుస్తూ వచ్చాయనీ, ఇంకా వెలుస్తున్నాయనీ మనకు తెలిసి వస్తుంది. ఇదంతా అభ్యుదయమా? లేక సోరా విజృంభణమా? ఆలోచించండి! కానీ సోరాకు చెందిన మనస్సుకు ఇది అభ్యుదయంగానే కనిపిస్తుంది. కానివిలువలకు పెద్దపీట వేయడం దాని లక్షణం కదా!

ఇంతకూ ఆహారమెందుకు? శరీరం నిలబడేటందుకు! సోరాగ్రస్తమయిన మనస్సు ఈ సత్యాన్ని విస్మరిస్తోంది. ఆహార స్వీకరణం రుచులను అనుభవించడానికే! అభిరుచులను తీర్చుకొనడానికే-అని అది నమ్ముతుంది. కావలసిన ఆహారాన్ని రుచిగా రూపొందించుకోవడం స్వస్థత లక్షణం. రుచికొరకే ఆహార స్వీకరణం అని విశ్వసించడం అది సోరా లక్షణం.

రుచికొరకని దారి తప్పిన తరువాత ఇక ఆ పయనం లేక ఆ పతనం అంతటితో ఆగదు. అన్నపానాలతో ప్రారంభించి ఇక అన్ని 'పానాల'కూ అది ఆస్కారమిస్తుంది. కాఫీ, టీలు, దినచర్యను నడిపిస్తాయి. ధూమపానం ఉల్లాసమనిపిస్తుంది. మద్యపానం మధ్యమధ్యలో ఉండవలసిందిగానే కనిపిస్తుంది. తాంబూలం సరదాను దాటి జరదాగా మారుతుంది. పొగాకు నశ్యంగా రూపొంది సభాపూజ్యతను సంపాదిస్తుంది. మామూలు పొగచాలక కొందరు అడ్డపొగకు అలవాటుపడతారు. ఇవన్నీ ఎందుకని కొందరు సూటిగా పొగాకునే నములుతారు. ఇదంతా ఎందుకుట? రుచులు కావాలి. ఘాటైన రుచులు కావాలి. క్రమంగా ఎంత ఘాటు ఉన్నా చాలని స్థితి వచ్చేస్తుంది. ఈ రుచులలో, ఈ స్థితులలో లివరు చెడుతున్నదనీ, నరాలు దుర్బలమై పోతున్నాయనీ శరీరం వశం తప్పుతున్నదనీ చెప్పినా వారికి తెలుస్తుందా? తెలిసినా వారు మానగలరా?

ఇంతగా రుచులు కోరుతున్నారు కదా, ఎంతగా తినగలరు వీరు అనిచూస్తే ఆశ్చర్యం -వేస్తుంది! పట్టుమని పట్టెడన్నం తినగలగిన స్థితి ఉండదు. అరుపులే తప్ప అసలులేదు. ఇష్టమైనవి నాలుగూ ఒకేరోజు చేస్తే తినగలిగే సత్తాలేదు. 'అన్నీ ఒక్కరోజే ఎవరుచేయమన్నారు నిన్ను'- అని పోట్లాడతారు కూడా! మరి మన పెద్దలు ఒక్క ఉదుటున నలభైగారెలు తినగలిగే వాళ్లుకదా! శేరు పాయసం ఒక్క సారిగా త్రాగేవారు కదా! అదరువులు అన్నీ వేసికొని, ఒక్కొక్కదానికీ విస్తరి నిండుగా కలిపి అన్నింటికీ న్యాయంచేకూర్చేవారు కదా! అంటే ఇక్కడ గమనించ వలసింది ఏమంటే, మనపెద్దలు చేతలవారు. సోరా చేతికి చిక్కనివారు! వాళ్ల తినగలరు, అరిగించుకోగలరు. మనం కూతల వాళ్లం. సోరా చేతికి చిక్కినవాళ్లం. తినలేము, అరిగించుకోలేము.

మనపెద్దలు కాశీకి నడిచి వెళ్లారు. మనం ఇవాళ కాసేపుకూడా నడవలేము. ఇక్కడ నుండి ఇక్కడికి రిక్షాకావాలి. ఇక్కడి నుండి అక్కడికి సిటీబస్సుకావాలి. సిటీ బస్సుకోసం ఎదురు చూస్తాముతప్ప, ఎదురుగా ఉన్న దారివెంట నడిచిపోలేము. కాళ్లున్నాయి నడవలేము. చేతులున్నాయి చేయలేము. నోరున్నది తినలేము. మనస్సున్నది మనలేము. ఇదీ సోరా మహిమ! సోరా బారిన పడనివారుమనపెద్దలు! అలోపతీ వైద్యంచేత అంటుబడలేదువాళ్లు. అందుకే అంతగా చేవగలిగి జీవించ గలిగారు. మనకిప్పుడు ఆ చేవలేదు. కేవలం చావలేక బ్రతుకుతున్న వాళ్లం! మన పెద్దలు సదాచారాన్ని ఆశ్రయించారు. ఔషధమే అవసరంలేని జీవితాన్ని నిండుగా అనుభవించారు. మనం సదాచారానికి దూరమయ్యాం. సోరా దీర్ఘవ్యాధికి లోనయ్యాం, ఇలా బ్రతకలేక బ్రతుకుతున్నాం. కావిబ్రతుకు బ్రతుకుతున్నాం. కనుక సోరా లేని వారు ఎలా ఉంటారన్నప్పుడు మనం మనపెద్దల నొకసారి స్మరించకొంటే చాలు.

సోరాకు గురైన కుటుంబంలో జీవకళ మనకు కనిపించదు. నిరాశలు, నిస్త్రాణ, నిట్టూర్పులు, మూలుగులు—ఇవేమనకు కనిపిస్తాయి. మధ్య మధ్యలో గావుకేకలు. ఇవే మనకు వినిపిస్తాయి. నలుగురున్న ఇంటిలో ఎప్పుడూ ఎవరో ఒకరు మంచం పట్టి ఉంటారు. అందరూ హాయిగా ఉండేరోజు బహుశా ఉండదేమో! ఇటు రుచుల వేటకూ, అటు ఔషధాల వేతకూ జీవితకాలం చాలని స్థితి! ఇది సోరా సృష్టించిన పరిస్థితి! విధినిర్వహణకు సమయం చిక్కనిస్థితి. విధిలేక విధిని నిర్వర్తిస్తున్న పరిస్థితి!

చిరాకు-అసహనం

చీటికీ మాటికీ చిరాకు. మాటకూ మాటకూ చిరాకు, ఊరికే ఊరికే చిరాకు! కారణంలేకనే చిరాకు. అవసరం లేకుండానే అసహనం. నేర్పు ఉంటుందిగాని, ఓర్పు ఉండదు. చేయాలని ఉంటుందిగాని చేయలేరు. చేయలేక పోతున్నామని ఒప్పుకోరు. దానికి వ్యక్తులూ, పరిస్థితులూ కారణమని చిరుబురులాడతారు. కేకలేస్తారు. తిడతారు. అరుస్తారు. పరుషవాక్కులు పలుకుతారు. గొంతెత్తి తిట్లుతిడుతూ విరుచుకు పడతారు. ఆగలేరు. తోటివారు వీరితో వేగలేరు.

చిరాకు పడటానికి సిద్ధంగా ఉంటారు. ఎప్పుడు పడదామా అని చూస్తూ ఉంటారు. సన్నివేశమేదయినా వస్తే, ఇక అగ్గిపుల్లకు అగ్నిపెట్టి అందివచ్చినట్లే! రివ్వున మండి పడతారు. పనిచేస్తూ ఉండటం వీరికి తెలియదు. పనిచేస్తూ మండటమే వీరికి తెలుసు! మళ్లీ మండుతున్నారూ అని ఎవ్వరూ అనకూడదు. అంటే ఇంకా మండిపడతారు. మండగలగటమే తప్ప, మనగలగటం వీరికి తెలియదు.

ఒకదశ దాటితే వీరికి వివశత్వం వస్తుంది. విసిరికొడతారు. చేతిలో ఏదుంటే దానిని విసిరేస్తారు. అన్నంతింటూ ఆ కంచాన్ని భార్యపై విసిరికొట్టే భర్తలుంటారు. వంటచేస్తూ ఆ పాత్రలను పిల్లలపై విసిరేసే తల్లులుంటారు. క్రింది ఉద్యోగస్తులపై ఫైళ్లను విసిరికొట్టే అధికారులుంటారు. కాస్త దానికికూడ రెచ్చిపోతారు. మాటిమాటికి రభసచేస్తారు. కథను సాఫీగా సాగనీయరు. తగవులాడనిదే వీరికి తనివి తీరదు. తోటి వారిని తిట్టకుండా పనిచేయడం ఎలాగ? చిన్నపిల్లలను కొట్టకుండా చదివించడ మెలాగ? మాట అనకుండా మాట్లాడటం ఎలాగ? కేకలు పెట్టకుండా కథను నడపడం ఎలాగ?-అని ఎదురు ప్రశ్నించగలరు వీరు. మీదాకా వస్తే మీకూ తెలుస్తుంది- అని గద్దించగలరుకూడా! ఒక్కమాటలో చెప్పాలి అంటే, చేపనీటిలో ఉన్నట్లుగా, వీరు చిరాకులో ఉంటారు. చేపకు నీరు ఎలాంటిదో, వీరికి చిరాకు అలాంటిది!

చిరాకు రాజయితే, అసహనం దానికి మంత్రి వంటిది. సోరా సామ్రాజ్యానికి వీరే రాజు, మంత్రి! రాజుగారిని ప్రోత్సహించడమే మంత్రిగారికి పని! 'పిల్లలని ఎప్పుడో అప్పుడు కొట్టనివారు ఎవరు? ఎప్పుడో అప్పుడు మాట అనుకోని భార్యాభర్త ఎవరు? కొట్లాటలు లేని కొంపలెక్కడ? గావుకేకలు లేని చోటు లెక్కడ? ఇది స్పీడుయుగం కదా-వేచియుండగలవారు ఎవరు? అసలువేచి ఉండమనవచ్చునా?'- ఇలా ఉంటుంది అసహనమనే ఆ మంత్రిగారి ప్రోత్సాహం! అరుస్తాను అని రాజు

గారంటే అరవండి ఫరవాలేదు. మీ స్థానంలో ఎవరున్నా అరచి తీరుతారు. అసలింతకు ముందే మీరు అరచి ఉండవలసింది—అని ప్రోత్సహిస్తాడు ఈ మంత్రి. గంతకు తగ్గ బొంత అన్నట్లుగా రాజుకు తగిన మంత్రి! వ్యాధికి తగిన లక్షణాలు. ఇంక మనుషులు లక్షణంగా ఎలాఉంటారు? వ్యాధిలక్షణంగానే ఉండగలరుతప్ప!

### హర్రీ-వర్రీ

తాము హైరాణపడతారు. తోటి వారిని హైరాణ పెడతారు. తాము ఒత్తిడి ననుభవిస్తారు. ఎదుటి వారిని ఒత్తిడిచేసేస్తారు. తమకు తోచదు. ఎదుటి వారికి తోచనీయరు. అంతలోనే హడావిడి చేస్తారు. అంతలోనే డీలాపడి పోతారు. అంతా ఆటుపోటులు. ఆపసోపాలు. కోపతాపాలు. నిరాశా నిస్పృహలు. అదీ చిన్న పనయినా సరే పెద్దపనయినా సరే, ఇవన్నీ ఉండవలసిందే! ఈ పరివారమంతా ఉండవలసిందే! అసలు వీరికి పనిచెప్పకుండా ఉంటే బాగుంటుందేమో అనిపిస్తుంది. చెప్పకపోతే వర్రీఅవుతారు. చెబితే హర్రీ అవుతారు. చేయలేరు, చేయకుండా ఉండలేరు. కలగజేసి కోకుండా ఉండరు. కలవరపెట్ట కుండానూ ఉండరు. తాము నిలబడరు, మనను నిలబడనీయరు. తట్టుకోవడం కష్టమనిపిస్తుంది. తప్పుకోవడం సాధ్యంకాదు. ఎలా వీరితో చచ్చేది అనిపిస్తుంది. తప్పుతుందా అనిపిస్తుంది.

### పంతాలు-పట్టింపులు

పట్టుదలలు బాగా ఎక్కువ. ఇతరులు తమను తక్కువగా చూడకూడదు. తనకు ఏమాత్రం తక్కువ జరిగినట్టు అనిపించినా సహించలేరు. పంతాలు పడతారు. పట్టింపులకు పోతారు. ప్రతిచోటా తమకు పెద్దపీట వేయబడాలి. చిన్నపీట వేసినట్లు తమకు తోస్తే దానిని అవతలకు త్రోసి, వారు ఇవతలకు వచ్చేస్తారు. గౌరవానికి భంగం జరగకూడదు. గుర్తింపులో కొరత ఉండకూడదు. సరిపెట్టుకోవడం చేతకాదు. ఉరిపెట్టుకొన్నంత పనిచేస్తారు.

ఒకతను కావలసిన వారింటికి పెళ్ళికనివెళ్ళాడు. అక్కడి వాళ్లు ఇతనికి ఎదురుగా వచ్చి మర్యాదలు సలపడంలో ఆలస్యం జరిగినట్లుగా అతనికి అని పించిందట. అంతే! పెళ్లి పందిర్లోకి పూర్తిగా వెళ్లకుండానే తిరిగి వచ్చేశాడు. పెళ్ళిళ్లవంటి శుభకార్యాలలో ఈ సోరా ప్రజ్వలనాన్ని మనం కనులారాచూడవచ్చు!

తప్పులుపట్టే కళ

తమను అందరూ పెద్దచూపు చూడాలి! తాము మాత్రం అందరినీ చిన్న చూపు చూస్తారు. ఎంత మంచివారిలోనైనా తప్పులను ఎంచగలరు. తప్పులను ఎంచడంలో వీరిని మించినవారు ఇక ఉండరు. ఎంతటివారిలోనైనా, సమాజంచేత ఎంతగా గౌరవింపబడుతున్న వారిలోనైనా ఏదో ఒక దోషాన్ని ఇట్టే చూపగలరు. రంధ్రాన్వేషణలో నిపుణులు. ఈగ సూటిగా పుండుమీద వాలగలిగినట్లుగా, వీరి కన్ను సూటిగా ఎదుటివారిలోని లోపంమీద పడగలదు. సోరా వలన వీరి మనస్సుకు ఇలాంటి పదును వస్తుంది. ఎవరెవరిలో ఏయేదోషాలు ఉన్నాయో, చిటికెలో ఏకరువు పెట్టగల నైపుణ్యం వీరికి అబ్బుతుంది. కొందరికి యోగశక్తి ఉన్నట్లుగా, వీరికి ఇలాంటి రోగశక్తి ఉంటుంది. మీరు ఎవరిపేరు ఎత్తండి, వారిలోని లోపమేమిటో వెంటనే వీరు చెప్పగలరు. వారిలో మంచికూడ ఉంటుందికదా! కాని వీరు దానిని మెచ్చలేరు. ఎదుటివారి బలహీనతలను బహిర్గతం చేయడంలో వీరు సరదా పడతారు. మళ్లీ వీరినెవరయినా తప్పు పడితే దానికి తట్టుకోలేరు. ఉడికిపోతారు. రెచ్చిపోతారు. వివశత్వంతో ఊగుతారు. మరి ఎదుటివారిని అంతగా ఆడిపోసుకొంటున్నారు కదా, వారికిమాత్రం ఇలా ఉండదా! ఈ సంగతి వీరికి పట్టదు. పడితే తప్పులను ఎంచలేరు కదా! తప్పులను ఎంచనిదే వీరికి రోజు గడవదుకదా! కాలం వెళ్లదు కదా! మనస్సు ఊరట చెందదు కదా!

ఆఫీసులలో సందులు దొరికినప్పుడు, పల్లెటూళ్ళలో నూతుల దగ్గర, బస్తీలలో క్లబ్బుల లోపల, వివాహాలలో విరామసమయాలలో, గుడి గోపురాలలో పురాణ కాలక్షేపాలకు ముందూ వెనుకా ఎక్కడికక్కడ ఒక నలుగురు చేరడం, ఎవరో ఒకరిని గూర్చి తప్పులు ఎంచుకొంటూ కాలక్షేపం చేయడం—మనం చూస్తూనే ఉంటాం. సమయం సందర్భం ఎలా కలసివస్తుందా అని సోరా ఇలా చూస్తూ ఉంటుంది. ఏమాత్రం సందు దొరికినా ఇక విజృంభిస్తూ ఉంటుంది.

ఒక్కొక్క కుటుంబంలో కుటుంబ సభ్యులందరూ సోరాచేత ప్రేరితులయి ఊగిపోతూ ఉంటారు. తెల్లవారి లేచింది మొదలు ఒకరినొకరు తప్పులు ఎంచుకొంటూ, పెద్ద గొంతులతో అరుచుకొంటూ ఉంటారు. రాత్రి ఆ కాసేపూ ఎలా విశ్రమిస్తారో ఏమో, మళ్లీ లేస్తూనే మొదలుపెడతారు. తెల్లవారి లేస్తే పేపర్లలో మనం చూస్తున్నదేమిటి-ఒకరినొకరు తప్పులు పట్టుకోవడమే కదా! పేపర్లనిండా సోరానే కనిపిస్తుంది మనకు. ప్రజలలో కూడా మెజారిటీ సోరావారిదే కాబట్టి, పేపరు తీస్తూనే

'ఈ రోజు ఎవరిని ఎవరు తిట్టారు, నిన్నటి వారికన్నా వీరు బాగా తిట్టగలిగారా లేదా' అని తూచి చూచుకొంటూ ఉంటారు. సోరా ప్రజ్వలనం పెరిగినకొద్దీ వేదిక లున్నది ఒకరినొకరు తప్పులను ఎంచుకొనడానికే! అన్నట్లుగా తయారవుతున్నది పరిస్థితి! ఎవరు బాగా తప్పులు పట్టగలిగితే వారిదే విజయం అన్నట్లుగా ఉంటు న్నది. బహిరంగసభల దగ్గరనుండి, చట్టసభల వరకూ తప్పులు పట్టడమే పరమావధిగా ఉన్నది. సామర్థ్యం ఇందులోనే కనబడుతున్నది.

సోరా ఇలా విజృంభిస్తున్నకొద్దీ ఇక ఒకరినొకరు ఎంచుకోవడమే తప్ప, పెంచుకోవడముండదు. సహకరించుకోవడం సాధ్యపడదు. ఎవరికి వారు వీరిలాగ, వారలాగ అంటూ తాము ఎలాగో అయిపోతారు. ఆవేశ కావేశాలతో వివశత్వం చెందుతూ, వికృతంగా వర్తిస్తారు. శక్తియుక్తులన్నీ ఇలా తప్పులు పట్టడానికే ఖర్చు పెడుతూ, జీవితాన్ని తమకు తెలియకుండానే వృథా చేసేస్తారు. ఎవరు ఏం చేయలేక పోతున్నారో నిశితంగా చెప్పగలుగుతున్న వీరు, ఇంతకూ తాము చేయగలిగినది ఏమిటి?- అని ఆలోచించలేరు. తమ చేతలను తాము సరిజూచుకోలేరు. ఎవరిని వారు సరిజూచుకోవడం స్వస్థత! ఒకరిని ఒకరు తప్పులు పట్టుకోవడం అస్వస్థత. ఇక తప్పులు పట్టడమే జీవితధ్యేయంగా సాగుతున్న వారిది సోరా యొక్క విజృంభణ. పూర్వం మానవులు హోరాహోరీగా పోట్లాడుకొనేవాళ్ళు. ఇప్పటి మానవులు సోరా సోరీగా పోట్లాడుకొంటున్నారు. మరి నూటికి తొంభయి తొమ్మిదిమంది ఉన్నది సోరా లోనే కదా!

### ఆరంభ శూరుల

ఇందరినీ ఇంతగా తప్పులు పడుతున్నారు కదా, మరి వీరు ఏమయినా కార్య శూరులా? అని ఆలోచిస్తే కార్యశూరులు కారు కేవలం ఆరంభశూరులు అని స్పష్ట మవుతుంది. సోరావారు ఒక పనిని మొదలుపెట్టగలరు తప్ప, కొనసాగించలేరు. పనిని మొదలుపెట్టడానికి ఆవేశం చాలు! అది వీరికి పుష్కలంగా ఉంటుంది. పనిని కొనసాగించడానికి దీక్ష కావాలి! అది వీరికి సాధ్యమయ్యే అంశం కాదు.

ఆవేశంతో పనులు ప్రారంభిస్తారు. ఆ ఊపు అయిపోతుంది. ఆ పనులను అంతలోనే వదిలేస్తారు. ఏమిటీ అంటే ఏదో ఒక వంక చెబుతారు. పనుల వత్తిడి పెరిగింది అంటారు. పరిస్థితులు బాగుండలేదు అంటారు. తీరిక చిక్కడంలేదు— అంటారు. తోటివారు కలసిరావడంలేదు-అంటారు. ఎంత చేసినా ఏమి ప్రయోజనం, గుర్తింపు లేదుకదా-అంటారు. తమకు రావలసిన పదవి ఇంకెవరికో పోయింది

అంటారు. మొత్తంమీద ఆ పనిని అంతలోనే అక్కడ వదిలిపెడతారు. ఆ వదిలి పెట్టడంలో తమ తప్పు ఏమీ లేదంటారు. తమమీద ఈగ వాలనివ్వరు. తోటివారి పైన నిప్పులు కురిపించగలరు. ఇంతకూ పని అక్కడ ఆగిపోవడానికి తాము కారణం కాదు. ఇంకెవరో! 'కంటిన్యుటీ ఆఫ్ పర్పస్' లేకపోవడమంటే ఇదే!

శంఖుస్థాపనలు ఎన్ని జరుగుతున్నాయి, నాయకుల చేతుల మీదుగా? మరి ఆ తరువాత నిర్మాణాలెన్ని జరుగుతున్నాయి? పరిశీలించి చూడండి. సోరా ఎంతగా పాతుకుపోతున్నదీ మీకు తెలుస్తుంది. మననాయకులు మనకు ప్రతినిధులు అయినట్లే, మనలోని సోరాకు కూడా ప్రతినిధులని ఇట్టే బోధపడుతుంది.

సోరా ఎక్కువగా గల నాయకులు లెక్కకు మిక్కిలిగా వాగ్దానాలు చేస్తుంటారు. చేస్తున్నప్పుడు పాపం అవన్నీ చేద్దామనే ఉంటుంది వారికి. చేయకూడదని ఉండదు. ఇంతలో గెలుస్తారు. సంబరాలు, పదవులు, పర్యటనలు, సభలు! కాలం గడిచిపోతుంది. మళ్ళీ ఎలక్షన్లు వస్తాయి. చేసిన వాగ్దానాలు అప్పుడు గుర్తుకువస్తాయి. నాలుక కొరుక్కుంటారు. ఈసారి చేస్తామని మళ్ళీ వాగ్దానం చేస్తారు. అనుకొంటారు గాని, ఈసారికూడా చేయలేరు. ఒకవేళ ప్రారంభించినా కొనసాగించలేరు. ఎన్ని నిర్మాణాలు, ఎన్ని ప్రణాళికలు—ఇలా సోరాలో చిక్కుకొనిపోయి ఉన్నాయో మనం గమనించవచ్చు. ఆర్భాటం ఎక్కువ, ఆచరణ తక్కువ. మళ్ళీ ఆ మాటంటే వారు ఒప్పుకోరు. దోషం వారిమీద ఉంచుకోరు అలవోకగా మరొకరిమీదికి నెట్టేస్తారు— పనులు సాగకపోవడానికి ఎవరో కారణమంటారు. ఎవరోకాదు, తమలోని సోరానే అందుకు కారణమని వారు గ్రహించలేరు. తమ అహంకారానికి దెబ్బ తగలనీయరు. ఇలాంటి పరిస్థితులలో మేము కాబట్టి ఈమాత్రమయినా చేశాం—అన్నట్లు చూస్తారు.

## పోటీ స్వభావం

సోరా వ్యాధికి గురి అయినవారికి ఇతరులతో పోటీ పడాలనిపిస్తుంది. తోటి వారిని అన్నివిధాలా అధిగమించాలనిపిస్తుంది. అధిగమించడంలోనే ఆనందం ఉంటుందని వీరికి అనిపిస్తుంది.

కూడు, గూడు, గుడ్డ-నిజానికి ఇవి అవసరాలు. సోరా విజృంభించేటప్పటికి ఈ అవసరాలను ఆధిక్యతను ప్రకటించగల అంశాలుగా స్వీకరించాలనిపిస్తుంది. వాళ్ళ ఇంటికి మనం వెళ్ళినప్పుడు ఎలాంటి భోజనం పెట్టారు? మన ఇంటికి వాళ్ళు వచ్చినప్పుడు మన తడాఖా ఏమిటో వాళ్ళకు చూపించాలి. అనిపిస్తుంది. మొదటినుండీ

; ఊళ్ళో మేడంటే మాదే, అందరూ మమ్మల్ని 'మేడవారు' అంటారు. ఇప్పుడు
ఒకొకడొచ్చి మాకు పోటీగా మేడను కడతాడా! అందుకని మా కవసరం లేక
యినా మరో రెండు అంతస్తులు పైనవేస్తున్నాం. కనీసం పెద్దమేడివారు అన
నా మమ్మల్ని అంటారుకదా! - అని వివరిస్తారు. ఒకప్పుడు ఆస్తిపాస్తులతో
మిత్తంలేకుండా అందరూ ఒకలాంటి బట్టలే కట్టుకొనేవారు. బట్టలను బట్టి వీరున్న
రు, వీరు లేనివారు అని చెప్పటానికి వీలుండేదికాదు. సోరా విజృంభిస్తున్నకొద్దీ బట్ట
లో ఆధిక్యత చూపించాలనిపిస్తున్నది. వందలు, వేలు, లక్షలు బట్టలకు ఖర్చుపెడు
న్నారు. పూర్వం మగ్గాలు సరిపోయేవి. ఇప్పుడు మిల్లులు కూడా సరిపోవడంలేదు.
ఈ బట్టలు కడితే ఒంటికి గాలి సోకదని తెలుసు. అయినా ఆధిక్యత కోసం వాటివి
డుతున్నారు. ఈ బట్టలు కడితే పొయ్యిదగ్గర ప్రమాదం అని తెలుసు. అయినా
ఆధిక్యత కోసం వాటిని కడుతున్నారు. ప్రాణాలను పణంగా పెట్టయినా ఆధిక్యతను
సాధించాలనిపిస్తున్నది. అహా! సోరామహిమ ఎంతటిది! జీవనావసరాలను పోటీపడ
వలసిన అంశాలుగా మార్చివేసింది కదా!

అలాగే చదువులలో పోటీ, ఉద్యోగాలలో పోటీ, వ్యాపారాలలో పోటీ, అడు
గడుగునా పోటీ! ఇవాళ మనది పోటీ ప్రపంచమని మనమే అంటున్నాం కదా! ప్రపం
చాన్ని పోటీ ప్రపంచంగా రూపొందించిన ఘనత సోరాకే దక్కుతుంది. పాటు పడ
వలసినవారు, పోటీ పడుతున్నారంటే ఏమి చెప్పాలి. పాటుపడటం అనే పదం, పోటీ
పడటం అనే పదంగా రూపుమార్చుకొన్నదీ అంటే ఏమనుకోవాలి! పూర్వం, మన
మన తోటి వారు-అనేవారు. ఇప్పుడుమనం మన పోటీవారు-అని అనుకొంటున్నారు.
తోటివారిని పోటీ వారుగా చూస్తున్న స్థితి. అన్నదమ్ముల మధ్య పోటీ, భార్యాభర్తల
మధ్య పోటీ, తండ్రి కొడుకుల మధ్య పోటీ! ప్రతి ఇద్దరి మధ్యనా పోటీ! పోటీ పడ
టమే మానవ లక్షణం అన్న స్థాయికి వచ్చేశాం మనం. సోరా సాంగత్యం మనకు
ఈ రూపు నిచ్చింది, ఈ చూపు నిచ్చింది.

స్వస్థతలో ఉన్నవారికి పాటుపడటం ఉంటుంది గాని, పోటీపడటం ఉండదు.
ఎవరూ ఎవరితోనూ పోటీపడనవసరం లేదని వారికి తెలుస్తుంది. ఈ లోకంలో
ఒకరి పనిని మరొకరు చేయలేరు. ఒకరి పాత్రను ఒకరు పోషించలేరు. ఎవరికి
ఎవరూ 'కార్బన్ కాపీ' కారు. ప్రతి ఒక్కరికీ వారు మాత్రమే చేయగలిగిన పనితీరు
ఒకటి ఉంటుంది. దానిని వారు దర్శించి నిర్వహించగలగాలి! దీనినే స్వధర్మ నిర్వ

హాణమంటారు. సోరా చేత ఆవేశింపబడిన వారికి ఈ స్వధర్మ దర్శనం అందదు. ఒక పని చేయటానికి అందరూ మూగాల్సి ఉంది- అనిపిస్తుంది. మూగక తప్పదు అనిపిస్తుంది. దానితో పోటీ స్వభావం పెరుగుతుంది.

ప్రకృతి వ్యక్తులను పరస్పర పరిపోషకంగా జీవించగలిగే లాగున రూపొంది స్తుంది. ఒకరికొకరు తోడు నీడ కాగలిగే లాగున వారిని తీర్చిదిద్దుతుంది. ఒకరిమండి ఒకరికి 'కోపరేషన్' అందాలన్నది ప్రకృతి ఉద్దేశం. అలాంటిది ఒకరినుండి ఒకరు 'కాంపిటీషన్'ను ఎదుర్కొంటున్నారు అంటే అది సోరా ప్రభావం.

ఈ పోటీ స్వభావం వల్ల ఏమి జరుగుతుంది? మనిషి, తోటి మనిషిని తన కన్నా పరాయివాడుగా చూస్తాడు. తనకు అడ్డువచ్చేవాడుగా చూస్తాడు. తాను అధిగ మించవలసిన వాడుగా చూస్తాడు. క్రమంగా తోటివాడిని తనకు శత్రువుగా భావి స్తాడు. పోటీ స్వభావం వల్ల సమాజంలో సరిక్రొత్తగా రూపుదిద్దుకొంటున్న విషమ పరిణామమిది! దీర్ఘ వ్యాధి అయిన సోరా ఫలమిది!

## శ్రుతి మించిన అహం

తమను మించిన వారు ఉండకూడదు అనిపిస్తుంది. తామే అందరికన్నా ఘనుల మనిపిస్తుంది. ఇంకొకరి ఘనతను చూస్తూ చూస్తూ అంగీకరించలేరు. తమ కన్న గొప్పవారు ఉన్నారూ అంటే ఒప్పుకోలేరు. అవతలివారు గొప్పవారు ఎలా కారో తీవ్రస్వరంతో వివరిస్తూ మనలను హడలగొట్టగలరు.

ఇలా అహంకరించడానికి చదువు సంధ్యలు ఉండనక్కర లేదు. ఆస్తులు, అంతస్తులూ ఉండనక్కరలేదు. హోదాలూ, పదవులూ ఉండనక్కరలేదు. ఏ విధ మయిన కీర్తిప్రతిష్ఠలూ ఉండనక్కరలేదు. సోరా ఒక్కటీ ఉంటే చాలు. సోరా ప్రగాఢంగా ఉన్నవారికి తాము సర్వోన్నతులమనిపిస్తుంది. తమను మించిన వారు లేరు. ఉండరు. ఉండటానికి అవకాశం లేదు-అని వారి మనస్సు గర్జిస్తుంది. ఏ పాత్రతా లేకుండానే తాము అందరికన్నా అధికులమన్నట్లుగా వీరు ప్రవర్తిస్తారు. అసలు పాత్రత అన్నది ఉంటే వీరిలా అహంకరించరు కదా!

## పరుగెత్తే మనస్సు

మనస్సు ఒక పనిమీదనుండి మరొక పనిమీదికి పరిగెత్తుతూ ఉంటుంది. సోరా వలన మనస్సుకు వేగం పెరుగుతుంది. నిలబడలేని స్థితి వస్తుంది. జరుగు

తున్న పనిని గూర్చి గాక, ఆ తరువాతి పనిని గూర్చి ఆలోచిస్తుంది మనస్సు. ఎప్పటికప్పుడు అలాగే చేస్తుంది. చేస్తున్న పనిపైన ఎప్పుడూ నిలబడదు. తరువాత పనిని గూర్చి ఆలోచిస్తూ ఒత్తిడిని అనుభవిస్తుంది.

ఉదయం అన్నం తింటున్నప్పుడు ఆఫీసుగురించి ఆలోచిస్తుంది. ఆఫీసులో పనిలో ఉన్నప్పుడు ఇంటిని గురించి ఆలోచిస్తుంది. ఇంటికి వచ్చిన తరువాత ఆ విశ్రాంతిలో మళ్ళీ ఆఫీసు గురించి ఆలోచిస్తుంది. ఇలా నడుస్తున్న పనికి న్యాయం జరగకుండా చూస్తూ ఉంటుంది. కారుకన్నా చక్రం ముందు పరిగెత్తితే ఎలా ఉంటుంది? అలా మనిషికన్నా ముందుగా మనస్సు ఇక్కడ పరుగెత్తుతున్నది, కారును విడిచిన చక్రంలా! ఇప్పుడా వేగం కలుస్తుందా! ఆ ప్రయాణం సాగుతుందా? ఆలోచించండి!

పగలల్లా ఇలా సన్నివేశంనుండి సన్నివేశానికి పరుగెత్తుతున్న మనస్సు, ఎప్పటికప్పుడు తరువాత సన్నివేశం పైపుకు పరిగెత్తుతున్న మనస్సు దినచర్య ముగిసి రాత్రి ఇక పడుకొందామని లైటు తీసివేసేటప్పటికి పడుకోవడం మానేసి రేపటి గురించి ఆలోచిస్తున్నది. మనస్సుకు ఇప్పుడు నిద్రపట్టాలి. అది పట్టడం లేదు. మనస్సు దానిని పట్టించుకోవడం లేదు. దానికి తరువాత పనికావాలి. అందుకని రేపటి పనిని పట్టించుకొంటున్నది. ఈ పూట నిద్రపోకుండా, రేపటి పనికి అది న్యాయం చేయగలదా?-అని ఆలోచించగలిగిన స్థితిలో అది లేదు.

ఇంతలో భార్య లేచి అడుగుతుంది-ఏమిటండీ ఇంకా మేలుకొనే ఉన్నారా? అని, దానితో అతడికి వివశత్వం వచ్చి ఇలా అంటాడు: ఇంకా నయం, బ్రతికే ఉన్నారా అని అడగలేదు. నేనేం చేస్తున్నానో, ఏం చస్తున్నానో మీకేం తెలుస్తుంది? బరువు మోసేవాడికే తెలుస్తుంది, తిని పడుకొనే వాళ్ళకేం తెలుస్తుంది? పైగా పడుకో లేదా? అని అడుగుతున్నావా? మీరు పడుకొంటున్నారు కదా, అది చాలులే!-ఇలా వినుకోగలరు.

ఆమె బిత్తరపోతుంది. ఎన్నాళ్ళు బిత్తరపోతుంది. క్రమంగా అలవాటు పడు తుంది. అప్పుడు ఇంకొక ప్రమాదం వస్తుంది. 'నిద్రపట్టక నేను చస్తున్నా మీకేం అక్కరలేదు. ఇంత తెచ్చి పోస్తున్నాను. ఆ మాత్రం అడిగే దిక్కుకూడా లేదు నాకు'-అని విరుచుకు పడగలడితను.

ఇతనితో ఏమన్నా ఇబ్బందే! ఔనన్నా ఇబ్బందే, కాదన్నా ఇబ్బందే! అవునూ అంటే ఏమిటి ఔను, నీకేం తెలుసు ?—అని కేకలు వేయగలడు. కాదు అంటే ఏమిటికాదు, ఎందుకు కాదు, అసలు నీకేమిటి అర్థమైంది- అని అరవగలడు. ఇలా తాను హైరాణపడగలడు. తోటి వారిని హైరాణ పెట్టగలడు.

ఇక ఇలాంటి వారి దాంపత్య క్రతునిర్వహణకూడా హైరాణతో కూడి ఉంటుందని వేరే చెప్పనక్కరలేదుకదా! ఆనందించాలని ఆరాటముంటుంది. సుఖ పడాలని ఆత్రముంటుంది. కాని మనస్సు నిలచి ఆనందించలేదు. మనస్సుకు తగినట్లే శరీరం కూడా! దాంపత్యక్రతు నిర్వహణకు కావాలసిన సామర్థ్యం దాని దగ్గర అంతంతమాత్రంగానే ఉంటుంది. అలా నామమాత్ర సౌఖ్యంతో రోజులు దొర్లి పోతూ ఉంటాయి. ఎందునా తృప్తిపడని మనస్సు, పడలేని మనస్సు ఇక్కడ మాత్రం తృప్తిపడగలదా! అసంతృప్తి అన్నది వీరికి జన్మహక్కు కదా!

ఇలా మనస్సు పనిమీద నిలవకపోవడంతో ఎప్పటికప్పుడు తరువాత పని మీదకు పరుగెత్తుతూ, ఒత్తిడిని అనుభవిస్తూ ఉండటంతో ఏపనికీ అతడు న్యాయాన్ని చేకూర్చలేడు. మళ్ళీ అనాక అసంతృప్తి. దానితో మరింత ఒత్తిడి! మరింత చికాకు. మరింత అసహనం! మరిన్ని పరుష వాక్కులు.

చేస్తున్న పనిమీద మనస్సు నిలబడని కారణాన, జరుగుతున్న పనిలోని రుచిని మనస్సు అనుభవించలేదు. ఆనందమనే ఆ రుచిని అనుభవిస్తూ పనిచేయ గలగడం దానికి చేతకాదు. ఆ రుచిదానికి అందదు. అది అందుకోలేదు. పనిలోని రుచిని అందుకోలేని మనస్సు, ఇక ఫలితం పైపుకు చూస్తుంది. ఇదే నా ఫలితమని నిట్టూర్పులు విడుస్తుంది. ఎంత రొష్టుపడి ఏమి ప్రయోజనం అని వేష్టపడుతుంది. ఇంతచేశాను ఏమి ఒరిగింది అని నిష్టూరమాడుతుంది. ఏమిచేసి ఏమిలాభం? అంటూ కృంగి పోతుంది.

తృప్తిలేనిస్థితి. రుచిదక్కని పరిస్థితి. ఎందుకు బ్రతుకుతున్నామో తెలియనిస్థితి. ఏమి సాధించామో బోధపడని పరిస్థితి. క్షోభపడతూ ఉంటాడతను. కాని ఓటమిని అంగీకరించడు. తోటివారినీ, ఎదుటి వారినీ పట్టుకొని ఈ క్షోభ అంతటికీ మీరే కారణం అంటాడు.

శోభగా సాగవలసిన జీవితం క్షోభగా సాగడమేమిటి? సోరా మహిమ అంతటిది! సోరా క్షోభ అంతటిది! భూమి మీద నిలబడలేడు. ఆకాశాన్ని అందుకో లేడు. మధ్యలో వ్రేలాడుతుంటే ఎలాఉంటుంది! అటు భూమికీ చెందక ఇటు

ఆకాశమూ దక్కక భరించలేనంత క్షోభ! అయినా అతడు ఓటమిని అంగీకరించడు. తనలో తప్పున్నది అనడు. అలా అని ఎవరయినా అంటే విరుచుకు పడతాడు. ఆత్మ పరిశీలనకు అంగీకరించడు. నలుగురి ముందూ ఒప్పుకోడు. ఒప్పుకొంటే తన ప్రతిష్ఠపోదూ! తాను అలుసైపోడూ!

ఒకతను మాటిమాటికీ భార్యను కేకలేస్తూ ఉంటాడు. అలా కేక లేస్తున్నందుకు నీకు బాధ కలగదా?-అని అడిగాను. తరువాత బాధపడతాను, అన్నాడు. మరి ఆ మాట ఆమెకు చెబుతావా?- అన్నాను-చెప్పను-అన్నాడు, ఎందుకని?- అన్నాను చెబితే అలుసయిపోనూ! ఇంకొకసారి కేకలు వేసినప్పుడు ఆమె నన్ను లక్ష్యపెట్టదు కదా!- అన్నాడు. సోరా వారికి ప్రతిష్ఠ అంతటిది! తమ ప్రతిష్ఠను కోల్పోవడానికి వారు అంగీకరించరు.

## విజ్ఞానమయ కోశం

మనస్సు సన్నివేశం కన్నా ముందుగా పరిగెడుతూ ఉండగా, విచక్షణ సన్నివేశాన్ని సమీపించకుండా అలా వెనుకగా ఎక్కడో నిలబడి పోతుంది. ఎప్పటికో చేరుకుంటుంది. అప్పటికి జరగవలసినదంతా జరిగిపోతుంది.

సన్నివేశానికీ, విచక్షణకూ అనుసంధానమందదు. జరిగిపోయిన చాలా సేపటికి-'ఇంతకూ జరిగింది ఇదా, ఇలా జరిగిందేమిటి? ఇలా జరిగి ఉండవలసింది కాదే'-అన్న విచక్షణ కలుగనారంభిస్తుంది. పని అయిపోయిన తరువాత అప్పుడు కలిగి ఏమిలాభం? మనస్సుకూ, పనికీ లంగరందదు. పనికీ విచక్షణకూ పొంతన కుదరదు.

పనికి అడ్డం వచ్చాడని పిల్లవాడిని అయినకాడికి కొట్టిందితల్లి. వాడు ఏడ్చి ఏడ్చి నిద్రపోయాడు. పని పూర్తిచేసికొని వాడి దగ్గరకుచేరింది. వీపుమీద తేలిన వేళ్లగుర్తులను చూచి కన్నీళ్లపెట్టుకొంది. 'ఇంతగా కొట్టానానేను! అని ఆశ్చర్య పోయింది. దెబ్బలకు కొబ్బరినూనెరాస్తూ తనను తాను నిందించుకొంది. 'ఇంకొకసారి ఇలా జరగకూడదు'-అనుకొన్నది. కాని ఇప్పటికి ఇలా చాలాసార్లు అనుకొన్నది. కొడుతూనే ఉన్నది. ఏడుస్తూనే ఉన్నది, ఎప్పటికప్పుడు ఇలా జరుగుతూనే ఉన్నది. కొడుతున్నప్పుడు విచక్షణ అందిరావడంలేదు. ఆ తరువాత ఎప్పటికో వస్తున్నది. కనుక ఇలా జరుగుతూనేఉన్నది.

ఆఫీసులో ఆఫీసరు క్రింది ఉద్యోగులపైన ఫైళ్లు విసిరికొడతాడు. అందరినీ కసిరి కొడతాడు. హడల గొడతాడు. పెడలగొడతాడు. కొంతసేపయిన తరువాత కబురుపెడతాడు. 'ఎందుకయ్యాఅలా చేసికొంటారు! కోప్పడక తప్పని పరిస్థితి కల్పించుకొంటారు. ఇలాంటి సన్నివేశం మరొకసారి తెచ్చుకోకండి-' అంటాడు. జరిగిన దానికి ఆ తరువాత క్రమక్రమంగా అతనికి బాధకలిగింది. అంటే అప్పటికి విచక్షణ అందుకొన్నది. కాని, అతడు మన్నించమని అడగలేదు, తప్పుఒప్పుకోలేదు. ఇలా జరిగినందుకు నాకూ బాధగానే ఉంది-అన్నట్లుగా ప్రవర్తించాడు.

కాని వీరావారు ఎవరికీ అపకారం మాత్రంచేయరు. విరుచుకు పడతారు తప్ప, విధ్వంసం మాత్రం తలపెట్టరు. ఆఫీసరుగా ఉన్నవాడు ఉన్నంతకాలం కేకలువేస్తాడు తప్ప, వెళ్లేటప్పుడు చేతనయిన మంచిచేసిపోతాడు. అపకారులుకారు. ద్రోహచింతన ఉండదు. అంతవరకు వీరిలోని విచక్షణ బ్రతికి ఉన్నట్లే! సన్నివేశానికి అందిరావడం లేదుగాని, ఆ విచక్షణ అపకారం మాత్రం జరగకుండా చూస్తుంది. అందుకే వీరిని గురించి చెప్పేవారు కూడా—'ఆయనకు చాలాకోపం,కాని మనిషి మాత్రం మంచివాడు, ఎవరినీ ఇబ్బందిలో పెట్టడు'—అని చెప్పుకొంటారు.

కోపంలో వివశత్వం వచ్చినట్లే, ఎవరయినా పొగిడినప్పుడు కూడా వీరికి ఒక విధమయిన వివశత్వం వస్తుంది. వీరిని పొగిడి వీరిచేత పనులు చేయించుకొనే వారుంటారు. అలాగే మద్యపానం వంటి వ్యసనాలలో వీరిని ముంచెత్తి వీరిచేత పనులు చేయించుకొనేవారుంటారు. అప్పుడు కూడ, అలాంటప్పుడు కూడ ఆ వివశత్వానికి గురి చేసిన వారికి మేలు చేయాలని ఉంటుంది తప్ప, మరొకరికి కీడుచేయాలని వీరికి ఉండదు. కాని వివశత్వానికి గురి చేసినవారు వీరి కన్ను గప్పి, వీరిచేత అలాంటి పనులు చేయించే అవకాశం కూడ లేకపోలేదు. ఆ తరువాత, ఆ మత్తు దిగి విచక్షణ అప్పటికి అంది వచ్చి, తమ వలన జరగకూడనిది జరిగినందుకు లోలోపల, బాధ పడతారు. సామాన్యంగా బైట పడరు. తమ వలన అలా ఇబ్బందికి గురయిన వారికి అవకాశం వచ్చినప్పుడు తగిన మేలు చేద్దామని మాత్రం వారికి ఉంటుంది. అలా చేస్తారు కూడా ! విచక్షణ ఆలస్యంగా అంది వచ్చినందువల్ల ఒక్కొక్కప్పుడు ఇలా ఇన్ని మలుపులు తిరుగుతూ ఉంటుంది. మొత్తంమీద వీరు కోపధారులే తప్ప దుర్మార్గులు కారు. దుర్బలులేతప్ప దుష్టులు కారు.

## ఆనందమయ కోశం

వీరికి సుఖపడాలని ఉంటుంది. కాని సుఖపడలేరు. తోటివారిని సుఖపెట్టాలని ఉంటుంది. కాని సుఖపెట్టలేరు. సంతోషంగా ఉండాలని ఉంటుంది. సంతోషంగా ఉండలేరు. అందరినీ సంతోషంగా ఉంచాలని ఉంటుంది. సంతోషంగా ఉంచలేరు. మెదిలితే ఆవేశం, కదిలితే వివశత్వం. ఇక సుఖమెక్కడ, సంతోషమెక్కడ?

ఇతరులను అధిగమించి, తమ ఆధిక్యతను ప్రకటించి, ఆనందించాలని చూస్తారు. ఎప్పుడూ ఎవరో ఒకరిని అధిగమించవలసిన స్థితిలోనే పెట్టబడతారు. ఇక ఎప్పటికి ఆనందిస్తారు! జీవితమంటే ఒక ఆరాటం, జీవితమంటే ఒక పోరాటం-అన్నట్లు ఉంటుంది వీరి పని!

సన్మానాలూ మొదలయినవి పొంది ఆనందిద్దామనుకొంటారు. ప్రయత్నం మీద కూడ వాటిని పొందుతూ ఉంటారు. ఇంతలో తమకన్నా పెద్ద సన్మానం మరొకరికి జరిగినట్లుగా తెలుస్తుంది. ఇంకేమి సంతోషపడతారు! అంతకన్నా పెద్ద సన్మానం తమకు జరిగేది ఎలాగ అన్న ఆలోచనలో పడతారు!

దినపత్రికలో తమను గూర్చి తరచు చూచుకోవాలనుకొంటారు. సేవలూ మొదలయినవి కూడ అందుకే చేస్తూ ఉంటారు. తమను గూర్చి ఫొటోలతో సహా పత్రికలలో వార్తలు రావాలని ఒత్తిడి పడిపోతారు. ఇంతలో తమకన్నా, మరొకరిని గూర్చి ఆ దినపత్రిక ఎక్కువ స్థలాన్ని కేటాయించినట్లు గమనిస్తారు. ఇంకేమి ముచ్చట పడతారు ?

ఇలా ఆనందం, సంతోషం, సుఖం, ముచ్చట—ఇలాంటివన్నీ అందివస్తే ఉంటాయి. కాని అందవు వీరికి. ఆనందాన్ని ఫలితాలలో వెతుక్కుంటున్నారు వీరు. కాని ఆనందాన్ని పొందవలసింది పనిలో కదా, పని జరుగుతూ ఉన్నప్పుడు కదా-అది వీరికి చేతకావడం లేదని ఇంతకుముందే చెప్పుకొన్నాం కదా !

ఆనందమనేది వేరుగా ఉండదు. అది మన రూపంలో ఉంటూ, కార్యాచరణ రూపంలో మన నుండి వ్యక్తమవుతూ ఉంటుంది. మనయొక్క నిజ స్వభావమే ఆనందం! అది బయట దొరికేది కాదు. దానిని అనుభవించడానికి మనకు యోగస్థితి కావాలి. మరి ఇక్కడ ఉన్నది రోగస్థితి కదా !

అసలు ఆనందమయ కోశం యొక్క చెదరుబాటే కదా-అన్నమయ కోశం వరకు వ్యక్తమవుతున్నది. ఈ వ్యాధి లక్షణాలన్నీ కేంద్రంనుండి పరిధికి వ్యక్తమవు

తున్నవే కదా ! అవే చెదరుబాటునే కదా ఇంతవరకూ మనం గమనిస్తూ వచ్చినది! సోరాను నిష్క్రమింపజేయటానికై ప్రాణశక్తి చేసడుతున్న చర్యలే కదా ఇవన్నీ!

అయితే రాను రాను వ్యాధి గాఢమవుతున్నది. ప్రాణశక్తి శిథిలమవుతున్నది. కాఫీ, టీ, వక్కపొడి వీటితో మొదలయి, మద్యపానాది వ్యసనాలకు లోనవడంతో ప్రాణశక్తి మరింత డీలా పడిపోతున్నది. ఈ ఉత్ప్రేరకాలు ముసలెద్దుకు ముల్లు కర్రలా రూపొందుతున్నాయి. ముల్లుకర్ర ఎంతవరకు నడిపించగలదు. చూసి చూసి ముసలెద్దు మొండికేస్తే కథ అడ్డం తిరగదా ! ఉత్ప్రేరకాలు మనిషిని ఎంతవరకు ఉత్సాహపరచగలవు ? వ్యసనపరత్వానికి దేహాన్ని బలి చేసి పొందుతున్న ఉత్సాహంతో ఎంతవరకు ఈ బండిని నడుపగలము? ఉత్సాహం మననుండి మనకు అందాలి తప్ప, అది బయటనుండి అందేదా? కాని సోరా, ఈ మాత్రపు ఆలోచనను మనకు రానీయడం లేదు కదా! వచ్చినా ఆ ఆలోచనను నిలువనీయడం లేదు కదా! ఆనందమయ స్థితి నుండి ఇలా అయోమయ స్థితికిపడిపోగలిగాం కదా! గజ్జిపొక్కును ముట్టుకోవడమనే మొదటి పాపం (ఫస్టు సిన్) మనను ఈ దుస్థితికి తీసికొని వస్తున్నది కదా !

## అన్ని కోశాలా ఆ దురదే !

చూడవచ్చిన వారిలో కొందరు ఏమిటో మాస్టరు గారూ, అంతా ఆదుర్దాగా ఉందండీ ! మీరే చూడాలి అంటారు. వారు ఆదుర్దా అన్నప్పుడల్లా నాకు ఆ 'దురదే' గుర్తుకు వస్తుంది. అన్ని కోశాలా వ్యక్తమవుతున్న ఆ దురదే కదా ఈ ఆదుర్దా!— అనిపిస్తుంది. ఇంతకూ వీరు అదుర్దా అంటున్నారా! ఆ దురద అంటున్నారా ! వారే మంటున్నా వారిని ఇబ్బంది పెడుతున్నదిమాత్రం ఆ దురద. ఇది ఖాయం !

గజ్జి పొక్కు ఏం చేస్తుంది? దురద పెడుతుంది. దానిని అణచిపెడితే ఏమి జరిగింది? అన్ని కోశాలకూ ఆ దురద అంటింది. ఇంతవరకూ మనం చూసింది ఏమిటి ? ఏయే కోశాలలో ఆ దురద ఎలా ఎలా వ్యక్తమవుతూ వస్తున్నదని !

ఈ దీర్ఘ వ్యాధిని నిష్క్రమింపజేసే ప్రయత్నాలు ఆనందమయ కోశం నుండి అన్నమయ కోశంవరకూ సాగుతున్నాయి. ఆ దురద ఆనందమయ కోశం నుండి అన్నమయ కోశంవరకు సాగి సాగి మరల బైటపడుతున్నది.

ఆనందమయ కోశం ఈ ప్రయత్నంలో పడటంతో మిగిలిన కోశాలకు ఆనందం అందేలాని స్థితి ఏర్పడుతున్నది. ఆనందించాలని ఉన్నది. కాని ఆనందించ

లేదు. తాను ఆనందమై ఉండవలసిన స్థితినుండి ఆనందం కోసం వెతుకులాడ వలసిన స్థితి వచ్చింది. ఇది ఈకోశానికి పట్టిన దురద. విచక్షణ వెలుగుతూ ఉండవల సిన స్థితినుండి సమయానికి అది అందిరాని పరిస్థితి ఏర్పడింది. తరువాత వచ్చి అది తాపత్రయపడుతున్నది విజ్ఞానమయ కోశానికి ఈ దురద ఇలా పరిణమించింది. మనస్సుకు వేగం పెరిగింది. ఒత్తిడి హెచ్చింది. చిరాకు, అసహనం పెచ్చరిల్లాయి. తప్పులు పట్టడం దినచర్య అయింది. పనిచేయలేదు. కాని అహంకరించగలదు. పోటీపడగలదు. మనోమయకోశానికి దురద ఇలా అందివచ్చింది. రుచులను కోరింది. వ్యసనాలకు చోటిచ్చింది.

ప్రాణమయకోశం దగ్గరకు వచ్చేటప్పటికి అన్నపానాలకు వేళలు తప్పాయి. ప్రాణప్రక్రియలకు గతులు తప్పాయి. పంచేంద్రియ ప్రవృత్తులు తమ పట్టును తప్పాయి. ఇంతా అయి అన్నమయకోశం దగ్గరకు వచ్చేటప్పటికి కురుపులో, ఒరు పులో అడపా దడపా కనబడుతూనే వున్నాయి. దురదలూ, సలుపులూ తరచుగా చేతికి పనిపెడుతూనే ఉన్నాయి. మరి ఒరిగింది ఏమిటి? అన్నికోశాలా ఆ దురదను అనుభవించగలగడం తప్ప, సాధించుకొన్నది ఏమిటి?

అశాంతి, అసంతృప్తి, అసహనం, ఆవేదన, ఆరాటం, పోరాటం-ఇవే జీవిత లక్షణాలుగా రూపొంది పెనుతుపానులో నావలా మనిషిని నిలబెట్టివేశాయి. దారి దొరకని స్థితి. తెన్నుకానని స్థితి. ఒకానొక విషమ పరిస్థితి. ప్రకృతిని వ్యతిరేకించి, మానవుడు సృష్టించుకొన్న దారుణ మారణ పరిస్థితి!

## తనది కానిది తనది కావాలని

సోరాకు చెందిన మనస్సుకు కూడని కాంక్ష ఒకటి కలుగుతుంది. తనదీ కానిదీ తనది కావాలి అనిపిస్తుంది. అది తనది అనిపించుకోవాలని తాపత్రయ పడు తుంది. దీనినే 'పొజెస్సివ్ టెంపరమెంట్'అంటారు. ఈ కూడని కాంక్షలోని భాగం గానే వీరు వ్యభిచారులవుతారు.

సామర్థ్యం ఎక్కువై వీరు వ్యభిచారులు కావడంలేదు. సోరా విజృంభించడం వల్ల వీరు వ్యభిచారులవుతున్నారు. ఈ వ్యభిచారమే తరువాతి రెండు దీర్ఘ వ్యాధు లకు రూపునిస్తున్నది. సైకోసిస్ గాని, సిఫిలిస్ గాని గతితప్పిన స్త్రీ పురుష సాంగ త్యము వల్ల రూపుదిద్దుకొంటున్నవే!

సోరా లేకపోతే వ్యభిచార బుద్ధిలేదు. వ్యభిచార బుద్ధి లేకపోతే సైకోసిస్, సిఫిలిస్ లేవు. కనుకనే మిగిలిన రెండు దీర్ఘవ్యాధులకూ సోరానే మూలమని చెప్పడం జరిగింది.

ఒకసారి సోకిన తరువాత ఈ దీర్ఘవ్యాధులు ఏడుతరాలదాకా కొనసాగుతాయి. అనగా మిగిలిన తరాలవారు శ్రమపడి పొందవలసిన అవసరం లేదన్నమాట! వారు వారసత్వంగానే వీటిని అందిపుచ్చుకొంటున్నారు.

ఏడుతరాల లోపున వీటిని నయం చేసికొని తీరాలి. లేకపోతే ఏడవతరం వారికి ఇక సంతతి ఉండదు. దీర్ఘవ్యాధులను అదుపు చేసేందుకు తప్పనిసరి పరిస్థితులలో జాతిరక్షణ కోసం ప్రకృతి ఈ చర్యను చేపడుతున్నదన్నమాట! సరైన పద్ధతిని అవలంబించి, వారు దీర్ఘవ్యాధుల నుండి బయటపడితే సంతతిని పొందడానికి ప్రకృతినుండి వారికి అనుమతి లభిస్తుంది.

# సైకోసిస్

సోరాచేత ప్రేరితుడయిన మానవుడు స్త్రీ పురుష సాంగత్య విషయంలో గతిని తప్పి, గనోరియా వ్యాధిని తెచ్చుకొని, దానిని తరుణ వ్యాధిగా బయటకు పోనీయక లోనికి అణచిపెట్టినప్పుడు సైకోసిస్ అను దీర్ఘ వ్యాధిగా అది రూపొందుతూ ఉన్నది. ఒకసారి రూపొందిన తరువాత ఏడు తరముల వరకు ఇది కొనసాగ గలదు. తరాలునడుస్తున్న కొద్దీ ఈ వ్యాధి గాఢమవుతూ ఉంటుంది. పుట్టుకలో నుండే మనిషిని ఇబ్బందుల పాలు చేయగలుగుతుంది.

## అన్నమయ కోశం

సోరావారు సాధారణంగా సన్నగా ఉంటారు. సోరా నుండి వారు సైకోసిస్‌కి మళ్లేటప్పటికి శరీరస్థితి మారుతుంది. సన్నగా ఉండేవారితో బాటుగా, ఒక మాదిరి లావుగా ఉండేవారు కూడా వీరిలో ఉంటారు. సోరావారి శరీరం కళతప్పి ఉంటుందని చెప్పుకొన్నాం. సైకోసిస్ వారిశరీరం నిగనిగలాడుతూ ఉంటుంది. జిడ్డుజిడ్డుగా ఉంటుంది. చెమటలనుండి నూనెవంటిది ఏదోపోతూ ఉంటుంది. ముఖం మరల మరల కడుక్కున్నా, స్నానం మరల మరల చేసినా జిడ్డు జిడ్డే. అది వీరిని వదిలిపెట్టదు.

చెమటలకు రంగులుంటాయి. కట్టుకొన్న బట్టలకు అవి అంటుకొంటూ ఉంటాయి. ముఖ్యంగా కాలరుదగ్గర, చంకల దగ్గర చొక్కాలనూ, బనీన్లనూ పరిశీలించినప్పుడు ఈ సంగతి తెలిసిపోతూ ఉంటుంది. ఊదారంగు, పసుపురంగు, లేదా వివిధ రంగుల కలయిక-ఇలా అనేక రంగులు ముద్రింప బడుతూ ఉంటాయి.

చెమటలకు వాసనలుంటాయి. ఇబ్బందికరమయిన వాసనలు. ఒళ్లువాసన, కట్టుబట్టలు వాసన. ఇతరుల బట్టలతో వీరి బట్టలు కలపడం కష్టం. వెల్లుల్లివాసనవంటి ఘాటయిన వాసనలు కూడా ఉంటాయి.

చెమటల రంగులూ, వాసనలూ ఇలా ఉండటం ఒక హెచ్చరిక వంటిది. విలువయిన దేహధాతువులు చెమటల ద్వారా బయటకు పోతున్నాయని ప్రాణశక్తి

ఈ విధంగా మనలను హెచ్చరిస్తూ ఉన్నది. చెమటనుండేకాదు, మలమూత్రాదీ విసర్జనల నుండి కూడా విలువైన దేహధాతువులు బయటకు పోతూ ఉంటాయి. మూత్రంద్వారా షుగర్ పోతూ ఉన్నది అంటాం. అది ఈ వ్యాధికి సంబంధించినదే!

షుగరును వ్యాధిగా జమకట్టి, దానికి మందువాడి ఏమి ప్రయోజనం! సైకోసిస్ దీర్ఘవ్యాధి యొక్క ఫలితాల జాబితాలో షుగరు ఇలాపోవడమన్నది ఒకానొక అంశం మాత్రమే! కనుక దానిని బ్రతిమాలుతూ కూర్చుండి లాభంలేదు. దానికి కారణమయిన సైకోసిస్ దీర్ఘవ్యాధిని సమూలంగా సాగనంప గలిగినప్పుడు షుగరు పోవడమనే ఈ దుస్థితి అలవోకగా రద్దయిపోతుంది. ఈ సూక్ష్మం తెలియక షుగరు పోవడమన్నది నివారణకాదు-అని వైద్యులు చెబుతున్నారు. అదిసరికాదు. షుగరు దగ్గర ఆగకూడదు. కారణం దగ్గరకు చేరుకోవాలి! అప్పుడు పరిష్కారం లభిస్తుంది. హోమియో విధానంలో నాజూకుగా ఇది నివారింపబడుతున్నది. కొంచెం గమనించండి, షుగర్ పోవడమే కాదు, సైకోసిస్ వారిశరీరంనుండి అనేక విధాలుగా ఎన్నెన్నో విలువయిన ధాతువులు బైటకుపోతున్నాయి. కనుక ఒక్కొక్కదానిని పట్టుకొని ఇబ్బంది పడకుండా, మూలమైన వ్యాధిని ముట్టుకోవడం మనకు చేతకావాలి.

సైకోసిస్‌కు చెందిన వారిలో ఎక్కువమందికి పులిపిర్లు ఉంటాయి. శరీరంపైన ఎక్కడో అక్కడ ఇవి కనబడుతూ ఉంటాయి. కొందరికి ముఖంపైన, కొందరికి చంకలలో, కొందరికి మలమూత్ర అవయవాలదగ్గర—ఇలా వివిధప్రదేశాలలో ఈ పులిపిర్లు కనబడుతూ ఉంటాయి. పులిపిర్లు సైకోసిస్‌కు గుర్తులు. సినిమాకు వాల్ పోస్టర్లు ఎలాంటివో, సైకోసిస్‌కు ఇవి అలాంటివి.

ఈ పులిపిర్లు ఇలా ఉండటం బాగుండలేదని కొందరు దానిపైన యాసిడ్ పోసి వానిని రాలగొడుతున్నారు. కొందరు ప్రతిపులిపిరికి ఒకగుర్రపు వెంట్రుకను కట్టించి పీకిస్తున్నారు. ఇంకొందరు వ్యాధి లక్షణాలతో నిమిత్తం లేకుండా కేవలం పులిపిర్లకని 'తూజా' అనేహోమియో మందును వాడి, వాటిని రాలగొట్టే ప్రయత్నం చేస్తున్నారు. ఈ మూడు పద్ధతులు కూడ చాల అపాయకరమైనవి.

ఇలా చేస్తున్న వీరికి ఇవి ఎందుకు ఏర్పడుతున్నాయో తెలియదన్నమాట! ఇంటిలోని చెత్తను పడవేయడానికి గదుల మూలలలో చెత్తబుట్టలను పెట్టుకొంటాం చెత్త తారసపడినప్పుడల్లా ఆ చెత్తను ఆబుట్టలలో పారవేస్తాం. ఆతరువాత ఆ చెత్త బుట్టలలోని చెత్తను తరలించవలసిన చోటుకు తరలిస్తాం. కావలసిన సౌకర్యం కోసం ప్రాణశక్తిచేత అలా ఏర్పాటు చేసికోబడిన చెత్తబుట్టలే ఈ పులిపిరులు.

పల్లెటూళ్ల లోని పెంట పోగులు ఇలాంటివే! సినిమా హాళ్ల లోని ఉమ్మితొట్లు ఇలాంటివే! అంటే ఏమిటి? తెలిసో తెలియకో మనం నిత్యకృత్యాలలో ప్రాణశక్తిని అనుకరిస్తున్నామన్నమాట!

చెత్త బుట్టలను లేకుండా చేసేస్తే ఏమవుతుంది! ఇల్లంతా చెత్తయి పోతుంది. వక్రమార్గాన పులిపిర్ల వంటి వాటిని తొలగిస్తే ఏమవుతుంది. శరీరస్థితి విషమిస్తుంది. కనుక ఇలాంటి వక్రమార్గాలు పట్టకూడదు. సరి అయిన పద్ధతిలో హోమియో చికిత్సను పొందినప్పుడు శరీరంనుండి దీర్ఘవ్యాధి నిష్క్రమిస్తుంది. అప్పుడు పులిపిర్ల అవసరం తీరిపోతుంది. అలాంటిస్థితిలో పులిపిర్లు వాటికవిగానే రాలిపోతాయి. అంటేఏమిటి! ప్రాణశక్తి స్వయంగా వాటిని సాగనంపుతున్నదన్నమాట!

ఒకప్పుడు మన వైద్యాలయానికి ఒకరోగివచ్చాడు. అతడికి ముఖంనిండా పులిపిర్లు ఉన్నాయి. ముఖాన పులిపిర్లు ఉన్నాయా, పులిపిర్లలో ముఖమున్నదా-అన్నట్లు ఉన్నాడతను. వాటి సంగతి మరచిపొమ్మన్నాము. వేదనా సముదాయాన్ని సమగ్రంగా స్వీకరించి, చికిత్సను ప్రారంభించాము. కొన్నినెలలు గడిచాయి. ఒక రోజు ఉదయం నిద్రలేచి కూర్చొని, రెండుచేతులతోనూ ముఖాన్ని ఒక్కసారి అదిమిపెట్టి రాసుకొన్నాడతను. అతనికి అలా రాసుకోవాలని అనిపించింది. ఆశ్చర్యం! మొత్తం పులిపిర్లన్నీ పొడుం పొడుంగా రాలిపడిపోయాయి. ముఖం ముఖంగా మిగిలిపోయింది. తనముఖం ఎలా ఉంటుంది అన్నది చాలారోజుల తరువాత అతనికి మళ్లీ తెలిసింది. కనుక సరైన చికిత్స జరుగుతున్నప్పుడు ఇలాంటి చిన్న చిన్న అంశాలను గురించి పెద్దపెద్ద విచికిత్సలు పడనక్కరలేదు.

అలాగే ముక్కులలో చెవులలో మెత్తటికాయలవంటివి రావచ్చు. ఇలాంటి మెత్తటికాయలు గుత్తులుగుత్తులుగా నవరంధ్రాలను ఆక్రమించవచ్చు. ఈ దీర్ఘ వ్యాధిలో శరీరంలోని మెత్తటి ధాతువు (Soft tissue) దెబ్బతింటుంది. దెబ్బతిని ఇలా వికృతమయిన రూపాలను ధరిస్తుంది.

ఒకప్పుడు మన వైద్యాలయానికి ఒక పదునాలుగేళ్ల అమ్మాయివచ్చింది. ఆ అమ్మాయికి రెండు ముక్కులనుండి రెండు ద్రాక్షగుత్తుల వంటి గుత్తులు, వ్రేలాడు తున్నాయి. మెత్తటికాయలగుత్తులు. ఈ గుత్తులు సైకోసిస్‌కు గుర్తులు. ఆ అమ్మాయికి ఊపిరి పీల్చడం కష్టంగాఉంది. ఊపిరి అందడం కష్టమవుతోంది. వేదనా సముదాయాన్ని సమగ్రంగా స్వీకరించి, చికిత్సను ప్రారంభించాము. గుత్తులు వాటికవిగా రాలిపడిపోయాయి,

ఇలా సరైన పద్ధతిలో సాగనంపకుండా ఇలాంటి వాటిని అపరేషనుద్వారా తొలగించామనుకోండి. అప్పుడు ఏమవుతుంది? వ్యాధి ఇంకా ముదురుతుంది. ఈ సారి లోపలిభాగాలు దెబ్బతింటాయి. ప్రాణశక్తి తానుగా లోపలి భాగాలను దెబ్బతిననీయదు. ఏదో ఒక రూపంలో మాలిన్యాన్ని బయటకు నెట్టివేస్తుంది. మాలిన్యం మరీ ఎక్కువగా ఉంటే, కొన్నికొన్ని రూపాలను శరీరంపైన కల్పిస్తుంది. పల్లెటూళ్లలో ఇంటికి దూరంగా, అలా ఆమూలన పెంట పోగుపోస్తాం చూడండి. సరిగా అలాగ చేస్తుంది. పెంట పోగు పోయబడిన స్థలంకూడ మనదే! ఇంకొకరి స్థలంలో పోస్తే ఊరుకోరుకదా! మనస్థలంలోనే ఇబ్బందిలేని చోటును చూచుకొని పెంటపోగును పోస్తున్నాం. ప్రాణశక్తి కూడాసరిగా అలాగే చేస్తుంది. మన శరీరానికి ప్రమాదం లేని చోటుకు ఆ మాలిన్యాన్ని నెట్టివేస్తుంది. కావలసి వస్తే అక్కడే ఆ మాలిన్యానికి కొన్నికొన్ని రూపాలను నిర్మించి ఇస్తుంది. పులిపిరుల గుంపులు, మెత్తటి కాయల గుత్తులు ఇవన్నీ ఇలాంటివే! ఇలా నిర్మించి ఇస్తున్నవే!

మూలశంక ఉన్నది. దీనినే పైల్స్ అని అంటారు. భగందరమున్నది. దీనినే పిస్ట్యులా అని అంటారు. గిలక వ్యాధి ఉన్నది. దీనినే హెర్నియా అని అంటారు. ఇలాంటివన్నీ కూడా సైకోసిస్ దీర్ఘవ్యాధి నుండి, మనకు ప్రాణ విపత్కర పరిస్థితి కలగకుండా ఉండడం కోసం ప్రాణశక్తి చేస్తూ వస్తున్న ఏర్పాట్లే! తెలియక ఈ ఏర్పాట్లనే వ్యాధులుగా భ్రమించి, వాటిని కోసేస్తున్నారు. దానితో వ్యాధి లోలోపల ముదిరిపోతున్నది. దారుణ మారణ రూపాలను స్వీకరిస్తున్నది. కనుక ఈ ఏర్పాట్లను మనం ముట్టుకోకూడదు. సరి అయిన హోమియో చికిత్స జరిగినప్పుడు లోపలి వ్యాధి నిష్క్రమిస్తుంది. ఇక బయట చేయబడిన ఏర్పాట్లకు అవసరం తీరి పోతుంది. దానితో అవి వాటికవిగా తప్పుకొంటాయి. జరుగవలసిన పని ఇది! ప్రాణ శక్తి తగినంతగా ఉన్నప్పుడు ఈ పెరుగుదలలు ఇలా వాటికవిగా రాలి పడిపోతాయి. ప్రాణశక్తి తగినంతగా లేనప్పుడు బాధ తగ్గిపోతుంది. ఆ అవశేషాలు నామ మాత్రంగా అలా ఉండిపోతాయి. ఏ మాత్రమూ ఇబ్బంది పెట్టవు. కనుక ఏ పరిస్థితు లలో కూడ అపరేషనుతో పని లేదని మనకు అర్థమవుతున్నదీ కదా!

ఒకప్పుడు మన వైద్యాలయానికి ఒక వృద్ధుడు వచ్చాడు. అతడికి హెర్నియా అనబడే స్థితి ఉన్నది. దానితో బాగా బాధ కలుగుతున్నది. డాక్టర్లు అపరేషను చేయాలి అన్నారు. అతడు భయపడ్డాడు. అదీగాక ఈ పెద్దవయస్సున ఇప్పుడు

ఇవన్నీ ఎందుకు? అనుకొన్నాడు. మన దగ్గరకు వచ్చి 'నాకు ఈ బాధ తగ్గించండి చాలు!'—అన్నాడు. వేదనా సముదాయాన్ని సమగ్రంగా స్వీకరించి, అతనికి చికిత్స ప్రారంభించాము. లోని వ్యాధి బయటకు నిష్క్రమించింది. దానితో హెర్నియా బాధ తగ్గిపోయింది. బాధ తగ్గి ఊరికే నామమాత్రంగా అది అలా ఉంది. మిగిలింది. అతడు స్థిమితపడ్డాడు. ఆపరేషను బాధ తప్పింది కదా అని ఆనందపడ్డాడు.

కొందరికి టాన్సిల్స్ వాస్తూ ఉంటాయి. పిల్లలలో ఈ స్థితి ఎక్కువగా కన బడుతూ ఉంటుంది. అప్పుడప్పుడూ బయట పడుతున్న ఈ స్థితి కూడా, లోపల సైకోసిస్ వ్యాధి ఉన్నదని మనకు తెలియ చెబుతూ ఉంటుంది. ఇది తెలియక డాక్టర్లు టాన్సిల్స్ ఆపరేట్ చేస్తామంటారు. అవసరం లేదు. బైటకు వార్త వస్తున్నది-లోప లకు చూడమని చెప్పడానికి! అలాంటి వార్తాహరుణ్ణి పట్టుకొని, సంహరిస్తామనడం భావ్యమా!-వార్తాహరులను ఇలా సంహరిస్తూ ఉంటే లోపల ఏమి జరుగుతున్నదో చెప్పేటందుకు మనకు ఎవరు మిగులుతారు?-ఆలోచించండి! వాస్తున్నాయని చెప్పి టాన్సిల్స్‌ను తీసేస్తామంటున్నారు. వాచినంత మాత్రాన శరీర భాగాలను తొలగించడ మేనా, అది భావ్యమా! మరి, తరచుగా తలనొప్పి వస్తున్న వారిని ఏమిచేస్తారు, తలను తీసివేస్తారా? కనుక ఆపద్ధర్మంగా తప్ప కత్తిని పట్టకూడదు. ప్రతి చిన్న దానికీ కత్తి పట్టడమంటే అది మనిషిపై కత్తి కట్టడమే! మరి ఎప్పుడు కత్తిని పట్టాలి! ప్రాణశక్తి మనని అడిగినప్పుడు. శరీరం నా వశం తప్పిపోతున్నదని ప్రాణ శక్తి ఆర్తితో ప్రకటించినప్పుడు! అప్పుడు మాత్రమే కత్తిని పట్టాలి! ఆపద్ధర్మంగా మాత్రమే మనం ఆపరేషను చేయడానికి ఉద్యమించాలి.

బైటకు వస్తున్న వ్యాధి స్థితులను ఎట్టి పరిస్థితులలోనూ అణచిపెట్టకూడదు. లేదా కృతకంగా వాటిని తీసివేయకూడదు. అలా చేస్తే ఇక లోపలి భాగాలు దెబ్బ తింటాయి. ఈ సూక్ష్మాన్ని వైద్యులు గమనించాలి. లోపలి భాగాలు అతిగా దెబ్బ తినడం అన్నది ఇటీవలి కాలంలోనే ఎక్కువగా జరుగుతున్నది. కూడని అణచి వేతలకూ, ఆపరేషన్లకూ ఫలితంగా, సమాజానికి ఈ దుస్థితి సంప్రాప్తమవుతున్నది. కనుక వైద్యులు మెలుకువతో ప్రవర్తించాలి. ప్రాణశక్తిని గమనించుకోవడం నేర్చు కోవాలి! ప్రాణశక్తి సంకల్పానికి వ్యతిరేకంగా రోగిపైన ఏ చర్యనూ వైద్యుడు తీసికొనకూడదు. అక్కరలేని చర్యలను అతిగా తీసికొని, శరీరాలను కుళ్ళబెట్టే అధి కారం మనకు లేదు. ఒక యాభై ఏళ్ళ క్రితం ఇన్ని క్యాన్సరు కేసులున్నాయా? ఇంత మందికి మూత్రపిండాలు దెబ్బతిన్నాయా? ఇంతమందికి గర్భాశయాలు తొల

గించవలసి వచ్చిందా? ఆలోచించండి! పరికరాలు పెరుగుతున్నాయి సరే, మరి మన అవగాహన పెరగవద్దా? యోచించండి!

## ప్రాణమయ కోశం

శ్వాసక్రియలో ఎగుడు దిగుడులు గోచరిస్తాయి. శ్వాసకోశం అనేక విధాలుగా వేదనలను అనుభవిస్తూ ఉండటం ఈ దీర్ఘవ్యాధికి చెందిన వారిలో మనం గమనించ వచ్చు. జలుబులు, తుమ్ములు తరచుగా వస్తూ ఉంటాయి. సోరాలో కూడా జలుబులు ఉంటాయి గాని, సైకోసిస్ జలుబులలో తుమ్ములు ఎక్కువ. ముఖ్యంగా వైద్యులు పరిశీలించి ఇస్నోఫీలియా ఉన్నది-అని ప్రకటించిన జలుబులన్నీ ఈ దీర్ఘవ్యాధి క్రిందికే వస్తాయి.

ఆస్తమా అనబడే ఇబ్బందికరమయిన స్థితి-దీనినే మనం ఉబ్బసమంటాం, ఈ స్థితి ఈ దీర్ఘవ్యాధికి చెందినదే! ఊపిరి సలపదు. ఊపిరి అందదు. మొండికేసి నట్లుగా నిలబడి పోతుంది. ప్రాణానికి ముప్పు ఉండదు గాని, మనిషిని గుక్క-తిప్పుకోనీయదు. అలోపతీ వారు ఉపశమనాన్ని అందిస్తూ, జీవిత కాలమూ దీనిని భరించక తప్పదు-అని చెబుతారు. వేదనా సముదాయాన్ని సమగ్రంగా స్వీకరించి, హోమియో విధానాన సరైన చికిత్సను నడిపినప్పుడు ఈ మొండిస్థితి తప్పక దారికి వస్తుంది. నివారణమవుతుంది.

అనేక విధాలుగా గ్యాసు వలన బాధపడేవారుంటారు. ఆ గ్యాస్ట్రబుల్ అది ఏ విధమయినదయినాసరే ఈ దీర్ఘవ్యాధికి చెందినదే! దీనితో బాటుగా అజీర్ణ బాధలు ఉండవచ్చు. మలవిసర్జనలో తేడాలు ఉండవచ్చు. అలాగే ఈ వాతస్థితి కారణంగా నరాల బాధలు కలుగవచ్చు. కండరాలలో ఇబ్బంది రావచ్చు. సంధి బంధాలలో నొప్పులు, వాపు బా సంభవించవచ్చు. ఈ దీర్ఘవ్యాధిని సాగనంపగలిగిన వేళ ఇవన్నీ కూడా నిష్క్రమిస్తాయి.

రక్తప్రసరణలో ఆటుపోటులు అనేక విధాలుగా ఉండవచ్చు. ఉండుండి రక్త నాళాలు కుంచించుకుపోవచ్చు. రక్తప్రసరణ కొన్ని భాగాలలో సరిగా సాగలేక పోవచ్చు. గుండెకు సంబంధించిన రక్తనాళాలు దెబ్బతినవచ్చు. పుట్టుకతోనే గుండెలో రంధ్రమొకటి ఉండి ఉండవచ్చు. దానితో పిల్లవాడు ఏడ్చినప్పుడల్లా నల్ల బడిపోవచ్చు. ప్రాణశక్తి సహకరించిన వేళ ఈ దారుణస్థితుల నుండి కూడా, హోమియో విధానాన చికిత్సను సాగించి రోగార్తులను మనం రక్షించవచ్చు.

## మనోమయ కోశం

ఈ దీర్ఘ వ్యాధికి చెందినవారి మానసిక లక్షణాలను గమనించుకోవడానికి చాలా ఒడుపు కావాలి. సోరావారు తెలిసి పోతూనే ఉంటారు. తమకు తాముగానే బయట పడిపోతూ ఉంటారు. సైకోసిస్ వారు అంత తేలికగా బయటపడరు. సాధ్యమైనంత వరకు మనకు దొరకకుండా ఉందామనే చూస్తారు. వాళ్ళు చెప్పదలచింది చెబుతారు తప్ప, మనకు కావలసింది ఒక పట్టాన చెప్పరు. సోరా వారు తమను తాము రట్టు చేసికొంటూ ఉండగా సైకోసిస్ వారు తమను తాము గుట్టుగా ఉంచుకోవాలని చూస్తారు.

### ఎంతో అనుమానం

అనుమానం సైకోసిస్ వారి జీవ లక్షణం. అంతటా అనుమానమే! అన్నిటా అనుమానమే! తెలియనివారి యెడలా అనుమానమే, తెలిసినవారి యెడలా అనుమానమే! దూరంవారి యెడలా అనుమానమే, దగ్గరవారి యెడలా అనుమానమే! ఒక్కమాటలో చెప్పాలి అంటే అందరూ వీరికి అనుమానించవలసిన వారుగానే కనబడతారు. నిన్నటివరకూ బాగుండవచ్చు. ఇవాళ బాగుండాలని ఎక్కడ ఉంది? నిన్నటి వరకూ మంచిగా ఉండవచ్చు. ఇవాళ మంచిగా ఉండాలని ఎక్కడ ఉంది? ఇవాల్టివరకూ మనతో బాగున్నారు. ఇక ముందు కూడా ఇలాగే ఉంటారని నమ్మకమేమిటి? కనుక మనిషన్న వాడితో, వాడెంతటి వాడయినా, ఎలాంటి వాడయినా, ఎంత కావలసినవాడయినా జాగ్రత్తగా ఉండవలసిందే! ఒక కంట వాడిని కనిపెడ్తూ ఉండవలసిందే! ఎవడినయినాసరే నమ్మినట్లు ఉండాలి తప్ప, నమ్మకూడదు. పనిని జరిపించుకోవాలి తప్ప, మన మనసులో ఏమున్నదీ అవతలి వారికి తెలియకూడదు. ప్రతిమనిషినీ కూడ అనుక్షణం అనుమానించవలసిందే!-ఇదీ వీరి స్వభావం, ఇలా సాగుతుంది వీరి ఆలోచన!

తల్లిదండ్రులను అనుమానిస్తారు. అన్నదమ్ములను అనుమానిస్తారు. ఆలుబిడ్డలను అనుమానిస్తారు. ఏ ఇద్దరు మాట్లాడుకొంటున్నా, అది తమను గురించేనని పిస్తుంది. ఏ ఇద్దరు నవ్వుకొంటున్నా తమను గూర్చే నవ్వుకొంటున్నారు అని పిస్తుంది.

ఒకాయన జేబులో మూడువందలు పెట్టుకొన్నాడు బయటకు వెళ్ళబోతూ! ఒకడుగు ముందుకు వేసినవాడు రెండడుగులు వెనక్కు వేసి, ఆ మూడువందలలో

నుండి రెండువందలు ఇవతలకు తీసి ఇంట్లో భద్రపరిచాడు ఎందుకనీ! ఉంటే అవి కూడా ఖర్చుచేస్తానేమో—అని అనుమానం. లేక ఎవరయినా అడిగితే ఇచ్చేస్తానేమో నన్న అనుమానం. అంటే ఏమిటన్నమాట! తనను తానే నమ్మలేకపోతున్నాడన్న మాట! తనపైన తనకే అనుమానం వస్తున్నదన్న మాట!

భార్యలను అనుమానించడమే పనిగా పెట్టుకొన్న భర్తలుంటారు. అలాగే భర్తలను అనుమానించడమే పనిగా పెట్టుకొన్న భార్యలుంటారు. మాటలతో చేత లతో జీవిత భాగస్వాములను పెద్దయెత్తున పొడుచుకుతింటూ ఉంటారు. వీరందరూ కూడా ఈ సైకోసిస్‌కు చెందినవారే!

ఒకాయన గేటు తీసికొని గృహప్రాంగణంలోనికి ప్రవేశిస్తూనే నలుపైపులా కలయజూస్తాడు. ఈ పాదాల ముద్రలేమిటి? ఈ చెప్పుల గుర్తులేమిటి? సైకిలేదో వచ్చి వెళ్ళినట్లుందే! కుర్చీలూ అవీ ముందుకు జరిగాయేమిటి? వస్తువులు తారు మారుగా ఉన్నాయేమిటి?-ఇలా అనుకొంటూ వెళ్ళి తలుపు కొడతాడు. భార్య తలుపు తీస్తుంది. ఈమెలో ఆ నవ్వేమిటి? ఆ తృప్తేమిటి? ఆ పూలు ఎక్కడివి? ఇంటిలో ఉండగా ఇంతమంచి బట్టలు ఎందుకు కట్టవలసి వచ్చింది?—ఇలాంటి ఆలోచనలతో అడుగడుగునా, అణువణువునా అనుమానిస్తూ మాటలతో, చేతలతో కుళ్ళబొడుస్తూ ముందుకు సాగుతాడు.

అలాగే ఒకామె భర్తను రాత్రిపూట శల్యపరీక్ష చేస్తూ ఉంటుంది. చొక్కాపై ఆ నలుపు రంగేమిటి? ఈ ఎరుపు ముక్కేమిటి? ఇంతపెద్ద వెంట్రుక ఈ చొక్కాను చుట్టుకొని ఉండవలసిన అవసరమేమిటి? బట్టలు ఇంతగా నలగవలసిన అవసర మేమిటి? బట్టలకు ఈ వాసనలేమిటి? ఇవి ఈయనకు అలవాటున్న వాసనలు కావే! ఇలాంటి సువాసనాద్రవ్యాలు ఈయన ఎప్పుడూ వాడలేదే! జేబులో డబ్బు మరీతక్కు వగా ఉన్నదే, తీసుకువెళ్ళినదంతా ఏమయి ఉంటుంది?- ఇలా ఆ శల్యపరీక్ష కొన సాగుతుంది.

ఒకవేళ భార్యాభర్తలిద్దరూ ఈ వ్యాధికి చెందిన వాళ్ళనుకోండి. ఇక బెంగ లేదు. ఒకరినొకరు అనుమానించడమే జీవితవ్రతంగా స్వీకరిస్తారు. తమ జీవితాలను అనుమానాలకు అంకితం చేస్తారు. ప్రతిపూటా పునరంకితం అవుతారు. ఒక దంప తులు ఇద్దరు కొడుకులను కన్నారు. చెరొకరినీ పంచుకొన్నారు. ఒకడు తల్లిపై నిఘా వేసి తండ్రికి సూక్ష్మాంశాలను అందిస్తుంటాడు—మరొకడు తండ్రిపై నిఘావేసి ఆ

సూక్ష్మాంశాలను తల్లికి అందిస్తూ ఉంటాడు. ఇలా బిడ్డలు ఉన్నది ఇందుకే అన్న ట్లుగా ప్రవర్తిస్తున్నారు వాళ్ళు.

ఒక తల్లి తన కొడుకూ, కూతురు అలా అల్లంతదూరాన కూర్చొని మాట్లా డుతూ ఉండగా భరించలేక అందులో ఒకరిని ఇవతలకు పిలిచింది. అన్నాచెల్లెళ్ళ యినా వయస్సు వచ్చిన తరువాత అనుమానించవలసిన వారేనన్నది ఆమె భావన. మరొకామెకు రోడ్డుమీద స్త్రీ పురుషులు కలసి కనబడితే చాలు. వారెవరయినా సరే కూడని ఆలోచన వచ్చేస్తుంది. ఎవరూ, ఏమిటి అని తెలుసుకోవాలనిపించడం లేదు. ఎవరయితేనేమిటి ఆడా, మగా! అదిచాలు అనుమానించడానికి! ఇదీ వరుస!

ఒక తల్లి నీరసంగా మంచాన పడి ఉండి, కొడుకును ఈ పూటకు అన్నం పెట్టుకొని తిను నాయనా అన్నది. తల్లి కావాలనే ఇలా చేస్తున్నదని కొడుకుకు అని పించింది. అతని మనస్సు అలా అనుమానించింది. అవసరమయి ఆర్థికసాయాన్ని కోరితే అవతలి మిత్రుడు పరిస్థితి బాగుండలేదు—అన్నాడు. తప్పించుకోవడానికి ఇలా అంటున్నాడని అడిగినవాడికి అనుమానమొచ్చింది. ఇలా ఎన్నోరకాలుగా ఒకరి నొకరు అనుమానించుకొంటూ ఉంటారు. కొందరికి తమపైన కుట్ర జరుగుతున్న దని అనుమానం. ఇలా చెప్పుకొంటూ పోతే అనుమానించడానికి అవకాశం లేని దెక్కడ ?

అంతా రహస్యం

అనుమానించే బుద్ధితో పాటుగా వీరికి తమకు సంబంధించిన అంశాలను నర మానవునికి తెలియకుండా రహస్యంగా ఉంచే లక్షణం కూడా ఉంటుంది. కనుకనే ఇంతగా అనుమానిస్తున్నా సాధ్యమైనంత వరకు తాము బైటపడకుండానే అనుమా నిస్తూ ఉంటారు.

ఒకాయన ఊరికి బయలుదేరాడు. తెలిసిన వాడొకడు మధ్యలో ఎదురవుతూ- 'ఎంతవరకు?' అని అడిగాడు. ఇక్కడికే!-అంటూ సాగిపోయాడతను. నిజానికతడు చాలా దూరప్రాంతానికి వెళుతున్నాడు. ఆ వివరాలు చెప్పడం అతనికి ఇష్టంలేదు. 'అడిగిన ప్రతివాడికీ ఇవన్నీ ఎందుకు చెప్పాలి? అయినా నేను ఎక్కడికి వెళ్తే వీడి కెందుకు? నేను లేనిసమయంలో ఏమయినా చేద్దామనా! నేను ఎన్నాళ్లు వూర్లోఉండనో తెలుసుకొందామనా—' ఇలా సాగుతుంది వీరి ఆలోచన. ఇంతకూ ఎదురుపడ్డవాడు

మాటవరస కడిగాడు. ఇతని వరుస ఇదీ అని తెలియక అడిగాడు. చూశారా, అను మానం, రహస్యం ప్రాణస్నేహితులయి ఇతనిలో ఎలా మసలుతున్నాయో!

ఈ వ్యాధికి చెందినవాడని తెలియక భర్తను ఊరికి సాగనంపుతూ, 'ఎప్పటికి వస్తారు?' అని అడిగింది భార్య. అతనికి వెంటనే అనుమానం కలిగింది. 'పనినిబట్టి ఉంటుంది. నేనేం చెప్పగలను?'— అన్నాడు. నిజానికి తిరిగి వచ్చేటందుకు కావలసిన టికెట్లు కూడా అతని దగ్గరే ఉన్నాయి. కాని చెప్పడు. అంతా రహస్యం, ఎంతో అనుమానం!

మరొకసారి ఊరికి బయలుదేరుతుంటే 'ఎప్పటికి వస్తారు?' అని అడిగింది. 'నాలుగురోజులు పడుతుంది' అన్నాడు. అలాగా? అన్నది ఆమె. ఎలాగో చూశా డతను. ఆ చూపుకు ఇదీ అర్థం అన్నట్లుగా రెండురోజులలోనే తిరిగి వచ్చాడు. ఎందుకు వచ్చాడలా! తను నాలుగురోజులదాకా రానన్నాడు కదా! — 'ఈ లోపల ఇక్కడ ఏదో జరుగుతూ ఉంటుంది. దానిని పసిగట్టి పట్టుకోవాలి!' అని అనిపించి వచ్చాడు. భార్య అడిగింది 'అప్పుడే వచ్చేశారే!' అని. ఏం ఇబ్బందిగా ఉందా అన్నాడు అదోలా. ఆమెకు అర్థంకాలేదు. అదేమిటండీ అలా అంటారు. వచ్చారన్న సంతోషంలో నేనడిగితే అన్నదామె. ఇది నిజంగా సంతోషమే నంటావా అన్నట్లు చూశాడతను.

సోరావారు అరుస్తారు. ఉన్నదేదో బయటకు అనేస్తారు. సైకోసిస్ వారు అనుమానిస్తారు. ఆ అనుమానాన్ని కూడా రహస్యంగానే ఉంచుతారు. సోరావారి విషయాలూ, విశేషాలూ వీధిలోని వారందరికీ తెలుస్తూ ఉంటాయి. సైకోసిస్ వారి వార్తలూ, విశేషాలూ ప్రక్కింటి వారికేకాదు, ప్రక్కనున్న వారికి కూడా తెలియక పోవచ్చు. సోరావారు ఏదీ తమలో ఉంచుకోలేరు. సైకోసిస్‌వారు ఏదీ తమనుండి బయటకు పొక్కనివ్వరు.

భార్యాభర్తలిరువురూ సోరా అయితే ఎలా ఉంటుంది? ఇరువురూ సైకోసిస్ అయితేఎలా ఉంటుంది? ఒకరు సోరా, ఒకరు సైకోసిస్ అయితే ఎలా ఉంటుంది— ఊహించి చూడండి. సమాజంలో గమనించి చూడండి! చిత్రవిచిత్రాలు మీ కనుల ముందు గోచరిస్తాయి.

అంతలోనే అవమానిస్తారు సోరావారు. అంతలోనే అనుమానిస్తారు సైకోసిస్ వారు. సోరావారికి ఎదుటివారు ఆనరు. సైకోసిస్‌వారు ఎదుటి వారిని నమ్మరు. సోరా

వారికి చిరాకు, అసహనం ఎలాంటివో, సైకోసిస్ వారికి అనుమానం, రహస్యం అలాంటివి! సోరావారు సుఖపడలేరు, సుఖపెట్టలేరు. సైకోసిస్‌వారు సుఖపడరు. సుఖపడనివ్వరు!

### పగ-ప్రతీకారం

వీరు పగపడితే ఇక వదలరు. ప్రతీకారం చేసేవరకు వీరిపగ చల్లారదు. వీరు పగబట్టినట్లు ఎదుటివారికి తెలియదు. ప్రతీకారం జరిపినప్పుడుకూడా ఆ జరిపింది వీరేనని వారికి తెలియదు. హత్య చేయించగలరు, తామేముందువెళ్ళి ఆ శవానికి ముందు దండవేయగలరు. కుటుంబ సభ్యులను ఓదార్చిన వారిలో మొదటివారు కాగలరు. సానుభూతిచూపి, సంస్మరణ సభలు జరిపి, సంతాప తీర్మానాలను మిగిలిన వారికన్నా ముందుగా పత్రికలకు అందించగలరు.

తడిగుడ్డలతో గొంతుకోసేరకం వీరు. ఏదిచేసినా తమచేతికి మట్టి అంటుకో కుండా చేయగలరు. సోరావారికి సారాపోయించి, ఎదుటివారిని చంపించగలరు. అరెస్టయిన సోరావారిని తామే బెయిలు మీద విడిపించగలరు. సోరా వారిని పావులుగా చేసికొని, తాము కనబడకుండానే కథను నడిపించగలరు.

సాధారణంగా వీరికి బయటకు కనబడే జీవితం ఒకటీ, బైటకు కనబడని జీవితం ఒకటీ ఉంటుంది. రెండు జీవితాలనూ ఏకకాలంలో సమర్థవంతంగా పోషించగలరు. బయట జీవితంలో మహనీయుడుగా, మహానాయకుడిగా చలామణి అవుతూనే లోపలి జీవితంలో గజదొంగగా, హంతకుడిగా విజృంభించగలడు! తమకు రెండురకాల జీవితాలు ఉన్నట్లుగా అంతరంగికులకూ, ఆలుబిడ్డలకూ కూడ అంతుబట్టకుండా జీవించగలరు. చివరకు ఎప్పుడో తెలిస్తే వారందరూ ఆశ్చర్య పడగలరు. సైకోసిస్ దీర్ఘవ్యాధి వలన వీరు ఇంతటి నిపుణతను పొందగలుగు తున్నారు, నయవంచన చేయగలుగుతున్నారు.

### విధ్వంసం

వస్తువులనూ, వ్యక్తులనూ విధ్వంసంచేయడం వీరికి సరదా. అలా విధ్వంసం జరుగుతూ ఉండగా తాము ఆనందించాలని చూస్తారు. సోరావారు అహంకరించడంలో ఆనందాన్ని వెతుక్కుంటూ ఉండగా, సైకోసిస్‌వారు విధ్వంసంద్వారా ఆనందాన్ని పొదివి పట్టుకోవాలని అభిలషిస్తారు.

సోరావారు ఎదుటి వారికన్న పైమెట్టులో ఉండాలని చూస్తారు. ఎదుటివారు మూడంతస్తులమేడ కట్టారనుకోండి, తాము ఏడంతస్తులమేడ కట్టాలనిచూస్తారు. సైకోసిస్ వారు అలాచూడరు. అంతటిశ్రమను కోరుకోరు. మూడురోజులలో ఆ మూడంతస్తుల మేడను నేలమట్టం చేయిస్తారు. ఆ మేడ అలా నేలమట్టమయి పోతూ ఉండగా, దూరాన అలా పొంచి ఉండి, చూచిచూచి సంతోషిస్తారు. ఫొటోలను తీయించి పత్రికలకు అందేలాచేస్తారు. ఆ ఫొటోలతోవచ్చిన పత్రికలను చాటుచాటుగా తనివి తీరేలా చూసుకొంటూ సంతోషిస్తారు. మరి అది తమ ఘనతకు దర్పణంకదా!

సైకోసిస్ భర్తలు, భార్యలను దాంపత్యం పేరిట హింసిస్తారు. సూదులు ఒంటిలోనికి గుచ్చేవారు, బ్లేడుతో భార్య శరీరాన్ని గాటులు పెట్టేవారు, కాలుతున్న సిగరెట్టును భార్య ఒంటిపైన ఆనించి, అలా అదిమివేసేవారు. ఇలా మనం చెప్పరాని రీతులలో, ఆమె చెప్పలేని స్థితులలో హింసాత్మక మయిన శృంగారాన్ని నడిపించేవారు ఇందులో ఉంటారు. రాత్రి అవుతున్నదీ అంటే, ఇక ఆ స్త్రీమూర్తులకు యమలోకం కనులముందు నిలుస్తుంది. చెప్పలేనంతబాధ! చెప్పుకోలేనంత బాధ! ఎవరికీ చెప్పటానికి అవకాశముండదు. అలాంటి అవకాశాన్ని భర్తలు ఇవ్వరు. రాత్రిళ్ల ఆ బాధ లన్నింటినీ అనుభవిస్తూ, పగళ్ల లేని చిరునవ్వులు తెచ్చుకొని పని పాటలు చేసికోవలసిన స్థితి!

అలాంటి అధ్వాన్న పరిస్థితులలో అత్తమామలు చూడవచ్చారనుకోండి! ఆ అల్లుడు ఎంతటి ఆత్మీయతను ఒలకబోస్తాడనీ! ఇలాంటి అల్లుడు మరెవ్వరికీ దొరకడని వారు మురిసిపోతారు. ఇలాంటి భర్త ఇంకెవరికీ దొరకకూడదు అనుకొంటూ—ఆ ఇల్లాలు మనస్సులోనే మూర్ఛపోతుంది. బయటకు మూర్ఛపోవ డానికి ఆమెకు అవకాశంలేదు. అత్తమామలున్నంతకాలం శెలవుపెట్టుకొని ఇంట్లో ఉంటాడు అల్లుడు. మనమీదఎంతప్రేమ శెలవుకూడ పెట్టుకొన్నాడు! అనుకొంటారు వాళ్లు. భార్య ఎక్కడ తనవారి దగ్గర తన బాధను వెళ్లబోసు కుంటుందోనని కాపలా కాసేటందుకయి అతడు శెలవు పెట్టాడని వారికి తెలియదు. ఆ విషయం భార్యకు తెలుసు. కాని ఆమెచేయగలిగింది లేదు. అల్లుడిని మెచ్చుకొని, అమ్మాయికి బుద్ధులు చెప్పి వృద్ధ దంపతులు వెళ్లిపోతారు. ఇక ఆ రాత్రి భార్యను పట్టుకొని హింసించి, హింసించి ఒక మాంసపుముద్దను చేసి వదిలి పెడతాడతను! ఎదురుచెబితే ఇంకా హింసిస్తాడేమో నని భయం. మౌనంగా భరిస్తుంది ఆమె. మాట్లాడి బ్రతుకగలనా-అనుకొంటుంది.

అలాగే భార్యలు సైకోసిస్ అయినప్పుడు భర్తలు బాధలకు గురి అవుతారు ఒకరాత్రివేళ భర్త కనులు తెరిచేటప్పటికి అతడి కనులముందు కత్తి కనబడింది. కత్తి చేతబట్టి నరకడానికి సిద్ధంగా ఉంది. అదృష్టవశాన మెలుకువ రావడంతో అతను బ్రతికి పోయాడు. మరొకామె మామగారిని చంపించింది. భర్తను త్రాగుబోతుగా తయారుచేయించింది. అలా వారిరువురినీ రంగంలోనుండి తప్పించి, తాను గ్రామాధిపత్యాన్ని స్వీకరించింది.

పెళ్లిసంబంధాలను కోరిచెడగొట్టేవాళ్లు ఈ వ్యాధికి చెందిన వాళ్లే. అలా ఊరవతల, అల్లంత దూరాన ఆదరంతో నిలబడి ఉంటారు. సంతోషంగా వెళుతూ, వెళ్లి ఉత్తరం వ్రాస్తామని చెప్పిన పెళ్లివారు వీరికినోరికిపోతారు. ఇక ఉత్తరంలేదు: ప్రత్తరం లేదు అసలు పత్తానేఉండరు. అలాగే కావాలని ఆకాశరామన్న ఉత్తరాలు వ్రాసేవారు కూడ దీనికి చెందినవారే!

ఏ ఇద్దరు సుఖంగా ఉన్నా వీరు చూడలేరు. అన్నదమ్ములు, ఆప్తమిత్రులు, అత్తాకోడళ్లు, భార్యాభర్తలు వీరి చలువవల్ల విడిపోతారు. ఒక ఇద్దరు నవ్వుతూ సుఖంగా ఉండటం వీరు తమ కన్నులతో చూడలేరు.

పల్లెటూళ్లలో అలా ఖాళీ బిందె పట్టుకొని, ఈ ఇంటినుండి ఆ ఇంటికీ, ఆ ఇంటి నుండి ఈ ఇంటికీ తిరుగుతూ 'అయినా నాకెందుకులే అమ్మా, అని తంపులు పెట్టి కొంపలుదీసే వాళ్లను ఎందరినో మనం చూస్తూ ఉంటాం. మంచినీళ్లకని బయలుదేరుతారు. మంచికి నీళ్లు వదిలి ఇంటికి చేరుతారు. బాగున్న అత్తా కోడళ్లమధ్య భగ్గుమనిపిస్తారు. అది దంపతుల వంటి వారికి విడాకులిప్పిస్తారు. ఆప్తమిత్రులను పట్టుకొని బద్ధవిరోధులుగా రూపొందిస్తారు. అనురాగంగల అన్నదమ్ములను ఎడమొఖం పెడమొఖం చేసేస్తారు. ఒక్కమాటలో చెప్పాలీ అంటేనవ్వుతున్న ప్రతివారిని ఏడిపించేవరకు వీరికి నిద్రపట్టదు. కనుచూపుమేరలో వీరికి నవ్వుకనబడకూడదు, వినబడకూడదు. ఇలాచేయవచ్చునా అని వీరికి అనిపించదు. ఇలా చేయడానికే మనం ఉన్నది అని వీరికి అనిపిస్తుంది. సైకోసిస్ మహిమ అంతటిది!

తమకు లేనివి ఇంకెవరికీ ఉండకూడదు. తమకు దక్కనివి ఇంకెవరికీ దక్కకూడదు. ఒక యువకుడు ఒక అమ్మాయిని ప్రేమించాడు. ఆమె అందాన్ని కాంక్షించాడు. 'నాకు అలాంటి అభిప్రాయంలేదు, నాగురించి అలాంటి ఆలోచన పెట్టుకోవద్దు'-అన్నది ఆ అమ్మాయి. ఆ తరువాత ఒకరోజున ఆ అమ్మాయి రిక్షాలో వెళుతోంది. ఉన్నట్టుండి, ఆ అమ్మాయి ముఖాన యాసిడ్ గుమ్మరించబడింది.

ఆమె శరీరం వికృతమైంది. అతని కళ్లు చల్లబడ్డాయి. తనకు దక్కనిది మరొక రికి దక్కకూడదు. అది వ్యక్తి అయినా సరే, వస్తువయినా సరే, అది ఏమయినాసరే!

పిల్లలలో

ఈ దీర్ఘ వ్యాధుల లక్షణాలు పిల్లలలోకూడ మనకు కొట్టవచ్చినట్లుగా కనబడుతూనే ఉంటాయి. పూవు పుట్టగానే పరిమళిస్తుంది అంటారుచూడండి. అలాగే పిల్లలు పిల్లలుగా ఉండగానే వీరు సోరా, వీరు సైకోసిస్, వీరు సిఫిలిస్ అని మనకు తెలుస్తూనే ఉంటుంది.

సోరాపిల్లవాడొకడు క్రొత్త చొక్కా తొడుక్కొని స్కూలుకు వచ్చాడు. 'ఇది క్రొత్తచొక్కా, మా నాన్న బస్తీనుండి తెచ్చాడు. ఇక్కడెక్కడా ఇలాంటిది ఉండదు, అక్కడకూడా ఒక్కటే ఉందట'-అంటూ ఎచ్చుపోతూ అందరికీచూపిస్తూ ఉంటాడు. మరి ఎచ్చుపోవడం సోరా లక్షణం కదా!

ఒక సైకోసిస్ పిల్లవాడు ఈ దృశ్యం చూస్తాడు. క్లాసు జరుగుతూ ఉండగా, మెల్లగా ఆ సోరా పిల్లవాడి వెనుకగా చేరుతాడు. ఎవరూ చూడకుండా ఏదోచేస్తాడు. అక్కడనుండి తప్పుకొంటాడు. కాసేపటిలో ఎవరో అటు చూస్తారు. 'ఒరేయ్ ఇదేమిటి ఇటుచూడు, నీచొక్కానిండా సిరానే'-అని చెబుతారు. ఆ పిల్లవాడు బోరున ఏడుస్తాడు. సిరా జల్లిన వాడు మరి దొరకడు. దొరికితే వాడు సైకోసిస్ ఎలా అవుతాడు?

మరో దృశ్యం మీ ముందుంచుతాను. టీచరు సోరాకు చెందినవాడు-ఆవే శాత్మకంగా పాఠాన్ని చెప్పుకుపోతున్నాడు-ఆయన వివశత్వంలో ఆయన ఉండగా, సైకోసిస్ పిల్లవాడొకడు టీచరు వెనుకగా వెళ్ళాడు. టీచరు చొక్కాకు ఒక మేకును కలిపి మెల్లగా కుర్చీకి కొట్టాడు-ప్రశాంతంగా ఇవతలకు వచ్చి, కాసేపు అలా కూర్చున్నట్లే కూర్చుని ప్రక్కనున్న వాడిని కొద్దిగా గిల్లాడు, 'నన్ను గిల్లుతున్నా డండీ' అరిచాడు వాడు. ఎవడ్రావాడు అంటూ ఒక్క ఉదుటున లేచాడు టీచరు అంతే! ఆయన చొక్కా చిరిగి పీలికలయిపోయింది. సైకోసిస్ పిల్లవాడు ముందుకు వొంగు కొని ముసి ముసి నవ్వులు నవ్వుకొన్నాడు.

ఒక సోరా పిల్లవాడు క్లాసులోనికి ప్రవేశిస్తూనే 'ఇది తెలుగు వాచకం, క్రొత్తది. ఇక్కడెక్కడా దొరకడంలేదు. ఎక్కడినుండో మా నాన్న నా కోసమని తెచ్చాడు.' అని ఆర్భాటంగా అందరికీ చూపిస్తున్నాడు. ఈ ఆర్భాటమంతా ఒక సైకోసిస్ పిల్లవాడు చూచాడు. విరామ సమయంలో అందరూ బైటకు వెళ్ళారు.

సైకోసిస్ పిల్లవాడుమాత్రం వెళ్లలేదు. స్కూలు వదిలిపెట్టగానే కొంచెం ముందుగా వెళ్లి సోరా పిల్లవాడు ఇంటిముందు నిలబడి 'మీరు మీ అబ్బాయికి తెలుగు వాచకం కొన్నారు కదండీ, ఎందుకైనా మంచిది అది సరిగ్గా ఉందో లేదో ఒక్కసారి చూడండి'-అని చెప్పి వెళ్లిపోతాడు. ఎక్కడికి వెళతాడు, ఎక్కడికీ వెళ్ళడు. ఆ ప్రక్క ఇంటి ప్రక్కకు చేరి, నడుస్తున్న కథను చూస్తూ ఉంటాడు. సోరా పిల్లవాడు వచ్చాడు. తెలుగు వాచకం ఏదిరా?- అన్నాడు తండ్రి. ఇదిగో అని ఇస్తూ ఉండగానే ముక్కలు ముక్కలుగా అది క్రిందికి రాలిపోయింది. తండ్రి కోపానికి పిల్లవాడి వీపు బ్రద్దలవుతోంది. సైకోసిస్ పిల్లవాడు చల్లటి కళ్ళతో చూస్తూ ఉంటాడు.

ఒక సోరా పిల్లవాడు సైకోసిస్ పిల్లవాడిని వాళ్ళ ఇంటికి అహ్వానించాడు. ఇంటిలోని విశేషాలన్నింటినీ గొప్పలుపోతూ అతడికి చూపించాలన్నదీ సోరా పిల్లవాడి ఆశయం. అదేమిటో చూద్దామని సైకోసిస్ పిల్లవాడు వచ్చాడు. అన్నిటినీ చూపిస్తూ ఒక చోటికి తీసికొనివచ్చి 'ఇది తాజ్‌మహల్. మా నాన్నగారు దీనిని ప్రత్యేకంగా తెచ్చారు. ఇంటిలోని వాళ్ళమంతా దీనిని ప్రాణంగా చూసుకొంటాం. బాగుంది కదా' అన్నాడు సోరా పిల్లవాడు. బాగుంది. చాలా బాగుంది. ఇలాంటి దాన్ని నేనెక్కడా చూడలేదు. కాని నాకు కాసిని మంచినీళ్ళు తెచ్చిపెడతావా!' అన్నాడు సైకోసిస్ పిల్లవాడు. సోరా పిల్లవాడు లోనికి వెళ్లాడు. మంచినీళ్ళు ముంచి తెస్తున్నాడు. ఎదురువెళ్ళి వాటిని అందుకొని త్రాగి గ్లాసునందిస్తూ 'మరచిపోయాను. అర్జంటు పని ఉంది. నేను వెళ్ళి వస్తాను' అని అంటూ వెళ్ళిపోయాడు సైకోసిస్ పిల్లవాడు. అతడిని సాగనంపివస్తూ తాజ్‌మహల్ కోసం చూశాడు సోరా పిల్లవాడు. అంతే కెవ్వున కేకపెట్టాడు. బోరున ఏడవసాగాడు. గుండెలపై బాదుకొంటూ విహ్వలత్వాన్ని పొందుతున్నాడు. తాజ్‌మహల్ లేదక్కడ, అది నుగ్గు నుగ్గుగా చేయబడింది. పోయిన తాజ్‌మహల్ మళ్ళీ ఎలా వస్తుంది! రాదు. రాకూడదు- అదే సైకోసిస్ పిల్లవాడి అభిమతం!

విద్యాలయం నుండి ఇంటికి వెళుతున్నారు పిల్లలు. వడివడిగా, కలివిడిగా నడుస్తున్నారు. ఇంతలో సైకోసిస్ పిల్లవాడొకడు తన కాలును కొంచెంగా వంకరగా పెట్టాడు. వెంటనే ముగ్గురు పిల్లలు పడిపోయారు. అయ్యయ్యో! అనుకున్నారు అందరూ. అమ్మయ్య అనుకొన్నాడు వాడు.

పిల్లలు ఆడుకొంటున్నారు, అందులో ఒకడు సైకోసిస్ వాడు. వాడేం చేశాడూ, ఉండుండి ఒకడ్ని గభాలున తోసేశాడు. తోసింది ఎవరో తెలియదు. ఒకడ్ని మేకుతో పొడిచాడు. పొడిచింది ఎవరో తెలియదు. ఇలా ఆటల మధ్యలో ఆక్రందనలు సృష్టిస్తూ ఆనందిస్తున్నాడువాడు. వాడికదే ఆట!

సైకోసిస్ పిల్లల్లో కొందరు ఉన్నట్టుండి ఇంటినుండి పారిపోతారు. ఇక్కడ మునుగుతారు. ఎక్కడో తేలుతారు. ఈ లోపల కుటుంబ సభ్యులు గోలపెడతారు. ఆ గోలను కొంతకాలం అక్కడక్కడా ఉండి గమనిస్తూ ఎప్పటికో ఇంటికి చేరుతారు. వీరిలో కొందరు పిల్లలు ఇంటినుండి డబ్బులు తీసికొని పారిపోతారు. వాళ్ళకు తోచినట్లల్లా ఖర్చుపెట్టుకొంటారు. మధ్యలో బంధువుల ఇళ్ళలో బస చేస్తారు. అక్కడకూడ అందినది అందినట్లుగా దొంగలించుకుపోతారు. ఇంటిదొంగను ఈశ్వరుడుకూడా పట్టలేడు కదా!

ఇంటి నుండి పారిపోయి నెలల తరబడి కనబడనివారు, సంవత్సరాల తరబడి కనపడనివారు, జీవితకాలంలో దొరకనివారు ఉంటారు. తల్లిదండ్రులు వెతికి ఇంటికి తీసుకువచ్చినా, కొన్నాళ్ళుండి మళ్ళీ పారిపోతారు. ఉండుండి వెళ్ళిపోవాలనిపిస్తుంది వీరికి. అంతే! ఏది దొరికితే దానిని తీసికొని వెళ్ళిపోతారు. వయస్సు వస్తున్నకొద్దీ దొంగలుగా, తిరుగుబోతులుగా మారిపోతారు వీరిలో కొందరు.

పెరిగి పెద్దయి దొంగతనాలు నిర్దాక్షిణ్యంగా చేస్తారు. రైళ్ళలో సూట్‌కేస్‌లు మారుస్తారు. స్త్రీమూర్తి మెడలోని మంగళ సూత్రాలను కూడ తెంపుకొనిపోతారు అలా త్రెంచుకొనిపోతుంటే వీరికేమీ అనిపించదు. వీరి దృష్టిలో సెంటిమెంట్ ఒక బలహీనత. క్రమంగా దోపిడీలు చేస్తారు. స్మగ్లింగ్ చేస్తారు. అంతర్జాతీయంగా విద్రోహాలు నడిపిస్తూ ఉంటారు.

యువకులుగా

కాలేజీల్లో కుర్రవాళ్లు చేసే అల్లరి మనకు తెలుసు. అందులో సైకోసిస్ కుర్రవాళ్ళ అల్లరి తట్టుకోవడం కష్టం. ఎక్కడినుండో కాగితాల ఉండలువచ్చి ఆడపిల్లల మీద పడతాయి. ఎక్కడినుండో తెలియదు. ఎవరు వేస్తున్నారో తెలియదు. ఉన్నట్టుండి రకరకాల కూతలు వినిపిస్తాయి. కూస్తున్నది ఎవరో తెలియదు. చిత్రవిచిత్రమయిన శబ్దాలు వినబడతాయి. చేస్తున్నది ఎవరో తెలియదు. అంతా అలజడి. అందులోనే వారికి ఆనందం.

సైకోసిస్ యువకులతోటి ప్రేమలూ, పెళ్లిళ్లూ కూడా అంతగా నమ్మదగ్గవి కావు. మోసగించగలరు, విధ్వంసం చేయగలరు. తాము ఆశించింది పొందిన తరువాత నిర్దాక్షిణ్యంగా విడిచిపెట్టగలరు. ఆవేశపరులయిన సోరా వారు వీరిని నమ్మి మోసపోతూ ఉండగలరు.

వృత్తి ఉద్యోగాలలో కూడా దగా, మోసం, లంచాలు, అవినీతి, నల్లబజారు, ఫోర్జరీ-మొదలయిన తరహాలలో విజృంభిస్తారు. రోడ్డు సూటిగా ఉన్నా, పాము వంకరగానే పోతుంది అన్నట్లు, మార్గం సూటిగానే ఉన్నా వీరు వక్రంగానే సాగి పోతుంటారు.

ఒక యువకుడు ఒక యువతిని పగలంతా చెల్లీ అని పిలిచేవాడు. రాత్రి పూట 'చెలీ' అంటూ ఆదమరిచేవాడు. లావత్తును తొలగించడంలో అర్థం యావత్తునూ మార్చగలిగిన ఘనుడతను!

నా య కు లు గా

నాయకులుగా సమాజాన్ని నడిపించే వారిలో కూడా ఈ రెండు తరహాలవారూ ఉంటారు. సోరావారు వాగ్దానాలతో కాలక్షేపం చేస్తూ ఉండగా, సైకోసిస్‌వారు తీయని మాటలతో ప్రేమను అభినయిస్తూ నయవంచన చేస్తూ ఉంటారు.

ఒక నాయకుడు ఉండేవాడు. తిరిగేటప్పుడు మిగిలిన కులాల వారితో తిరిగేవాడు. పనిదగ్గరకు వచ్చేటప్పటికి తన కులం వారికి చేసిపెట్టేవాడు. కులాభిమానం తనకులేదని ప్రజలు అనుకోవాలి. ఆ అనుకునేలోపల తనకులం వారికి పనులన్నీ జరిగిపోవాలి. ఇదీ వరుస!

ఒక నాయకుడు వేదిక ఎక్కినప్పుడల్లా కులమతాలకు చోటులేని సమసమాజం కావాలని షుమారు గంటసేపు గొంతెత్తి ఘోషించేవాడు. క్రిందకుదిగి తన అనుచరులతో మెల్లగా 'ఇంతకూ మనవాళ్ళు ఎంతమంది వచ్చారు?'—అని అడిగేవాడు. ఇక్కడ మనవాళ్ళు అంటే మన కులంవాళ్ళు అని అర్థమని వేరే చెప్పనక్కరలేదు కదా!

తుఫానువచ్చి ఊరంతా కొట్టుకుపోయింది. ప్రజలంతా నిరాశ్రయులయ్యారు. ఒక నాయకుని ఆధ్వర్యంలో సేవా కార్యక్రమాలు జరుగుతున్నాయి. ఒక రెండిళ్ళ వారికి మాత్రం ఏ సేవలూ అందడంలేదు. కారణం ఏమిటి? అని ఆరాతీస్తే జరిగిన

ఎన్నికల్లో ఆ రెండిళ్ళవాళ్ళూ ఆ నాయకుడికి ఓటేయలేదని తేలింది. తుఫాను వచ్చి సగానికి సగంమంది చనిపోయినా, ఆ నాయకునిలోని కక్షమాత్రం చనిపోలేదు. అది పెన్నాడుతూనే ఉంది. రేపు స్మశానంలోకూడా వారికి చోటు దొరక్కుండా చూడగల ఘతను.

తిన్నఇంటి వాసాలనే లెక్కపెట్టగలరు. పెట్టిన చేతినే పడగొట్టగలరు. అందమయిన అబద్ధాలను అదేపనిగా ఆడగలరు. ఆశ్రయమిచ్చినవారినే హతమార్చగలరు. సహకరించినవారినే స్వాహా చేయగలరు. ఇలా చేయవచ్చునా?—అని వారికి అనిపించదు. తెల్లవారిలేస్తే దగా, మోసం వీరినుండి అలవోకగా సాగిపోతుంటాయి. ప్రేమ, కృతజ్ఞత, సహనం, క్షమ—ఇవన్నీ కూడా చేతగానివారి మాటలు—అని వారికి అనిపిస్తుంది. చేతగానివారే మంచిగా ఉంటారన్నది వీరి విశ్వాసం!

విశ్రాంతి—విహారాలు

వీరికి విశ్రాంతి ఉండదు. విశ్రాంతిగా మనకు కనపిస్తారుగాని, వీరి మనస్సు పనిచేస్తూనే ఉంటుంది. ప్రణాళికలు వేస్తూనే ఉంటుంది. అదేమిటి అన్నది బయటికి తెలియనీయరుగనుక మనకు విశ్రాంతిగా ఉన్నట్లు కనబడతారు.

ఏదయినా ఒక మహావిధ్వంసాన్ని తలపెట్టినప్పుడు ఉన్న ఊరికి దూరంగా, ఏ కొండలోయలలోనికో అలా ఆ అందచందాల మధ్యకు పనివేళా వెళ్ళి విందులూ, వినోదాలూ ఒకప్రక్క కానిస్తూనే, మరొకప్రక్క మహావిధ్వంసానికి కావలసిన పనులను సాధిస్తూ ఉంటారు. వీరు విశ్రాంతి తీసికొంటున్నారట, విహార యాత్రలో ఉన్నారట—అంటే జరుగకూడనిది ఏదో పెద్దఎత్తున జరుగబోతున్నదన్నమాటే! వారక్కడ విశ్రాంతిలో ఉండగానే ఇక్కడ వారు తలపెట్టినది జరిగిపోతూఉంటుంది.

సోరావ్యక్తి విశ్రాంతిగా ఉండాలని కోరుకొంటాడుగాని, అది కోరికగానే మిగిలిపోతుంది. పనులను గూర్చిన ఆలోచనలు అతనిని ముసురుతూ ఉంటాయి. పట్టి పీకుతూ ఉంటాయి. ఇక విశ్రాంతి ఎక్కడ? సైకోసిస్‌వారు మనకు విశ్రాంతిగా కనిపిస్తున్నారుగాని, వారికది విశ్రాంతికాదు, తుఫానుకుముందు ప్రశాంతత వంటిది.

నిద్ర - తీరు తెన్నులు

రాత్రిపూట అలా లేచికూర్చొని ఆలోచిస్తుంటారు. భార్య లేచి ఏమిటి అని అడిగితే 'ఏమీలేదులే నీవు పడుకో, నీ విషయం కాదులే, నీకెందుకు ఈ నిద్రాభంగం'-అంటూ ఆమెను పడుకోబెట్టి, తాము ఒంటరిగా కూర్చొని ఆలోచిస్తూ

ఉంటారు. అదే సోరావారయితే నిద్రపోతున్న భార్యనులేపి, నేను చస్తూఉంటే మీకు నిద్ర ఎలా పడుతోంది. చూడు అందరూ శవాలలాగ ఎలా పడుకున్నారో, ఎవరికీ ఏమీ పట్టదు. జరుగుతున్నదేమిటి అని ఒక్కరయినా ఆలోచించారా, ఆలోచిస్తే ఇలా నిద్రపోగలరా, అసలు మీకు నిద్ర ఎలా పడుతోంది. ఇంత మథనపడు తున్నాను నా సంగతి ఎవరికి పట్టింది అని అరుస్తూ వాపోతారు. మొత్తంమీద వీరికీ, వారికీ కూడ నిద్ర అంతంత మాత్రమే!

సోరావారికి దినచర్యలోని ఒత్తిడులు కలలరూపాన్ని ధరిస్తూ ఉండగా, సైకోసిస్ వారికి కుట్రలు, కుతంత్రాలు, వెంబడించడాలు, వేటాడటాలు కలల రూపాన్ని ధరిస్తూ ఉంటాయి.

### శక్తియుక్తులు

సోరాలో మనస్సు హైరాణ చెందుతూ ఉండటంవల్ల సమయానికి కావలసినది గుర్తురాక ఇబ్బందిపడతారు. అంటే ఒకవిధమయిన 'కన్ఫ్యూజన్'కు గురి అవు తారన్నమాట. సోరావారి మతిమరుపు ఇలా ఉంటుంది. సైకోసిస్‌లో అలాగాక చిత్ర మయిన మతిమరుపు ఉంటుంది. వ్యక్తులు గుర్తుంటారు. వారి పేర్లు గుర్తుండవు. ప్రాంతాలు గుర్తుంటాయి. వాటి పేర్లు గుర్తుకురావు. సిటీ బస్సులు కనుల ముందు మెదులుతాయి. కాని వాటి నంబర్లు స్ఫురణకు రావు. ఇలా నామధేయాలనూ, నెంబర్లనూ మరచిపోవడంలో వీరు సిద్ధహస్తులు. అయితే ఒక చిత్రముంది. గుర్తుకు రాకపోయినా బయటపడరు. లౌక్యంగా సన్నివేశాన్ని నడిపిస్తారు. ఒక్కొక్కసారి మాట్లాడి పంపివేసి, ఆ తరువాత అతడి పేరేమిటి అని ప్రక్కవారి నడుగుతారు. ఒక్కొక్కసారి అల్లంతదూరాన వ్యక్తి ఉండగానే, ప్రక్కనున్నవారిని పేరడిగి తెలుసుకొని పేరుపెట్టి పిలుస్తూ ఎదురువెళ్ళి స్వాగతం పలుకుతారు—మాకారా! మిమ్మల్ని నేనెంతగా గుర్తుపెట్టుకొన్నానన్నట్లుగా!

సోరావారికి ఎదుటివారు చెప్పేది సాకల్యంగా వినగలిగిన సహనం ఉండదు. అంతేనంటారా, ఇంకేమయినా ఉందా? అంతేనా అయితే అది నేను చూస్తాలెండి— అంటూ చెబుతున్నది పూర్తిగా గ్రహించుకోకుండానే ముందుకు వెళ్ళిపోతూ ఉంటారు. తరువాత ఎప్పటికో—'ఇంతకూ వారు చెప్పివెళ్ళింది ఏమిటని' ఆలోచనలో పడతారు. సైకోసిస్‌వారు చెప్పిందంతా వింటారు. కాని తమ ప్రకారం అర్థంచేసికొంటారు. కాని తాము చేయదలచినదానికి అనుగుణంగా గుర్తుపెట్టుకొంటారు. గ్రహించడం, గుర్తుపెట్టుకోవడం, తిరిగి వివరించడం మొదలయిన శక్తియుక్తులన్నీ ఉంటాయి.

కాని బాగా వక్రించి ఉంటాయి. 'పర్వర్షన్' అంటామే అది ఉంటుంది. సోరావారి మనస్సు ముందుకు పరిగెత్తుతూ ఉండగా, సైకోసిస్ వారి మనస్సు ప్రక్కదారులు తొక్కుతూ ఉంటుంది.

## విజ్ఞానమయకోశం

గమనిస్తూ వస్తున్న అంశాలనుబట్టి వీరిలోని విచక్షణ ఎంతగా దెబ్బతిన్నదీ తెలుస్తూనే ఉన్నదికదా! సోరాలో విచక్షణ ఆలస్యంగా అందివస్తున్నది. చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకొన్నట్లు, నీరు పోయిన తరువాత చెరువుకు గట్టువేసి నట్లు సోరాలోని విచక్షణ జీవిత నిర్వహణకు వినియోగపడకుండా పోతున్నది.

సైకోసిస్‌లో విచక్షణ వక్రిస్తూ ఉన్నది. అన్ని కోశాలలోనూ వక్రత ఇతడిలో కనబడుతున్నది. దానితో జీవితమే వక్రమార్గం పడుతున్నది. కాని పనులు చేయడమే కర్తవ్యంగా వీరికి భాసిస్తున్నది.

## ఆనందమయకోశం

ఇకపోతే ఆనందమయకోశం—ఏమి ఆనందమయం. ఆనందమంతా మాయం! వక్రించిన ఆనందమయకోశం విధ్వంసంలో,వినాశంలో ఆనందించాలని చూస్తున్నది. చేసిపెట్టి ఆనందించడం కాదిది. చెడగొట్టి ఆనందించడం. బ్రతికించి ఆనందించడం కాదిది. బలిచేసి ఆనందించడం. సాధించి ఆనందించడం కాదిది. హతమార్చి ఆనందించడం! నలుగురినీ చేరదీసి ఆనందించడం కాదిది. అందరినీ తొలగించి ఆనందించడం! ఎంత వికృతస్థితి ఇది! సైకోసిస్ యొక్క పరిస్థితి ఇది !

సోరా వారికి ఆనందించాలని ఉంటుంది. కాని ఆనందించలేరు. ఆనందాన్ని గూర్చి వెతుక్కొంటూ, అధికృతలో అది ఉందనుకొంటూ, ఆరాట పడుతుంటారు. సైకోసిస్ వారికి సరైన పద్ధతిలో ఆనందించాలని లేదు. ప్రకృతిని వికృతిచేసి ఆనందించాలని ఉంటుంది. అదే వీరి ప్రకృతి-అదే వీరి వికృతి! అదే వీరి ఆకృతి!

# సిఫిలిస్

సోరాచేత ప్రేరితుడయిన మానవుడు దుష్ట స్త్రీ పురుష సాంగత్యానికి లోనై సవాయి వ్యాధికి గురిఅయినప్పుడు ఆ వ్యాధిని తరుణవ్యాధిగా సాగనంపక అడ్డుపడి, అణచిపెట్టగా ఈ సిఫిలిస్ దీర్ఘ వ్యాధి రూపుదిద్దుకొంటున్నది. ఒకసారి రూపుదిద్దు కొన్న తరువాత ఇదికూడ ఏడుతరముల వరకు వర్తిల్లగలదు. వివాహాదులు తల పెట్టినప్పుడు ఇటేడుతరాలు, అటేడు తరాలు చూడాలి అంటారు. అలా చూడటం వల్ల తెలియవచ్చే మిగిలిన అంశాలమాట అటుంచి, ఈ దీర్ఘవ్యాధుల లీలలను మాత్రం మనం స్పష్టంగా గమనించగలము.

## అన్నమయకోశం

ఒకమాదిరి లావునుండి బాగా లావుగా ఉండేవారి వరకూ దీనిలో ఉంటారు. శరీరం సడలిపోతుంది. బిగుతు తగ్గుతుంది. పాకం కుదరని వేళలో లడ్డూ కట్టబోతే ఉండగా కాకుండా సడలిపోతుంది చూడండి, శరీరం అలా సడలిపోతుంది ఇక్కడ.

ఇది తెలియక ఈ ఒళ్ళు తగ్గడంకోసం ఆహారాన్ని తగ్గించేవారుంటారు. ఆహార నియమాల పేరిట ఆకలి తీరకుండానే అలమటించే వాళ్ళుంటారు. అతిగా తినడం ఎంత తప్పో, తగినంత తినకపోవడం కూడ అంతే తప్పు. సన్నగా ఉండి, ఊహించనంత ఎక్కువ పరిమాణంలో ఆహారాన్ని తీసికొనేవాళ్ళు ఎంతమంది లేరు! లావుగా ఉండి కొద్దిగా తినగానే ఆయాసపడిపోయేవారు ఎంతమంది లేరు! కనుక కేవలం ఆహారంతో తూకం పెట్టవలసిన విషయం కాదు. ఆపేక్షించిన దీర్ఘవ్యాధిక తగిన విధంగా హోమియో చికిత్స జరిగినప్పుడు అక్కరలేని ఒళ్ళు అదే తగ్గి పోతుంది.

శరీర నిర్మాణంలో క్రమపద్ధతి కనబడదు. అవయవాల పొందిక అంతగా ఉండదు. అందమంటే ఏమిటి? అవయవాల పొందికే కదా! ఆ పొందిక ఇందులో క్రమక్రమంగా, తరతరానికీ దెబ్బతింటూ వస్తుంది. అవయవాల నిర్మాణంలో ఎగుడు దిగుడులు వస్తాయి. నిష్పత్తి దెబ్బతింటుంది. ఘోస్ను ఘోస్ను ఆకారం వికారంగా

మారుతుంది. ఇంకా తరాలు గడిచినకొద్దీ అంగముల వక్రతే కాకుండా, అంగవైకల్యము కూడ కలుగవచ్చు.

వ్రేలిపైవ్రేలు ఎక్కినవారు, అయిదువ్రేళ్ళకు బదులు ఆరువ్రేళ్ళు ఉన్నవారు-పన్నుపై పన్ను ఎక్కినవారు, పళ్ళు ముందుకు త్రోసుకువచ్చినవారు—ఇలా రకరకాల వికారాలు గోచరిస్తూ ఉంటాయి.

ఒక విధమయిన అయోమయస్థితి ఆనందమయకోశం నుండి అన్నమయకోశం వరకు వ్యక్తమవుతూ ఉంటుంది. శరీర నిర్మాణంలోని వికార వైఖరులన్నీ ఈ అయోమయ స్థితి యొక్క ఫలితాలే! దేహనిర్మాణ సమయంలోనే ఈ అయోమయ స్థితి ఇలా వర్తిస్తున్నదన్న మాట!

వికార నిర్మాణాలతో బాటుగా అంగవైకల్యమే ప్రాప్తించవచ్చు. పుట్టుకతోనే కన్నులు, ముక్కులు లేనివారు, కాళ్ళు, చేతులు కరువయినవారూ ఇందులో ఉండవచ్చు.

ఇంకొంచెం దూరం పోతే ఆ మాత్రం దేహనిర్మాణానికి అవకాశం లేని స్థితులు కూడ వస్తాయి. ఆ స్థితిలో వ్యక్తమయ్యేవే గర్భస్రావాలు. కొందరికి మూడవ నెలలో, కొందరికి ఏడవనెలలో మొత్తంమీద తొమ్మిదినెలలూ నిండకుండానే గర్భం పడిపోతూ ఉంటుంది. సరిఅయిన హోమియో చికిత్స జరిగినప్పుడుగాని ఆ గర్భస్రావాలు ఆగవు.

ఇలా ఒడలు పడలిన స్థితినుండి ఆంగికమైన వికారాల స్థితి, దానినుండి అంగవైకల్యస్థితి, దానినుండి శరీరనిర్మాణమే పూర్తికాని స్థితి! ఇలాంటి అయోమయ స్థితి ఒకటి ఈ వ్యాధి పొడుగునా ఉంటుంది. తరాల భేదాలను బట్టి లేతముదుళ్లు ఉంటాయి.

వీరిలో దేహంలోని గట్టిధాతువు దెబ్బతింటుంది. పళ్ళు పుచ్చిపోతాయి. బొమికెలు మిగిలిపోతాయి. అస్థిపంజరం ఒక్కసారిగా కృంగిపోతుంది. పెరుగుతున్న వయస్సులో కాలిబొమికెలు వంగిపోయి దొడ్డికాళ్ళు వస్తాయి. కొందరికి ఎముకలు ఎప్పటికీ గట్టిపడవు కొందరికి మాడు ఎప్పటికీ కలుసుకోదు. కొందరికి గూని వస్తుంది. కొందరికి ఎదుకొమ్ము ముందుకు పొడుచుకు వస్తుంది. కొందరికి ఒక వయస్సు దాటిన తరువాత నడుము వంగిపోయి, చేతులను కూడా కాళ్ళుగా చేసికొని నాలుగు కాళ్ళమీద నడవవలసి వస్తుంది.

ఇందులో కొందరు మరుగుజ్జులుగా పుడతారు. తల పెద్దది, శరీరం మరీ చిన్నది. చేతకానివాడు బొమ్మ గీసినట్టుగా ఉంటుంది. దేహనిర్మాణంలో సమ తూకం ఉండదు.

కొందరికి శరీరం ఎదగదు. మనస్సు ఎదుగుతుంది. కొందరికి మనస్సు ఎద గదు. శరీరం ఎదుగుతుంది. మనస్సూ, శరీరాల పరస్పరతత్వం దెబ్బతింటుంది.

కొందరికి కనుబొమలు ఉండవు. కొందరు మగవారికి గడ్డాలు, మీసాలు రావు. ఆడవారిలో కొందరికి గడ్డాలు, మీసాలు వస్తాయి. శరీరనిర్మాణం జరుగుతుండగా అయోమయస్థితి ఆవరిస్తుందని చెప్పానుకదా! ఇది స్త్రీ శరీరమా, పురుష శరీరమా— అన్న స్పష్టత లేనిస్థితిలో ఆ నిర్మాణం సాగుతున్నదన్నమాట!

వెంట్రుకలు ఉండవలసినచోట వెంట్రుకలు ఉండకపోవడం, ఉండనక్కర లేనిచోట ప్రోగుపడినట్లు ఉండటం ఇలాంటి తారుమారు స్థితులు ఇందులో ఉంటాయి. ఒక అమ్మాయికి తలలో సగభాగం వరకు అసలు వెంట్రుకలు లేవు. వగం నుండి ప్రారంభమయి వెనుకకు సాగాయి. మరి ముందుసంగతి ఏమిటి? ఆమెకు చికిత్స జరి గింది. ఇక విచికిత్స తొలగింది. వెంట్రుకలు వచ్చాయి. వ్యాధిపరమయిన అయో మయ స్థితి చికిత్స వలన సర్దుకొన్నదన్నమాట. జీవప్రజ్ఞ తగిన రీతిలో [illegible] వర్తించిందన్నమాట!

అలాగే కొందరికి గోళ్ళు ఎప్పుడూ పుచ్చిపోతూ ఉంటాయి. కొందరికి గోళ్ళు బలహీనంగా ఉంటాయి. కొందరి గోళ్ళు ఎప్పుడూ విరిగిపోతుంటాయి. కొందరికి గోళ్ళు సరిగా రావు. ఈ స్థితులన్నీ దీనికి సంబంధించినవే!

సైకోసిస్‌లో మెత్తని ధాతువు దెబ్బతింటున్నది. సిఫిలిస్‌లో గట్టి ధాతువు దెబ్బతింటున్నది. గోరు ఎంత గట్టిది! పన్ను ఎంత గట్టిది! ఎముక ఎంత గట్టిది! కాని ఇవన్నీ ఇందులో పుచ్చిపోతున్నాయి. బిగిలిపోతున్నాయి.

కొందరి నోరు వాసన కొడుతుంది. కొందరి చెవులు చీము ఓడుతూ ఉంటాయి. కొందరికి తమ శ్వాసే తమకు వాసనగా ఉంటుంది. కొందరి నాలికి ఉబ్బుతూగాని, పగులుతూ గాని ఉంటుంది. కొందరి చర్మం రంగులు మారుతుంది. శోభి, బొల్లి మొదలయిన స్థితులు వస్తాయి. కొందరు పిల్లలు పుట్టడమే వ్యాధిగ్రస్త మయిన రంగులో పుడతారు. ఇవన్నీ కూడా దీనికి సంబంధించిన స్థితులే!

ముసలితనం తొందరగా వస్తుంది. జుట్టు తొందరగా నెరుస్తుంది. లావణ్యం తొందరగా పోతుంది. శరీరం రానురాను వికారాన్ని సంతరించుకొంటుంది. వికృతంగా రూపొందుతుంది. వయస్సు వస్తున్నకొద్దీ పిచ్చికళ పడుతుంది.

## ప్రాణమయకోశం

శరీరం తొందరగా కదలదు. ప్రాణానికీ, శరీరానికీ శ్రుతి కుదరదు. ప్రాణశక్తికి కావలసినంత చైతన్యం ఉండదు. దేహం నిస్తేజస్థితిని పొందుతూ ఉంటే, ప్రాణం నిర్వీర్యస్థితిని అనుభవిస్తూ ఉంటుంది.

అన్నం తినాలనిపించదు. రుచులపై పెద్దగా కాంక్ష ఉండదు. తీసికొన్న ఆహారం అరగదు. కడుపులో ఒక ఉండపెట్టినట్లు, ఒక రాయిపెట్టినట్లు అలా గంటల తరబడి ఉండిపోతుంది. జీర్ణాశయం తన పనికి తాను బద్ధకిస్తున్నట్లు తెలుస్తుంది. ఈ బద్ధకించడమనేది ఈ వ్యాధిలో ఆనందమయ కోశంనుండి అన్నమయ కోశం వరకు వ్యక్తమవుతుంది. చురుకుగా కదలలేరు, నడువలేరు. తెమలలేరు. తినలేరు. అరగించుకోలేరు. అయోమయంతో కూడిన అలసత్వమొకటి వీరిలో అణువణువునా వ్యక్తమవుతుంది. దీనినే హోమియోద్రష్టలు 'స్లగ్గిష్‌నెస్' అన్నారు. ఏ కోశాన చూచినాసరే ఇదే కనబడుతుంది.

జీర్ణాశయం బద్ధకిస్తుంది. జీర్ణక్రియ మందకొడిగా సాగుతుంది. మల విసర్జన క్రియ కూడా మందకొండిగానే ఉంటుంది. పనిని నిర్వహించడానికి పెద్దప్రేవులు బద్ధకిస్తాయి. చూద్దాంలెద్దురూ అన్నట్టు ఉంటుంది వ్యవహారం. అరుగుదల సరిగా లేకపోవడంతో శక్తి తగ్గుతుంది. శక్తి ప్రసారం మందగిస్తుంది. అడుగడుగునా అందగించవలసిన జీవితం ఈ వ్యాధితో అడుగడుగునా మందగిస్తుంది.

రక్తప్రసరణ మందగిస్తుంది. రక్తపు నడకలో ఎగుడుదిగుడులు వస్తాయి. తరాలు సాగుతున్నకొద్దీ రక్తం క్రమంగా దేహమంతటా ప్రసరించే స్థితి తగ్గుతుంది. చేతుల చివళ్ళవరకూ రక్తం వెళ్ళదు. ఫలితంగా చేతులు చచ్చుబడతాయి. కాళ్ళ చివళ్ళవరకూ రక్తం రాదు. ఫలితంగా కాళ్ళు చచ్చుబడతాయి క్రమంగా! కొన్ని పల్లెటూళ్ళకు బస్సులు వేస్తారు. వర్షం వచ్చినప్పుడు అవి ఊళ్లోదాకా వెళ్ళవు, పొలిమేరనుండే తిరిగి వస్తాయి. వ్యాధి ముదురుతున్నకొద్దీ, రక్తప్రసరణ విషయంలో సరిగా ఇలాంటి పరిస్థితులు వీరిలో కనబడతాయి. పక్షవాతాలు వచ్చేవారిలో ఎక్కువమంది ఈ దీర్ఘవ్యాధికి చెందినవారే! సగభాగం చచ్చుబడింది అన్నమాట. ప్రాణం

సగభాగంలో సర్దుకొంటున్నదన్నమాట! మొత్తమంతా వ్యాపించలేకపోతున్నదన్న మాట! శరీరంలో సగం చచ్చిపోయి, సగం మిగిలి ఉందన్నమాట! గ్రంథాలయా లలో వెళ్ళమని వేరే చెప్పకుండానే వరుసగా కిటికీలు మూస్తూవస్తారు చూడండి. అలా అన్ని తలుపులూ మూసేస్తుంటే మనంతట మనమే బయటకు వచ్చేస్తామని వారికి తెలుసు. అలాంటి స్థితి ఇది. అలాంటి స్థితులలో కూడ సరైన హోమియో చికిత్స జరిగితే ప్రాణప్రసారం చక్కబడుతుంది. దేహం మొత్తం బ్రతికి బట్టకడు తుంది.

రక్తప్రసరణ చివళ్ళవరకూ జరగదు అని చెప్పాను. అలా ఎంతవరకు జరగడంలేదో అంతవరకూ స్పర్శ తగ్గిపోతుంది. ఎండలో విల్చుంటే కాళ్ళుకాలవు. నిప్పులు త్రొక్కినా కాళ్ళు కాలవు. అంటే కాలవని అర్థంకాదు, కాలుతున్నాయని మనకు తెలియదు. ఇది యోగస్థితి అనుకోకూడదు. రోగస్థితి! ఆరోగ్యవంతుడికి కాలుతున్నదని వెంటనే తెలుస్తుంది. వెంటనే తననుతాను రక్షించుకొంటాడతను. ఈ వ్యాధిగ్రస్తుడికి అలా తెలియదు. దానితో ఆ భాగాలను అతడు కోల్పోయినా మనం ఆశ్చర్యపడనక్కరలేదు. తెలిస్తేకదా, అతడిని అతడు రక్షించుకోగలిగేది.

మూత్ర విసర్జనలో ఎగుడుదిగుడులు. వ్యాధి ముదురుతున్నకొద్దీ మూత్ర విసర్జన జరిగినా జరిగినట్లు తెలియని స్థితిగతులు. అన్నీ తెలియకుండానే! అన్నీ ఆ బట్టలలోనే ఆని అంటుంటామే అలాంటి స్థితిగతులు.

శ్వాసక్రియ తగ్గిపోతుంటుంది. ఊపిరి వెళ్ళవలసినంత లోతుకు వెళ్ళుతున్నట్లు ఉండదు, ప్రాణవాయువు తరిగిపోతున్నట్లు ఉంటుంది- గాలి బాగా కావాలి అనిపిస్తుంది. సామాన్యంగా చల్లటిగాలిని కోరుకొంటారు. చెమటలుకూడా ఎక్కువగానే ఉంటాయి. స్థితిలో కొందరు అసలు చెమట పట్టనివారు ఉంటారు, లోతున్న అయోమయ స్థితి వల్ల ఆ అంశం జారిపోయిందన్నమాట!

ఇంద్రియ ప్రవృత్తులు కూడా క్రమంగా మందగిస్తాయి. ఒక వయస్సుదాటాక కళ్ళకు మసక వచ్చేవారు, చెవుల వినికిడి తగ్గేవారు, ముక్కుతో వాసనలు తెలియని వారు, నాలుకకు రుచి తెలియనివారు, స్పర్శను కోల్పోతున్న చర్మం కలవారు ఉంటారు ఇందులో! సరిఅయిన హోమియో చికిత్సను సరిఅయిన సమయంలో అందించడం జరిగితే ఈ ప్రవృత్తులను సరిచేయవచ్చు.

కంటికి మసక వస్తున్నది. కళ్ళజోడు పెడుతున్నాము. అది సహకారం అవుతుందిగాని వైద్యం కాదుగదా! చెవి వినికిడిని కోల్పోతున్నది. చెవికి మిషన్ పెడ్తున్నాము. అది సహకారం అవుతుందిగాని వైద్యం కాదుగదా! ఇన్ని భాగాలకూ ఇంతమంది స్పెషలిస్టులుండికూడా కేవలం సహకారాన్ని అందిస్తున్నారుతప్ప సరైన వైద్యాన్ని అందించలేకపోతున్నారుకదా! చివరకు ఆయా భాగాలకు చేసే శస్త్రచికిత్స కూడా సహకారమే అవుతున్నది తప్ప వైద్యంకాలేదు కదా! ఇది ఆలోచించవలసిన అంశం కాదా! కుంటివాడికి కర్రఇస్తే కర్రఇచ్చినట్లు అవుతుందిగాని, కాలు ఇచ్చినట్లు అవుతుందా? మరి వైద్యులు సహకరించే స్థితినుండి సరిఅయిన వైద్యాన్ని అందించే స్థితికి ఎదిగివచ్చే ప్రయత్నం చేయాలికదా! ఆ సరైన వైద్యాన్ని హోమియో అందించగలదు. వైద్యులందిస్తున్న సహకారానికి ఈ సరిఅయిన వైద్యం తోడయితే, ఎంత బాగుంటుంది చూడండి! అందువల్ల ఆ ప్రత్యేక వైద్యనిపుణులకు హోమియో వైద్యం అధ్యయనం చేయవలసిందిగా నేను సలహానిస్తున్నాను. అప్పుడు వారు చేస్తున్న సేవ సమగ్రరూపాన్ని సంతరించుకొంటుందని నేను నొక్కి చెబుతున్నాను. వైద్యులారా! సహకారమందించే స్థితినుండి సరిజేసి నిలబెట్టే స్థితికి మనం పయనం చేద్దాము! సేవచేయాలని నిలబడినవారు మీరు. ఆ చేసేది ఏదో అది పూర్తిగా చేయండి. మనస్ఫూర్తిగా చేయండి. వివిధ వైద్యవిధానాలను సమన్వయించి చేయండి.

ఈ వ్యాధిలో తరాలు నడుస్తున్నకొద్దీ ఇంద్రియ ప్రవృత్తులు ఒకటొకటిగా పూర్తిగా లోపించడం మొదలుపెడతాయి. పుట్టుకతోనే చూపులేనివారు పుడతారు. వినికిడి ఎరుగనివారు పుడతారు. వాసన తెలియనివారు పుడతారు. రుచిని చూడలేని వారు పుడతారు. స్పర్శలేనివారు పుడతారు. అంటే ఆయా ఇంద్రియ ప్రవృత్తులు పూర్తిగా లుప్తమయిపోతున్నాయన్నమాట! పుట్టుకకు ముందే లుప్తమయిపోతున్నా యన్నమాట! ఇలాంటివారిని సరిచేయాలీ అంటే చాలా చిన్నవయస్సునుండీ సరి అయిన హోమియో చికిత్స జరగాలి. అప్పుడు కొంతలో కొంత వారికి మేలుజరిగే అవకాశం ఉంటుంది.

సోరాలో ప్రాణప్రవృత్తులు చెదురుబాటు చెందుతాయి. సైకోసిస్‌లో ప్రాణ ప్రవృత్తులు వక్రమార్గాన్ని పొందుతాయి. సిఫిలిస్‌లో ప్రాణప్రవృత్తులు మందకొడి తనాన్ని పొందుతాయి.

సోరాలో శరీరానికి ఏమాత్రం ఒత్తిడి తగిలినా పుండ్లుపడతాయి. సైకోసిస్‌లో శరీరానికి పడిన పుండ్లు ఒకపట్టాన మానవు. సిఫిలిస్‌లో శరీరానికి పడిన పుళ్ల

తొందరగా కుళ్ళిపోతాయి. ఒక్కొక్కసారి అశ్రద్ధ జరిగితే ఆ మేరకు శరీర భాగా లను తొలగించవలసి వచ్చినా రావచ్చు. శరీరంలో తొందరగా కుళ్ళే లక్షణం ఉంటుంది. వృద్ధాప్యంలో మంచానపడినప్పుడు పుండ్లు పడేవారిని మనం చూస్తుంటాం. పుండ్లుపడేవారిలో మనం ఈ వ్యాధివాళ్ళనే ఎక్కువగా చూస్తుంటాం. పుండ్లుపడి, కుళ్ళిపోయి, గదంతా దుర్వాసనలతో నిండిపోయే సంఘటనలు మనకు ఈ వ్యాధి వారిలో తారసపడతాయి. ప్రాణం దేహాన్ని భరించలేని స్థితిలో పడిపోతుంది. దేహం ప్రాణాన్ని అంటిపెట్టుకోలేని స్థితికి వచ్చేస్తుంది.

### మ నో మ య కో శ ం

ఒక విధమయిన జడత్వం, ఒక విధమయిన స్తబ్దత, ఒకవిధమయిన మందకొడి తనం అడుగడుగునా వీరిలో కనబడుతుంది. మనస్సు అంతగా ఎదగని స్థితి, విషాదం మేఘమై, మనస్సును ఆవరించిన స్థితి వీరిలో అంతటా ప్రస్ఫుటమవుతుంది. అనం దించలేనిస్థితి. సంతోషపడలేని పరిస్థితి. ఈ సృష్టిలో ఏమున్నదనీ, ఈ జీవితం ఒక మూన్నాళ్ళ ముచ్చట అనీ, ఏదో తెలియని వెలితిని అనుక్షణం అనుభవిస్తున్న స్థితి.

### పా ప ం - ఋ ణ ం

ఏదో పాపం చేసి, దాని ఫలితంగా ఈ భూమి మీదకు వచ్చాము అనిపిస్తుంది. భూమిమీద ఉన్నవారందరూ పాపులేననిపిస్తుంది. ఈ భూమిపైన పాపులు గాక, పరిపూర్ణులు ఉంటారా! అది అసంభవం— అనిపిస్తుంది. మహాత్ములుగా దిగివచ్చిన వారు కూడా ఎంతో కొంత కర్మశేషం ఉండి, అది తీర్చుకోవడం కోసం తప్పనిసరి అయి భూమిమీదకు వచ్చినవారేననిపిస్తుంది.

ఈ జన్మ పాప ఫలితం, ఈ జీవితం వేదనా భరితం! ఈ దేహం క్షణ భంగురం, ఈ సృష్టి అశాశ్వతం! చేసిన దానికి అనుభవించడమే తప్ప, పొంద గలిగింది ఇక్కడేముంది అని అనిపిస్తుంది.

దేహం ఒక జైలువంటిది. జీవి అందులో బందీ అయి ఉన్నాడు. శిక్షను అనుభవించడానికే భూమిమీదకు వచ్చాడు. ఇక అనుభవించడమే! శిక్షను అనుభ వించడానికి వచ్చి సుఖ సంతోషాలను అభిలషించడం అది ఒక పిచ్చితనం!

జన్మ ఈయబడింది ఋణం తీర్చుకోవడానికే! బంధుమిత్రుల రూపంలో ఉన్నవారికి మనమంతా ఋణగ్రస్తులం. ఎవరి ఋణం వారికి తీర్చిపోవడమే మన పని. ఋణాలు తీర్చివేయాలి గాని, క్రొత్త ఋణాలు చేయకూడదు. చేస్తే మళ్ళీ పుట్టవలసి

వస్తుంది. ఋణగ్రస్తులం గనుక మనం చేస్తూ వెళ్ళిపోవడమే! మనం ఎవరిచేతా చేయించుకోకూడదు. చేయించుకొంటే మళ్ళీ ఋణపడతాం. ఋణపడితే మళ్ళీ జన్మ వస్తుంది అనిపిస్తుంది.

అలా కాదు. ఈ సృష్టి ఒక లీల. ఒక క్రీడ! సృష్టిలో ఉన్నది క్రీడానుబంధమే గాని, ఋణానుబంధం కాదు. జీవితాన్ని కేవలం జమా ఖర్చులు లెక్కగా చూడకూడదు. కేవలం సరిపెట్టడానికి కాదు మనం భూమి మీదకు వచ్చింది. దేవదేవుని రాజ్యంలో ఒకానొక దివ్యమయిన పాత్రను పోషించడానికి ఈ భూమి మీదకు వచ్చాము. అయితే ఆటలో పాయింట్లు ఉండవని కాదు. పాయింట్లు కన్నా ఆటముఖ్యం! ఆటలో పాయింట్లు ఉంటాయి గాని,పాయింట్లకోసం ఆటకాదు. అలాగే సృష్టిలో కర్మబంధాలు ఉండవచ్చు. కాని సృష్టి ఉన్నది కేవలం కర్మబంధాల లెక్కలను కట్టడానికి కాదు. అంటే, అది వీరికి అంత అంగీకారంగా ఉండదు.

దేవదేవుడు ఈ సృష్టికొరకు తపస్సు చేశాడు. అతని తపస్సు ఈ సృష్టి రూపంలో ఇలా కొనసాగుతూ ఉంది. దేవదేవుని తపస్సునుండి వ్యక్తమవుతున్న ధన్యజీవులం మనం. అతనికి తగినట్లుగా నడుచుకొన్నప్పుడు అమృతత్వాన్ని పొందగలం- అని పెద్దలెవరయినా అంటే, అంతా విని వీరు అంటారు గదా- 'ఏదో ధైర్యం చెప్పడానికి ఇలా చెబుతున్నారు గాని, ఈ సృష్టి మొత్తం పాపభూయిష్ట మని మీకు మాత్రం తెలియదూ?'

మీరు ఎన్ని చెప్పండి వీరి మనస్సుకు పాపమన్న ఆ భావన పోదు. ఏమిటో ఈ జిహ్వాచాపల్యం, ఇన్నీ తెలిసి కూడా! అని ఆహారాన్నీ రుచులను ఒక ప్రక్క ఏవగించుకొంటూనే, మరొకప్రక్క తింటూ ఉంటారు. ఏమిటో ఈ మనశ్చాంచల్యం అని చిన్నచూపు చూస్తూనే దాంపత్య ధర్మంలో పాల్గొంటూ ఉంటారు. ఒకప్రక్క ఈసడిస్తూనే, మరొకప్రక్క అనుభవించడం, మళ్ళీ అందుకు తమనుతాము నిందించుకోవడం—ఇది ఒక చిత్రం! ఈసడించుకోవలసిన పని లేదు. శరీరధారికవి సహజ ధర్మాలు. పవిత్రమయిన మార్గాన వాటిని తగిన విధంగా అనుభవించాలి. అంటే అంగీకరించరు. అలాగని అనుభవించకుండా ఉంటున్నారా? చాంచల్యం, చాంచల్యం అని విసుక్కుంటూనే అనుభవిస్తున్నారు.

రక్తమాంసాల ముద్ద ఇది. చీము నెత్తురుల మూట ఇది. మలమూత్రాల నిలయమిది! జన్మజన్మల పాపఫలమిది- అంటూ దేహాన్ని గూర్చి అవకాశం వచ్చినప్పుడల్లా ఆక్షేపిస్తూ ఉంటారు. అప్పుడప్పుడూ అలా గొంతెత్తి నిందిస్తూ

ఉంటే దేహాభిమానం క్రమంగా తొలగిపోతుందని గట్టిగా నమ్ముతూ ఉంటారు. దేహాభిమానం ఇట్లా తొలగిపోతుందా, ఎన్నటికీ తొలగిపోదు. ఈ దేహం మనది కాదు దేవునిది. దేవుడు మన కప్పగించిన కార్యాచరణకోసం శ్రద్ధతో వినియోగించ వలసిన ఉపకరణ మిది - అన్న దర్శనం మనకు కలిగినప్పుడు దేహాభిమానం దానికదిగా తొలగిపోతుంది. అలాగాకే దేహాన్ని నిందిస్తుంటే ఒరిగేదేమీ ఉండదు సరికదా, దేహనింద దైవనింద అవుతుంది. దేహాన్ని మనం నిందిస్తున్న ప్రతిసారీ, అది దైవాన్ని నిందించడమే అవుతుంది. అది వీరికి తెలియదు. చెప్పినా బోధ పడదు. ఎందువలన అంటే వీరు దేహాన్ని జైలుగా భావిస్తున్నారు తప్ప, దేవుడిచ్చిన దివ్యమయిన ఉపకరణంగా గ్రహించలేకపోతున్నారు.

ఇంతోటి జీవితానికి ఈ ఆపేక్షలేమిటో, ఈ మమకారాలేమిట్రా, ఈ అనురాగా లేమిటో, అనుబంధాలేమిటో పొమ్మన్నా పోవు కదా! కట్టై ఉన్నంతవరకు ఇవి మనను కట్టిపడేస్తూనే ఉంటాయి కదా!-అని వాపోతూ ఉంటారు. వద్దనుకొంటారు— కాని వదిలిపెట్టలేరు. వద్దనుకోవడం మానేయండీ అంటే, ఎలా మానగలం, అంటారు. పోనీ వదిలేయండి అంటే అంత తేలికా, అని ఆశ్చర్యపోతారు. వద్దంటూనే అనుభవిస్తున్నారు కదా, పోనీ అందులోనే దైవాన్ని చూడండీ అంటే ఎంత సుళువుగా చెప్పావు?—అంటూ పెదవి విరుస్తారు, వెష్టపడుతూనే ఇష్టపడతారు. వద్దనుకుంటే మాత్రం పోతాయా, ఎవరికి ఎంత ఋణమో—అని ఋణస్మరణ చేస్తారు.

పాపాన్ని చూడగలిగినంతగా పరమాత్మను చూడలేరు. ఋణస్మరణ చేసి నంతగా, దైవస్మరణ సాగించలేరు. మాటిమాటికీ, మాటిమాటికీ గొంతు నుండి విషాదమొకటి జీర సాగుతూ ఉంటుంది. దూరాననుండి చూస్తున్నవారికి ఇదంతా వైరాగ్యమనిపిస్తుంది, ఏది ఏదో తెలిసినవారికి ఇదంతా ఈ దీర్ఘవ్యాధి లక్షణమని బోధపడుతుంది.

సోరావారి గొంతునుండి అహంకారం ప్రకటింపబడుతుంది. సైకోసిస్ వారి గొంతునుండి అనుమానం ధ్వనిస్తుంది. సిఫిలిస్‌వారి గొంతు నుండి విషాదం జీరసాగుతుంది.

### ఒంటరితనం

అహంకరించి సోరావాడు ఒంటరివాడు అవుతాడు. మరి అతడు ఎవరినీ తనతోపాటు చూడలేడు కదా! అందరినీ చిన్నచూపు చూస్తున్న అతను ఎందరిలో

ఉన్నా ఒంటరివాడే! ఎవరితోనూ శ్రుతి కలుపలేడు. అసలు శ్రుతి కలపాలని అనుకోడు. అందరికన్నా మనం ఎక్కువ. చాలా ఎక్కువ అనుకొంటూ దూర దూరంగా జరిగి ఒంటరివాడుగా మిగిలిపోతాడు. విలవిలలాడుతూ తడబడిపోతాడు.

అనుమానించి సైకోసిస్‌వాడు ఒంటరివాడుగా నిలిచిపోతాడు, ఎవరినీ నమ్మడు. ఎందుకు నమ్మాలి? అంటాడు. ఎలా నమ్మగలను? అంటాడు. ఇవాళ ఇలా ఉన్నాడు, రేపు ఎలా ఉంటాడో, ఎవరు చెప్పగలరు? అంటాడు. అయిన వారిని కూడ అనుమానిస్తూనే ఉంటాడు. నాకు అయినవారు లేరు. అందరూ అనుమానించతగినవారే నంటాడు. 'దగ్గరగా ఉన్నవారిని మరీ అనుమానించాలి? ఏమో, ఏ క్షణంలో ఏం చేస్తారో, వాళ్ళకు అవకాశాలు ఎక్కువ. ఇంకా ఎక్కువ జాగ్రత్తగా ఉండాలి' అంటాడు. అందరిలో ఉంటూనే ఎవరికీ కాకుండా ఒంటరివాడుగా మిగిలిపోతాడు. తనలో తానే దాక్కుంటాడు.

విషాద దృష్టితో సిఫిలిస్‌వాడు ఒంటరివాడై పోతాడు. అంతా ఋణానుబంధం! ఎవరికి ఎవరూ ఏమీ కారు. ఈ కాస్త గాలీ పోయిన తరువాత ఎవరికి ఎవరు ? ఏమిటో అంతా నాటకం! ఇదంతా మూన్నాళ్ళ ముచ్చట! ఏముందిఇందులో బావుకో డానికి! ఆ ఋణం కాస్తా తీరిపోయిన తరువాత ఎవరికి ఎవరు ? ఋణం తీర్చుకునే వరకే ఎవరికి ఎవరయినా! నాకెవరూ లేరు. ఎవరూ నాకు ఏమీ కారు. ఏదో ఋణాలు తీర్చిపోదామని ఇలా వచ్చాను. అదేదో ఈ జన్మలోనే తీరిపోతే ఈ గొడవ పోతుంది. మళ్లీ పుట్టకుండా ఉండే మార్గం చూడాలి. ఋణం లేకపోతే పుట్టం కదా! కనుక ఎవరి ఋణం వారికి తీర్చేయాలి! ఇలా సాగుతుంది వీరి ఆలోచన. ఏ పూట ఎవరు కనబడినా వీరికి మనం ఎంత ఋణమున్నామో అనిపిస్తుంది. మనస్సు అందరినీ ఋణసంబంధులుగానే చూస్తుంది. దారుణమయిన ఈ ఋణ దృష్టితో వీరు ఒంటరివారుగా మిగిలిపోతారు. అందరిలో ఉన్నా, అందరూ ఉన్నా, ఎవ్వరూ లేనట్లు వీరికి అనిపిస్తుంది. ఈ విధంగా ఈ మూడురకాల దీర్ఘవ్యాధులవారూ ఒంటరితనాన్ని అనుభవిస్తున్నారు. భయంకరమయిన ఒంటరితనాన్ని అనుభవిస్తున్నారు.

నిజానికి ఆధ్యాత్మికత అంటేఏమిటి? ఎవరికీ కాకుండా పోవడమా? అందరుగా ఉన్నది మనమేనని తెలియడమా? అంతర్యామిగా వ్యాపించవలసిన మానవుడు తనలో తాను ఇలా కుంచించుకు పోవచ్చునా! మానవుడుగా పుట్టినందుకు దైవమయి వర్తించవలసినవాడు అధికృతనుకోరుతూ ఒకడు, అనుమానిస్తూ ఒకడు,

నేను పాపిని, మహాపాపిని అని రోదిస్తూ ఒకడు-ఇలా కూర్చుండి పోవచ్చునా, ఆలోచించండి!

భవిష్యత్తును గూర్చి

సోరావారు భవిష్యత్తును గూర్చి ఆరాటపడతారు. కడదాకా తమస్థాయి ఇలా నిలబడుతుందో, లేదో! చివరివరకు తమమాట ఇలా చెలామణి అవుతుందోకాదో! వయస్సు వస్తున్నకొద్దీ మిగిలినవారు మనకు ఇంతగా ఒదిగి ఉంటారో, ఉండరో!— అని ఆలోచిస్తూ ఉంటారు. తమస్థాయిని ఇంకాఇంకా పెంచుకొంటూ పోతేగాని, ఇప్పటిలాగే చివరివరకూ తలవంచకుండా సాగలేమని ఆరాటపడుతూ ఉంటారు. ఎట్టి పరిస్థితులలోనూ వారి అహంకారం దెబ్బతిన కూడదు. ఒకరిని అర్థించాల్సిన అవసరం కలగకూడదు. ఎవరిపైనా ఆధారపడవలసిన స్థితి రాకూడదు—అని అనుకొంటూ, అందుకుగాను అనేకమయిన చర్యలను నిరంతరం చేపడుతూ ఉంటారు.

సైకోసిస్‌వారూ భవిష్యత్తును గూర్చి భయపడుతూనే ఉంటారు. ఏది ఎలా జరుగుతుందోనన్నభయం వీరిని వెన్నాడుతూ ఉంటుంది. కడదాకా ఒకరికి దొరక్కుండా సాగడం ఎలా? చివరివరకు జీవితసత్యాలను మరొకరికి తెలియకుండా కథను నడపడం ఎలా—?అనివీరు ఆలోచిస్తూ ఉంటారు. జీవితంలో ఈ గుంభన చివరిదాకా సాగాలి—అని మథనపడుతూ ఉంటారు. తమ ఈర్ష్యాసూయలకు బలయి పోయినవారు చివరిదశలో తమపై కక్షతీర్చుకోరు కదా అని భయపడతారు. తమ బ్రతుకు ఎక్కడ బయటపడుతుందోనని భయం. ఎలాంటి చర్యలకు తావు గురికావలసి వస్తుందోనని భయం.

భవిష్యత్తు ఎలాగడుస్తుందీ అన్నప్పుడు అది మన చేతిలో లేనిది. విధిచేతిలో ఉన్నది. ఎలావ్రాసిపెట్టి ఉంటే అలా జరుగుతుంది-అంటారు సిఫిలిస్‌వారు. మృత్యువును గూర్చి భయపడుతున్నారా-అంటే లేదు అది సహజమేకదా, ఎప్పటి కయినా అది తప్పదుకదా- అంటారు. మనం చేయగలిగింది ఏముంది అంటూనే భవిష్యత్తునుగూర్చి ఒక భయాన్ని ప్రకటిస్తారు. అది ఏమిటీ అంటే—చివరి క్షణం వరకూ మనం ఒకరికి చేయగలిగి ఉండాలితప్ప మరొకరిచేత చేయించుకోవలసిన అవసరం మనకు రాకూడదు. మంచాన పడకూడదు, అలవోకగా వెళ్ళిపోవాలి. వెళ్ళటం ఎలాగూతప్పదు. చేయించుకోకుండా వెళ్ళిపోవాలి. ఇలా అనుకున్నది

అనుకున్నట్లుగా జరిగితే ఫరవాలేదు. ఇలా కాక మంచానపడితే, మరొకరితో చేయించుకోవలసివస్తే అది నేను భరించగలనా అన్న భయం వీరిని వెన్నాడుతుంది.

వయస్సు మళ్లుతున్న కొద్దీ ముగ్గురూ మూడురకాలుగా భయపడతారు. ఎక్కడ తమఅహంకారానికి దెబ్బతగులుతుందోనని సోరావారికిభయం. ఎక్కడ తమ నిజస్వరూపం బయటపడిపోతుందోనని సైకోసిస్‌వారికి భయం. ఎక్కడ ఇతరులచేత చేయించుకోవలసి వస్తుందోనని సిఫిలిస్ వారికి భయం! మొత్తంమీద ముగ్గురికీ భయమే!

స్వస్థతలో ఉన్నవాడు మృత్యువునుగూర్చి ఆలోచించడు. అతనికి మృత్యువాక సన్నివేశమేకాదు. ఈ లోపున నిర్వర్తించ వలసిన కర్తవ్యం పైననే శ్రద్ధను పెడతాడతను. జీవితాన్ని సద్వినియోగం చేయడం పైననే అతనిదృష్టి ఉంటుంది. మిగిలిన ఆలోచనలు అతనికిరావు.

## తేమానం—తీర్మానం

సోరాలో మనస్సుకు వేగం పెరుగుతుంది. సైకోసిస్‌లో మనస్సు వక్రమార్గం పడుతుంది. సిఫిలిస్‌లో మనస్సు మందకొడి తనాన్ని పొందుతుంది.

సిఫిలిస్‌వారు తొందరగా ఆలోచించలేరు. తొందరగా బోధపరచుకోలేరు. బోధపరచుకొన్నదానిని తగిన విధంగా విప్పిచెప్పలేరు. గ్రహణశక్తి తగ్గుతుంది. జ్ఞాపకశక్తి తగ్గుతుంది. తిప్పిచెప్పగల శక్తి తగ్గుతుంది. మన ఇళ్లల్లో ఒక్కొక్కసారి విద్యుచ్ఛక్తియొక్క ఓల్టేజీ తగ్గిపోతుంది చూడండి—అలా ఇక్కడ మానసిక శక్తి తగ్గిపోతుంది. సన్నివేశానికి తగినట్లు ఎదగలేరు, దిగలేరు. సమయస్ఫూర్తి అన్నది అంతగా ఉండదు.

నీకు ప్రవర్తించడం చేతగావాలి. ఇలాచేస్తే ఎలాగ అనిమందలిస్తే ఇన్నేళ్లు వచ్చాయి. ఇంకాక్రొత్తగా చేతనయ్యేందుకు ఏముంటుంది? ఎలాగో అలాగ ఇంత కాలమూ నడిచిపోయింది. ఇకముందు మాత్రం నడిచిపోదా! అని అంటారు తప్ప, ఎదుగుదామని అనుకోరు.

వీరిలో చాలా మందికి బట్టను చుట్టడమేతప్ప కట్టడము రాదు. బట్టలను తగినవిధంగా ధరించడం చేతకాదు. ఇదేమిటి ఇలా కట్టుకొన్నారు అని ఎవరయినా అడిగితే, ఇప్పుడొచ్చిన నష్టమేముంది, ఏది కట్టుకొంటేరోజు వెళ్ళదు, ఎలా కట్టుకుంటే రోజు వెళ్ళదు— అంటారు.

సిఫిలిస్ గృహిణులకు వంట చేయటం చేతకాదు. చేత కావాలనికూడా వారు అనుకోరు. ఏవి తింటే రోజులు వెళ్ళవు? ఎలా తింటే రోజులు వెళ్ళవు? అని పిస్తుంది. నాలుగు పాత్రలు అవసరమయినచోట, నలభయి పాత్రలను చేస్తారు. మళ్ళీ ఎక్కడవి అక్కడే పడుంటాయి. సర్దుకోవడం తెలియదు. వాడుకోవడం తెలియదు. పదార్థాలను వృథా చేస్తారు. రోజూ వంట చేస్తున్నా పాళ్ళు తెలియవు. ఎంత వండుకోవాలో తెలియదు. వండి పారబోసుకొంటూ ఉంటారు. ఏ కూరలో నూనె ఎంత వేయాలో తెలియదు. పూట పూటకూ మూకుళ్ళు అలా ప్రక్కన చేరుతూ ఉంటాయి. ప్రతి దాంట్లోనూ ఎంతోకొంత నూనె ఉంటూ ఉంటుంది. పెరుగు గిన్నెలు, మజ్జిగ గిన్నెలు చేరుతూ ఉంటాయి. ప్రతి దాంట్లోనూ ఎంతో కొంత ఉంటుంది. ఇలా వంటిల్లంతా అస్తవ్యస్తంగా ఉంటుంది. ఏమిటి ఇదంతా ఇలా ఉంది అంటే-మరి వంటిల్లెలా ఉంటుంది. అయినా ఈ వేళప్పుడు మిమ్మల్ని ఎవరు రమ్మన్నారు. అన్నీ మీకే కావాలి. మీ పనినిగూర్చి నేనొక్కమాటయినా అడుగుతున్నానా?-అంటారు. వీరిలో కొందరు మధ్యాహ్నం వరకు అన్నింటినీ వాడతారు. మధ్యాహ్నం నుండి అన్నిటినీ తోముతూ కూర్చుంటారు. రోజు మొత్తం వాడటం, తోమటం ఇదే సరిపోతుంది. భర్త గొడవ పెడుతూ ఉంటాడు. ఆమె మాత్రం తెమలలేదు. రోజూ ఉన్నదేకదా ఇది! తెలిసిన దానికి రాద్ధాంతమెందుకు? అంటుంది. గంటల తరబడి వంటను చేసి, ఇంతా అయితే ఒక కూర, ఒక పచ్చడితో అన్నం పెడుతుంది. వాటిలో ఉప్పూ, కారం ఎక్కువవడమో, తక్కువవడమో జరుగుతుంది. అన్నం ఒక ప్రక్క ఉడుకుతుంది ఒక ప్రక్క ఉడకదు. ఇంత సేపు చేశావు ఇదేనా చేసింది-అంటే ఈమాత్రం దానికి సర్దుకుపోలేరా, అన్నట్లు చూస్తుంది. ఇంకొంచెం మందలిస్తే కళ్ళనీళ్ళు పెట్టుకొంటుంది. పమిటకొంగు అందుకొంటుంది. మర్నాడు మళ్లీ మామూలే! కథ అలా సాగుతూనే ఉంటుంది. కాని ఆమె పద్ధతిని ఆమె మార్చుకోదు,మార్చుకోలేదు. ఎప్పుడూ ఏదో ఒకటి చేస్తూనే ఉంటారు. ఏ పనీ తెమిలినట్లు కనిపించదు. ఒక్కొక్కప్పుడు భర్తకు చాలా ఇష్టమని మరీమరీ అనుకొని ఏ పచ్చడో తయారుచేస్తారు. ఇంతాచేసి దానిని వడ్డించడం మరచి పోతారు.అంతా అయిపోయిన తరువాత గుర్తొస్తుంది. 'అయ్యో అయ్యో! ఎంతపని జరిగింది భయపడినట్లే జరిగింది—అంటూ వాపోతారు. పనుల మధ్యలోపడి మరచి పోయామనుకొంటారు గాని, తమ మతిమరుపే అంతా అని ఒప్పుకోరు.

ప్రయాణాలవీ ఉన్నప్పుడు సిఫిలిస్ వారు ఎప్పటికీ తెమలరు. వెళ్ళేటప్పటికి ముహూర్తం దాటిపోతుంది అనేటట్లు ఉంటారు. త్వరగా సర్దలేరు. త్వరగా నడవలేరు. భార్య సిఫిలిస్, భర్త సోరా గనుక అయితే ఇక ఆ ప్రయాణం విచిత్రంగా ఉంటుంది. బయలుదేరిన బస్సును చూసి, అరుస్తూ పరిగెడతాడు భర్త. ఒక ప్రక్క బస్సుకోసం అరుస్తాడు. మరొక ప్రక్క భార్యకోసం అరుస్తాడు. రా, రా, ఎక్కు, ఎక్కు అంటూ తాను బస్సెక్కేస్తాడు. భార్య రాలేదు, బస్సు ఆగలేదు. ఏమిటీ గొడవంతా అని సోరాకు చెందిన ఆ కండక్టర్ అతణ్ణి క్రిందకుతోసి తలుపు వేసేసుకొంటాడు. భర్తకు పడినంత పని అవుతుంది. భార్య అప్పటికికూడా అక్కడికి చేరుకోలేదు. అతడే లేచి ఆమెకు ఎదురువస్తూ 'ఎప్పుడూ ఇంతే! నీతో ప్రయాణమంటే ఇలాగే ఉంటుంది. నీతో కలిసి బయలుదేరడమనేది నా బుద్ధి తక్కువ. నాకు బుద్ధిలేక నీతో బయలుదేరాను. ఒక్కనాడూ అనుకొన్న సమయానికి అనుకున్నట్లుగా జరగనీయవు. ఆ బస్సువాడు చూడు నన్నెన్ని తిట్టాడో, అయినా నీకు బుద్ధిలేదూ, రాదు. నా నోటిని బయట పెడతావు తప్ప, నిన్ను ఎన్నని ఏమి లాభం?' అంటాడు,

అంతావిని ఆవిడ అంటుంది కదా-'ఇప్పుడు ఏమయిందనీ, ఇంకో బస్సుకు వెళతాం. ఏదో ఒక వేళకు చేరుకోలేకపోతామా! అయినా బయలుదేరిన బస్సు ఎక్కడమెందుకు, ఈ బాధలన్నీ ఎందుకు? అన్నీ సవ్యంగా జరుగుతాయి. మీరు కొంచెం స్థిమితపడండి. ఆమాట అంటే మీకు కోపం. మీరు స్థిమితపడలేరు. నన్ను స్థిమితంగా ఉండనీయరు. మన ఇద్దరికథా ఈనాటిదా? మీ తొందర, నా తేమానం? ఎన్నుకొంటేమాత్రం ఇవి పోతాయా? స్వభావాలెలా మారుతాయి? నన్నంటున్నారు గాని, మీరు మాత్రం మారగలరా? ఏదీ ఆ తొందర కొంచెం తగ్గించుకోండి చూస్తాను.'

పని చెడగొట్టింది కాకుండా, పైగా నీతిబోధలుకూడానా, అదీ రోడ్డుమీద, బుద్ధిలేకపోతే సరి! అని విసుక్కుంటాడు భర్త. ఇప్పుడు నేనేమన్నాననీ! లేనిమాట గాని, కాని మాటగానీ ఏమన్నా అన్నానా?-అంటుంది ఆమె.

మొత్తంమీద ఎవరూ తమదీ తప్పని అంగీకరించరు. ఎవరి ప్రవర్తన వారికి సరి అయినదిగానే కనిపిస్తుంది. ఆలస్యం అమృతం విషం-అని సోరా వారు అంటే నిదానమే ప్రధానము-అని సిఫిలిస్ వారు అంటారు. నిజానికి అనవలసినవి ఇవి

రెండూ కాదు-'విధానమే ప్రధానము'- అనాలి. ఏ పనివయినా దానికి కావలసిన పద్ధతిలో చేయాలి. కొన్ని పనులకు వేగం అవసరమవుతుంది. అక్కడ వేగం ఉండాలి. కొన్ని పనులకు నిదానించడం అవసరమవుతుంది. అక్కడ నిదానించాలి. కనుక స్వస్థతలో ఉన్నవారు 'విధానమే ప్రధానము' అని తెలిసికొంటారు.

సోరా భర్త కాబట్టి సిఫిలిస్ భార్యతో ప్రయాణం పెట్టుకొని ఘర్షణపడ్డాడు గాని, అదే ఆ భర్త సైకోసిస్‌కు చెందినవాడనుకోండి అప్పుడేం జరుగుతుంది? అతడు తిట్టడు-అలా అని ఉండడు. చూడూ! నేను పనులమీద అలా అలా వెళ్లి అక్కడికి చేరుకుంటాను. నీవు, ఇక్కడ పనీ అదీ చూసుకుని, ఇంకా వచ్చేవాళ్ళను కూడా కలుపుకుని సూటిగా వచ్చేసేయి-అంటూ సాగిపోతాడు. సైకోసిస్ వారు ఇలా దొరక్కుండా ప్రవర్తించగలరు. సోరావారు ఎక్కడికక్కడ దొరికిపోతుంటారు. ప్రతి దాంట్లోనూ కలగజేసుకుంటూ ఉంటారు.ఆ తరువాత కొట్లాడుతూ ఉంటారు.

గుర్తు రావడంలో కూడ వీరికి తేమానమే! మీకోసం ఫలానా ఆయన వచ్చాడండి. ఇది చాలా అర్జంటు విషయమంటూ ఏదో చెప్పాడు, ఏం చెప్పాడో గుర్తు రావడంలేదు-అంటుంది సిఫిలిస్ గృహిణి. భర్త గనుక సోరా అయితే ఆ చెప్పిందేమిటి అంటూ గింజుకుపోతాడు. పెద్దగొంతుతో అరుస్తాడు. 'ఎందుకలా ఇదయిపోతారు? గుర్తుంటే చెప్పనా?' అంటుంది ఆమె. ఆ చెప్పలేనిదానివి మొత్తంచెప్పడం మానుకోవచ్చుగా, కొంతచెప్పి నా ప్రాణం తీయడం ఎందుకు? అంటాడు అతను. 'ఎలా మానుకొంటాను. గుర్తున్నంత వరకయినా చెప్పాలి కదా! గుర్తున్నది కూడా చెప్పకపోతే తప్పు కాదా? తెలిసి పాపం చేయవచ్చా?' అంటుంది ఆమె. అతనికి కోపం మరింత పెరుగుతుంది. ఫలానావాడు వచ్చాడని అంటున్నావు. వాడి పేరు కూడా చెబుతున్నావు. విషయం మాత్రం గుర్తులేదా- నీతో వేగలేక చస్తున్నాను! అంటాడు. 'అనుకుంటే మాత్రం తప్పుతుందా? వ్రాసిపెట్టి ఉన్నదాన్ని ఎవరు తప్పించగలరు? మధ్యలో ఎన్నుకొని ఏం లాభం? అన్నది మిగులుతుంది గాని, ఉన్నది తప్పదు కదా'—అంటుంది ఆమె.

సైకోసిస్ వారు పేర్లూ, సందర్భాలూ మరచిపోతారు. సిఫిలిస్‌వారు విషయాలూ, విశేషాలూ మరచిపోతారు. కాలం గడుస్తున్న కొద్దీ సిఫిలిస్ వారికి జరిగిన సన్నివేశాలు మొత్తంగా జారిపోతూ ఉంటాయి. అన్నట్లు ఆమధ్య ఇతనొకసారి వచ్చాడండి. ఆ సంగతే మరచిపోయాను. చాలా తొందర పనిమీద వచ్చానని కూడా

చెప్పాడు. మీకు చెప్పనేలేదు. గుర్తుంటేకదా చెప్పేందుకు?- అంటారు. ఇలా వీరి మతిమరపు ఎంతదూరమయినా వెళ్ళగలదు.

## చ దు వు స ం ధ్యా లు

సిఫిలిస్‌కు చెందిన విద్యార్థులకు పాఠాలు ఒకపట్టాన బోధపడవు. అందువల్ల వీరు ప్రశ్నలూ-జవాబులనూ బట్టీపడతారు. ఆ బట్టీ పట్టినవి పరీక్షల్లో వస్తే వ్రాస్తారు. మధ్యలో ఒక వాక్యం గుర్తుకు రాలేదనుకోండి, ఇక మొత్తం జారిపోయే అవకాశం ఉంది. కామాలు, ఫుల్‌స్టాప్‌లతో సహా బట్టీ పడతారు. వీరు బట్టీ పట్టినవే పేపర్లో వచ్చాయనుకోండి, వీరికి ప్రథమశ్రేణి వచ్చినా మనం ఆశ్చర్యపడనక్కర లేదు. అలా రావడం వీళ్ళ అదృష్టమే తప్ప, వీరికి విషయం బోధపడినట్లు కాదు. పెద్ద తరగతులలోనికి వెళ్ళిన తరువాత కూడా వీరు ఇలా బట్టీ పడుతూనే ఉంటారు. పెద్దగొంతుతో చదువుతూ మరీ బట్టీపడతారు. వీరు చదువుతున్న అంశాలు ప్రక్కవారికి వచ్చేస్తాయి. వీరికి రావడం మాత్రం కష్టంగా ఉంటుంది.

మా మిత్రుడొకడు ఉండేవాడు. ఎమ్.ఎ. తెలుగు రెండవ సంవత్సరం చదువుతూ ఉండేవాడు. తెలుగు సాహిత్యంలో ఆధునికయుగం ప్రత్యేక పాఠ్యాంశంగా ఉండేది. అందువల్ల అతడు ఆ యుగానికి సంబంధించిన కొన్నివ్యాసాలను రూపొందించి, అదేపనిగా బట్టీపడుతూ ఉండేవాడు. ఒక్కొక్క పేరాను కొన్ని పదులసార్లు పెద్దగొంతుతో చదువుతూ ఉండేవాడు. 'వెనకదగా, ముందుదగా, కుడి ఎడమల దగా దగా'—అన్నది శ్రీశ్రీ కవితలోని ఒక భాగం. దీనినతడు మళ్ళీ మళ్ళీ చదువుతున్నాడు. ముందునుండి కొన్నిసార్లు, వెనకనుండి కొన్నిసార్లు, త్రిప్పి త్రిప్పి వల్లె వేస్తున్నాడు. అటుపైపుగా వెళుతున్న మరోమిత్రుడు నిలబడి ఇదంతావిన్నాడు. మరునాడు విశ్వవిద్యాలయంలో అతడిని పట్టుకొని—'వెనక దగా, ముందు దగా, కుడి ఎడమల దగా దగా'-మీరు ఇలా బట్టీలుపట్టి మార్కులు తెచ్చేసుకొంటారు. మేము ఎంత అర్థం చేసికొని వ్రాసినా మాకు అన్ని మార్కులు వేయరు. 'వెనక దగా, ముందు దగా, కుడి ఎడమల దగా దగా! సోదరా! ఈ నగ్నసత్యాన్ని రాత్రంతా వల్లె వేశావు కదా! నిన్ను చూస్తుంటే నాలో అగ్నిపర్వతం బ్రద్దలవుతోంది. ఇంక ప్రతిభకు చోటెక్కడ ఉంది-అనీ!' అంటూ అతడు గర్జించాడు. తనలోని ఘోరాను ఇలా ప్రకటించాడు.

సోరావారికి చదివితే వస్తుంది. కాని శ్రద్ధగా చదవలేరు. సిఫిలిస్‌వారికి ఎంత చదివినా ఒకపట్టాన రాదు. కాని విశ్రాంతిని కోరకుండా బట్టీపడతారు. వచ్చేవాడు చదవడు. రానివాడు వదలడు. సైకోసిస్‌వాడు ఈ రెండూ కాదని చక్కగా కాపీలుపెట్టి వ్రాస్తాడు. లేదా ఇంటిదగ్గిరే వ్రాసుకువెళ్ళి, పేపరుమధ్యలో దానినిపెట్టి అందిస్తాడు. ప్రశ్నపత్రాలు బయటకు వచ్చేటట్లు చూస్తాడు. మార్కులు ఎలా వేయించుకోవాలో ఆ సుళువులన్నీ తెలిసికొంటాడు. ఇలా—ముగ్గురూ చదువు అంతగా రాకుండానే విద్యార్థిదశను గడిపేస్తారు. చివరికి డిగ్రీ వస్తుంది. కాని చదువు రాదు. ఇలా డిగ్రీలు వచ్చి, చదువు రానివాళ్ళే నేటి సమాజంలో మనకు పెద్దఎత్తున గోచరిస్తున్నారు. దీర్ఘవ్యాధుల నివారణ అయితే తప్ప అక్షరంముక్క ఒంటబట్టదు. ఈ సంగతిని మనం గ్రహించుకోవాలి!

చిన్నతరగతులలోని విద్యార్థులలో సిఫిలిస్‌కు చెందినవారుంటారు. 'ఏరా పాఠం వచ్చిందా?-అని గద్దిస్తాడు సోరాకు చెందిన టీచరు. సిఫిలిస్ పిల్లవాడు చేతిని చాపుతాడు. దాని అర్థమేమిటి? 'బెత్తం దెబ్బలకు నేను సిద్ధంగా ఉన్నాను' అని. అలాగే ఇంకొకసారి చొక్కాను పైకితీసి వీపును టీచరుకు అప్పజెపుతాడు. వీపు మ్రోగిపోతూ ఉంటుంది. దానివల్ల టీచరుగారి సోరా తీరుతుంది తప్ప సిఫిలిస్ విద్యార్థికి చదువురాదు. టీచరు బాదడం మాని విద్యార్థికి సరిఅయిన హోమియో వైద్యం జరిగేటట్లు చూస్తే సిఫిలిస్ తొలగిపోతుంది. సరస్వతి ప్రసన్నమవుతుంది. కొంతమంది సిఫిలిస్ పిల్లలకు చదువు సంధ్యల మీదికి దృష్టి పోదు. ఎంతచెప్పినా పుస్తకం తీయరు. మూర్ఖంగా, మూఢంగా ఉండిపోతారు. సరైన హోమియోవైద్యం జరిగితే వారికి చదువుకోవాలనిపిస్తుంది. వారంతట వారే శ్రద్ధగా చదువుకొంటారు.

సిఫిలిస్ పిల్లలు బట్టలు సరిగా తొడుక్కోలేరు. తొడిగినవి సరిగా ఉంచుకోలేరు. గుండీలు సరిగా పెట్టుకోలేరు. ఒకచేత్తో లాగూను పైకి లాగుతూ, ఇంకో చేత్తో చీమిడిముక్కును తుడుచుకొంటూ, అయోమయం—అందవికారం అన్నట్లు తిరుగుతూ ఉంటారు. పాఠం చెబుతూఉంటే నోరు తెరుచుకొని కూర్చుంటారు. నోరు మూయాలని తెలియదు. ఇంతవిన్నా ఆ పాఠం బోధపడుతుందా, పెడుతుందా?

### నమ్మకాలు - మోసాలు

సిఫిలిస్ వారిని సులువుగా మోసగించవచ్చు. ఎవరినయినా సుళువుగా నమ్మే స్వభావం వీరిది. అవతలివాళ్ళను నమ్మి అన్నీ ఇచ్చేస్తూ ఉంటారు. నమ్మకాలు ఎక్కువగా ఉంటాయి. ఈ నమ్మకాల ఆసరాతో సైకోసిస్‌వారు వీరిని అనేక విధాల

మోసగిస్తూ ఉంటారు. భర్తలు అలా పనిపాటులకు వెళ్ళగానే కోయదొరలా మొద లయినవారి రూపంలో సైకోసిస్‌వారు ఇళ్లవెంట పడతారు. సిఫిలిస్‌కు చెందిన గృహి ణులకు ఆ కబురు, ఈ కబురూ చెప్పి, బియ్యమనీ, బట్టలనీ, డబ్బులనీ పట్టుకొని పోతూ ఉంటారు. కోయదొరలు అలా వెళ్ళగానే పాతబట్టలకు స్టీలుసామాను ఇచ్చే వారు వస్తారు. ఇంటిలోఉన్న బట్టలన్నీ తీసికొని, రెండు చిన్నచిన్న గిన్నెలను వారి చేతిలో పెట్టిపోతారు. భర్త వచ్చిన తరువాత కట్టుకునేందుకు బట్టలు లేని స్థితి వచ్చే స్తుంది. ఒంటినిండా సిమెంటుతో సిమెంటును కారుచౌకగా ఇస్తామని కొందరు వస్తారు. ఉన్నడబ్బుల్ని తీసికొని ఇంత బూడిదను సంచుల్లో ఇచ్చిపోతారు. బియ్యం చౌకగా వస్తున్నాయని చెప్పి డబ్బులతో సహా సంచినీ అందిపుచ్చుకొనేవారు వస్తారు. మళ్ళీ కంటికి కనబడకుండా పోతారు. ఇలా పనిపాటులు పూర్తిచేసికొని, భర్తలు వచ్చేలోపున సైకోసిస్‌వారి పుణ్యమా అని సిఫిలిస్ గృహిణులు ఇళ్ళను తుడిచిపెట్టు కొని కూర్చుంటారు. ఇంతలో సోరా భర్తలు ఇళ్లకు తిరిగివచ్చి జుట్టు పీక్కుంటూ గోల పెడతారు. ఇలా సిఫిలిస్‌వారు సైకోసిస్‌వారి చేతుల్లో మోసపోతూ సోరావారిని అరిపిస్తూ ఉంటారు. ఇంత జరిగిన తరువాత కూడా సిఫిలిస్ గృహిణి ఏమంటుందో తెలుసునా!—జరిగినదేదో జరిగిపోయింది. ఎవరి ప్రాప్తం వారిది, మనం ఎంత రొష్టుపడితేమాత్రం మనది కానిది మనదగ్గిర ఉంటుందా? ఈ మాటలకు సోరావారు మరింతగా రెచ్చిపోతారు. ఇలా మూడు దీర్ఘవ్యాధుల వారి ముచ్చటలూ, దినచర్య రూపంలో నడిచిపోతూనే ఉంటాయి.

రకరకాల నమ్మకాలు. ఎప్పుడూ ఏదో మంత్రం అంటారు. ఏదో తాయత్తు అంటారు. ఏదో దీక్ష అంటారు. ఏదో వ్రతమంటారు. పూజలంటారు, ఉపవాసాలు అంటారు. ఏమిటి ఈ హడావిడంతా అంటే, ఇప్పుడీ హడావిడివల్ల మీకొచ్చిన ఇబ్బంది ఏమిటి? అంటారు. దేవుడిపేరిట తరచుగా ఉపవాసాలుచేస్తారు. వారంలో 3,4 రోజులు ఉపవాసాలకే కేటాయిస్తారు. ఈ వ్యాధికి చెందినవారిలో నాస్తికులుంటే, నాస్తికత్వానికి సంబంధించిన నియమాలను వారూ అంత గట్టిగాపాటిస్తారు. వీరి చర్యలకు నేపథ్యంగా ఒక మూర్ఖత్వముంటుంది. వీరిది గాఢ భక్తికాదు, మూఢభక్తి. గాఢ విశ్వాసంకాదు, మూఢవిశ్వాసం. దానితో చాదస్తమెక్కువవుతుంది. ఎందుకో ఎలక్ట్రిక్ స్తంభం కదులుతూఉంటే దేవుడు పలుకుతున్నాడంటూ వెళ్ళి కొబ్బరికాయ కొట్టివస్తారు.

అక్కడ దేవుడు పలుకుతున్నాడంటారు. ఇక్కడ దేవుడు బదులు చెబుతున్నాండటారు. పూనకాలంటారు, ఆవేశాలంటారు. తరచు ఆయా చోట్లకు వెళ్ళివస్తుంటారు. వీళ్ళనురప్పించి దేవుళ్ళను పలికించే వాళ్ళలో కొందరు సోరా వారుంటారు. కొందరు సైకోసిస్ వారుంటారు. సోరా వారికి వస్తుతః అహంకార ముంటుంది కదా! దేవునిఎదుట కూర్చొని దిగువ మనస్సునుండి ఎగువమనస్సులోనికి వెళతారు. అక్కడనుండి దేవుడయి మాట్లాడతారు. మాట్లాడుతున్నది దేవుడుకాదు, మీరే మీ ఎగువ మనస్సునుండి మాట్లాడుతున్నారు అంటే, మీకు బోధపడింది ఇంతే నన్నమాట—అంటూ ఆగ్రహాన్ని ప్రకటిస్తారు. వ్యక్తిత్వం కరిగిపోయి, అస్తిత్వం మాత్రమే మిగిలినవేళ దైవంతోడి అనుసంధానం సాధ్యపడుతుంది. మరి వీరు వ్యక్తిత్వాన్ని వదులుకోగలరా! ఇదిపెద్దప్రశ్న. ఇక సైకోసిస్ వారుంటారు. వీరిపూనకాలూ, ఆవేశాలూ కేవలం అభినయాలు. సిఫిలిస్‌వారి నమ్మకాలను సొమ్ము చేసికొనేటందుకుగాను వీరు వేసేవేషాలు. సోరావారు అహంకారంతో తమను తాము మోసగించుకొంటూ ఉండగా, సైకోసిస్‌వారు అభినయంతో చేరవచ్చిన వారందరినీ మోసగిస్తున్నారు.

ఈ రెండు విధాలుగా కాక మానవుడి ద్వారా దేవుడు వ్యక్తమవడం అనేది ఉంటుంది. అసలు నోటులేకుండా దొంగనోట్లు పుట్టవుకదా! అయితే అవ్యక్త మవుచున్నచోట సోరా యొక్క ఆర్భాటమూ ఉండదు. సైకోసిస్‌యొక్క అభినయమూ ఉండదు. ఆర్భాటమూ, అభినయమూకాక అది అనుభూతి ప్రదంగా సాగిపోతూ ఉంటుంది. ఆ అనుభూతి చేరవచ్చిన వారి మనస్సును కరిగిస్తూ, హృదయాన్ని స్పృశిస్తూ, కావలసిన మేలుకొలుపును ఆమనిషికి అందిస్తూ సాగిపోతూ ఉంటుంది.

మూర్ఖత్వంతో కూడిన ఆవేశం సిఫిలిస్ వారిది. సోరావారి ఆవేశం వెనుక అహంకారమెంతగా ఉంటుందో, సిఫిలిస్‌వారి ఆవేశం వెనుక మూర్ఖత్వం అంతగా ఉంటుంది. చెప్పినా బోధపరచుకోరు. మాట వినిపించుకోరు. ఒకటి అనుకొన్న తరువాత అది సాధించి తీరుతారు. మొండిపట్టు పడతారు. వీరి కోపతాపాలు ఈ మూర్ఖత్వంతో కూడిన ఆవేశాలనుండి వ్యక్తమవుతూ ఉంటాయి. సోరావారు అహంకరిస్తే, సిఫిలిస్‌వారు మొండికేస్తారు. సైకోసిస్‌వారు పట్టించుకొన్నట్లు అనిపించరుగాని అంతుచూసి వదిలిపెడతారు.

సుఖ సంతోషాలు

సోరావారికి సుఖసంతోషాలను మెండుగా అనుభవించాలని ఉంటుంది గాని అందుకు కావలసిన తీరిక ఉండదు. మనస్సు తీరికగా ఉండనీయదు. కుటుంబ సభ్యులనూ, తోటివారినీ సుఖసంతోషాలలో ముంచెత్తాలని ఉంటుందిగాని, ఈ పని అయినతరువాత, ఈ పని అయిన తరువాత అని అనుకొంటూ ఉండగానే ఏళ్ళన్నీ గడచిపోతాయి. వీరికి పనిలేనిదెప్పుడు? మిగతావారు పనిలో ఉంటారు. కొందరు పనిమీద ఉంటారు. వీరివిషయంలో మాత్రం పని వీరి మీద ఉంటుంది. రైలుమీద వెళుతున్న వాడికి, రైలు తన మీదుగా వెళుతున్నవాడికీ ఎంత తేడా ఉంటుంది! సోరా వారినడిగితే తెలుస్తుంది. ప్రతిపనీ ఒక రైలుగామారి వారిమీదుగా వెళుతూ ఉంటుంది. అయితే ఓటమిని అంగీకరించరుకదా వీరు. భార్య ఎప్పుడయినా విసుక్కుంటే నీకేం తక్కువచేశాను! అన్నీ తెచ్చిపడేస్తున్నానుకదా! ఏలోటుజరిగిందని? ఈ శ్రమంతా మీకోసం కాక మరెవరికోసం?—అంటూ అరుస్తారు. ఏం తక్కువచేస్తున్నారో వారికితెలుసు. ఏం అందించలేక పోతున్నారో వారికితెలుసు. అన్నీఉన్నా సుఖ సంతోషాలననుభవించలేక పోతున్నామని వారికి తెలుసు. అయితేదానిని అంగీక రించరు. దబాయిస్తారు. మరితమ ప్రతిష్టకు భంగం కలుగకూడదు కదా!

ఇక సైకోసిస్‌వారి సంగతిచూద్దాం. ఇతరుల సుఖ సంతోషాలను హరించడం వీరికి ఆనందదాయకం. తాము చూస్తుండగా ఎవరూ సుఖసంతోషాలతో ఉండ కూడదు. తమలాగా సుఖసంతోషాలను తమతోటివారు అనుభవించకూడదు. చివరకు భార్య అయినాసరే! లేక భర్తయినాసరే! ఒకాయన కుటుంబజీవనంలో భార్యను సుఖపడకుండా చేయడమే ధ్యేయంగా పెట్టుకొన్నాడు. తెల్లవారు ఝామున పాలు రాగానే గబగబా లేచి, చిక్కని డికాషన్‌తో తాను కాఫీ కలుపుకొని, ఆ మిగిలిన డికాషన్‌లో కావలసినన్ని నీళ్ళుకలిపి ఇవతలకు వస్తాడు. తను త్రాగినంత చిక్కగా భార్య కాఫీ త్రాగడమా! అది తాను భరించగలడా! భోజనం దగ్గర కూర్చుంటాడు, పదార్థాలన్నీ ముందు ఉంటాయి. భార్యను ఏదో ఒక వంకపెట్టి అక్కడ నుండి పంపి స్తాడు అల్లప్పచ్చడి గబగబా తాను వడ్డించుకొంటాడు. మిగిలిన అల్లప్పచ్చడిలో తగు మాత్రంగా నీళ్ళను కలిపి ఆమె వచ్చేటప్పటికి బుద్ధిమంతుడయిన బాలుడిలాగ కూర్చొని ఉంటాడు. ఏదయినా ఊరు వెళ్ళదలుచుకొన్నప్పుడు ఇంటిలో ఉన్న కూరలన్నీ కావాలని ఒకటికి రెండు వండించుకొని తినేస్తాడు. ఇంటిని శివాలయంగా చేసి నేను ఊరు వెళ్ళివస్తాను. నీకు అన్నీఉన్నాయికదా? ఉండేది నీఒక్కదానివేగా!

నీక్కావలసినవి మటుకు ఏముంటాయి? అంటూ బయలుదేరుతాడు. అంతటితో ఊరుకోడు, వస్తానన్న రోజుకన్నా కొన్నిరోజులు ముందుగానే వస్తాడు. ఇంటి పరిస్థితి తాను వదిలిపెట్టినట్లేఉందా, లేక ఏమన్నా సమకూర్చుకొని తినడం జరుగుతోందా—అని చూడటానికి. రోజూ రాత్రిపూట అతడు పడుకొన్నంతసేపు ఆమె కాళ్ళుపట్టాలి. పట్టడం ఆపిన క్షణంలో అతనికి మెలుకువవస్తుంది.కనుక ఆమె అలాపడుతూనే ఉంటుంది. నిద్రకు తాదుకదా, కనీసం కునికిపాట్లు పడటానికి కూడా ఆమెకు వీలుండదు. ఇక తెల్లవారుఝామున ఆయన లేచిన తరువాత ఏకొద్దిక్షణాలో ఆమె పడుకోవడం, ఆ లోపుననే అతడు డికాషన్ కథలోనికి వస్తాడు. డికాషన్ కథకనుక లేకపోతే ఆ కాసేపుకూడ ఆమెను కునకనీయడేమో! తాను పడుకొన్నట్లు ఆమె పడుకోవడమా! అది అతడు భరించగలడా! ఇలా ఇతరుల సుఖ సంతోషాలను హరించడంద్వారా, తాము సుఖసంతోషాలను పొందాలని చూస్తారు సైకోసిస్‌వారు. సుఖసంతోషాల స్థానంలో వీరికి ఈర్ష్యాసూయలు నిలబడతాయి. వీరినుండి వ్యక్త మవుతున్న విధ్వంసమంతా దాదాపుగా ఈర్ష్యాసూయల నేపథ్యంనుండి వ్యక్త మవుతున్నదే.

ఇక సిఫిలిస్‌వారు-సుఖసంతోషాలా? అవి ఎక్కడ?ఎలా ఉంటాయవి? అసలు భూమిపైన ఉంటాయా? ఉంటాయని మన మను కొంటున్నాము. అది మనభ్రమ! అయినా ఎవరికర్మకు ఎవరు కర్తలు? ఎవరిని ఎవరు సుఖపెట్టగలరు? ఈమూన్నాళ్ళ జీవితంలో సుఖసంతోషాలను ఆశించడమేమిటి? పాపమో, పుణ్యమో తేలేదిపైన. సుఖసంతోషాలను ఆపేక్షించని జీవితాన్నే దేవుడు మెచ్చుతాడు. మనను మనం ఎంతగా శిక్షించుకొంటే, ఆయనకు అంతగా దగ్గరవుతాం—ఇలా అనుకొంటూ, సుఖ సంతోషాలను తమదగ్గరకు చేరనీయకుండా, ఇతరుల సుఖసంతోషాలకు దోహదాన్ని అందించకుండా జీవిత సన్నివేశాలను చిన్నచూపుచూస్తూ, మరణానికై వేచియున్నాము అన్నట్లుగా బ్రతుకుతూ ఉంటారు. సుఖసంతోషాలను దైవానుగ్రహంగా, ఆ దేవ దేవుని వ్యక్తవైభవాలుగా స్వీకరించాలి! అంటే వారు—తప్పు, తప్పు, అలా అనుకొంటే ముప్పు, ముప్పు—అని అంటూ లెంపలు వేసికొంటారు. సుఖసంతోషాల యెడల అస్పృశ్యత పాటించడమే ఆధ్యాత్మికత అని వీరు విశ్వసిస్తారు. అలాకాదు తనవిగా భావించినప్పుడు అది బంధం. అతనిదిగా దర్శించినప్పుడు అది మోక్షం అంటే వినిపించుకోరు.

ఇది బందరు లడ్డూ అని చేతికందించినప్పుడు ఆహా అంటూ దానిని కాంక్షతో తింటున్నాం. ఇది తిరుపతి ప్రసాదం అంటూ చేతికి అందించినప్పుడు అలాగా అంటూ కళ్ళకద్దుకొని నోటబెట్టుకొంటున్నాం. ఈ సుఖసంతోషాలను మనం సాధించుకొంటున్నాం అన్నప్పుడు అవి కోరికలయి కదులుతాయి. కాంక్షలయి రగులుతాయి. ఈ సుఖసంతోషాలు దైవం మనకు తన అనుగ్రహంగా అందిస్తున్నా డన్న దర్శనం అందినప్పుడు మనలో కృతజ్ఞత కలుగుతున్నది. ఆరాధన పెరుగు తున్నది. ధర్మదృష్టి అప్రయత్నంగా అలవడుతున్నది. ధర్మదృష్టి అంటే ఏమిటి? సుఖసంతోషాలను అతడి ప్రకారం, అతడుద్దేశించిన ప్రకారం గతి తప్పకుండా అనుభవించగలగడం! ముట్టుకొంటే గతి తప్పుతామేమోనని, వాటికి దూరంగా ఉండడమూ భావ్యంకాదు. అదేపనిగా వాటిని అనుభవిద్దామని స్వతంత్రించడమూ పద్ధతికాదు. ధర్మమెప్పుడూ అటూ ఉండదు, ఇటూ ఉండదు. మధ్యలో ఉంటుంది– త్రాసుకు ముల్లులా! కనుకనే కర్మాచరణంలో కౌశలమే యోగమని శ్రీకృష్ణుడు గీతలో ప్రవచించాడు. ఆ కౌశల మేమిటన్నది అతడు తన ఆచరణలో చూపాడు.

### దాంపత్యానుభవం

సోరావారికి దాంపత్యానుభవం ఒక కాంక్ష. కాంక్ష ఎక్కువ. తృప్తితక్కువ. ఆరాటమెక్కువ. అనుభూతి తక్కువ. శరీరానికి అంతాగా సామర్థ్యముండదు. మనస్సుకు ఎంతకూ తృప్తి దొరకదు. ప్రక్కదారులు వెతుకుతారు. దీనితో బాటుగా తనదికానిది తనది కావాలి అన్నమానసిక కాంక్షకూడ ఈ దారులు వెతకడానికి ఒక కారణమవుతుంది. మొత్తం మీద దాంపత్యానుభవానికి సంబంధించిన అసంతృప్తి ఒకటి సోరాకు చెందిన చాలా మందిలో మనకు గోచరిస్తుంది.

సైకోసిస్ వారిలో దాంపత్యానుభవం వక్రతను చెందుతుంది. సైకోసిస్‌కు చెందిన చిన్నపిల్లలలో కాముకత కనిపిస్తుంది. చాలా చిన్న వయస్సులోనే వీరు కామోద్రేకాన్ని పొందుతారు. స్నానాలవీ జరుగుతున్నప్పుడు చాటుగా సందులలో నుండి చూస్తూఉంటారు. స్కూళ్ళలో చదువుతున్నప్పుడు టీచర్లనే ఆ భావనతో చూడగలవారున్నారు. అయిదవ తరగతి చదువుతున్న కుర్రవాడు, మూడవ తరగతి చదువుతున్న అమ్మాయికి ప్రేమలేఖ వ్రాశాడు. ఇదిమనం ఊహించగలమా! సైకోసిస్ చర్యలు ఇలా మన ఊహలకు కూడా అందవు. అలాగే వయస్సు ఉడిగి పోయిన తరువాతకూడా శరీరం దాంపత్యానుభవాన్ని కోరుతుంది. మందుకని వచ్చిన ఒక డెబ్బయి ఏళ్ళముదుసలి 'బాబూ! ఈ మందుకు స్త్రీపథ్యం ఉంటుందా' అని

అడిగాడు ఇదేమి పథ్యం-ఇతడడుగుతున్నది! అనిపించింది మొదట. ఆ తరువాత బోధపడింది. స్త్రీ పథ్యం ఉంటుంది అంటే మందు మానివేసేటట్లున్నాడు. అందుకని ఏమీ అనలేదు. నవ్వి ఊరుకొన్నాను. మౌనమర్థాంగీకారమని అనుకొని అతడు అర్థాంగి వైపుగా సాగిపోయాడు.

ఇక సిఫిలిస్‌వారు, వీరి దాంపత్యానుభవం చిత్రమైనది. అది కూడనిది అనిపిస్తుంది. అయినా తప్పదుకదా అనిపిస్తుంది. జీవిత భాగస్వామి కొరకయినా అందులో పాల్గొనాలికదా అనిపిస్తుంది. మనకు ఇష్టం లేకపోయినా వారిని ఇబ్బంది పెట్టకూడదుకదా- అనిపిస్తుంది. సరిపెట్టు కొన్నట్లు ఉంటుంది. తప్పదుకాబట్టి అన్నట్లు ఉంటుంది. ఏమయినా అదితప్పు అనిపిస్తుంది. ఆ అనుభవం లేకుండా ఉండలేక పోవడ మన్నది ఒక బలహీనతే ననిపిస్తుంది. దైవం దీనిని మెచ్చడు అపిసిస్తుంది. పడక గదులలో దేవుడి ఫొటోలు ఉండకూడదు అనిపిస్తుంది. తప్పుచేస్తున్నదీచాలక ఆయనముందు చేయడమా అనిపిస్తుంది. దాంపత్యానుభవం తరువాత శరీరాన్ని శుద్ధిచేసికోవాలని పిస్తుంది. ఒక పెద్దామె ప్రొద్దున్నే గదినుండి బయటకు వస్తున్న కొడుకూ, కోడళ్ళను ఆగండి అనిచెప్పి, నిలువుగా నీళ్ళల్లో ముంచెత్తేది. పాపం క్షమించుగాక అని అనుకొని; ఇక ఇప్పుడురండి అన్నట్లుగా చూసేది. ఆహారస్వీకరణ విషయంలోగాని, దాంపత్యానుభవ విషయంలోగాని రుచిని అనుభవించడం దోషమనీ; పాపమనీ వీరికి అనిపిస్తుంది. అరుచులకు ఎంతదూరంగా ఉంటే అంతమంచిది అని వీరికి అనిపిస్తుంది.

సోరావారు ఉన్నదానితో తృప్తిపడలేక పోతుండగా, సైకోసిస్ వారు వయస్సుల తారతమ్యాన్నీ, వావి వరుసలను కూడ మరచిపోతున్నారు. ఇక సిఫిలిస్‌వారు ఉన్నదీ కూడ ఉపేక్షింపబడవలసిందే నంటున్నారు.

అసలింతకూ ఏది ఎందుకు ఉన్నది-అన్నది వీరెవ్వరూ ఆలోచించలేక పోతున్నారు. ఆహార స్వీకరణమున్నది శరీరం నిలబడేటందుకు. దాంపత్యానుభవమున్నది మన తరువాతి తరం నిలబడేటందుకు! ఆహార స్వీకరణం మనను నిలబెడుతూ ఉండగా, దాంపత్యానుభవం మన తరువాతి తరానికి రూపుదిద్దుతూ ఉన్నది. ఈ రెండు అంశాలూ కూడా పరమపవిత్రంగా నిర్వహించుకోవలసినవి. ఇవి అవుననవలసినవీ కావు. కాదనవలసినవీ కావు. ప్రకృతి నిర్దేశానుసారం నిర్వహించవలసినవి.

ఆహార స్వీకరణంలో ఎక్కువ తక్కువలు జరిగినప్పుడు శరీరం గతి తప్పుతుంది. దాంపత్యానుభవంలో ఎక్కువ తక్కువలు జరిగినప్పుడు తరువాతి తరం దెబ్బతింటుంది. నిజానికి ఇవి రెండూ మన కొరకు నిర్వహింపబడుతున్నవి కావు. మన చేత, సృష్టి కొరకు నిర్వహించబడుతున్నవి. కనుక వీటి యెడల మన ప్రకారం ప్రవర్తించకూడదు. మన ప్రకారం ప్రవర్తిస్తే అది అధర్మమవుతుంది. సృష్టి ప్రకారం ప్రవర్తిస్తే అది ధర్మమవుతుంది.

ఇలా దర్శించినపుడు దాంపత్యానుభవాన్ని వద్దు అనడం అధర్మమే. దానినొక కాంక్షగా రూపొందించుకోవడమూ అధర్మమే! వద్దు అన్నప్పుడు తరువాతి తరం ఉండరు. కాంక్షగా రగిలి గతితప్పినప్పుడు తరువాతి తరాలు మైలపడతాయి. సోరా వారు అలా గతి తప్పుతూ తెచ్చుకొంటున్నవే కదా ఈ సైకోసిస్, సిఫిలిస్ మొదలయినవి. దాంపత్య ధర్మాన్ని సోరావారు మైలపరచగా, మైలపడిన మానవజాతి సైకోసిస్‌గా ఎలా వర్తిస్తున్నదీ, సిఫిలిస్‌గా ఎలా వర్తిస్తున్నది అన్నది మనమింత వరకు చూస్తూ వచ్చాం గదా! తాము పొందినది చాలక, తమ తరువాతి తరాలకు వారసత్వంగా వారు ఎలా అందించగలుగుతున్నదీ అర్థం చేసికొంటూ వస్తున్నాం కదా! ఇది చాలదా, దాంపత్య ధర్మాన్ని పవిత్రంగా నిర్వహించుకోవడం అవసరమని గ్రహించడానికి! ఇంతకంటె దాఖలాలు ఇంకేమి కావాలి!

దాంపత్యధర్మం పవిత్రంగా నిర్వహింపబడిన వేళ తరువాతి తరం నిలబడటమనే ప్రయోజనంతో బాటుగా అద్వైతస్థితిని అనుభవించగలగటమనే పరమార్థం కూడా మనకు సిద్ధిస్తుంది. మన ఇరువురము ఇరువురము కాదు నిజానికి ఒక్కరమే!- అన్న దివ్యానుభూతిని అందుకొనడానికి దాంపత్యమొక మహత్తరమయిన అవకాశమే కదా! ఆదీ దంపతులయి, వేద దంపతులయి మనం వర్తిల్ల గలిగిన వేళ అనుభవానికి వచ్చే ఆ దివ్యానుభూతి కొరకే కదా, ప్రకృతి మనను దంపతులుగా రూపొందిస్తున్నది! ఆలోచించండి. ఒక్కసారి ఆ లోచనాన్ని తెరచి చూడండి! తరచి చూడండి.

తరాల అంతరాలు

సిఫిలిస్‌లో మొదటి తరాలలో ఒక చిత్రం కనిపిస్తుంది. ఒక వయస్సు వరకూ ఒక వెలుగు వెలిగి ఆటుపైన మనస్సు తన శక్తియుక్తులను కోల్పోతుంది. కరెంటు పోయినట్లు అవుతుంది. బ్యాటరీ డిస్‌చార్జ్ అయినట్లు అవుతుంది. చదివినవి గుర్తుండవు. చేసినవి గుర్తుండవు. అంతవరకూ గొప్ప వైద్యుడిగా పేరుపడినవారికి

ఇప్పుడిక అశక్తత వస్తుంది. ఇంతవరకూ వైద్యం చేసింది నేనేనా అనిపిస్తుంది. అంతవరకూ పెద్ద ప్లీడరుగా ఫైలు నడిపిన వారికి అంతలోనే అశక్తత ఆవరిస్తుంది. పుస్తకాలు తెరిచి చూస్తే, అంతా క్రొత్తగా ఉన్నట్లు ఉంటుంది. ఇలా ఒక వెలుగు వెలిగి, అటుపైన ఆ వెలుగు తగ్గిపోయే వారుంటారు. ఏదో అలా నామ మాత్రంగా తిరుగుతూ ఉంటారు. వీరికి గనుక సరి అయిన హోమియో చికిత్స జరిగితే సిఫిలిస్ తొలుగుతుంది. వెలుగు మళ్లీ వెలుగుతుంది.

తరం దాటుతున్న కొద్దీ స్థితి మారుతుంది. వయస్సుతో పాటు శరీరం ఎదుగుతుంది తప్ప మనస్సు ఎదగదు. వయస్సుకు తగిన తెలివితేటలుండవు. వయస్సుకు తగిన భావ ప్రకటన ఉండదు. వయస్సుకు తగిన ప్రవర్తనా, పద్ధతులు ఉండవు- వయస్సుకు తగిన మానసిక ప్రవర్తన అంతగా వికసించని స్థితి!

తరువాత తరాలలో ఇంకొక రకమయిన స్థితి. శరీరం పెరుగుతుంది. మనస్సుకూ శరీరానికీ శ్రుతి ఉండదు. తొందరగా బోర్లాపడరు. ప్రాకరు. నడవరు. అన్నీ ఆలస్యం. మాటలు ఎప్పటికోగాని రావు. పెద్ద మాటలు పలుకలేరు. ఏ పనులు ఎలా చేసికోవాలో ఎప్పటికోగాని తెలియదు. ఈ లోపున చెప్పినా అర్థం కాదు.

తరం మారుతున్న కొద్దీ మరొక స్థితి. శరీరానికి పెరుగుదల ఉంటుంది. కాని సరిగ్గా ఉండదు. మనస్సు దాదాపు జడత్వాన్ని పొందుతుంది. వయస్సు వచ్చేస్తూ ఉంటుంది. వాళ్లు మాత్రం చిన్నపిల్లల లాగానే ప్రవర్తిస్తూ ఉంటారు. నలభై ఏళ్ళ వయస్సులో ఉండి, నాలుగేళ్ళ పిల్లలతో గోళీలాట లాడతారు. చూడమ్మా వాడు నా గోళీ లాక్కుంటున్నాడు-అంటూ ఏడుపు ముఖంతో వచ్చి తల్లికి ఫిర్యాదు చేస్తారు. ప్రతి చిన్నదానికీ పిల్లలతో పేచీలు పడతారు. వాటాలు కోరుతారు. పోటీలు పడతారు. ఏవో రంకెలు వేస్తూ ఉంటారు. కుక్కపిల్లల్లాంటి వాటితో స్నేహం చేస్తూ కాలం గడుపుతారు. ఇంతవరకూ చెప్పిన ఈ స్థితులన్నీ కూడా హోమియో వైద్యాన్ని పొందినప్పుడు చాలా వరకు దారిలోకి వస్తాయి.

చివరకు ఇంకొక స్థితి ఉంటుంది. మనస్సు ఆమాత్రం కూడా మేల్కొని స్థితి అది. మానసిక శక్తియుక్తులకు సంబంధించిన కేంద్రాలు ఏర్పడి పనిచేయడంలేదా, అసలు ఏర్పడనే లేదా అని అనుమానించే పరిస్థితి. వయస్సు వచ్చేస్తూ ఉంటుంది. మాటలురావు-పిచ్చిగా చూస్తూ ఉంటారు. ఆకలితప్ప ఇంకేమీ తెలియదు. ఆకలి అయినప్పుడు ఏడుస్తారు. మలమూత్ర విసర్జనలకు పద్ధతి తెలియదు. ఎక్కడుంటే అక్కడే. ఇది ఒక శాపగ్రస్థమయినస్థితి. సర్వసామాన్యంగా వీరు ఇరవై సంవత్స

రాలలోపు శరీరాన్ని విడిచిపెడతారు-మా శాపం ఇప్పటికి పూర్తయింది!-అన్నట్లుగా. కొందరు హోమియో వైద్యంద్వారా మనస్సు మేల్కొని శాపంనుండి బయటపడ తారు. అంటే వారికి ఈ దేహంలో ఉండగానే శాప విమోచనం కలుగుతున్నదన్న మాట! ప్రకృతి అందుకు అంగీకరించిందన్నమాట! సిఫిలిస్‌లోని ఈ స్థితుల వారందరికీ చాలా చిన్నవయస్సునుండీ హోమియో వైద్యం జరగడం అవసరం. వెన్ను ముదర కూడదు. కొందరు వైద్యులు ఇది తెలియక వయసు వచ్చినకొద్దీ అదే సర్దుకోవచ్చు-అని కాలక్షేప వైద్యం చేస్తారు. అది తప్పు. ప్రయత్నం చిన్నప్పటినుండీ జరగాలి. హోమియోలో తప్ప దీనికి చికిత్సలేదు.

మూడు దీర్ఘవ్యాధులవారుకూడా చివరి తరాల దగ్గరకు వచ్చేటప్పటికి గర్భ స్రావాలకు గురి అవుతూ ఉంటారు.కారణం తెలియదు. వైద్యులు కాపలాలు కాస్తుం టారు. ఇంతలో గర్భం పడిపోతూ ఉంటుంది. సరిఅయిన హోమియో చికిత్స జరిగి నప్పుడు ఈ దుస్థితులు సర్దుకొంటాయి. శరీరానికి రూపకల్పన పూర్తిచేయలేనిస్థితికి దీర్ఘవ్యాధులు వీరిని తీసికువస్తున్నాయన్నమాట. ఇప్పుడు కాపలాలుకాదు కావలసి నది. సరైన హోమియో చికిత్సద్వారా దీర్ఘవ్యాధి నివారణ!

విశ్రాంతి-విహారాలు

సోరా వారికి విశ్రాంతి విహారాలు కూడా ఆరాట పోరాటాలే! సైకోసిస్ వారికి విశ్రాంతి విహారాలు కుట్రలకు కుతంత్రాలకు అవకాశాలు. సిఫిలిస్ వారికి విశ్రాంతి విహారాలు విషాదానికి విరక్తికి నిలయాలు.

సిఫిలిస్ వారు ఎక్కువగా గుడిగోపురాలకు, తీర్థయాత్రలకు వెళుతూ ఉంటారు. భక్తిప్రపత్తులు ఉంటాయి. అయితే విషాదంతో కమ్మబడటం వలన ఆనందానుభూతికి బదులుగా విషాదానుభూతి కలుగుతుంది.

నిద్ర-తీరుతెన్నులు

సోరావారు మానసికమైన ఒత్తిడి వలన సరిగా నిద్రపోరు. సైకోసిస్ వారు రాత్రులను వ్యూహ రచనతో గడుపుతారు. సిఫిలిస్ వారికి నిద్ర ఆలాపనగా ఉంటుంది. పోయినట్లూ కాదు, పోనట్లూ కాదు. అందులోనూ నడిరేయి వరకూ మరీను. పడుకోవాలి కాబట్టి పడుకున్నామన్నట్లు ఉంటుంది.

కలలు, ఆ ఆలాపనలోనే కలలు. దేవుళ్ళూ, పూజల దగ్గర నుండి మర ణాలూ, దుఃఖాల వరకు. ఇలా మంచి కలలూ రావచ్చు, పీడకలలూ రావచ్చు నమ్మ కాలూ-విశ్వాసాల కలలుగా రూపొందుతూ ఉంటాయి.

## ఉన్మాద స్థితి

ఉన్మాద స్థితిలో సోరావారు అరుపులూ, పెడబొబ్బలూ పెడతారు. సైకోసిస్ వారు భయాలకూ, భ్రాంతులకూ లోనవుతారు. సిఫిలిస్‌వారు సణుగుతారు. గొణుగుతారు. సోరావారు మనని దడిపించాలని చూస్తారు. సైకోసిస్‌వారు హతమార్చాలని చూస్తారు. సిఫిలిస్‌వారు విరక్తిని ప్రకటిస్తారు. సోరావారిది కోపం, సైకోసిస్ వారిది పగ. సిఫిలిస్‌వారిది విరక్తి. సోరావారు భయపెడతారు. సైకోసిస్‌వారు భయపడతారు. సిఫిలిస్‌వారు తమలో తాముంటారు.

ఉన్మాదస్థితి అంటే ఇంతకూ ఏమిటి? జీవిత సన్నివేశాలను ద్రోహదంగా తీసికొని, దీర్ఘవ్యాధులు హెచ్చిన స్థితి. దీర్ఘవ్యాధులు రెచ్చిన స్థితి. దీర్ఘవ్యాధుల వలన మనస్సు అలజడి చెందుతున్న స్థితి. సంక్షుభితమవుతున్న పరిస్థితి.

ఇలాంటి స్థితులలో వారికి రక్షణ కావాలి. అటుపైన వారికి హోమియో వైద్యం జరగాలి. హోమియో వారి మనస్సును క్రమబద్ధం చేస్తుంది. లయబద్ధం చేస్తుంది. వారిని మళ్ళీ మామూలు మనుషులుగా, ఇంకా చెప్పాలంటే ఇదివరకటికన్నా మిన్నగా నిలబెడుతుంది.

అలాగాక వారికి నిద్రమాత్రలు అందించి, షాకులు అంటించడంవల్ల వారి మనస్సు అణగిపోతుంది. స్తబ్దత చెందుతుంది. వారు జీవచ్ఛవాలవుతారు. వారివల్ల వారి బంధువులకు కలుగుతున్న ఇబ్బందిని ఇలా తప్పించగలుగుతున్నారు తప్ప, వ్యాధిగ్రస్తులను వ్యాధులనుండి బయట పడవేయలేకపోతున్నారు. ఇంతకూ ఇది అణచిపెట్టడంకదా, మళ్ళీ రావడానికి అవకాశముంటుంది. ఆ రావడమే జరిగితే అది చాలా తీవ్రంగా ఉంటుంది. మాట వినడం కష్టమవుతుంది. ఇలా ఈ మోటువిధానం వల్ల రాక్షస పద్ధతిలో ప్రవర్తించి, రోగార్తులను జీవచ్ఛవాలుగా రూపొందించడం కన్నా, వారికి తగిన రక్షణను కల్పించి, హోమియో చికిత్సద్వారా వారిని సరిజేసి నిలబెట్టడం అన్నివిధాలా ఉత్తమం. మానసిక వైద్య నిపుణులు ఈ అవకాశాన్ని గమనించుకోవాలి. సద్వినియోగం చేసికోవాలి. మోటుగా గతానుగతికంగా వెళ్ళిపోకూడదు. కావలసిన పరిష్కారంకోసం అన్నివైపులకూ చూడగలగాలి. విశ్లేషించినంతసేపు విశ్లేషించి, చివరకు నిద్రమాత్రలు చేతబెడితే అంతవరకూ మనం చేసిన విశ్లేషణకు అర్థమేమిటి? పరమార్థమేమిటి? నేటి మనస్తత్వ శాస్త్రం విశ్లేషణవరకు ఎదిగింది తప్ప పరిష్కారంపైపుకు చూడలేకపోతున్నది. హోమియోలో ఉన్నది ప్రయోజనాత్మకమైన మానసిక విశ్లేషణ! పరిష్కారాన్ని చూపుతున్న విశ్లేషణ ఇది!

పరమార్థాన్ని మనకు సాధించిపెడుతున్నది. దీనిని అందుకొని సద్వినియోగం చేయ గలగడం మనందరికీ కర్తవ్యం!

## విజ్ఞానమయ కోశం

విజ్ఞానానికి విషాదం కమ్ముతుంది, మూర్ఖత్వం ఆవరిస్తుంది. దానితో వీరు మార్పుకు అంగీకరించరు. తమకు తోచిందేతప్ప, ఒకరు చెప్పింది వినరు. ఎవరు ఎంత చెప్పినా, విన్నట్లు ఉంటారు. కాదనకుండా వింటారు. చివరకు తామనుకొన్నదే చేస్తారు.

దీనితో వీరిని విజ్ఞానం నడిపించదు. విషాదం నడిపిస్తుంది. విజ్ఞానమయకోశం చేతిలో ఉండదు వీరిమనస్సు, విషాదయోగానికి లోనయి ఉంటుంది. విధేయతను కనబరుస్తారు గాని, విన్నపాపానపోరు. పెద్దలను గౌరవిస్తారుగాని, వారి ఉపదేశాలను స్వీకరించలేరు. ధర్మజ్ఞులను సంప్రదిస్తారుగాని, ధర్మ మర్మాలను చెవిని పెట్టరు. చివరకు అందరినీ వీరు అడిగేది ఒక్కటే. మేమిది అనుకొంటున్నాము. దీనిపైన మీరందరూ ఆమోదముద్రవేయండి! మా ఆలోచనను మీ సంకల్పంగా భావించి, కృతకృత్యులము కావాలని ఆశీర్వదించండి! మేమనుకొంటున్నదే ధర్మమని మీరందరూ గొంతెత్తి ఘోషించండి!—అన్నట్లు చూస్తారు. అన్నట్లుచేస్తారు.

సోరావారు అహంకారంతో మరొకరిమాట వినరు. సైకోసిస్‌వారు అనుమానంతో మరొకరిమాటవినరు. సిఫిలిస్‌వారు మూర్ఖత్వంతో మరొకరిమాట వినరు. సోరావారు విననట్లు కనబడతారు. సైకోసిస్‌వారు విన్నట్లు నటిస్తారు. సిఫిలిస్ వారు వినీ విననట్లు ఉంటారు.

## ఆనందమయ కోశం

దినచర్య ఆనందమనిపించదు. జీవితాన ఆనందం కనిపించదు. వైరాగ్యం పేరిట విషాదం వ్యక్తమవుతూ ఉంటుంది. నిజానికి వీరికి ఉన్నది విషాదమేగాని వైరాగ్యంకాదు. వైరాగ్యం వల్ల లభించేది పూర్ణస్థితి. విషాదంవల్ల వీరికి లభిస్తున్నది శూన్యస్థితి!

వీరిలో మమకారం నశిస్తున్నది. అపేక్షలు అడుగంటుతున్నాయి. ఆదరాభి మానాలకు బదులు నిరాశా, నిస్పృహలు వ్యక్తమవుతుంటాయి. వైరాగ్యం వల్ల ఇలా జరుగదు. మమకారమనే గొంగళిపురుగు ప్రేమఅనే సీతాకోక చిలుకగా రూపొందు తుంది. కొందరేనావారు అనే స్థితినుండి అందరూ నావారేనన్న అనుభూతి కలుగు తుంది.

నేను ఎవరికీ చెందను అంటే విషాదం. నేను ఎవరికి చెందనూ! అంటే అది వైరాగ్యం. ముడుచుకొంటే అది విషాదం. వికసిస్తే అది వైరాగ్యం. మొగ్గగా మాడిపోతే అది విషాదం. పువ్వుగా పరిమళిస్తే అది వైరాగ్యం! నీరసింపజేస్తుంది విషాదం. నిండుదనమిస్తుంది వైరాగ్యం! నీకేమున్నది అంటుంది విషాదం. నీవుగాక ఇంకేమున్నది! అంటుంది వైరాగ్యం!

వైరాగ్యమొక పూర్ణస్థితి. పరిపూర్ణ స్థితి! అది ఒక నిండుదనం. ఒక పచ్చదనం. ఈ భూమిని దేవుని రాజ్యంగా దర్శింపజేసి, దినచర్య రూపంలో అనుక్షణం అతనిని ఆరాధింపజేసే ఒక మహోన్నత వైభవం! కర్తవ్య నిర్వహణ జరుగుతూ ఉండగా, ఆ సమయాన మనస్సు దేవునియందు కరుగుతూ ఉండగా తాదాత్మ్యస్థితిని నిండుగా అనుభవానికి తెచ్చే అపురూపమయిన అవకాశమే వైరాగ్యం!

నిరాశా నిస్పృహలకు అక్కడ చోటులేదు. మూలుగులూ, నిట్టూర్పులూ అక్కడ వినిపించవు. తానుకానిది ఏదీ అక్కడ కనిపించదు. అంతా తానై విహరించే ఆత్మారామస్థితి అది. మనస్సు, ఇంద్రియాలు, దేహం, బంధువులు, మిత్రులు, అయిన వారు, కానివారు అందరూ ఒక్కటిగా, ఆ ఒక్కడిగా అనుభవానికొచ్చే స్వస్వరూప అనుభవమది. విశ్వరూప సందర్శన మది!

అది వ్యాధుల ద్వారా పొందవలసినదికాదు, సాధన ద్వారా అందుకోవలసినది! దైవానుగ్రహవశాన అనుభవానికి రావలసినది.

పతనొ్ట్టే విషాదానికీ, విలబెట్టే వైరాగ్యానికీ ఎంత తేడా ఉన్నది! గమనించారుకదా!

# ట్యూబర్క్యులార్....

సోరాచేత అంటుబడిన మానవుడు మలేరియా వ్యాధికి గురిఅయి, దానిని మరల మరల అణచిపెట్టగా ట్యూబర్క్యులార్ దీర్ఘవ్యాధి రూపుదిద్దు కొంటున్నది.

ఈ వ్యాధికి చెందిన వారిలో నేపథ్యంగా సోరా మాత్రమేగాక, కొందరిలో సోరాతోబాటుగా సిఫిలిస్, కొందరిలో సోరాతో బాటుగా సైకోసిస్ గోచరిస్తూ ఉంటుంది.

తరాలు నడుస్తున్న కొద్దీ ఈ వ్యాధి అకాలమరణాలను కలిగిస్తుంది. మన చెంతకు వచ్చిన వ్యాధిగ్రస్తుల వారసత్వంలో అకాలమరణాల ప్రసక్తి అధికంగా ఉన్నప్పుడు వారు ఈ వ్యాధికి చెందినవారయి ఉంటారు.

## అన్నమయ కోశం

సర్వ సాధారణంగా వీరు సన్నగా ఉంటారు. బక్క పలుచగా, ఎదురురొమ్ము అర్చుకుపోయి కనబడతారు. తిన్నగా నిలబడలేనిస్థితి. కొద్దిరోజులు కొంచెం కోలుకున్నట్లు కనబడతారు. మళ్ళీ అంతలోనే వడలిపోతారు. జీవకళ నిలబడదు.

ఉండుండి బరువు తగ్గిపోతారు. కొందరిలో నరాలు, కండరాలుకూడా హరించి పోతూ ఉంటాయి. కొందరిలో బొమికలుకూడా హరించిపోతూ అస్తిపంజరాన్ని కృంగదీస్తాయి. ఇలా శరీరంలోని అవయవాలు కృశించి, హరించి, నశించిపోయే స్థితికి వస్తూ ఉంటాయి. ఈ వ్యాధి సోకినవారిలో ఊపిరితిత్తులు మాత్రమే దెబ్బ తినాలనిలేదు. శరీరంలోని ఏ భాగమయినా దెబ్బతినిపోవచ్చు. కనుక హెచ్చరికతో గమనించాలి.

ఊపిరితిత్తులు కూడ రెండువిధాలుగా దెబ్బతినవచ్చు. ఆస్తమావంటి వ్యాధిస్థితి కలుగవచ్చు. లేదా క్షయవంటి దారుణస్థితి ప్రాప్తించవచ్చు. శరీరంలోని ఏదో ఒక భాగంపైన క్యాన్సరు వంటిస్థితి బయట పడవచ్చు. అకాల మరణానికి దారితీసే రకరకాల వ్యాధి స్థితులు సంప్రాప్తం కావచ్చు.

రకరకాల క్షీణదశలు. అంతలోనే వ్యక్తమయి,అంతలోనే విజృంభించగలిగిన వ్యాధి దశలు. చూస్తుండగానే మనుషులు జారిపోతారు. మృత్యువు కౌగిలిలోనికి చేరిపోతారు. వైద్యులు ప్రత్యేకమయిన శ్రద్ధతో గమనించవలసిన వ్యాధిస్థితులు వీరివి. రోగార్తులు కూడ ఏమాత్రం తేడాచేసినా అశ్రద్ధ చేయకూడదు. వైద్యుని వెంటనే కలుసుకోవాలి!

మలేరియా జ్వరాన్ని మరల మరల అణచిపెట్టడం వలనకదా మానవజాతి ఈ స్థితి గతులను కొనితెచ్చుకొంటున్నది. మలేరియా జ్వరాన్నేగాదు, మరే జ్వరాన్ని కూడా మనం అణచిపెట్టకూడదు. ఏవేదనను కూడా అణచివేతకు గురిచేయకూడదు. అణచివేతను చేపట్టడంవలన దీర్ఘవ్యాధులు రూపొందుతున్నాయి, ముదురుతున్నాయి, దేహాలు శిథిలమయిపోతున్నాయి.

### ప్రాణమయ కోశం

వీరిలో చాలా మందికి తరుచుగా జలుబులు, తుమ్ములు, జ్వరాలు, దగ్గులూ కనబడతాయి. ఆహార విహారాలలో ఏమాత్రం తేడావచ్చినా, వాతావరణ పరిస్థితులు కాస్తంతమారినా జ్వరంపైకి ఉబుకుతూ ఉంటుంది. జ్వరంతోబాటు చలికూడా ఉండవచ్చు. శ్వాసకోశ బాధలు వీరిలో ఎక్కువ. అజీర్ణస్థితులుకూడ ఎక్కువగానే కనబడతాయి. ఆహారం ఒంటబట్టదు. కావలసిన ఓపికా అందదు. శరీరం వ్రేలాడుతూ ఉంటుంది. శ్రమపడలేరు. బరువులు మోయలేరు. ఎక్కువదూరం నడవలేరు. క్రమక్రమంగా ప్రాణశక్తికి శరీరాన్ని నిలబెట్టడమే కష్టంగా అనిపించే స్థితి గతులు వస్తాయి. ఇక పనిపాటలకు అవకాశమెక్కడ? చిన్నవయస్సునే కళ్లజోళ్లు మొదలయినవి అవసరమవుతాయి. రక్తప్రసరణలో ఎగుడుదిగుడులు అదే పనిగా గోచరిస్తాయి.

### చిత్రమయిన లక్షణం

ఈ వ్యాధికి చెందిన పిల్లలలో ఎక్కువమంది చాలా తెలివిగలవారుగా కన బడతారు. మాటలు కోటలు దాటుతూ ఉంటాయి. దేహాలు మాత్రం గడపలు కూడా దాటలేనంత దుర్బలంగా ఉంటాయి. పిల్లల తెలివితేటలను చూచి తల్లిదండ్రులూ, బంధుమిత్రులూ మరీమరీ మురుసుకొంటూ ఉంటారు. ఏమి తెలివితేటలు, ఏమి తెలివి తేటలు! కాకపోతే తీరని ఈ అనారోగ్యమొకటి ఇలా ఉండి పోయింది గాని—అని అనుకొంటూ ఉంటారు. చాలా జాగ్రత్తగా ఉండాలి. ఆరే దీపానికి వెలుగెక్కువ

అనే స్థితిగతులు వీరివి! ఏ మాత్రం అశ్రద్ధ చేసినా, ఏదో ఒక రూపంలో వ్యాధి బాధలు ముంచుకు వచ్చి, పుటుక్కున శరీరాన్ని విడిచిపెట్టగలరు.

ఈ వ్యాధిలో ఒక చిత్రమైన లక్షణముంది. మనస్సు వికాసవంతంగా ఉంటే వ్యాధి దేహప్రాణాలను తినేస్తూ ఉంటుంది. దేహప్రాణాలు సజావుగా ఉంటే వ్యాధి మనసు పైపుకు మొగ్గి ఉన్మాద స్థాయి వరకు తీసికొని వెళ్లగలుగుతుంది. ఈ చిత్రమయిన ఏర్పాటు ప్రాణశక్తి వల్ల జరుగుతుంది. పరిస్థితిని బట్టి ప్రాణశక్తి ఇటు దేహప్రాణాలను గాని, అటు మనస్సూ, ఆపై కక్ష్యలను గాని వ్యాధికి అప్పగిస్తుంది. అలా అప్పగించక తప్పని పరిస్థితి ఏర్పడుతుంది.

ముఖ్యంగా వ్యాధి ఇక నివారణ కాదు అన్న స్థితిలో ప్రాణశక్తి వ్యాధిని మనస్సు పైపుకు నెట్టి, దేహ ప్రాణాలను అలా నిలబెట్టి కొంతవరకయినా మనిషిని బ్రతికిద్దాము అన్న ప్రయత్నం చేస్తుంది. తప్పనిసరి పరిస్థితులలో వ్యాధి అలా పైకి నెట్టబడినప్పుడు అది ఉన్మాద స్థితిగా రూపొందుతుంది. ఆ స్థితిలో దేహ, ప్రాణాలు మాత్రం లక్షణంగా ఉన్నట్లు కనిపిస్తాయి. పిచ్చివాడికి బలం ఎక్కువ అన్నట్లు కూడా ప్రవర్తిస్తారు.

ఈ స్థితిలో హోమియో చికిత్స ప్రారంభించవలసి వచ్చినప్పుడు వైద్యుడు మెలకువతో ప్రవర్తించాలి. తగిన మందును వేయగానే వ్యాధి మనస్సును వదిలిపెట్టి, దేహ ప్రాణాలను ఆక్రమించే ప్రమాదముంది. అంటే మనస్సు చక్కబడటం ప్రారంభిస్తుంది. దేహ ప్రాణాలు క్షీణించడం ప్రారంభిస్తాయి. వైద్యునికి ఒడుపు తెలియాలి. మనస్సు నుండి దిగివస్తున్న వ్యాధి దేహప్రాణాలను ఆక్రమించకుండానే బైటకు నిష్క్రమించేటట్లు చేయగలగాలి! సైంధవుడి శిరస్సును క్రిందపడకుండా చూస్తూనే, చేర్చవలసిన చోటికి చేర్చారు చూడండి. అలాంటి ఒడుపును చూపాలి! దేహ ప్రాణాలు దెబ్బతిన కూడదు, వ్యాధి మాత్రం బైటకు వెళ్ళిపోవాలి.

## మనోమయ కోశం

మనస్సుకు పద్ధతి ఉండదు, నిలకడ ఉండదు. నిరంతరం మార్పును కోరుతుంది. కుదురులేని స్థితిని అనుభవిస్తుంది. వీరిని విశ్వసించడానికి వీలులేదు అనిపిస్తుంది. తమ స్థితిని గూర్చి తామే నమ్మకంగా చెప్పలేరు. ఇక వారిని విశ్వసించడం అది మన తప్పు అవుతుంది.

### కూడని చొరవ

ఇవి మన వస్తువులు, ఇవి ఎదుటివారి వస్తువులు, అన్న భేదాన్ని వీరు పాటించరు. వస్తువు ఉన్నది వాడటానికే కదా-అన్నట్లుగా ప్రవర్తిస్తారు. మీ ఇంటికి వచ్చారనుకోండి, ఇక మీ ఇల్లు వారి వశమై పోతుంది. మీ సబ్బులు వాడతారు. మీ టవల్స్ వాడతారు, మీ బట్టలు వాడతారు, మీ పడక గదులలో, మీ మంచాలపై విశ్రాంతిగా పడుకొంటారు-ఉన్నది అనుభవించడానికే కదా-అన్నట్లుగా! ఆ వస్తువులు మీవే అయినా, మీరు వాటితో ఇలా ఎప్పుడూ ప్రవర్తించి ఉండరు. అంత స్వేచ్ఛగా, అంత నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తారు.

మీ జేబులో డబ్బులు తీసి తాము ఖర్చుపెట్టగలరు. రిక్షావాడికి ఇచ్చేటప్పుడు, హోటలు బిల్లులు కట్టేటప్పుడూ, సినిమా టికెట్లు తీసేటప్పుడు మీ జేబును తమ జేబుగా వాడుకోగలరు. డబ్బుమీది. ఖర్చువారు పెడతారు. మనమెప్పుడయినా ఇలా పెట్టగలమా, అని మీరు అనుకొంటారు. ఈయవలసిన దానికన్నా ఎక్కువ ఇచ్చేస్తూ ఉంటారు. అవతలి వారి నుండి మెప్పును పొందుతూ ఉంటారు. ఖర్చు మీకు, మెప్పు వారికి!

మీ కుటుంబ సభ్యులతో మీ కన్న చనువుగా ఉండగలరు. వరుసలు కలుపుతూ దగ్గరయి పోగలరు. ఇన్నినాళ్ళ కుటుంబ జీవితంలో మన కుటుంబ సభ్యులతో ఇంత ఇదిగా ఎప్పుడయినా మనం ప్రవర్తించగలిగామా అని మీకు అనిపిస్తుంది. లోకరీతులు, మర్యాదలు పట్టింపులు వీరికి పట్టవు. వాటిని ముందుకు నెట్టి సాగిపోగల చొరవ వీరికి ఉంటుంది.

### మాటి మాటికీ మార్పు

మాటిమాటికీ మార్పు కావాలి. ఒకే విధమయిన వాతావరణంలో, పరిస్థితులలో ఎక్కువకాలం మనలేరు. అయితే నింద తమ మీద ఉంచుకోరు. ఎదుటవారిని వేలెత్తి చూపిస్తూ, తాము అక్కడినుండి కదలిపోతారు.

ఎప్పటికప్పుడు క్రొత్త వ్యక్తులనూ, క్రొత్త వాతావరణాలనూ ఇష్టపడతారు. కొంత పాతబడగానే ఆ మోజు తీరిపోతుంది. ఇక మానసికంగా పెష్టపడతారు. మళ్ళీ క్రొత్తవ్యక్తుల కోసం, క్రొత్త వాతావరణాల కోసం ఉబలాట పడతారు. ఎప్పటికప్పుడు అంతే చేస్తారు. ఎక్కడికక్కడ అలాగే ప్రవర్తిస్తారు.

పరిచయమయిన క్రొత్తల్లో ఆ వ్యక్తులనూ, ఆ వాతావరణాలనూ అమితంగా, ఇంకా చెప్పాలంటే అతిగా అభిమానిస్తారు. అదే పనిగా మెచ్చుకొంటారు. ఇటువంటి వ్యక్తులనూ, ఇలాంటి వాతావరణాలనూ ఇదివరకెన్నడూ చూడలేదంటారు. విడిచి ఉండలేని స్థితిని ప్రకటిస్తారు. వారే వీరు, వీరే వారు అన్నట్లుగా తాదాత్మ్యస్థితులలో కనబడతారు.

కాలం గడుస్తున్నకొద్దీ, అనగా క్రొత్త తీరుతున్న కొద్దీ ఇక లోటుపాటులు కనబడటం మొదలుపెడతాయి. అడుగడుగునా అవలక్షణాలే గోచరిస్తాయి. ఇలాంటి దుర్భరస్థితులను ఇదివరలో అనుభవించలేదు. అన్నదాకా వెళ్ళిపోతారు. ఆ వ్యక్తులనూ, వాతావరణాలనూ తనివితీర నిందిస్తూ, మళ్లీ క్రొత్త వ్యక్తుల దగ్గరకూ, క్రొత్త వాతావరణాలలోనికీ వెళ్ళిపోతారు.

ఆత్మీయంగా ఉన్నప్పుడు ఎంతగా ప్రేమిస్తారో, ఆత్మీయత తగ్గుతున్నకొద్దీ, అనగా క్రొత్తతీరుతున్నకొద్దీ అంతగా ద్వేషించగలరు. తప్పులు పట్టగలరు, చాటున దూషించగలరు. ఇతరులకు వారినిగూర్చి పనిగట్టుకొని చెడుగా చెప్పగలరు. అందుకే విడిచి వెళతున్నాము అని ప్రకటించగలరు. మేము నిలువలేకపోతున్నాము అనరు, వారు మమ్ములను నిలుపుకొనలేక పోతున్నారు అంటారు. ఎప్పటికప్పుడు క్రొత్త వారిని కౌగిలిస్తారు. పాతవారిని ప్రక్కకు నెడతారు.

### నిలకడలేనితనం

మార్పును కోరే ఈ లక్షణంతో ఇక వీరు నిలకడలేనివారు అవుతారు. చేతగానివాళ్ల మాత్రమే స్థిరంగా ఒకచోట ఉండిపోవడానికి ఇష్టపడతారని ప్రకటిస్తారు. అద్దె ఇళ్లను మాటిమాటికీ మారుస్తారు. క్రొత్తగా చేరినప్పుడు ఇటువంటి ఇంటిని ఇంతవరకు చూడలేదు అంటారు. ఇలాంటి ఇంటి యజమానులను ఇదివరకు ఎరుగము అంటారు. చుట్టుప్రక్కలవారు ఇంతగా కలసిపోవడమన్నది ఇక్కడే చూస్తున్నాము అంటారు. కొద్దిరోజులు గడుస్తాయి. క్రొత్తతీరుతుంది. ఛీ, ఛీ ఇదేమి కొంప, ఇదీ ఒక కొంపేనా? ఈ యజమానికి మానవత్వం లేదు. చుట్టుప్రక్కల వాళ్ల ఉత్త స్వార్థపరులు. అంతా అవకాశవాదులు-అంటూ ఆఇంటిని ఖాళీచేసి వెళ్ళిపోతారు. ఒకవేళ సొంత ఇంటిని కట్టినా, అందులో ఉండటానికి ఇష్టపడరు. ఏదో ఒక వంకన అద్దెఇళ్లలో అలా అల్లిబిల్లిగా తిరుగుతూ ఉంటారు.

ఉద్యోగాలు మారుస్తారు. వృత్తివ్యాపారాలను మారుస్తారు. దేశంలో ఒక చోటనుండి మరొక చోటికి క్షణాలలో వెళ్ళిపోతారు. ఉత్తరదేశంలో ఉద్యోగాన్ని

వదిలి దక్షిణ దేశంలో మరొక ఉద్యోగానికి వచ్చేస్తారు. ఎందుకు వచ్చారు అంటే, వాతావరణం నచ్చలేదు. అంటారు. ఇప్పుడు ఇక్కడ చాలా బాగుంది అంటారు. ఇంతలో క్రొత్త తీరుతుంది. అక్కడనుండీ వెళ్ళిపోతారు. వృద్ధాప్యం వచ్చిన తరువాత కూడ ఉద్యోగాలు మారుతూనే ఉంటారు. వృత్తివ్యాపారాలను మారుస్తూనే ఉంటారు. ఇళ్లూ మొదలయినవి ఇక్కడ అమ్ముతారు, అక్కడ కొంటారు. మళ్ళీ అక్కడ అమ్ముతారు. ఎక్కడో కొంటారు. ప్రపంచమంతా అలా సంచారం చేస్తూనే ఉంటారు.

వాహనాలు మారుస్తారు—ఎప్పటికప్పుడు క్రొత్త మోడల్ కొంటారు. పాతవి అమ్మేస్తారు, టి.వి.లు, మిక్సీలు పాతవి అమ్మి క్రొత్తవి కొనేస్తూ ఉంటారు. ఇలా వారు నిలకడగా ఉండరు. వస్తువులను కూడ నిలకడగా ఉండనీయరు. వీరికి వస్తువు లయినా, వ్యక్తులయినా ఒక్కటే! వైద్యులను మారుస్తారు. మిత్రులను మారుస్తారు. కలసి ఉన్నప్పుడు ఎంతటి అన్యోన్యతో, క్రొత్త తీరగానే అంతటి దూషణ! తొడిగిన బట్ట తొడగరు. కట్టిన ఫ్యాషన్ కట్టరు. చూసిన దృశ్యం చూడరు. ఆడిన మాట ఆడరు.

సంస్థలు మారుస్తారు. ఇటువంటి సంస్థ లేదంటారు మొదట. ఇలాంటి సంస్థ అనుకోలేదు అంటారుచివర!అసలు ఇది ఒక సంస్థేకాదు. అక్కడ ఏమీలేదు. అంతా చూసిచెబుతున్నాం అంటూ ఈర్ష్యాసూయలతో దుష్ప్రచారం చేస్తారు.

పార్టీలను మారుస్తారు. ఎక్కడ క్రొత్తపార్టీ పుట్టినా, అక్కడ మొదట వీరే ఉంటారు. మిగిలిన పార్టీ లన్నీ పనికిమాలినవి అంటారు. వాటిలోని అవలక్షణాలను తట్టుకోలేక ఇలా వచ్చాము అంటారు. మరి ఇప్పటివరకూ ఎలా ఉన్నారు అక్కడ? అని అడిగితే 'మార్పువస్తుందని ఓర్పువట్టాము' అంటారు. ఇక రాదనితెలిసి ఇలా వచ్చాము అంటారు. ఆ పాతపార్టీలపైన బురదజల్లడమే ధ్యేయంగా పెట్టు కొంటారు. ఒకపార్టీ నుండి మరొక పార్టీకి తరచు మారుతూ ఉంటారు-ప్రజల శ్రేయస్సుకోరి ఇలా మారాము అంటారు.

మతాలను మారుస్తారు. ఈ క్రొత్తమతం దేవునికి దగ్గరజేస్తుంది అంటారు. పాత మతంలో ఉన్నదంతా అజ్ఞానమే అంటారు. దేవుడే ఇలా తీసికొని వచ్చాడు అంటారు.

గురువులను మారుస్తారు. ఎప్పటికప్పుడు క్రొత్తగురువును పట్టుకొని వీరే అసలయిన గురువు అంటారు-ఇదివరకూ ఇలా చెప్పారుకదా అంటే, చెప్పినమాట నిజమే, కాని కాదని తెలుసుకొన్నాం. ఆ అనుభవంతో వీరు గురువని రూఢి చేసికొని మరీవచ్చాం. మామాటనమ్మండి అంటారు. క్రొత్తతీరుతుంది. ఆ రూఢి గురువుకూడా ఊడిపోతాడు. ఎంతటి వారికయినా వీరు చేట కొట్టగలరు. గురువులనే కాదు, వారు ఉపదేశించిన మంత్రాలను కూడ మారుస్తారు. పాతబడిన మంత్రం ఫలించలేదు అంటారు, క్రొత్తమంత్రం కొంత బాగుంది అంటారు.

ఇకవీరు మార్చనిది ఏమిటి? మార్చలేనిది ఏమిటి? ఒక్కటే! ఒక్కదానినే వీరు మార్చలేరు. 'అదే వీరి వ్యాధిలక్షణం'! ఆ వ్యాధిలక్షణాన్ని మాత్రమే వీరు మార్చలేకపోతున్నారు.

ఇలాంటి యువతీయువకులు ప్రేమించామూ అన్నారనుకోండి, జాగ్రత్తగా ఉండాలి. అంతలోనే వీరికి క్రొత్తతీరిపోవచ్చు. క్రొత్త తీరగానే వాళ్ళువెళ్ళిపోవచ్చు.

విద్యార్థులు గ్రూపులను మాటిమాటికి మారుస్తారు. విద్యాలయాలను మారుస్తారు. ట్యూషన్ టీచర్లను మారుస్తారు. అలామారుస్తునే ఉంటారు.

ఒక విద్యార్థి ఒక సంవత్సరకాలంలో నాలుగు విశ్వవిద్యాలయాలు మార్చాడు. ఒక మెడికల్ రిప్రజెంటేటివ్ కనబడినప్పుడల్లా కంపెనీ మారినట్లు చెబుతాడు. ఒక ఉద్యోగి సగటున ప్రతిరెండు సంవత్సరాలకూ ఒక ఉద్యోగాన్ని మారుస్తున్నాడు. ఒక అత్తగారు ఉంది. ఆమెకు నలుగురు కొడుకులు. క్రొత్తగా వచ్చిన కోడలిని కౌగిలించుకొంటుంది. ఇంతలో ఆ కోడలు పాతబడుతుంది. అన్నీ దోషాలే కనబడ తాయి. ఇక రానున్న క్రొత్త కోడలు కోసం ఎదురు చూస్తూ ఉంటుంది. అలా ఇప్పటికి ముగ్గురు కోడళ్ళను మొదట దగ్గరగా తీసుకొని తరువాత దూరానికి విసిరింది. ఇప్పుడిక నాల్గవ కోడలికోసం చూస్తున్నది.

నయవంచనలో నాజూకుతనం

ఇంతవరకూ చెప్పబడిన ఈ పై నాలన్నీ ఈ దీర్ఘవ్యాధికి చెందిన వారందరికీ ఉంటాయి. అలాగాక సోరాతోబాటు సైకోసిస్‌ను కలిగి ఈ దీర్ఘవ్యాధిలోనికి వచ్చిన వారికి మరికొన్ని విశేషాంశాలు జోడింపబడతాయి. సైకోసిస్‌లో కొంత మోటుదన మంటుంది. వారు చాటుగా హింసించినా మోటుగా హింసిస్తారు. ఈ దీర్ఘవ్యాధిని సంతరించుకొన్న తరువాత ఆ మోటుదనం తగ్గి, నాజూకుగా

హింసించడం వారికి చేతనవుతుంది. అలవోకగా హింసిస్తారు-అవలీలగా మోసం చేస్తారు. చూస్తుండగా వంచిస్తారు. నిలువునా మోసగిస్తారు. మీకిష్టంలేని పనిని మీచేతనే మరల మరల చేయిస్తారు. మీకాశ్చర్యంవేస్తుంది వీరిని కాదనలేకపోతున్నా మేమిటని!

ఒక అర్ధరాత్రి మీ ఇంటి తలుపులు తట్టబడతాయి. మీరు లేచి తలుపుతీస్తారు. అతడు మిమ్మల్ని ఆదరంగా కౌగిలించుకొంటాడు. రైలుదిగి వస్తున్నాను. నీకోసం జర్నీబ్రేక్ చేశాను. నీకు ట్రాన్స్ఫర్ వచ్చిందిట, గదా! ఇక్కడే ఉండాలని నీవు చేస్తున్న ప్రయత్నం అంతగా ఫలించడం లేదట గదా! అది తెలిసివచ్చాను. సెక్రటేరియట్‌లో మా స్నేహితుడొకడున్నాడు. ఒక అయిదువేలు పట్టుకొని నా వెంటరా! పని అయిపోతుంది. అలా చూస్తావేమిటి? ఇంత అకస్మాత్తుగా ఎలాఅనా? పోనీ ఆ మాత్రం డబ్బుంటేచూడు, నేను పనిని జరిపిస్తాను. కాని డబ్బుతో నీవు రావడమే మంచిది, నాకు శ్రమ తగ్గుతుంది. బయలుదేరుతావా, తెల్లారేటప్పటికి అక్కడఉందాం! అనేటప్పటికి అయిదువేలూ అతనికిచ్చి, ఆదరంతో సాగనంపుతారు మీరు. అదేపనిగా వెళ్ళిపోతాడు అతను.

కొన్నాళ్ళకు వచ్చి మళ్ళీ తలుపుకొడతాడు. ఏమిటిది, ఇప్పుడు వచ్చాడు, ఇంతకాలం ఏమయి పోయాడు, అని అనుకొంటున్నావా? నీవు అనుకోవు. నాకు తెలుసు, అయినాచెప్పాలి. అది నా ధర్మం! పనికాలేదు. నీకు మొఖం చూపించలేక పోయాను. నన్నునమ్మి డబ్బిచ్చి పంపించావు. డబ్బుపోయింది. పనికాలేదు అని ఎలా చెప్పగలను? పాపం మా స్నేహితుడు కూడా ఏమీచేయలేక పోయాడు. అయితే ఇప్పుడెందుకు వచ్చానూ-అన్నది ప్రశ్న. నీవు రిటైరయి పెన్షన్ కోసం ప్రయత్ని స్తున్నట్లు తెలిసింది ఆ పనిపూర్తి కావట్లేనట్లుకూడా తెలిసింది. ఒక్క అయిదువేలు తీసికొని నాతోరా. దగ్గరుండి నీపనిచేయించి పెడతాను. ఈపని అయినా చేశానన్న తృప్తి నాకు ఉంటుంది.బయలుదేరు.అంటాడు.ఇప్పుడున్న ఈస్థితిలో ఇద్దరం వెళ్ళడం ఎందుకు నాయనా, ఎలాగో అలా అయిదువేలు ఇస్తున్నాను, పనిని పూర్తిచేయించి పెట్టు-అనిమరో అయిదువేలు మీరు అతనిచేతిలో పెడతారు. 'పెన్షన్ పడకు పెన్షన్ వస్తుంది.' అని అతడు ముందుకు సాగిపోతాడు.

మళ్ళీ కొన్నాళ్ళకు వస్తాడు. అమ్మాయికి పెళ్ళి చేయాలని అనుకొంటున్నారట. సంబంధం దాదాపు నిశ్చయమైందటకదా! కట్నం విషయంలోనే వాళ్ళుకొంచెం

సమాధాన పడటం లేదట! కాని అమ్మాయి వాళ్ళకు బాగా నచ్చిందటకదా! మరేం చేద్దామనుకొంటున్నారిప్పుడు! పోనీ ఒకపనిచేద్దామా! ఆ పిల్లవాడి తల్లి దండ్రులకు కావలసిన వ్యక్తి ఒకడున్నాడు. అతడెంత చెబితేవాళ్ళంత! విశేషమేమంటే అతడు మనస్నేహితుడు. వచ్చినచిక్కేమంటే వాడు దూరదేశంలో ఉన్నాడు.వాడిని రప్పించి, వీళ్ళకు చెప్పిస్తేచాలు పనయిపోతుంది. కాని అధమ పక్షం వాడి దారి ఖర్చులకు ఒక అయిదువేలన్నా అవుతుంది. ఆ మాత్రం నీవుచూడగలిగితే అతన్ని పిలిపిద్దాం. అమ్మాయి మంచి ఇంట్లో పడుతుంది. ఏమంటావు?—అంటాడు. ఈసారి అయినా పని చేసిపెట్టక పోతాడా అని పేరాశపడతారు మీరు. అయిదువేలిచ్చి, అదేదో చూడ మంటారు.

ఇలా అతడు మళ్ళీ మళ్ళీ వస్తూనే ఉంటాడు. మీరు మళ్ళీ మళ్ళీ ఇస్తూనే ఉంటారు. ఇది ఇలా అనంతంగా సాగుతూనే ఉంటుంది. అతనెప్పుడు వచ్చినా మీరు అత్యవసర పరిస్థితులలో ఉన్నప్పుడు వస్తాడు. మిమ్మల్ని సమ్మోహనం చేస్తాడు. మీకు పని అయిపోతున్నట్లే కనబడుతుంది. మీరు మీ చేతులతోనే డబ్బులు మాటిమాటికీ ఇస్తూ ఉంటారు.

సైకోసిస్‌వారు వ్యక్తులను బ్లాక్‌మెయిల్ చేస్తారు. మీ జీవిత సన్నివేశాలను బయట పెడతామని చెప్పి, అవకాశం వచ్చినప్పుడల్లా డబ్బును గుంజుకుపోతారు. అయితే అందులో కొంత పీడన ఉంటుంది. మానసికంగా కొంత హింస జరుగు తుంది. ఏడిపించి పట్టుకుపోతారు. వారు ట్యూబర్క్యులార్‌గా రూపొందిన తరువాత మీ అవసరాన్ని కనిపెట్టి వస్తారు. మిమ్మల్ని సమ్మోహనం చేస్తారు. మీ మనస్సుకు గిలిగింతలు పెడతారు. ఆ గిలిగింతలకు తట్టుకొనలేక చేతిలోని డబ్బును అతనికి వదిలేస్తారు మీరు.

## ఇంకా చిత్రాలు

వీళ్ళదగ్గర ఇంకా చిత్రాలుంటాయి. మీ దగ్గరకు వచ్చినప్పుడు మీకిష్టమయిన మాటలు చెబుతారు. మీకు ఎవరంటే ఇష్టమో వారిని గూర్చి చెబుతారు. మీకు ఏ అంశాలు ఇష్టమో వాటిని గూర్చి ప్రస్తావిస్తారు. మీకిష్టమయిన దేవుడుంటే అతడి మహిమలు మీ దగ్గర వర్ణిస్తారు. ఆ దేవుడి ప్రసాదమే ఇది అని మీ చేతిలో ఉంచుతారు. ఇలా నైపుణ్యాన్ని ప్రదర్శించి మీ మనస్సును చూరగొంటారు. వారి మాటను కాదనలేని స్థితికి మిమ్మల్ని తీసుకువస్తారు.

సైకోసిస్‌లో కష్టమయిన అబద్ధాలను చెప్పి మీ మనస్సును కరిగిస్తారు. ఈ ఊరి ఆసుపత్రిలో నా భార్య శవమై పడిఉంది బాబూ!తలాకాస్త సాయంచేయండి. దానినింత మట్టి చేస్తాను.' అని బోరున ఏడుస్తారు. రూపాయికి పదిరూపాయలు ఇస్తారు మీరు కష్టానికి కరిగి. కొన్ని రోజుల తరువాత మళ్ళీ బస్టాండులో అలాగే చెబుతూ కనబడతాడు. మీకు ఆశ్చర్యంవేస్తుంది. ఎన్నిసార్లు ఇతడు మట్టిచేస్తాడు?—అని. బస్టాండుకు, వచ్చిన మనిషి రాడుకదా సర్వసాధారణంగా, అందునా ఇంతపెద్ద బస్తీలో. సినిమా హాలులో చిత్ర మాడినట్లుగా రోజుల తరబడి అతడినుండి ఆ కథ నడుస్తూనే ఉంటుంది. కొన్ని వారాలపాటు అతడలా అందరినీ ఏడిపిస్తూనే ఉంటాడు. ఆ తరువాత ఇంకెక్కడికో వెళతాడు. ఇంకో కథను మొదలు పెడతాడు. ఇంకా కొందరు సైకోసిస్ వారు చిన్నపిల్లలను ఎత్తుకొనిపోయి, వాళ్ళకాళ్ళో, చేతులో విరిచేసి, ఆ విరిగిన పిల్లలను చూపిస్తూ డబ్బులు అడుక్కొంటూ ఉంటారు. అలాగే అడుక్కునేందుకుగాను రకరకాల కట్లు కట్టుకొంటారు. అభినయాలు చేస్తారు.

అడుక్కునేవారిలో కూడ ఇన్ని వ్యాధులవారూ ఉంటారు. సోరావారు అరుస్తారు. బిచ్చం వేసేదాకా అరుస్తూనే ఉంటారు. వేయకపోతే తిడతారు. శాపనార్థాలు పెడతారు వారి నోటికి విసిగి, వారి నోటికి దడిసి అందరూ బిచ్చం వేస్తూ ఉంటారు. సైకోసిస్‌వారు హింసా, అభినయాల మేళవింపుతో అడుక్కొంటూ ఉంటారు. ఆప్తమిత్రులమధ్య, భార్యాభర్తలమధ్య తమ చేతిని అలా దూరుస్తూ ఉంటారు. తట్టుకోలేక వదిలించుకోవాలని అయినా మనకు వేస్తారులే—అనుకొంటారు. బస్టాండులలో, రైల్వేస్టేషన్లలో, వెళుతున్నవారికీ, సాగనంపుతున్నవారికీ మధ్యలో తమ చేతులను చాస్తారు. మీరు వేయక ఏంచేస్తారు? సిఫిలిస్‌వారు అమాయకంగా అడుక్కుంటారు. మనకెంత ప్రాప్తమో, అంతే వస్తుంది అన్నట్లుగా పోతూ ఉంటారు. సర్వసాధారణంగా ట్యూబర్క్యులార్ వారు అడుక్కొనేవారుగా ఉండరు. తమ తెలివితేటల్ని ఉపయోగించి ఏదోఒకలా కావలసినదానిని పొందుతూ ఉంటారు. అంటే నాజూకుగా అడుక్కొంటూ ఉంటారు. ఇది అడుక్కోవడము అని అనిపించకుండా అడుక్కుంటూ ఉంటారు.

ఒక మహానుభావుడికి పాదపూజ జరుగుతోంది. చేరిన వారందరూ భక్తితో మొక్కుతూ పరవశులవుతున్నారు. ఉన్నట్లుండి ఒకతను 'గురువుగారిని ఇలా చూస్తూఉంటే నాకెంతో ఇదిగా ఉంది. నిజం చెప్పాలి అంటే ఇప్పుడు వారికి మంచి బట్టలు నా చేతులతో పెట్టుకోవాలని ఉంది, దురదృష్టవంతుణ్ణి. ఆ ఏర్పాటుతో నేను

రాలేకపోయాను' అన్నాడు. ప్రక్కనున్నవాళ్లు అదివిని—మీకు చాలా మంచి కోరిక కలిగింది. అది తీరడం ఏమంత కష్టంకాదు. మేమందరం ఉన్నాం, తలా కాస్త ఇస్తాం. మీరు దబ్బునవెళ్లి, మీకు నచ్చిన బట్టలు తీసుకొనివచ్చి, గురువుగారికి పెట్టండి. మీరు పెడితే మేమందరం పెట్టినట్లే—అంటూ అతని చేతుల్లో ధనాన్ని వర్షంగా కురిపించారు. కురుస్తున్న ధనవర్షాన్ని పొదివి పట్టుకొన్నాడు. బట్టలు తెస్తానని బయలుదేరి వెళ్ళాడు. మరి రాలేదు. ఇక రాడు.

ఒక గృహిణి వెంకటేశ్వరుని పూజిస్తూ ఉన్నది. దూరపు బంధువొకడు గడ్డాలూ, మీసాలూ పెంచుకొని, పట్టెనామాలతో మెరుస్తున్నవాడు అప్పుడే వచ్చి ఆమె చెంతకు చేరాడు. పూజ పూర్తిచేసి అతనితో ఆమె ఇలా అన్నది, ఈ బంగారాన్ని స్వామికని ముడుపుకట్టాను. 'ఎంత అనుకొన్నా వెళ్ళరావడమే అవడంలేదు'. అతడన్నాడుకదా—నేను ఇప్పుడక్కడికే వెళుతున్నాను. మీకు అభ్యంతరం లేకపోతే మీకన్నా ముందు ముడుపును స్వామి సన్నిధికి చేర్చగలను—అని. ఆమె అతి సంతోషంగా ఆ బంగారాన్ని అతనికి అందించింది. అతడు అతిశ్రద్ధగా దానిని స్వీకరించాడు. అతడు నిష్క్రమించాడు. ఇంతలో భర్త వచ్చాడు. ఆమె జరిగిందిచెప్పింది. అతను నవ్వాడు. నవ్వుతూ అన్నాడుకదా—నీవు స్వామికని ఇచ్చావు. స్వామిదగ్గరికే వెళ్ళిపోయిందని అనుకో—అని. కాని అతనికి తెలుసు. ఆ బంగారం అక్కడికి దగ్గరలోఉన్న అంగట్లోకి వెళ్లిందని.

ఇలా వీరి నయవంచనకు హద్దులుండవు. మీ నమ్మకాలను, విశ్వాసాలను, ఉపాసనా విధానాలను ఒకటేమిటి అన్నింటినీ వీరు తమ స్వార్థానికి వినియోగించుకోగలరు.

### నేల పై నడవరు

వీరు శ్రమపడలేరు. శ్రమపడరు. శ్రమపడకుండా జీవితమార్గాన్ని దేశకాలపాత్రాలకు అనుగుణంగా అవలంభిస్తూ ఉంటారు.

ఎప్పుడూ కాలినడకన కనబడరు. కార్లలోనే కనబడతారు. వివిధ వాహనాలపై విహరిస్తూ ఉంటారు. ఉన్నవాడికి ఒక్కటే వాహనం. మరి వీరికో! అన్ని వాహనాలూ వీరివే! ఎంత ఉన్నవాడయినా, ఇంత సుఖపడగలడా—అని మనం ఆశ్చర్యపడేలాగున తిరుగుతూ ఉంటారు వీళ్ళు.

ఏదో ఒక వంకన ఎప్పుడూ తిరుగుతూ ఉండే స్వభావం వీరిది. పనిపాటల పేరిట, బంధుమిత్రుల పేరిట, విహారయాత్రల పేరిట, తీర్థయాత్రల పేరిట, ఈ పేరిట, ఆ పేరిట అలా తిరుగుతూనే ఉంటారు. దేశదేశాలను అలా చుట్టి వస్తూనే ఉంటారు. తాము తిరుగుతూ ఉండాలి. తమ చేతిలో డబ్బులు ఆడుతూ ఉండాలి. తాము శ్రమించకూడదు. ఇతరుల శ్రమ ఫలితాన్ని అనాయాసంగా తాము అనుభవించగలగాలి. జీవితం మాత్రం నిత్యోత్సవంగా మార్పుచేర్పులతో వెళ్లిపోతూ ఉండాలి. ఎప్పటికప్పుడు పాతవాళ్లనుండి జారిపోవాలి, క్రొత్తవాళ్ళతో జేరిపోవాలి! క్రొత్తవాళ్ళ దగ్గర పాతవాళ్లను తనివితీరా నిందిస్తూ ఉండాలి. ఆ నిందలతో క్రొత్త వాళ్ళకు మరింత దగ్గర కావాలి. ఇదీ కథ! సోరాతో బాటుగా సైకోసిస్‌ను కలిగి, ఆపైన ఈ దీర్ఘ వ్యాధిని అందిపుచ్చుకొన్న ఘనుల స్వభావం ఇలా ఇలా ఉంటుంది.

దూ ర దూ ర ం గా

ఇదీ ఇలా ఉండగా సోరాతోబాటు సిఫిలిస్‌ను కలిగి, ఆటుపైన ఈ దీర్ఘ వ్యాధిని అందిపుచ్చుకొన్న వారిలో కొన్ని ప్రత్యేక లక్షణాలు వ్యక్తమవుతూ ఉంటాయి. బంధుమిత్రులనుండి విడిపోవాలనిపిస్తుంది. ఉమ్మడి కుటుంబాలనుండి విడికుటుంబాలను సాధించుకోవాలనిపిస్తుంది. అయిన వారెవరూ ఆ ఛాయలలో ఉండ కూడదు అనిపిస్తుంది. వారితో కలిసి ఉండటం సాధ్యంకాదు అనిపిస్తుంది. ఇది ఇమడలేనితనం. మార్పును కోరే లక్షణం. కొందరు ఈ ఊరిలోనే మేముండలేమని ఊరిని విడిచి వెళ్ళిపోతారు. కొందరు రాష్ట్రాన్ని విడిచిపెడతారు. ఇంకా కొందరు ఈ దేశాన్ని విడిచిపెట్టి ఇతర దేశాలలో స్థిరపడిపోతారు. మళ్ళీ తిరిగి మాతృదేశానికి రాము, రాము అను ఒట్టుపెట్టుకుంటారు. ఏమిటి ఇలా చేశారూ అంటే, ఆ ప్రాంతాల దోషాలు, ఆ దేశాల దోషాలు, ఆ జీవన సరళిలోని దోషాలు ఇన్నిన్ని కావని ఏకరువు పెడతారు.

ఇంకా కొందరు అక్కడా బాగుండలేదు, ఇక్కడా బాగుండలేదు, ఎక్కడా బాగుండలేదు అని చనిపోయే ప్రయత్నం చేస్తారు. అంతకన్న పరిష్కారం లేదం టారు. సైకోసిస్ నేపథ్యంగా కలవారు వయవంచనతో నాజూకుతనాన్ని చూపిస్తూ ఉండగా, సిఫిలిస్ నేపథ్యంగా కలిగినవారు విషాదయోగాన్ని పొందుతూ, ఆత్మ

హత్యలకు దగ్గరవుతున్నారు. స్థిమితపడలేరు, సమాధానపడలేరు, సర్దుకోలేరు, సరిదిద్దుకోలేరు. మనస్సు మాటిమాటికి మార్పులు కోరుతూ ఉండగా ఎండమావుల వెంట వెళుతున్నట్లుగా వెళుతూ ఉంటారు. ఏది దారి? అంతా ఎడారి!

## ఉద్రేక సమయాలు

వేదనలు ఉద్రేకం చెందే సమయాల విషయంలో నాలుగు వ్యాధులవారి స్థితిగతులూ ఏమిటో చూద్దాం. సోరాలో ఉద్రేకానికి వేళలు ఇదమిద్ధంగా ఉండవు. కొందరిలో పగలు ఉద్రేకం కనిపిస్తుంది. కొందరిలో రాత్రి ఉద్రేకం కనిపిస్తుంది. ఎవరి వేళలు వారివేనన్నట్లుగా ఉంటాయి. అయితే ఆ ఉన్న వేళలు మాత్రం పాటింపబడుతూ ఉంటాయి. సైకోసిస్ వారిలో సాధారణంగా పగటిపూట, వేదనలు ఉద్రేకిస్తాయి. సిఫిలిస్ వారి వేదనలు సాధారణంగా రాత్రిపూట ఉద్రేకిస్తాయి. ట్యూబర్క్యులార్ వారిలో రెండుతరహాలవారూ ఉంటారు. కొందరికి పగటిపూటా, కొందరికి రాత్రిపూటా వేదనలు ఉద్రేకిస్తూ ఉంటాయి.

## విజ్ఞానమయ కోశం

'తాము ఇలా చేయవచ్చునా' అని అనిపించదు. పని జరగడం వీరికి ముఖ్యం. అందుకు ఎలా అవసరమైతే అలా ప్రవర్తిస్తారు. అలా ప్రవర్తించినందుకు వారికి ఏమీ అనిపించదు. అది ఆశ్చర్యం! 'ఇంతమంది దగ్గర తీసికొంటున్నారు మీరు' అన్నప్పుడు—'వారిదగ్గర ఉన్నది తీసుకొంటున్నాం, మరి మన అవసరం గడవాలి గదా' అంటారు. మరి వారికి ఋణపడిపోరా? అన్నప్పుడు 'ఏమో, వారే మనకు ఋణమున్నారేమో, అలా ఎందుకనుకోకూడదు' అంటారు. ఇంకా కొంచెం ముందుకు వెళ్ళి—సంపాదించగల నైపుణ్యం వాళ్ళదగ్గర ఉన్నది. ఖర్చుపెట్టగల నైపుణ్యం మనదగ్గర ఉన్నది. రెంటికీ అనుసంధానం చేయడమే మనపని, మనం చేస్తున్నపని' ఏతావాతా తేలుతున్నది ఏమిటి? వారు చేస్తున్నది వారికి సరిగానే కనిపిస్తున్నది. వారి విచక్షణ ఆ స్థితిలో ఉన్నది. జరుగవలసినదే జరుగుతున్నది-అని వారు అన్నారూ అంటే విచక్షణ అంధకార బంధురమవుతున్నది.

## ఆనందమయ కోశం

అదిగో ఆనందం అనేటప్పటికి ఇదిగో విషాదం అన్నట్లుగా ఉంది వీరి స్థితి. అదిగో దీపం అనగానే, ఇదిగో పోయింది అన్నట్లుంది వీరి పరిస్థితి! ఆనందం అందుతున్నదీ అనుకొనేలోపల ఆ సన్నివేశం పాతబడుతున్నది. దానియెడల అయిష్టత కలుగుతున్నది. ఇంక సంతోషించడానికి వీలెక్కడ కుదురుతున్నది? వీరిది నిలకడలేని స్థితి అని చెప్పుకొన్నాం. ఆనందమయ కోశంనుండి అన్నమయకోశం వరకూ ఈ నిలకడలేని స్థితినే వీరు అనుభవిస్తున్నారు. గాలికి రెపరెపలాడే దీపం, వెలుగులను ఏమి కుమ్మరించగలదు! క్షణానికి ఒక విస్తరి దగ్గర కూర్చుంటున్నవారికి ఎక్కడని వడ్డన జరుగుతుంది? ఎప్పటికి ఆకలి తీరుతుంది! తాము ఆనందంగా ఉండలేకపోవడానికి కారణం తామే అన్నది వీరికి తెలియదు. అలా తెలిసికోవడానికి కూడా వీరు సిద్ధంగా లేరు. తమ ఆనందస్థితి పరిసరాలవారు పనిగట్టుకొనిచెదరగొడుతున్నారని వీరికి అనిపిస్తుంది. అలా అనుకోవడం వీరికి ఇష్టంగా ఉంటుంది.

ఇలా నాలుగు వ్యాధులవారూ నాలుగు విధాలుగా ప్రవర్తిస్తూ నరజన్మను వృధా చేసికొంటున్నారు. సరైన హోమియో చికిత్స జరిగినప్పుడు ఈ వ్యాధులనుండి వీరు బయటపడతారు. మనిషిగా పుట్టినందుకు, మనిషిగా జీవించగలగడమన్నది వీరికప్పుడు చేతనవుతుంది.

# సమన్వయం

దీర్ఘవ్యాధులను గూర్చి వరుసగా పరిచయం చేసికొంటూ వచ్చాం. ఇది కేవలం పరిచయం మాత్రమే! ఈ దృష్టితో మీరు పరిశీలిస్తున్న కొద్దీ, మరింత అవగాహన ఈ వ్యాధుల యెడల మీకు కలుగుతుంది. ఇక్కడ ప్రపంచమే మనకు ప్రయోగశాల. ప్రతిక్షణము మన గమనికకొక అవకాశమే! ఎలా ఉన్నా, ఎక్కడ ఉన్నా, ఏం చేస్తున్నా ఈ వ్యాధుల స్థితిగతులు అనేక రూపాలలో మన కనుల ముందు నిలబడుతూనే ఉంటాయి. మనను కవ్విస్తూనే ఉంటాయి.

సర్వసాధారణంగా ఈ దీర్ఘవ్యాధులు కలగలుపుగానే మనకు కనబడుతూ ఉంటాయి. సోరా ఒక్కటే ఉన్నవారు కొంతమంది ఉండగా, సోరాతో బాటుగా మిగిలిన దీర్ఘవ్యాధులలో ఒకదానిని పుణికిపుచ్చుకొన్నవారు కూడా ఎక్కువమందే కనబడతారు. ఒకొక్కక్కరిలో మూడు నాలుగు దీర్ఘవ్యాధుల కలగలుపు కూడా కనబడుతుంది. తల్లిదండ్రుల వారసత్వాలు విభిన్న దీర్ఘవ్యాధులకు చెందినప్పుడు, వారి పిల్లలలో ఈ దీర్ఘవ్యాధుల కలగలుపు మనకు కనబడక తప్పదు.

## చిత్రమయిన విశేషం

ఒక చిత్రమయిన విశేషముంది. రోగార్తునిలో రెండు మూడు దీర్ఘవ్యాధులు కలిసి ఉన్నప్పటికీ, అందులో ఒక దీర్ఘవ్యాధి ప్రాధాన్యాన్ని వహిస్తూ ఉంటుంది. ప్రముఖంగా కనిపిస్తూ ఉంటుంది. అంటే అక్కడ డామినేషన్ దానిది అన్నమాట! అంతేగాదు. అతనినుండి వ్యక్తమవుతున్న వేదనాసముదాయం ఒకే ఒక ఔషధాన్ని సూచిస్తూ ఉంటుంది. ఆ సూచింపబడిన ఔషధం ఈ దీర్ఘవ్యాధుల కలగలుపు స్థితిని మొత్తంగా హరించగలిగినదై ఉంటుంది. దీర్ఘవ్యాధుల కలగలుపు స్థితుల యొక్క గాఢతనుబట్టి సూచింపబడే ఔషధం కూడా అంత గాఢమైనదయి, వాటిని హరించ గలిగినదై ఉంటుంది. ఎట్టి పరిస్థితులలోనూ ఒకే సమయాన రెండు వేదనా సముదాయాలు ఉండవు. ఒకేసారి రెండు ఔషధాలు అవసరం కావు. ఒకే ఒక వేదనా సముదాయ ముంటుంది. ఒకే ఒక ఔషధాన్ని అది కోరుకుంటుంది.

స్థాయిని బట్టి

రోగార్తుల వ్యాధిస్థితులలో లేతముదుళ్ళు ఉన్నట్లుగానే, ఔషధాలలో కూడ వివిధ స్థాయిలలో పనిచేయగలిగినవి ఉంటాయి. ఇపికాక్, ఎకోనైట్ వంటి మందులు పైపైన పనిచేసేవి. బ్రయోనియా, రూస్టాక్స్ వంటి మందులు మధ్యస్థంగా పనిచేసేవి. నక్స్వామికా, పల్సటిల్లావంటి మందులు లోతుగా పనిచేసేవి. లైకోపోడియం, సల్ఫర్, నేట్రమ్మ్యూర్ వంటి మందులు ఇంకా లోతుగా పనిచేసేవి. ఇలా ఇన్ని స్థాయిలలో ఔషధాలు వర్గీకరణ చెందుతూ ఉంటాయి. ప్రాణశక్తి, వ్యాధియొక్క స్థితిగతులనుబట్టి తనకు కావలసిన స్థాయిగల ఔషధాన్ని సూచిస్తుంది. వ్యాధి మధ్యస్థమయిన స్థితిలో ఉన్నది అనుకోండి. ప్రాణశక్తి మధ్యస్థమయిన స్థితిలో పనిచేయగల ఒకానొక ఔషధాన్ని సూచిస్తుంది. వ్యాధిస్థితి ప్రగాఢంగా ఉన్నది అనుకోండి. ప్రాణశక్తి అంత ప్రగాఢమయిన ఔషధాన్ని సూచిస్తుంది. కనుక కంగారు పడవలసిన పనిలేదు. ప్రాణశక్తిని గమనించడంలో శ్రద్ధపెడితే చాలు. లోనఉన్న దీర్ఘవ్యాధుల కలయికను బట్టి వాటినన్నింటినీ కరిగించగల ఔషధాన్ని ప్రాణశక్తియే మనకు సూచించగలదు.

పొటెన్సీ విషయంలో

మరొక అంశమున్నది. ఈ దీర్ఘవ్యాధుల గమనిక పొటెన్సీని నిర్ధారించడంలో కూడ మనకు సహకరించగలదు. సోరావ్యాధి ప్రాధాన్యం వహిస్తున్నప్పుడు చిన్న పొటెన్సీతో మొదలుపెట్టినప్పటికీ, పొటెన్సీని తొందర తొందరగా పెంచవలసివస్తూ ఉంటుంది. సైకోసిస్ వ్యాధి ప్రాధాన్యం వహిస్తున్నప్పుడు చిన్న పొటెన్సీల నుండి-మధ్యస్థమయిన పొటెన్సీల మీదుగా క్రమ క్రమంగా వెళ్ళవలసి ఉంటుంది. సోరావ్యాధిలో పెంచవలసినంత తొందరతనం ఇక్కడ కనపడదు. సిఫిలిస్ దీర్ఘవ్యాధి ప్రాముఖ్యం వహిస్తున్నప్పుడు చాలా చిన్న పొటెన్సీలతో చికిత్సను ప్రారంభించవలసి ఉంటుంది. తొందరపడవలసిన అవసరం అంతగా ఉండదు. తొందరపడకూడదు కూడా! ఆనందమయకోశం నుండి అన్నమయకోశం వరకు వేదనాసముదాయం ఎంత గాఢంగా-వ్యక్తమవుతున్నప్పటికీ ఔషధం చిన్నపొటెన్సీల లోనే ఇక్కడ అవసరమవుతుంది. చిన్న పొటెన్సీలతోనే కేంద్రం నుండి పరిధి వరకు చక్కటి నివారణము గోచరిస్తుంది. సిఫిలిస్‌లో నివారణ నిదానంగా, సావధానంగా వ్యక్తమవుతుంది.

సోరాలో వేగం ఎక్కువ. కనుక పొటెన్సీని తొందరగా పెంచవలసి వస్తుంది. రిపిటీషన్ కూడ తొందరగా అవసరమవుతుంది. సైకోసిస్‌లో అంత వేగం ఉండదు. కనుక పొటెన్సీని గమనిక మీద, అవసరాన్ని బట్టి హెచ్చించవలసి ఉంటుంది. రిపిటీషన్ కూడ అంత తొందరగా అవసరంకాదు. సిఫిలిస్‌లో అసలు వేగం ఉండదు. కనుక చిన్నపొటెన్సీ సరిపోతుంది. డోసు చాలాకాలం పనిచేస్తుంది- రిపిటీషన్ తొందరపడి చేయకూడదు. పొటెన్సీని తొందరపడి పెంచకూడదు.

ట్యూబర్క్యులార్ వ్యాధి ప్రాధాన్యం వహిస్తున్నప్పుడు మన గమనిక రెండు విధాలుగా సాగవలసి ఉంటుంది—వ్యాధి దేహప్రాణాలను ముట్టకుండా, మనస్సునకూ ఆపైన వ్యక్తమవుతున్నప్పుడు ఒకమాదిరి పొటెన్సీతో మొదలుపెట్టి పెద్ద పొటెన్సీలకు వెళ్ళవలసి ఉంటుంది. వ్యాధి దేహ ప్రాణాలను ఆక్రమించినప్పుడు సూచింపబడిన ఔషధాన్ని చిన్న పొటెన్సీలలో తరచుగా ఈయవలసి వస్తుంది.

వ్యాధి మానసిక కక్ష్యలో ఉన్నప్పుడు ట్యూబర్క్యులార్ దీర్ఘవ్యాధిలో ఔషధం పెద్దపొటెన్సీలో అవసరమవుతుంది. మరొక డోసు వేయకుండా చిరకాలం వేచిచూడవలసి ఉంటుంది. దేహప్రాణాలపై పుకు వ్యాధి మొగ్గినప్పుడు, ఆ సూచింపబడుతున్న ఔషధం చిన్న పొటెన్సీలలో అవసరమవుతుంది. తరచుగా వాడవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. ఈ దీర్ఘవ్యాధిని నిష్క్రమింప జేయడానికి వైద్యుడు బహు నిపుణుడయి ఉండాలి.

ఒక ఔషధం ఒక పొటెన్సీలో వాడబడిన తరువాత అంతకన్నా తక్కువ పొటెన్సీలో ఆ వెంటనే వేయబడకూడదు. వేసినా ప్రయోజనముండదు. ఒకసారి ఒక పొటెన్సీని వాడిన తరువాత పైకెక్కడానికి అవకాశముంటుంది గాని, దిగి రావడానికి వీలుండదు! కనుక వేసేటప్పుడు ప్రాణశక్తిని శ్రద్ధగా గమనించాలి. ప్రాణశక్తి చెప్పినట్లు బుద్ధిగా నడుచుకోవాలి! ఒకవేళ తప్పనిసరి పరిస్థితులలో దిగిరావలసి వస్తే, ఆ వేయబడిన డోసును తగినవిధంగా న్యూట్రలైజు చేసి అప్పుడు మనం అనుకొన్న పొటెన్సీని వేయాలి! ఒక ఔషధం యొక్క పని పూర్తయి, మరొక ఔషధం సూచింపబడుతున్నప్పుడు, ఆ సూచింపబడుతున్న ఔషధాన్ని అవసరాన్ని బట్టి ఎంతచిన్న పొటెన్సీనుండయినా ప్రారంభించవచ్చు. అదే ఔషధంలో దిగడానికి వీలుండదు గాని మరో ఔషధాన్ని ఈయవలసి వచ్చినప్పుడు కావలసినంత దిగువనుండి కథను ప్రారంభించవచ్చు.

అలాగే తరుణ వ్యాధులలో పొటెన్సీని తొందరగా పెంచవలసిన అవసరం వస్తూ ఉంటుంది. అదే ఔషధం దీర్ఘవ్యాధులలో సూచింపబడినప్పుడు ఎప్పటికో గాని పొటెన్సీని పెంచవలసిన అవసరం రాదు. రిపిటీషన్ విషయంలో కూడా ఈ తేడా కనబడుతుంది. తరుణవ్యాధులలో రిపిటీషన్ తొందరగా అవసరం అవుతుంది. దీర్ఘవ్యాధులలో అంత తొందరగా ఆ అవసరం రాదు. ఒకే ఔషధం, తరుణ వ్యాధులలో అలా, దీర్ఘవ్యాధులలో ఇలా, సమయానికి తగిన విధంగా ప్రవర్తిస్తూ ఉంటుంది. ఔషధం పనిచేసే వేగంలో కూడా ఇలాంటి వైవిధ్యమే ఉంటుంది. ప్రాణవిపత్కర పరిస్థితులున్నప్పుడు క్షణాలలో పరిస్థితిని దారికి తెస్తుంది. అదే తరుణవ్యాధి స్థితులలో ఒకమాదిరి వేగంతో పనిచేస్తుంది. దీర్ఘవ్యాధులలో అయితే సావధానంగా కథను నడుపుతుంది. ఇలా సమయ సందర్భాలను బట్టి, ఔషధం పని చేయవలసిన వేగం ప్రాణశక్తి చేత నిర్ణయింపబడుతూ ఉంటుంది. దీర్ఘవ్యాధి స్థితులలో ఇంకొక చిత్రం కనిపిస్తుంది. తీవ్రతలు తొందరగా తగ్గుతాయి. ఇక అక్కడ నుండి మిగతా స్వస్థత నిదానంగా చిక్కుతుంది. ఊరినుంచి ఇంటికి వస్తారు మీరు. అర్జంటు పనులను గబగబా చూస్తారు. మిగిలిన పనులలోనికి వచ్చినప్పుడు ఇక సావధానంగా ప్రవర్తిస్తారు. ఇక్కడ మీ పనివేగం దేనినిబట్టి నిర్ణయమవుతోంది? అక్కడఉన్న అవసరాన్ని బట్టి! ఔషధం కూడా సరిగా ఇలాగే మన యెడల వర్తిస్తుంది.

అలాగే తరుణవ్యాధులలో ఒక ఔషధం తరువాత మరొక ఔషధం తక్కువ వ్యవధిలో సూచింపబడవచ్చు. అదే దీర్ఘవ్యాధులలో అంత తొందరగా ఆ అవసరం కనబడదు.

## తగినవారే

దీర్ఘవ్యాధులు ఒకసారి సోకిన తరువాత ఏడుతరాల వరకు కొనసాగగలవని చెప్పుకొన్నాం గదా! అలాంటప్పుడు ఒక అనుమానం కలిగేటందుకు అవకాశమున్నది. తల్లిదండ్రులు చేసిన పాపానికి బిడ్డలు బలికావడమేమిటి? తప్పుచేసినది తల్లిదండ్రులు కదా! బిడ్డలకూ, వారి బిడ్డలకూ ఈ శిక్ష కొనసాగడమేనా? ఇది అన్యాయమంకాదా అని అనిపించవచ్చు. కాని కాదు. ఎందువలన? ఆయా వ్యాధులు సోకవలసిన సంస్కారం గలవారే వీరి వీరికి బిడ్డలుగా దిగివస్తారు గనుక! ఇది ఆలోచించండి! ఆ దిగివచ్చేవారు వీరిచెంతకే ఎందుకు ఆకర్షింపబడుతున్నారు. ఈ వ్యాధులు వారికికూడ సంక్రమించవలసి ఉంది గనుక! అలాంటి పూర్వ సంస్కారం

వారిలో ఉన్నది గనుక! ఆయా వ్యాధిబాధలు ఆయా రీతులలో అనుభవించవలసిన వారే వీరికి బిడ్డలవుతున్నారు. ఇక్కడ తల్లిదండ్రులు సహకారులు మాత్రమే!

## అ ది చా లు

ఇంకొక అంశమున్నది. ఇలాంటి వ్యాధి బాధలు మా ఇంటా ఒంటా లేవు. మేమూ మా పూర్వులూ ఎరుగము. మరి మా బిడ్డకు ఎందుకు వచ్చాయి- అని అడిగే వారుంటారు. దీర్ఘవ్యాధులు తరం నుండి తరానికి ముదురుతాయి. ముదురుతున్న కొద్దీ వెర్రితలలు వేస్తాయి. ఆ ముదిరినస్థితిలో అవి వేస్తున్న వెర్రి తలలనే మీరు మీ బిడ్డలలో చూస్తున్నది. మీరు వ్యాధినందించారు. అది మీ బిడ్డలో వెర్రితలలు వేస్తున్నది. ఈ వేస్తున్న వెర్రితలలను ఇంతకుముందు మీరు చూచి ఉండనక్కరలేదు. మీ బిడ్డ మీ నుండి వ్యాధిని అందుకొన్నాడుగదా, అది చాలు. కొట్టువాడు అందించిన శనగపిండితో ఎవరి పిండివంటలు వారు చేసికొంటున్నారు. ఇదీ అలాంటిదే! మీరు చేసికొంటున్న పిండివంటలను ఆ కొట్టువాడు ఇదివరలో చూచి ఉండకపోవచ్చు. అసలు వినే ఉండక పోవచ్చు. ఏమంటారు!

## ఎక్కువ తక్కువలు

వ్యాధిగ్రస్తులయిన ఒక దంపతులకు ఒక నలుగురు పిల్లలు కలిగారనుకోండి. మరి వారి నలుగురికీ ఒకే విధమయిన వ్యాధి బాధలు కలగడం లేదేమి? ఇది ఒక ప్రశ్న. జరుగుతున్నది ఏమంటే, తల్లిదండ్రులు వారే అయినప్పటికీ, ఆ దిగి వస్తున్న బిడ్డలు, ఎవరి అవసరాన్ని బట్టి వారు తల్లిదండ్రుల నుండి వ్యాధి స్థితులను అందుకొంటున్నారు.

వెచ్చాల కొట్టుకు ఒక నలుగురు వెళ్ళారనుకోండి. వస్తువులన్నీ అక్కడే ఉన్నాయి. ఆ వెళ్ళిన వారు ఎవరికి ఏ వస్తువు ఎంత పరిమాణంలో కావాలో అంత అడిగి తీసికొంటున్నారు. కొందరు ఎక్కువ తీసికొంటున్నారు, కొందరు తక్కువ తీసికొంటున్నారు. కొందరు కొద్దిగా తీసికొంటున్నారు కొందరు నామమాత్రంగా తీసి కొంటున్నారు. కొట్టువాడు మాత్రం ఎవరికి కావలసినవి వారికి అందిస్తున్నాడు. అడి గిన వారికి అడిగినంతగా అందిస్తున్నాడు. దిగివస్తున్న బిడ్డలకు తల్లిదండ్రులు చేస్తు న్నదీ కూడ అంతే! దీర్ఘవ్యాధుల స్థితులు అక్కడ ఉన్నాయి. ఆ దిగివస్తున్న వాళ్ళలో ఒకడు ఎక్కువ తీసుకొంటున్నాడు, ఒకడు తక్కువ తీసికొంటున్నాడు, ఒకడికి కొన్ని అవయవాలు దెబ్బతింటున్నాయి. మరొకడికి మరికొన్ని అవయవాలు

దెబ్బతింటున్నాయి. అలాగే ఒకరిలో ప్రాణదేహాలు బాగా దెబ్బతింటుంటే ఒకరిలో మనస్సూ, ఆపై కక్ష్యలూ పెద్దఎత్తున చెదరిపోతున్నాయి. ఎవరి అవసరం వారిది. ఎవరి అనుభవం వారిది! తల్లిదండ్రులు సహకారులు. వారితో కలసి కథను నడప వలసిన వారు.

ఇలా భారతీయమైన తత్త్వదర్శనాన్ని హోమియో తత్త్వ శాస్త్రానికి జోడించిన వేళ కావలసిన సమన్వయం అందివస్తూ ఉంటుంది.

### వ జ్రా యు ధ ం

సామాన్యంగా మనం వ్యాధి బాధలు తీవ్రతరమయినపుడు మాత్రమే వైద్యాన్ని సంప్రదిస్తూ ఉంటాం. మళ్లీ ఆ వ్యాధి బాధలు కొంచెం ఉపశమించగానే వైద్యాన్ని నిలిపివేస్తూ ఉంటాం. ఇది సరైన పద్ధతికాదు. వ్యాధిబాధల తీవ్రతతో నిమిత్తం లేకుండా, మనను ఆవరించి ఉన్న దీర్ఘవ్యాధులకు సరైన హోమియో చికిత్సను శ్రద్ధగా మనం పొందవలసి ఉంది. చికిత్స కొన్ని సంవత్సరాలపాటు సాగవచ్చు. శ్రద్ధ ఏమాత్రం సడలకుండా, ఆ చికిత్సను మనం పొందినప్పుడే, దీర్ఘవ్యాధులనుండి పూర్తిగా బయటపడగలము.

ముఖ్యంగా చిన్నపిల్లలకు ఏ మాత్రం అశ్రద్ధ చేయకుండా ఈ చికిత్సను అందించాలి. తీవ్రమయిన వేదనలేవీ వారిలో ఉండనక్కర లేదు. వారసత్వంగా అంది వచ్చిన దీర్ఘవ్యాధులు వారిలో నిండి ఉన్నాయి కదా! ఆనందమయ కోశం నుండి అన్నమయ కోశం వరకు ఆ దీర్ఘవ్యాధుల లక్షణాలు వ్యక్తమవుతూనే ఉంటాయి. వాటిని గమనించుకొని, వారికి చికిత్స జరిపించాలి. అయిదునుండి ఏడు సంవత్సరాల పాటు పిల్లలకు ఈ చికిత్స జరిగితే ఇక జీవిత కాలంలో చెప్పుకోదగిన వ్యాధి బాధలు వారికి కలుగవు. వారికి వయస్సు వచ్చేటప్పటికి వారిని ఇలా పవిత్రీకరించి నిలబెట్ట గలగితే ఎంత బాగుంటుందో చూడండి. బాలలను భావి పౌరులుగా తీర్చి దిద్దగలగ డంలో సరైన హోమియో చికిత్స అవసరం ఎంతయినా ఉన్నది. జాతి నిర్మాణానికి పునర్నిర్మాణానికి ఈ హోమియో చికిత్స ఒక వజ్రాయుధం లాంటిది.

### ప్ర చో ద న ం

పిల్లలకు హోమియో బాగా పని చేస్తుంది అనే వాడుక ఒకటి లోకంలో వున్నది. ఇందులో నిజం లేకపోలేదు. వాళ్ళు చిన్న వయస్సులో ఉన్నారు. ప్రాణ శక్తిని కావలసినంతగా కలిగిఉన్నారు. దురలవాట్లకూ దుష్ట వ్యసనాలకూ దూరంగా ఉన్నారు. పెద్దల చెప్పుచేతలలో పద్ధతిగా ఉన్నారు. పథ్యపానా

లను శ్రద్ధగా అమలు పరచగలిగిన స్థితిలో ఉన్నారు. కనుక పిల్లలకు హోమియో చికిత్స జరిగితే సమాధానం తొందరగా వస్తుంది. స్వస్థత వారికి తొందరగా సిద్ధిస్తుంది. చిన్న వయస్సుననే హోమియో చికిత్సను పొంది, దీర్ఘ వ్యాధులనుండి విముక్తిని సాధించుకొని, ధీరులయి నిలబడగలిగిన కుర్రవాళ్ళు ధన్యులు ! వారు తాము బ్రతుకగలరు. మరెంతమందిని బ్రతికించగలరు. మంచి ఆలోచనలను చేయగలరు. తగిన ప్రబోధనాన్ని పొందగలరు. మంచి భవిష్యత్తును తమకూ, జాతికీ కూడ రూపొందించగలరు.

వయస్సులో ఉన్నవారికి కూడ హోమియో చికిత్స చక్కగా సహకరిస్తుంది. అన్నివిధాలా వారిని తీర్చిదిద్ది, అర్థవంతమయిన జీవితాన్ని నడుపగలిగిన స్వస్థతనూ, సుస్థితినీ వారికి అనుగ్రహిస్తుంది.

వయస్సు మళ్ళుతున్న వారికి హోమియోచికిత్స జరుగుతున్నప్పుడు వైద్యులు మరింత శ్రద్ధ పెట్టవలసి ఉంటుంది. రోగార్తులు కూడ మరింత శ్రద్ధగా వైద్య సేవను పొందవలసి ఉంటుంది. నివారణకు అవకాశాలు తగ్గుముఖం పడుతున్న వయస్సది! శ్రద్ధగా, ఒడుపుతో దీర్ఘవ్యాధులనుండి బయట పడవలసిన సమయమది!

వయస్సు మళ్ళి వ్యాధి ముదిరిన స్థితి వస్తే మరి తరుణోపాయం ఏమిటి ? అప్పుడు, ఆచరమదశలో, దీర్ఘవ్యాధుల నివారణకు అది సమయంకాదు. నిపుణతతో తగిన ఉపశమనాన్ని హోమియో చికిత్స ద్వారా అందించవచ్చు.

## ప వి త్రీ క ర ణ ం

హోమియో వైద్య విధానం మానవుని దీర్ఘ వ్యాధులకు నివారణాన్ని అందించడమే కాదు, అతడిని అన్ని విధాలా పవిత్రీకరిస్తున్నది కూడా! కనుక హోమియో ద్వారా మనం అందుకొంటున్నవి రెండు. ఒకటి-నివారణం, రెండు - పవిత్రీకరణం. మనిషి ఈ విధానం ద్వారా ఆనందమయ కోశం నుండి అన్నమయ కోశం వరకు శోధనాన్ని పొందుతున్నాడు. క్షాళణాన్ని పొందుతున్నాడు. ఆకాశ గంగలో స్నానం చేసినవాడు అవుతున్నాడు. పూర్వ వాసనలనుండి, సంస్కారాల నుండి, ఆవేశకావేశాలనుండి, ఆలోచనా వైఖరుల నుండి ఒక్కమాటలో చెప్పాలీ అంటే సమస్త కర్మ బంధాలనుండీ అతడు విమోచనాన్ని పొందుతున్నాడు. ముక్త స్థితిని అనుభవిస్తున్నాడు ! అపారమయిన యోగసాధన ద్వారా ఏ స్థితిని పొందు తున్నాడో ఆ స్థితిని ఇక్కడ ఈ వైద్యవిధానం ద్వారా పొందుతున్నాడు. హానిమాన్

తాను చేసిన తపస్సు ద్వారా ఆ స్థితిని లోకమంతటికీ ఈ విధానంతో ఇలా అంది వచ్చేలా చేశాడు. మానవజాతి దీర్ఘవ్యాధుల బారినుండి పూర్తిగా బయటపడి అటుపైన పరిపూర్ణంగా పవిత్రీకరింపబడి దేవుని రాజ్యాన్ని భూమిపైన నెలకొల్పగలిగిన స్థాయికి ఎదిగి వచ్చేటట్లుగా బాటను తీర్చాడు. ప్రతి మానవుడూ జీవన్ముక్తుడై భూమిపైన నడయాడాలని అతడి ఆకాంక్ష.

హోమియో చికిత్స సరైన పద్ధతిలో సాగినప్పుడు ఇలా అనంతమయిన సత్ఫలితాన్ని అందిస్తున్నది. పరిపూర్ణమైన స్వస్థతను అనుగ్రహిస్తున్నదీ. ఆ అంది వచ్చిన స్వస్థతను నిత్య జీవితాన్ని నియమబద్ధంగా నడుపుకోవడం ద్వారా మనం నిలబెట్టుకోవలసి ఉన్నది. అందుకు మనం అటు ఆయుర్వేదంలోని స్వస్థ వృత్తాన్నీ, ఇటు మన ఋషులు అందించిన సనాతన ధర్మాన్నీ ఆశ్రయించవలసి ఉంది. అలా ఆశ్రయించడానికీ, అలా ఆచరించడానికి స్వస్థవృత్త, సనాతన ధర్మాల మేళవింపుతో మననుండి వ్యక్తమయిన గ్రంథమే 'నిత్య జీవితానికి నియమావళి.' ఆహార స్వీకరణం, విధి నిర్వహణం, విశ్రాంతి విహారాలు, దాంపత్యానుబంధం, నిద్ర-తీరుతెన్నులు, గృహవాతావరణం మొదలయిన అంశాలను ఏ విధంగా నిర్వహించుకోవలసి ఉన్నదీ- ఈ గ్రంథం మనకు తెలియజెబుతుంది. మన శిక్షణ తరగతులలోని మొదటి అధ్యాయం ఆధారంగా రూపొందినదే ఈ గ్రంథం! అది చెబుతూ నేనెప్పుడూ ఒక మాట చెబుతూ ఉంటాను. 'మొదలా ఇదే, చివరా ఇదే'- అని! వ్యాధి రాకుండా ఉండాలన్నా ఈ అధ్యాయం కావాలి! వచ్చి తగ్గిన తరువాత మళ్ళీ సోకకుండా ఉండాలన్నా ఈ అధ్యాయం కావాలి! మన పెద్దలు సదాచారంగా, స్వస్థవృత్తంగా సనాతన ధర్మంగా దేనిని బోధిస్తూ వచ్చారో, దాని సారాంశమే ఈ గ్రంథం! వైద్యుడయినవాడు ఈ గ్రంథాన్ని తాను అధ్యయనం చేస్తూ, ఆచరిస్తూ రోగార్తుల చేతకూడా గ్రంథాన్ని పఠింపజేయాలి, పాటింపజేయాలి! అప్పుడు స్వస్థత తొందరగా చిక్కుతుంది. అటుపైన మళ్ళీ ఏ వ్యాధి బారినా పడకుండా నిలబడగలగడమూ జరుగుతుంది.

# అనుశాసనం

హోమియో విధానంలో ఔషధం ఏమిచేస్తున్నది? రోగార్తునిలోని ప్రాణశక్తికి కావలసిన ప్రచోదనాన్ని అందిస్తున్నది. అలాంటి ప్రచోదనమే ఒక మహనీయుని నుండి ఆ రోగార్తునిలోని ప్రాణశక్తికి అందినదనుకోండి. అప్పుడేమి జరుగుతుంది? హోమియో విధానంలో ఏమి జరుగుతున్నదో, సరిగా అదే జరుగుతుంది. వ్యాధి కారణం బహిష్కరింపబడుతుంది. అనాదిగా మహనీయుల సన్నిధిలో ఇలాంటి సన్నివేశాలు జరుగుతూనే ఉన్నాయని, జరుగుతూ వస్తున్నాయని మానవజాతి చరిత్ర మనకు చెబుతూనే ఉన్నది.

ఔషధానికి సూక్ష్మీకరణం ఎలాంటిదో, మానవునికి తపస్సు అలాంటిది! పదార్థం సూక్ష్మీకరణంద్వారా ఔషధంగా రూపొందినట్లు, మానవుడు తపస్సుద్వారా మహనీయుడవుతున్నాడు. ఔషధం తనకు సంబంధించిన స్థితిగతులు ఉన్నప్పుడు మాత్రమే రోగార్తుని పైన పనిచేయగలుగుతున్నది. తపస్సంపన్నుడయిన మానవుడు సర్వౌషధ సమాహార స్వరూపముయి, ఎవరెవరికి ఏయే రీతులలో సహకరించవలెనో ఆయా రీతులలో వారివారికి సహకరిస్తూ స్వస్థతవైపుకు వారిని నడిపించగలుగు తున్నాడు. ఒక విషపదార్థం ఔషధ స్వరూపమైననాడు తన మహిమను చూపుతూ ఉన్నది కదా! మరి దుర్లభమయిన మానవజన్మను పొందినవాడు తాను తపస్సంపన్నుడు కాగలిగిననాడు దేవుని మహిమను ఇంతెంతగా వ్యక్తం చేయగలడో, ఆ మహిమ అతడినుండి ఇంకెంతగా వ్యక్తం కాగలదో ఒక్కసారి ఆలోచించండి. 'వైద్యో నారాయణోహరిః' అన్న వచనం ఈ స్థితినే సూచిస్తున్నది. నారాయణుడయిన హరియే వైద్యుడుగా ఉన్నాడు'-అని అంటున్నది. ప్రతి వైద్యుని ఆ స్థితికి ఎదిగిరమ్మంటున్నది. సృష్టి దేవుని రాజ్యం. దేహాలు దేవుని ఉపకరణాలు. జీవులు దేవుని వివిధ రూపాలు. వైద్యము నందించుట అనగా దేవునికి ఉపకరణమును సరిజూచి పెట్టగలుగుట! మరి ఇది సామాన్యమా? నారాయణుని స్థితికి ఎదిగి వచ్చిన వానికి తప్ప ఇది సాధ్యమా? కనుక వైద్యులనబడువారు ఎందరో ఉండవచ్చు. అందులో నిజమగు వైద్యులు కొందరే ఉంటారు. అనగా ఆ కొందరు దేవునిచేత

అనుమతింపబడినవారన్నమాట! నిజానికి ఏ వృత్తిలోనయినా అంతే! ఆ వృత్తిపేరిట చలామణి అవుతున్నవారు ఎందరో ఉంటారు. దేవునియొక్క ఆమోదాన్ని పొందిన వారు అందులో కొందరే ఉంటారు. ఆ అందరిలో ఈ కొందరు తెలుస్తూనే ఉంటారు. వీరు అందమయినవారు అని ఎలా తెలుస్తున్నదీ, అలాగే వీరు ఆమోదింపబడినవారు అని కూడ తెలుస్తూనే ఉంటుంది. మీరు ఎన్ని విశ్వవిద్యాలయాలు పెట్టండి. వేలకు వేలుగా డిగ్రీలను పంచిపెట్టండి, వారినందరినీ బోర్డులను కూడ పెట్టమనండి. అందులో ఆమోదింపబడినవారెవరో ఇట్టే తెలిసిపోతారు. అయితే అందరూ బ్రతుకుతారు. బ్రతికింపబడతారు. సృష్టి ఆ మేరకు అందరకూ రక్షణను ఇస్తుంది. అయితే మానవుడు తనను తాను ప్రశ్నించుకోవాలి. నేను బ్రతుకుతున్నాను సరే, బ్రతకగలుగుతున్నాను సరే, ఈ బ్రతకడమూ, బ్రతకగలగడమూ దేనివలన జరుగుతున్నది, దేనికొరకు జరుగుతున్నది?—ఆ ప్రశ్న అతడిలో కలిగిన రోజున అతడు పైకి చూడగలుగుతాడు, పైకి రాగలుగుతాడు! దేవదేవుని ఆమోదాన్ని పొంది, తన వృత్తి వ్యాపారాలతో ఈ లోకరూపంలోనున్న అతనిని నిండుగా సేవించగలుగుతాడు! ఆ సేవిస్తున్న వేళ, అలా సేవిస్తున్న వేళ అతడిపైన దేవుని ఆమోదముద్ర మనకు కనబడుతూ ఉంటుంది. సోదరులారా! తపస్సును కొనసాగించండి. దేవదేవుని అనుగ్రహానికి పాత్రులు కండి!

ఆ దేవదేవుని ఇప్పటి కథలోనికి ఇక నేను వస్తున్నాను. పరబ్రహ్మ స్వరూపులయిన మాస్టర్ సి.వి.వి. ఈభూమిపైకి అమృత స్థితిని అవతరింపజేసేటందుకై దిగి వచ్చి ఉన్నారు. ఆయన ఇలా అన్నారు: 'స్వస్థతను అందించండి, యోగస్థితికి నడిపించండి!'—అని. స్వస్థతను అందించేటందుకూ, యోగస్థితికి నడిపించేటందుకూ కావలసిన దివ్యప్రార్థనను ఆయన మానవజాతికి అందించారు. ఆ ప్రార్థననే మనం నిత్యం ఉదయం ఆరుగంటలకూ, సాయంత్రం ఆరుగంటలకూ శ్రద్ధతో చేస్తూ వస్తున్నాం. స్వస్థతను అందించే ప్రార్థన ఇది. నిజస్థితికి నడిపించే ప్రార్థన ఇది. ఆర్తజనులను సేవించేటందుకు కావలసిన పాత్రతను మనకు నిండుగా అందించగలిగిన ప్రార్థన ఇది!

మాస్టర్ సి.వి.వి. ఒక మహోన్నతమయిన స్థితిని సిద్ధపరచి, దానిని భూమి జనులకు అందించారు. అది ఏమిటీ అంటే సృష్టిగతమయిన మహా ప్రాణానికీ, దేహగతమయిన పరిమిత ప్రాణానికీ అనుసంధానాన్ని కుదిర్చిపెట్టడం! ప్రార్థనలో

'నమస్కారమే మాస్టర్ సి.వి.వి.' అనగానే మనలోని ప్రాణశక్తికీ, సృష్టియందు అంతటా నిండివున్న మహాప్రాణశక్తికీ శ్రుతి కుదురుతుంది. మహాప్రాణం, దేహగత ప్రాణాన్ని శక్తిమంతం చేస్తుంది. దేహగత ప్రాణానికి తనయొక్క దివ్య సంస్పర్శాన్ని అందిస్తుంది. దేహగత ప్రాణం పూర్ణస్థితిని పొంది, వ్యాధికారాణాన్ని అవలీలగా నిష్క్రమింపజేస్తుంది. స్మరణ మాత్రం చేత ఈ శ్రుతి కుదురుతున్నదీ! ఈ స్వస్థత అందుతున్నదీ! ఇది ఆ మహనీయుడు పెట్టిన భిక్ష! ఆ మహనీయుడు మానవజాతికి కట్టిన రక్ష!

స్వస్థతను ఇలా స్మరణమాత్రంచేత అనుగ్రహించడమన్నది మాస్టర్ సి.వి.వి. తాము దేహధారిగా నున్నప్పుడే ప్రారంభించారు. వందల, వేలమందికి తమ అనుగ్రహంగా స్వస్థతను అందిస్తూ వచ్చారు. వాఙ్మయ ప్రభాకరులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు అలా వారి అనుగ్రహాన్ని ఆనాడే నిండుగా పొందినవారిలో నొకరు. తీవ్రమయిన వ్యాధి బాధకు తాళలేక, కనీసం ఉపశమనమయినా ఏ ఔషధం వల్లనూ అందిరాక, హరిద్వారానికి వెళ్ళి గంగలోపడి దేహాన్ని విడిచిపెడదామని నిశ్చయానికి వచ్చి, బయలుదేరుతుండగా మిత్రుడొకడు కనిపించి 'మాస్టరు సి.వి.వి'ని ఒక్కసారి చూడవచ్చుగదా! అన్నాడు. హరిద్వారానికని బయలుదేరిన శాస్త్రిగారికి హరియే ద్వారాన్ని తెరచి, తనను ఆహ్వానిస్తున్నట్లుగా దర్శనం కలిగింది. హరిద్వారమని ఆయన అనగానే హరి ద్వారం తెరుచుకొన్నది. శాస్త్రిగారిక కుంభకోణం చేరుకొన్నారు. మాస్టరు సి.వి.వి.ని తనివితీర దర్శించుకొన్నారు. దర్శన మాత్రంచేత రోగస్థితినుండి విముక్తులయి, యోగస్థితిలోనికి ప్రవేశించి ధన్యులయ్యారు. అలా ఎందరు చేరారో అక్కడికి! ఎందరెందరు ధన్యులయ్యారో!

మాస్టర్ సి.వి.వి. అంతటితో ఆగలేదు. తన కథతో తృప్తిపడలేదు. తన కథను మన కథగా, మానవజాతి గాథగా మలిచారు. సి.వి.వి. అన్న మంత్రాక్షరాలను స్మరించినంత మాత్రంచేత, గొంతెత్తి ఉచ్చరించినంత మాత్రంచేత మానవునికి మహాప్రాణంతో అనుసంధానం కలిగేటట్లుగా, అస్వస్థత తొలగి, స్వస్థతలో అతడు నిలచేటట్లుగా, అపరిపక్వత తొలగి, పరిపక్వతను అతడు పొందేటట్లుగా అనుగ్రహించారాయన! నాటినుండి నేటివరకు భూమిపైన ఆ ప్రార్థన జరుగుతూనే ఉన్నది. ఆ అక్షరాలు ఉచ్చరింపబడుతూనే ఉన్నాయి. మహాప్రాణం మానవునకు అలా అందివస్తూనే ఉన్నది. దేహధారి అయిన మానవుడు, దేహంతో వచ్చిన దేవునిగా రూపొంది వెలుగొందుతూనే ఉన్నాడు.

కరుణ కలిగిన ప్రతి మనిషిని తన వాహికగా రూపొందించుకొని, సి. వి. వి. మాస్టరుగారు భూమి ప్రజలకు సేదతీరుస్తూనే ఉన్నారు. భూమి ప్రజలకు దారి చూపిస్తూనే ఉన్నారు. ఒక్క సన్నివేశం చెబుతాను మీకు. సి.వి.వి. స్మరణతో స్వస్థతను పొందిన ప్రభాకరశాస్త్రిగారు మనసా, వాచా, కర్మణా ఆ దేవదేవునికి సర్వ సమర్పణం చెందారు. ఆ గురుదేవునికి ఒక వాహికగా రూపొందారు. ఒకరోజున శాస్త్రిగారు, పనిపైన పొరుగూరు వెళ్ళి, మిత్రునిఇంట బసచేసి, ఆరోజు రాత్రి, వారింటి అరుగుపై పడుకొన్నారు. ఓ రాత్రివేళ మెలకువ వచ్చింది. దాహమవుతోంది. ముందుగా మంచినీళ్ళను అడిగి మంచంక్రింద పెట్టుకోవడం మరిచారు. ఇప్పుడేం చేయాలి? ఇంటివారు మంచినిద్రలో ఉన్నారు. వారిని లేపడానికి మనస్సు ఇష్టపడలేదు. ఎదురుగా ఒక ఇల్లు కనబడింది. ఆ ఇంటి తలుపు తెరువబడి ఉంది. దీపం వెలుగుతూ ఉంది. కొంత అలికిడి ఉన్నట్లుగా ఉంది. వీరిని నిద్రలేపే బదులు, వారిని వెళ్ళి అడుగుదాం' అనుకొని లేచివెళ్ళారు. వెళ్ళిన మనిషి అలా నిలబడిపోయారు. ఆ ఇంటి యజమాని చావు బ్రతుకుల్లో ఉన్నాడు. ఆ ఇంటి గృహిణి ఒకచెంప దుఃఖిస్తూనే, మరొక చెంప అతడిని సేవిస్తూ ఉంది. దీనురాలయి మూగ బాధను అనుభవిస్తూ ఉన్నది.

ఆ దృశ్యాన్ని చూసిన శాస్త్రిగారికి హృదయం ద్రవించింది. అయ్యో! ఎంతటి దీనస్థితి ఇది! 'ఇతడి ఆరోగ్యం చక్కబడితే ఎంత బాగుండును!' అని మనసారా అనుకొని మంచినీళ్ళమాట మరచి, మరలివచ్చి మంచంమీద పడుకొన్నారు. వారికిప్పుడు మంచినీళ్ళు గుర్తులేవు. ఆ దృశ్యమే గుర్తుకు వస్తున్నది. వారికి మేలు జరిగితే బాగుండును అన్న ఆ తలపే మరల మరల కలుగుతున్నది.

ఇంకా తెల్లవారకుండానే శాస్త్రిగారికి మెలకువ వచ్చింది. 'ఎలా ఉన్నారో వారికి చూసివద్దాం' అని అనుకొంటూ మళ్ళీ ఆ గుమ్మాన్ని సమీపించారు ఆయన. ఆ యజమాని కులాసాగా కనబడ్డాడు. తానుగా కోరిమరీ ఏదో ఆహారాన్ని తీసికొంటున్నాడు. ఆ గృహిణి ముఖం కళకళలాడుతున్నది. 'అమ్మయ్య!' అనుకున్నారు శాస్త్రిగారు. తృప్తిగా ఊపిరిపీల్చుకొన్నారు. గృహిణి అన్నది 'బాబూ! రాత్రి మీరు వచ్చివెళ్ళినప్పటినుండీ ఈయనకు చాలా హాయిగా ఉన్నదట. ఎన్నిసార్లు అనుకొన్నారో మీ గురించి! అలా అనుకొంటూనే ఇలా కోలుకున్నారు. మీది చల్లని చూపు బాబూ! నా మాంగల్యాన్ని నిలబెట్టింది. మహనీయులు మీరు!

ఆనాటినుండి శాస్త్రిగారు చూసినా చాలు, స్పృశించినా చాలు, సి.వి.వి. అని స్మరించినా చాలు! వ్యాధిబాధలు ఆర్తజనులను వీడిపోసాగాయి. వందలు, వేలుగా తీర్థ ప్రవాహంలా వారిచెంతకు ఆర్తజనులు చేరుకోసాగారు. సి.వి.వి. అని స్మరిస్తూ తేరుకోసాగారు!

సి.వి.వి. గారినుండి అందుకొన్న ఆ వెలుగును శాస్త్రిగారు తమ తరువాతి తరానికి అందించారు. అలా తరంనుండి తరానికి ఆ వెలుగు ప్రసరిస్తూనే ఉంది. ఇంటినుండి ఇంటికి ఆ నిప్పు అందించబడుతూనే ఉంది!

ఆర్తజనులకు సేవచేయగోరినవారు సి.వి.వి. మాస్టరుగారిలా మానవజాతి యెడల బాధ్యతపడగలగాలి. ప్రభాకరశాస్త్రిగారిలా మానవజాతి ఆక్రందనలు విని ఆర్ద్రిమైపోవాలి! అప్పుడే, అప్పుడే వైద్యాన్ని మనం సేవగా అందించగలం! దేవునికొక నైవేద్యంగా సమర్పించగలం! వేదనలను అతడికి నివేదించగలం! అన్నికోశాలా అతడిని ఆవిష్కరింపజేయగలం!

ఇప్పుడు ఇంకొక మలుపు చెబుతాను. సి.వి.వి. మాస్టరుగారు అరుదుగా, ఎప్పుడయినా హోమియో ఔషధాలను లీలాప్రాయంగా వినియోగించేవారట! అలా ఈ హోమియో వైద్యశాస్త్రం వారి స్పర్శకు నోచుకుంది. వారి వెలుగును పునికి పుచ్చుకొంది. ఇలా వారి మక్కువకు ఎక్కిన, అనుగ్రహానికి నోచుకున్న ఈ వైద్య శాస్త్రానికి భాష్యకారులయి వర్ధిల్లుతూ, భూమి జనులను ఈ శాస్త్రమహిమను అందు కొనగల స్థాయికి ఉద్ధరిస్తూ, ఒక మహోత్కృష్టమయిన సేవా ఉద్యమాన్ని, మహత్తరమయిన ఆత్మవిద్యతో మేళవించి మానవజాతికి అందించినవారు మాస్టర్ ఇ.కె., సి.వి.వి. మాస్టరుగారు పడిన బాధ్యతకూ, ప్రభాకరశాస్త్రిగారు చూపిన ప్రేమకూ, ఉద్యమ శీలాన్ని జోడించి, ఈ సేవాసందేశాలను ప్రపంచదేశాలన్నింటికీ పంచి పెట్టిన నాయకుడాయన! సి.వి.వి. అను మంత్రాక్షరాలకు, ఈ మందుమాత్రలను అనుసంధానంగా నిలిపి, ఆ వెలుగును ఈ మాత్రలలోనికి జొనిపి, ఆ మందును మానవజాతికి మాస్టరుగారి ప్రసాదంగా అందించిన ఘనుడాయన! అమృతత్వాన్ని అవతరింపజేయగలిగిన మాస్టరుగారి ప్రార్థనకూ వైద్యశాస్త్రాన అగ్రభాగాన నిలబడ

గలిగిన హోమియో వైద్యానికి మేల్తరమయిన అనుసంధానాన్ని అందించి మానవ జాతిని స్వస్థతలోనికి మేల్కొల్పిన నవయుగవైతాళికుడాయన! సి.వి.వి. మాస్టరుగారి విశిష్టమయిన దైవానుగ్రహానికి, హోమియో విధానమనే పటిష్టమయిన మానవ ప్రయత్నాన్ని జోడించి, ప్రకృష్టమయిన సేవామార్గాన్ని తీర్చిదిద్దిన ప్రవక్త ఆయన!

ప్రపంచమంతటా పర్యటిస్తూ, దేశదేశాల వేదికలపయిన వెలుగులుగుమ్మరిస్తూ, అజ్ఞానాన్ని జ్ఞానంగా వెలువరించిన వెలుగుల రేడాయన. అస్వస్థతను స్వస్థతగా నిలువరించిన ప్రేమమయుడాయన! కొద్ది దశాబ్దాలలో అలోపతీ వైద్యం తన చోటును తాను తెలుసుకొంటుంది. తానెక్కడ, ఏ మేరకు పనిచేయాలో ఆ మేరకు తానుగా సర్దుకుంటుంది— అని చాటిచెప్పిన కాలజ్ఞాని ఆయన! ఆ అలోపతీ వైద్యం, వైద్యశాస్త్రంలో భౌతికవాదం. ఈ హోమియోపతీ వైద్యం, వైద్యశాస్త్రంలో ఆధ్యాత్మికవేదం-అని ప్రపంచ మేధావులకు తెలియజెప్పిన మహాద్రష్ట ఆయన!

ఆయన వెలుగును అందుకొనేటందుకై లబ్ధప్రతిష్ఠులయిన దేశదేశాల హోమియో వైద్య ప్రముఖులు ఒక చోటుకు చేరినవేళ 'శాశ్వతమయిన విలువలను మరువకండి. ప్రయోగాల పేరిట శాస్త్రసత్యాలకు దూరం కాకండి! ఏ సృష్టిసత్యాలను హానిమాన్ మహాశయుడు మనకు బోధించాడో, ఏ సృష్టిసత్యాలకు కట్టుబడమని కెంట్ మహాశయుడు మనవైపుకు తిరిగి ఘోషించాడో ఆ సత్యదర్శనానికి దూరం కాకండి! ప్రక్కదారులు త్రొక్కకండి!సద్యః ఫలితాలకోసం కక్కుర్తులు పడకండి! పెద్దలు అందించిన ఆ దివ్యదర్శనానికి కట్టుబడినంతవరకే, కట్టుబడి ఉన్నంతవరకే మానవజాతికి మనం మేలు చేయగలిగేది!'-అని నొక్కి చెప్పిన పెద్ద దిక్కు ఆయన.

మిత్రులారా! ఆ మహనీయుడు నొక్కి చెప్పిన విలువలకు కట్టుబడి మీకు అందించినవే ఈ ప్రవచనాలు! ఈ ప్రవచనాలు ఇంతగా మీకు నచ్చడానికి, ఇంతగా ఈ ప్రవచనాలతో మీరు తాదాత్మ్యం చెందడానికి కారణం ఆయన! మాస్టర్ ఇ.కె. అందించిన ఉపదేశాలకు ఉపబృంహణమే ఈ ప్రవచనాలు. ఆయన ప్రారంభించిన ఉద్యమానికి ఒక బృహద్రూపం అందివచ్చేటందుకే ఈ తరగతులు, ఈ నిర్వహణ! ఆయన అప్పగించిన పనిలోని భాగమిది! ఆయనకు కృతజ్ఞతలు చెప్పుకొనేటందుకు ఒకానొక మార్గమిది!

ప్రజాస్వామ్యంలో ఒక స్థాయిని మించి ఏ మంచిపని జరగాలన్నా అదీ ప్రజలలో నుండే ప్రారంభం కావాలి! ప్రజలు విద్యావంతులు కావాలి! ఏది మంచి, ఏది చెడు, ఏది ఎంతవరకు అవసరం-అన్నది గ్రహించగలిగిన వివేకం వారికి అబ్బాలి! వారిలో ఈ చైతన్యం వస్తే జాతికి మళ్ళీమంచిరోజులు వస్తాయి. ప్రజలను బట్టే పాలకులుకూడ సర్దుకొంటారు. కనుకనే మనం ఇప్పుడు ప్రజలలోని జిజ్ఞాసువులయినవారికి ఈ విద్యను అందిస్తున్నాం! ఈ అందుకొంటున్న వారిని సమాజంలో అట్టడుగున ఉన్నవారి వరకూ ఈ వెలుగును తీసికొని వెళ్ళవలసినదిగా నేను అభ్యర్థిస్తున్నాను. మనిషినుండి మనిషికి ఈ వెలుగు అందాలి. భూమిమీద ప్రతి మనిషికీ ఈ వెలుగు చెందాలి. మహత్తరమయిన ఈ ఆశయంలో, ఈ కార్యక్రమంలో మీరూ భాగస్వాములవుతారని ఆశిస్తున్నాను. విశ్వసిస్తున్నాను. అందుకే, అందుకొరకే, ఈ వెలుగును ఇలా అందించేటందుకొరకే ఇక్కడ నేను ఇలా శ్వాసిస్తున్నాను. ఈ వెలుగుదారి వెంట, ఇలా 'నా' వెంట సాగిరమ్మని ప్రేమతో మిమ్ములను శాసిస్తున్నాను.

ఆదేశమిది, ఉపదేశమిది, అనుశాసనమిది- అన్న వేదవాక్కును పలుకుతూ అనురాగయుతమైన శాసనంతో ఇలా మన మధ్య దివ్యమయిన అనుబంధమొకటి రూపొందిస్తున్నాను. దానికి కావలసిన రూపును ఇలా అందిస్తున్నాను.

# సారథి రచనల సంక్షిప్త పరిచయం

### స్వామి గేయాలు :

తీయగా హాయిగా సాగుతూ మనలను ప్రేమగా వెలుగుగా రూపొందిస్తాయి ఈ గేయాలు. మాస్టర్ ఇ.కె., మాస్టరు సి.వి.వి. వంటి పరమ గురువుల దివ్యరూపాలను మనకు అనుభవానికి తెస్తాయి. అలసటను పోగొట్టి, ఉత్తేజితులను చేస్తూ ఆచరణ పథం వెంట, ఆనందధామం పైపునకు మనలను ఇట్టే నడిపిస్తాయి.

### దర్శనాలు-నిదర్శనాలు : (1, 2 భాగాలు)

తెలిసిన దృశ్యాలను చూపిస్తూ, తెలియవలసిన సత్యాలను మనమందుకునే లాగున చేస్తారు ఇ. కె. మాస్టరుగారు ఇందులో. పతంజలి, భగవద్గీత మనకు అందిస్తున్న రాజయోగ మార్గాన్ని వెన్నతో పెడతారాయన ఈ భాగాలలో. యోగ మంటే ఏమిటి? సాధనంటే ఏమిటి? సమాజమంటే ఏమిటి? జీవితమంటే ఏమిటి? అన్నది ఈ గ్రంథాలలో ఆయన చక్కగా తెలియజెబుతారు.

### అన్వేషణ-అనుభూతి :

శ్రీ కృష్ణస్వామి సంక్షిప్త జీవితచరిత్ర ఇది. చిన్న నాటితో ప్రారంభమయి ఇ. కె. మాస్టరుగారి సన్నిధికి చేరుకొనే వరకూ జరిగిన దివ్యగాథను సూటిగా మన హృదయాలలో నాటుకొనేటట్లుగా చెబుతారు శ్రీ కృష్ణస్వామి. మనస్సున్న ప్రతి మనిషి చదువవలసిన ప్రత్యేకమయిన గ్రంథమిది.

### అక్షరాల్లో అనుభూతులు : (1, 2, 3, 4 భాగాలు)

ఇ. కె. మాస్టరుగారు పరిచయమయిన తరువాతనుండి దివ్యమయిన వారి సాహచర్యంలో శ్రీ కృష్ణస్వామి పొందుతూ వచ్చిన సార్థకమయిన అనుభూతులకు సరసమయిన అక్షర రూపాలివి. వారి నుండి పొందిన చేయూతను మొదటి భాగం గానూ, శిక్షణను రెండవ భాగంగానూ, ప్రోత్సాహాన్ని మూడవభాగంగానూ, విశ్వరూప సందర్శనాన్ని నాలుగవ భాగంగానూ శ్రీ కృష్ణస్వామి మనకు అందించారు. ఈ

గ్రంథాలను మనసుపెట్టి చదివినప్పుడు నరునికి కావలసిన ఆ నాలుగు అంశాలను మనం కూడా నిండుగా పొందగలుగుతాం.

### మానవసేవలో మాస్టర్ ఇ.కె. :

మాస్టర్ ఇ.కె. హోమియో వైద్యునిగా రూపొంది సమాజ సేవకు నడుము కట్టిన దివ్యచరితను నిండుగా వర్ణిస్తుంది ఈ గ్రంథం. గ్రంథం చదువుతున్నంత సేపూ వారి సాక్షాత్కార సాహచర్యాలు మనకు అలవోకగా లభిస్తాయి. వ్యాధిబాధలు తొలగి పోవడానికి ఈ దివ్యచరితను మనసుపెట్టి చదువుకొంటే చాలునని మనకు తెలుస్తుంది. మనలో అంతటి మార్పువస్తుంది.

### సంభాషణలు — సమన్వయాలు :

సగటు మనిషికి సాధారణంగా మనస్సులో మెదులుతూ ఉండే రకరకాలయిన సంశయాలన్నింటికీ ఈ గ్రంథంలో మాస్టర్ ఇ. కె. సమన్వయాత్మకమయిన సమాధానాలనందిస్తారు. మనలో మెదిలే ప్రతి సంశయానికీ ఇదిగిదిగోనని వెంటనే బదులు పలికే ఈ దివ్యగ్రంథం నిజంగా ఒక కల్పవృక్షం లాంటిది.

### సరసాల్లో నవరసాలు : (1, 2, 3 భాగాలు)

ఒక ప్రవక్త మనతో సరసమాడితే ఎలాఉంటుంది. అది ఎంత సరసంగా, సార్థకంగా నడుస్తుంది-అన్నది ఈ గ్రంథాలలో మనకు అనుభవానికి వస్తుంది. ఇ.కె. మాస్టరుగారు మానవజాతి మనస్సునకు పెట్టిన గిలిగింతలను ఈ గ్రంథాలనుండి మనం కూడా అందుకోవచ్చును. మధురమయిన ఆ సరసంలో ఆ వెనుకనుండి అలా అలా ఒక గంభీరమయిన సందేశం—ఎలా ఎలా కొంటెగా దోబూచులాడుతూ ఉంటుందో ఈ మూడు భాగాలలో మనం గమనించ వచ్చును.

### మాటలు — మంత్రాలు : (1, 2 భాగాలు)

మాటలలో మంత్రాలు, మంత్రాల వంటి మాటలు మనకీ గ్రంథాలనిండా కనబడతాయి. కృష్ణస్వామి గారి మాటలే మంత్రాలు. అవి ఎంత అర్థవంతంగా ఉంటాయో అంత నాజూకుగా ఉంటాయి. మనకు తెలియకుండానే మనచేత మననం చేయబడుతాయి. మనలో నిలబడతాయి. మనను నిలబెడతాయి.

**స్వామి పలుకులు – స్వాతి చినుకులు: (1, 2 భాగాలు)**

శ్రీ కృష్ణస్వామి ఆడిన మాటల ఆటలు. మాటలతోడి ఆటలు. సరదా సరదా ఆటలు. మననుకూడ ఆడిస్తాయి. బాగా అట పట్టిస్తాయి. ఆట పట్టిస్తూనే కథను రక్తి కట్టిస్తాయి. అన్నిటినీ మించి మనను కడుపుబ్బ నవ్విస్తాయి.

**మాటల మధ్యలో రాలిన ముత్యాలు: (1, 2 భాగాలు)**

పేరు చెబుతోంది. మనం కూడ ఆ ముత్యాలను ఏరుకోవచ్చని. ఈ భాగాలలో వాటిని ఏర్చి కూర్చి పెట్టామని. మన జీవిత సన్నివేశాల మధ్యలో ఈ ముత్యాలు అక్కరకు వస్తాయని!

**స్వామిలేఖలు - శాంతిరేఖలు: (1, 2 భాగాలు)**

మనకందరికీ కావలసిన లేఖలన్నీ ఈ భాగాలలో వ్రాసి పెట్టబడి ఉన్నాయి. ప్రతి లేఖా జీవితంలో ఏదో ఒక సన్నివేశంలో మనకో, మన తోటివారికో పనికి వచ్చేదే! ఏ లేఖకు ఆ లేఖ ఎంత అర్థవంతంగా ఉంటుందో, అంత ఆత్మీయంగానూ సాగుతుంది. మన గుండెల్ని తాకుతుంది.

**పునర్నిర్మాణానికి శంఖారావం : (1, 2 భాగాలు)**

జాతి పునర్నిర్మాణ సూత్రాల నందించే స్వామి ప్రవచనాల సంకలనమిది. మనమిప్పుడు ఎక్కడున్నామో, ఇప్పుడు మనం ఏమిచేయాలో సూటిగా, సున్నితంగా వివరిస్తుంది యీ గ్రంథం.

**ఇదీ మన సంస్కృతి - ఇదీ మన సంప్రదాయం :**

వివిధ పర్వదినాలను గూర్చి, ఉత్సవ సమయాలను గూర్చి తెలిసికోవాలని మనకు అనిపిస్తూ ఉంటుంది. ఆయా పవిత్ర దినాలయొక్క సందర్భమేమిటి? ఔచిత్య మేమిటి, పరమార్థ మేమిటి-అన్నది తెలిసికొంటే బాగుండును అనిపిస్తుంది. అందుకు తగిన గ్రంథమిది. వాటినన్నింటినీ ఇముడ్చుకొన్న గ్రంథమిదే. ఆయా విశిష్ట సమయాలలో శ్రీకృష్ణస్వామి చేసిన విలువైన ప్రవచనాల సంకలనమిది!

**కామధేనువు కనికరించినవేళ :**

కాళిదాస మహాకవి రచించిన రఘువంశ మహాకావ్యంలోని మొదటి రెండు సర్గలకు అనగా దిలీప ఖండమునకు దివ్యమైన భావానువాదాన్ని అందించే గ్రంథమిది.

దీనిని అనువాదం అనడంకన్నా కమ్మని తెలుగు వచనంలో జరిగిన అవతరణం అనడం ఎంతయినా సముచితం.

**నిత్యసత్యాలు - ఆణిముత్యాలు : (1, 2 భాగాలు)**

బాల బాలికలను తీర్చి దిద్దడం కోసం ప్రత్యేకంగా రూపుదిద్దుకొన్న ప్రయోజనకరమయిన సంకలన గ్రంథాలివి. మనకు ప్రసిద్ధి చెందిన శతకాలెన్నో ఉన్నాయి. వీటన్నిటినుండి బాల బాలికలకు ఎల్లకాలము పనికివచ్చేలాగున తగిన పద్యాలను ఎంచి తగినట్లుగా వాటికి భావాలను జతగూర్చి ప్రత్యేకమయిన శ్రద్ధతో భావి భారతంపై దృష్టి నిడుకొని యీ సంకలనాలకు రూపుదిద్దారు శ్రీకృష్ణస్వామి.

**నిత్యజీవితానికి నియమావళి :**

నిత్యజీవిత నిర్వహణానికి కావలసిన నియమావళి నందిస్తుంది గ్రంథం. మేలుకొలుపుతో ప్రారంభించి ఆహార స్వీకరణం, విధి నిర్వహణం, విశ్రాంతి విహారాలు, దాంపత్యానుబంధం, నిద్ర-తీరు తెన్నులు, గృహ వాతావరణం మొదలైన అంశాలను ఆచరణకు అనువైన రీతిలో, అనుభూతి ప్రదంగా వివరిస్తుందీ గ్రంథం. చదువరి యీ గ్రంథాన్ని ఒక ఆదర్శంగా, ఒక పెద్ద దిక్కుగా స్వీకరిస్తాడు అన్నది అనుభవంలోని అంశం.

**ప్రథమ చికిత్స - తరుణ వ్యాధులు**

ఈ గ్రంథం పరిమాణంలో చిన్నది అయినా, ప్రయోజనంలో చాలా దొడ్డది. అడుగడుగునా అక్కరకు వస్తుంది. ఆప్తమిత్రునిలా రక్షణను అందిస్తుంది. ప్రతి చిన్న విషయానికీ వైద్యాలయాల పాలుకాకుండా మనను రక్షిస్తుంది. అనారోగ్య స్థితులను గోటితోనే తీసివేసి, గొడ్డలికి పనిచెప్పవలసిన అవసరం రాకుండా చూస్తుంది. హోమియో విధానాన్ననుసరించి ఈ గ్రంథం రూపొందించబడింది. ద్వాదశ లవణ చికిత్స కూడా ఇందులో చేర్చబడింది.

**హోమియో విధానము - ఒక అవగాహన :**

ఈ గ్రంథం హోమియో గురించి జన సామాన్యంలోవున్న అపోహలను తొలగిస్తుంది. వారి అభిప్రాయాలను సరిచేస్తుంది. వారికి కావలసిన అవగాహనను అందిస్తుంది. నిత్య జీవిత నిర్వహణలో హోమియో యొక్క అవశ్యకతను తెలియజెబుతుంది.

ఈ గ్రంథం తమతో ఉన్నవారు తమ ఆరోగ్యాన్ని సకాలంలో సక్రమంగా గమనించ గలుగుతారు. సరైన చికిత్స పొందడానికి సన్నద్ధులవుతారు. వ్యాధిని అణచిపెట్టే స్థితినుండి, వ్యాధిని సాగనంపే స్థితికి ఎదిగి ప్రవర్తిస్తారు అంతటి అవగాహనను ఈ చిన్న గ్రంథం నుండి అందుకుంటారు.

పరిమాణంలో చిన్నదే అయినప్పటికీ ఇది తరచు అధ్యయనం చేయవలసిన గ్రంథం. శాశ్వతమయిన నివారణకు దారిచూపి, పరిపూర్ణమయిన స్వస్థతకు సింహ ద్వారాన్ని తెరిచే గ్రంథం.

## ప్రేయరు - పద్ధతి :

ఇది ఒకదివ్య గ్రంథం. మాస్టరు సి. వి. వి. జాతి కనుగ్రహించిన ప్రేయరును గూర్చి, దానిని నిర్వహించు కొనవలసిన పద్ధతిని గూర్చి ఈ గ్రంథం చాలా చక్కగా వివరిస్తుంది. ప్రేయరులోని వివిధాంశాలను గూర్చిన వివరణను అనుభూతి ప్రదంగా అందిస్తుంది. గాయత్రి, శాంతిపాఠం, మైత్రేయ స్తోత్రం మొదలైన ప్రేయరులోని అంశాలన్నీ పూర్వాపరాలతో సహా ఈ గ్రంథంలో వివరింపబడ్డాయి. మాస్టరు సి. వి. వి. గారి ప్రణాళికను గూర్చి, ఆ ప్రణాళికలో మాస్టర్ ఇ. కె. గారి పాత్రను గూర్చి ఈ గ్రంథం కావలసినంతగా తెలియజెబుతుంది.

## రామాయణము - మానవధర్మము :

దేవుడు మానవుడై, రామునిగా నిలిచి, తన జీవిత విధానంద్వారా ఈ భూమి జనులకు స్పష్టం చేసిన మానవధర్మ వైఖరులను వివిధ కోణాలనుండి ఒడుపుగాపట్టి చూపిస్తారు శ్రీకృష్ణస్వామి ఈ గ్రంథంలో. గురుశిష్యులుగా, తల్లిదండ్రులు-బిడ్డలుగా, అన్నదమ్ములుగా, ఆలుమగలుగా, స్నేహితులుగా, శత్రువులుగా ఒకరికొకరు దగ్గరైన వేళలలో మానవులైన వారు ఎలా మసలుకోవాలీ అన్నచోట-రామాయణం ఏమని చెబుతున్నదీ, దారిని ఎలా చూపుతున్నదీ - అన్నదీ ఈ గ్రంథం మనకు తృప్తిగా అందిస్తున్నదీ.

## భారతం - ధర్మాద్వైతం :

మానవులై జన్మించినవారు భూమిపైన సాధించవలసినదీ, అనుభవించవలసినదీ నాలుగే అంశాలు. అవే ధర్మార్థ కామమోక్షాలు. అధర్మార్థ కామ మోక్షాల యొక్క స్వరూప స్వభావాలను తేట తెల్లంజేస్తూ మహాభారత గాథలో అవి ఎలా సమగ్రంగా

సమన్వయించ బడ్డాయో ప్రబోధాత్మకంగా వివరిస్తుంది ఈ గ్రంథం. నిత్య జీవిత నిర్వహణలో పురుషార్థాల విషయంలో మనం సాధించుకోవలసిన సమన్వయమేమిటీ అన్నది మనకు కరతలామలకమవుతుంది ఈ గ్రంథం చదువుతున్నప్పుడు. ప్రతిష్టాకరమైన ఈ గ్రంథాన్ని సమర్పించే పి. హెచ్.డి. పట్టాన్ని స్వీకరించారు శ్రీ కృష్ణస్వామి, ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి.

## శ్రీమద్భాగవతము - దివ్యజీవనమార్గము :

షుమారు రెండు సంవత్సరాలపాటు ఆంధ్రపత్రికలో వారం వారం ప్రచురింప బడుతూ వచ్చిన పవిత్ర గ్రంథమిది. శ్రీమద్భాగవతములోని ప్రథమ స్కంధానికి అపూర్వమయిన ఉప బృంహణము. తేట తెలుగులో అవతరించిన మృదుమధుర వచన రూపము.

ఇది అక్షరధార-ఇది అమృతధార అంటున్నారు రజని. ఇది వెన్నముద్ద ఇది వెలుగుముద్ద అంటున్నారు కందర్ప. ఈ బాణీ ఈ వాణీ దివ్యమైనవి అంటున్నారు పరాశరం. ఇది అనుభూతి ఇది అభినందన అంటున్నారు మంత్రి.మరి మీరేమంటారు! చదివిచూడండి. చదివి .... చూడండి!

## పూజా విధానము - రుద్రాభిషేకము :

పూజ చేయుట దేవుని కొరకు కాదు. దేవుని సన్నిధిలో మనసు మనం పవిత్రీకరించుకొనుట కొరకు. అట్టి పూజ ఎంతశ్రద్ధగా చేసిన అంతగా ధన్యులము కాగలము. అందులకు మనకు పూజా విధానము తెలియవలెను. అది ఈ గ్రంథమున ఉన్నది. షోడశోపచార పూజా విధానము, నిత్యాగ్నిహోత్ర విధానము, రుద్రాభిషేక విధానము ఈ గ్రంథము మనకు చక్కగా అందించగలదు. వేద భాగములయిన శ్రీసూక్త, పురుషసూక్త, నమక చమకములు, మంత్ర పుష్పము, సస్వరముగా, ప్రామాణికముగా ఈగ్రంథమునందు మనకు దర్శనమీయగలవు.